# ఆంధ్ర గీర్వాణ శఠకోప సహస్రము.

ఉత్తరార్ధము.

శ్రీమాన్ మాడపల్లి వేంకటరఙ్గాచార్యులవారిచే
రచియింపఁబడినది.




శ్రీవైష్ణవ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

ఘంటపాడు.

1930.

శ్రీ

# ఆంధ్ర గీర్వాణ శఠకోప సహస్రము.

## ఉత్తరార్ధము.



[శ్రీశఠకోపసూరిచే నానతీయఁబడిన తిరువాయిమొ
ప్రబంధమునకు గీర్వాణాంధ్రభాషా పరివర్తనము.]

ఇయ్యది

దేవవ్రతచరిత్రము, శ్రీకృష్ణవైభవప్రకాశిక మొదలగు గ్రంథములకు నిర్మాతలును, శ్రీశ్రీశ్రీ విజయనగరము మహారాజాగారి యాస్థానకవీశ్వరులును, శ్రీవారి సర్వకళాశాలయందుఁ బ్రధాన సంస్కృతపండితులును, ఉభయవేదాంతపరిజ్ఞాతలు నగు

**శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులవారిచే**

రచింపఁబడి

---

పెంటపాడు పురమందలి

శ్రీవైష్ణవ ముద్రాశాలయందు

ముద్రింపఁబడి

తన్ముద్రాశాలాధిపతులచేఁ

బ్రకటింపఁబడియె.

**1930.**



[మూల్యము రూ 2—0—0.

లమునకుఁగూడ నడచి పోఁజాలనంత పరవశత్వముఁబొంది దూతలను పంపుచున్నారు. తాము క్రింద ననుసంధించిన అవతారము దూతలను బంపుటకు శక్యమైనది కాదు. ఇక నా విరహవ్యథను దెలియఁజేయుటకు తిరువణ్వండూరే అర్హమైనస్థలమని నిశ్చయించి యచటికే దూతలను బంపుచున్నారు. వీరిది జ్ఞానకర్మానుగృహీతమైన భక్తి కాదు. సర్వేశ్వరునికటాక్షమూలముగాఁ గలిగినది. తానేదో యొకప్రయత్నమును జేయుచున్నవాఁడై అది నెరవేరినతరువాత మనకుఁబురుషార్థము సిద్ధించునని తలంచువాఁడే విలంబమును సహించువాఁడు. వీరి కట్టిదొకటి కలదని చెప్పుటకు వీలులేదు. వీరు పరిగ్రహించినసాధనము విలంబమును సహించునది కాదు. వీరికి నితరోపాయనిష్ఠులకు గొంత తారతమ్యము గలదు. కావున పురుషార్థలాభమందలి ఉత్కంఠ ఉన్మత్తకము కాఁగా దూతలను బంపుచున్నారు. వీరు శరణాగతినిజేసి యుంటిమి కావున పురుషార్థప్రాప్తి వానివలననే కలుగునని శాంతించియుండు స్వభావముకలవారు కారు. బ్రహ్మాస్త్రమువలె నమోఘమైన ప్రపత్తి వ్యర్థము కాఁగా నీరు దూతలను బంపుట జ్ఞానకార్యమో చాపలమో తెలియదు. శ్రుతికూడా "యతో వాచో నివర్తంతే" అని చెప్పిన వాచామగోచరమైన విషయమును మర్మస్పర్శగా నిరూపించఁగల సామర్థ్యము గలవారగుటచే వీరికి జ్ఞానము లేదని చెప్పుటకు శక్యము కాదు. నోరులేని పక్షులను దూతలుగా వెళ్లుడని ప్రార్థించుట చూడగా జ్ఞానముగలవారనియుఁ జెప్పలేము. అయితే యిది యేమి యనఁగా: జ్ఞానకార్యమైన చాపల్యము. ఇతరవిషయవైరాగ్యమే జ్ఞానమున్నందుకు ఫలము. ఈ చాపల మా జ్ఞానఫలమే. వీరు జ్ఞానవైరాగ్యరాశి. ఇక దూతప్రేషణము చూడగా పిరాట్టివలె నొక ఐంద్రవ్యాకరణపండితుని దూతగాఁ బంపినవారు కారు. ఆమెకంటె వీరికి కొంత అతిశయము కలదు. ఎట్లనగా: నామె ఒకరి ననుభవించుటకే మనోరథించినది. వీ రుభయుల ననుభవించుటకు గోరినవారు. ఆమెకున్నట్లు వీరికి రావణభయము లేదు కావున నచటనుండి వచ్చినవారినే దూతగాఁ బంపవలెనను నిబంధము లేదు. అందువలన నీయాళ్వార్లు కంటికిఁ గనఁబడిన వారినందఱను దూతలగాఁ బంపుచున్నారు. దీనిలో "వేఱుగొండుమెయ్మ్మై యానిలందేన్" అనునది ముఖ్యగాథ. (ఈయిద్వాట్టు.)

## 1. వైగల్పూంగళివాయ్.

శ్లో. రమ్యాంభోధితటీవిహారరసికా నీడోద్భవాస్సప్రియా:
శ్యాలేయపరిబద్ధభృంగనగరీవాసోత్సుకం శ్రీధరమ్,

ద్రాది హేతివిలసద్బాహుం దుృతం సంగతా
భ్రాంతో త్త్వామ్యతి తే ప్రియాఽతివిరహాదన్వన్ని మగ్నేతితమ్.

చ. ప్రతిదిన ముష్ణకాలువను • బాయక మేయుచునందు పక్షిసం
తతి ! విను మేను వేడదను • తప్పక సస్యపరీతభృంగపూః
పతియగు చక్రిహస్తుం గని • పద్మదళాక్షి భవద్వియోగతా
పితతను వాచు నుండె నని • ప్రీతిదలిర్పగ విన్నవింపుమా.

## 2. కాదల్ మెన్పైదోము.

శ్లో. క్రౌంచ ! ప్రియాసఖ ! నిరంతర వేదఘోష
ఘుష్టద్వి రేఫనగరీవర వాసదీక్షమ్,
నాథం నిగీర్ణభువనం విలయోఽద్య దృష్ట్వా
నత్వా దశాం మమ నివేదయ యాహి తూర్ణమ్.

మ. ప్రియతోఁ గూడి చరించు పత్రరథమా • వేదప్రఘోషాధ్వరో
చ్చయకోలాహలనాదితాళిపురవా • స్తవ్య న్వరేశున్ జగ
చ్చయమున్మ్రింగిన మద్విభున్గని నమః స్కారంబుఁ గావించి హ్మా
చ్ఛయపీడాదిఁ తనైన నాదు దురవ • స్థన్ దెల్పుమా వేఁడెదన్.

## 3. తిఱంగళాగిరొంగుమ్.

శ్లో. కేదారౌఘచరద్విహంగమగణా ! వస్త్వాః సారోపమ
శ్రీమద్భృంగపురీనివాసనిరతం చక్రాయుధాలంకృతం,
శ్రీవత్సాంకితవక్షసం మురరిపుం దృష్ట్వా తదంఘ్రిద్వయం
నత్వా ఖ్యాత మదీయశోకవిధురావస్థాం స్ఫుటం మాచిరమ్.

చ. పొలముల గుంపుగూడి కడు • మోదముతో విహరించునండజా
వళి ! సుసమృద్ధసంపదల • వర్ధిలు భృంగపురి న్వసించు ను
చ్చలదరిమండితాగ్రకరు • శౌరినిఁ జూచి నమస్కరించి ని
స్తులమగు నాదు దుఃఖమును • ఘోరముగాఁ దెలుపంగ వేఁడెదన్.

## 4. ఇడరిల్ పోగమ్.

శ్లో. నీరోధప్రవిజృంభమాణనిరతక్రీడారసోల్లాసినో
హంసా ! స్సంతతవేదపాఠముఖరశ్రీభృంగపుర్యాం హరిమ్,

అంభోరాశివినీలసుందరతనుం స్వాంఘ్రిశ్రితైకప్రియం
వీక్ష్యాఽఽఖ్యాత విలీయతే శిథిలతామాప్తా భవత్ప్రేయసీ.

మ. ఎడబాపెప్పుడు లేక సంగతములై ♦ హెచ్చైన సౌఖ్యాబ్ధిలో
బడి తేలాడెడు హంసలార ! సతత ♦ స్వాధ్యాయపాఠధ్వనిన్
బుడమి న్రాజిలు చంచరీకనగరి ♦ న్బొల్పారు వార్ధిద్యుతిన్
గుడవద్భోగ్యుని గృష్ణుఁ జూచి నినుఁ దా ♦ గోరిస్మరాస్త్రవ్యథ
ల్గడిమీఱంగఁ గృశించె నో ర్తనిమది ♦ న్గాఢంగ నాకుర్చ్చుడీ.

5. ఉ ణ ర్త లా డ ల్.

శ్లో. శంఖవాశ్రితసమాస్తృతోచ్ఛ్రసిక తాదుగ్ధాబ్ధితీరావనా
శ్రీమద్భృంగపురీవరే కృతరతిం పద్మాలయావల్లభమ్,
సంశ్లిష్యత్తులసీసరోఘవిలసత్కోటీరరుఙ్మండలం
హంసా! వేదయత ప్రణమ్య శిరసా దీనాం దశాం మద్గతామ్.

మ. పొలయుల్క్ర్వెసఁదీర్చి వల్లభలతో ♦ భోగించు హంసౌఘమా !
జలరాశ్యూర్మిచయాస్తశంఖవితతి ♦ చ్ఛన్నాళిపుర్యాసికా
విలసద్దేవుని మాల్యశోభిశిరసు ♦ న్వెన్నున్విలోకించి యాం
జలిబంధంబున నన్నుఁ గావుమనుచున్ ♦ సాగింపుడీ సన్నుతుల్.

6. పో త్రి యా ని ర ం దే స్.

శ్లో. పున్నాగానోకహాగ్రస్థితసిక నివహా! వః ప్రణమ్యాద్య యాచే
పాకీనక్షోభితాంభోవిసరవలయితం పుష్పవిట్పత్తనం ద్రాక్,
గత్వా తత్రత్యమంహాహానిరసననిపుణం చక్రపాణిం సురేడ్యం
దృష్ట్వాతన్మోహశాంత్యై కురుమతిమితితం ప్రార్థయ త్త్వా స్వభావమ్.

శా. పున్నాగద్రుమమండలిం జెలగు నో ♦ పుంస్కోకిలవ్రాతమా !
నిన్ను న్సన్నుతిఁ జేసి కోరెదను మ ♦ న్నిం పిష్ట నాయాచనన్
వెన్నున్ భృంగపురీనివాసనిరతు ♦ న్వేవేగ వీక్షించి యా
పన్న న్గావు మటంచు బల్కసతిఁ డే ♦ ప్రత్యుత్తరం బిచ్చునో
విన్నాణంబుగ నాకుఁ దెల్పు మిదిగో ♦ వేర్వేరుగా మ్రొక్కెదన్.

7. ఒరువణ్ణంకెన్నుపుక్కు.

శ్లో. ప్రత్యూహాన్పథి తే నిరస్య శుక! సంఫుల్లప్రసూనక్షర
ద్ధూళీసిద్ధదకాలసాంధ్యరుచిమచ్ఛ్రీభృంగపుర్యాం విశేః,
రక్తాంభోజదృశం సురేశ్వరదృషన్నీలంచ రక్తాధరం
జ్ఞాత్వైతచ్ఛుభలక్షణైస్స్మరరిపుం వార్తాం మమ శ్రావయ.

ఉ. కీరమ! సాంద్రపుష్పవన ♦ కీర్ణము వార్ధితరంగతాడితం
బై రహింపు భృంగపుర ♦ మం దొకరీతినిఁ జొచ్చి యచ్చటన్
వారిధరాభగాత్రు నవ ♦ వారిజలోచనుఁ జక్రహస్తుఁ గ
న్నారఁగఁ జూచి మన్మనసి ♦ జాత్రరుజ న్వినిపింపుమా దయన్.

8. తిరుందక్కుండేసక్కు.

శ్లో. లీలానిష్కుటపుష్పభృంగనగరీవాసోత్సుకం మత్ప్రియం
ఫుల్లాంభోజవహాస్యనేత్రముకులం నీలాంబుదాభం విభుమ్,
సర్వాక్షేశ్వరతానుమాపకలసత్కోటీరకాంత్యుజ్జ్వలం
దృష్ట్వా జ్ఞాతతదాశయా వద పునర్మే శారికే! తద్వచః.

మ. వకుళాశోకరసాలచంపకవనీ ♦ ప్రాగ్భారసంవేష్టితం
బకలంకద్విజబృందవాసరుచిరం ♦ బౌ పుష్పలిట్పత్తనం
బకృశానందము తోడఁ జొచ్చి శుకక! ♦ యబ్జాయతాక్షు న్బలా
హకవర్ణు న్విలసచ్చతుర్భుజుఁ గిరీ ♦ టాంచచ్ఛిరు న్గృష్ణుఁ బూ
నిక వీక్షించి మదీయతాపగరిమ ♦ న్నీ నేర్పునన్ దెల్పుమా.

9. అడిగళ్కైతొళుదు.

శ్లో. ప్రీతధ్మాతదరౌఘరావముఖరశ్రీభృంగపుర్యాశ్రితం
దేవం మాయినమశ్మనిష్ఠురహృదం సంవీక్ష్య బద్ధ్వాఽఞ్జలిం,
హంసాః! పద్మవనీవిహారచతురాః పాపాశ్రియాయా మమ
ఖ్యాతాపన్నదశాం దయార్ద్రమనసో జ్ఞాత్వా తదీయేంగితమ్.

చ. కమలవనీవిహారరసి ♦ కత్వము గల్గిన హంససంఘమా!
కమలహితోదయోచ్చలిత ♦ కంబురవప్రతినాదితాష్టది

# ఆంధ్ర గీర్వాణ శఠకోప సహస్రము.

గ్భ్రమరపురీనికేతనుని ♦ బద్మదళాక్షుని జూచి తొంటిపా
పమున గృశించు నాదు దుర♦వస్థ రహస్యమునందు దెల్పుమా.

## 10. వే ము కొం డు మై స్మ.

శ్లో. సర్వేభ్యశ్చతురాః పరార్థఘటనే భృంగా ! స్వసుభ్యర్థనాయే
వః పంపాసరసీవరోత్తరదిశి శ్రీభృంగపుర్యాం స్థితమ్,
కల్పాపాయవిజృంభమాణహుతభుక్ప్లేషవిధ్వంసిత
శ్రీవ్యాదీశపురం విలోక్య గదత ప్రాణిత్యసాపిత్యారమ్.

మ. సుమగంధప్రచురద్విరేఫగణమా ! ♦ శుద్ధాంబుసంపానదీ
ప్రమథేశాత్తహరిద్గతాళినగరీ ♦ వాస్తవ్య బాణచ్ఛటా
దమునప్లుష్టదశాస్యపత్తను సదా ♦ ధారుస్మహావీరుని
స్సముపీక్షించియొకర్తుగాపుమున చూ ♦ సాంతోర్వృక్తింగోంజెప్పుమా.

## 11. మి స్నో ల్ శే ర్.

శ్లో. యః ప్రాగ్వామనరూపభృత్తుహానయా వ్యక్రంస్త లోకత్రయీం
తం శ్రీశం స్తువతా శఠారిమునినా ప్రోక్తే సహస్రే గిరామ్,
గాథా భృంగపురీశగా దశ పఠన్నేతా నరో భక్తిత
స్సాత్సర్వావయవానవద్యవపుషామేణీదృశాం భాజనః.

ఉ. కాంతులనీను జన్నిదము ♦ గల్గినవామనుడై ధరిత్రిం దా
నంతయుం గొన్న మాయియగు ♦ నబ్జదళాక్షుని పాదచింతనా
క్రాంతమనస్కుడైన కురు ♦ కాపురవాసి శఠారియోగి గా
నాంతముగా రచించిన స ♦ హస్రమున స్మధులిట్టిరమా
కాంతుని జెప్పునట్టి పది ♦ గాథల నాదృతి నభ్యసించువా
రెంతయు వైష్ణవావళికి ♦ నిష్టు లనంగునిమాడ్కి బోల్తురుస్.

శ్రీ మ తే శ ఠ కో పా య న మః.

శ్రీమతేరామానుజాయనమః.

## షష్ఠ శతకము - రెండవ దశకము.

[మిన్నిడై మడవార్.]

అవతారిక :—ఈ యాళ్వార్లు సంసారభయముచేతను, సర్వేశ్వరునియందున్న ప్రావణ్యముచేతను భగవద్విషయనిష్ఠులైనవారి రీతు లన్నియుఁ గలవారైయున్నారు. "పాయ్‌నిన్న ఞానముం పొల్లానొ ఱుక్కు మ ఱుక్కుడంబుమ్" (పాయ్‌నిన్న = అసత్యవాచ్యమయిన అచేతనమందు, ఞానముం = ఆత్మయనెడు జ్ఞానము, పొల్లానొఱుక్కుం = సాంసారికదుష్కర్మప్రవృత్తియు, అఱుక్కుడంబుం = నుండినదేహమును) అనిచెప్పుటచే సంసారబద్ధుల రీతియును, "ఇన్నిన్ననీర్మై యిని యాముఱామై" (ఇన్నిన్ననీర్మై = నీనియందు స్థిరముగానున్న రుచివాసనాస్వభావమును, ఇని = భగవత్కైంకర్యముకలిగినపిమ్మట, యామ్ = మేము, ఉఱామై = పొందకుండునట్లు) అని శరీరసంబంధమును సహింపలేక యుండుటవలన ముముక్షువుల రీతియును, "వఴువిలా వడిమై శెయ్య వేణ్డుం నామ్" (అవిచ్ఛిన్న కైంకర్యమును మేము చేయవలయును) అనుటచే కైంకర్యముచేఁగాని మఱియొకదానిచే దేహయాత్ర నడవని ముక్తుల రీతియును. "నిన్నలాలిలేన్కాణ్" (నీవు తప్ప మఱెవ్వరు లేనివాడను) అనుటచే నిత్యుల రీతియును, ప్రణయరోషముచే పాలయల్క బూనుటవలన పిరాట్టిమార్ల సామ్యమును, "విష్ణునా సదృశో వీర్యే సోమవత్ప్రియదర్శనః" అన్నట్లు శ్రీరామచంద్రుని ఆయాయిస్వభావమునకు జగత్తులో నుండు నాయాయి పదార్థములను పమానముగా జెప్పిన ట్లిందఱిప్రకారములును వీరు గలిగియున్నారు. "అఱియాకాలత్తుళ్లే అడిమైక్కణ్ అన్పుశెయ్విత్తు" (1-13-3) (అజ్ఞానదశయందే దాస్యమందు ప్రీతిని బుట్టించి) "ములైయో ముఴుముత్తుం పోందిల-ఇవళ్ పరమే పెరుమాన్‌మలైయో తిరువేంగడమెన్ను కర్కిన్న వాశకమే" (తి-వి. 60) (స్తనములు పూర్ణముగా గాలేదు. ఇట్టి చిన్నతనములో స్వామి నివసించు పర్వతము వేంకటాద్రి యని చెప్పుట మిక్కిలి యాశ్చర్యము) అనిచెప్పుటచే నిట్టియవస్థ వీరికి బాల్యమునుండియు గలదు. "ఏరాళుమిఱైయోన్" లో సర్వేశ్వరు డపేక్షించని నేను నాసొత్తు నాకక్కఱలే దన్నారు. "మాశరుశోది" లో నా కుపయోగింపని యాసర్వేశ్వరుతోను వానివిభూతితోను నాకు పనిలేదన్నారు. "పిరిందవారు" లో తన విరహబాధను సహించుకొని నేను నీగుణానుసంధానము చేసికొనుటకు సామర్థ్యముగలవాడ నగునట్లు కటాక్షింపు మని శరణాగతి నొనర్చిరి. అట్టి ఆ స్థితిలో దూతలను బంపిరి. ఆ దూతలు

వెళ్లి స్వామికి వీరియవస్థను తెలియజేయుచుగా స్వామియును గజేంద్రునికడకు బోయిన ట్లతిత్వరతో వీరివద్దకు వచ్చుటకుఁ బ్రయత్నించుచుండగా నావిలంబము నుగూడ సహింపలేక తల్లడించి యిక నేనిపుడు చేయవలసిన దేమి యున్నదని యాలోచించి ఆత్మహత్య నొనర్చుటకు నిశ్చయించిరి. ఆతనివిరహమందు నేను పొందిన బాధను, ఆతనియెదుట నాప్రాణములను విడిచి ఆతనికి గనుగ జేసెద ననెను. ఇంతలో నాలస్యమైనదని శంకించి నాయకుఁడు, నాయిక చెలులతో క్రీడించుచున్న యొకపుష్పవనమందు బ్రవేశించి తనసౌందర్యాదులచే నాయికరోషమును దీర్చి నాయికతో సంశ్లేషించెను.

భగవద్విషయమందు సాపత్న్యము తోచునట్లు చెప్పుట శేషత్వలక్షణము కాదనియు, "వళవేఱులగిక" అను తిరునాయ్ మొళి నాఁడ కలె నీయాళ్వార్లు అయోగ్యతానుసంధానము చేసినారనియు కొందఱు పూర్వాచార్యులు నిర్వహించిరి. ఆళ్వార్లు భగవద్విషయమందున్న రుచిని ప్రకాశింపజేయుటకే యీ యొక తిరునాయ్ మొళియే అని కొందరు సాధించియున్నారు. "నిన్నిలంగురుమొయినాయ్" అనునది యింకు ముఖ్యగాథ. (తయిర్పాట్టు.)

1. మిస్సైమడవార్.

శ్లో. వియన్మధ్యా బహ్వ్యస్సుదృశ ఇహ తే సంతి మధుజి
త్ప్రియాస్తాసాము గేహ్రే కిమపి పరిభీతాఽస్మి గదితుమ్,
అహైమి త్వచ్ఛాత్ర్యం సుభగ మమ మాచూచుర ఇదం
లసత్క్రీడావస్తు ప్రతివిసృజ తత్సాధయ తతః.

సీ. బాణాగ్నిసాక్ష్యత ♦ పౌలస్త్యనాయక
లంకాపురీవర ♦ పంకజాక్ష
సిక్ష్మపాస్పదలౌచు ♦ నెగడు నీ తనుమధ్య
లండజెమోహ్రిల నీ ♦ వళుకులేక
నాబంతి హరియింప ♦ నాయంబె యిది చూచి
వారలు నీతోడ ♦ వాదులాడు
తటి నీదు వెతగని ♦ తాళంగ జాలను
మాయమాట లికేల ♦ మాయలాడ
తే, గీ. నీదు నెఱవాదితన మిది ♦ నిష్ఫలంబు
నన్నుఁ గరుణించి నాబంతి ♦ నా కొసంగి

యిచ్ఛకోలఁదిసి విచ్చేయు • మెచటికైన
నీకరస్పృష్ట మంటిన • నాకు మేలు.

2. పోగునంబి.

శ్లో. రక్తాబ్జాతదళాయతాక్షియుగళం మందస్మితం చాధరే
చాస్మాన్వ్యాకులయంతి సాధయ శనైస్స్వామిన్నలం కైతవైః,
రక్తానామతిలోకరమ్యవపుషాం తాసాం పురస్తాదముం
వేణుం పూరయ నందమేదతితరాం తాస్తన్నినాదః కలః.

ఉ. తామరసానుకారియగు • తావకలోచనయుగ్మ మోహమున్
కోమలమందహాసమును • గోయఁదొడంగెను మామనంబు మా
నోముఫలంబె యిద్ది యఘు • నోదక మేమిటు నాశమొందుటల్
నీమురళీరవామృతము • నీప్రియభామలకర్ణవీధికి
న్నామిత వెట్ట గోగణము • హర్షమునొందఁగ గ్రోవినూదుమా.

3. పోయిరుందునిన్నుళ్లునమ్.

శ్లో. యాస్త్వత్కేతవనాగురా వలయితాస్స్యుస్తన్మదే త్వద్వచ
స్తే బింబాధరమాస్యమంబుజదళప్రస్పర్ధినేత్రద్వయమ్,
త్వద్విశ్లేషవశాద్విదూనహృదయా నస్సంతితం బాధతే
మంధక్షుబ్ధపయోనిధే తవ కృపాం ధన్యా లభంతే చ కాః.

మ. జలధిన్ ద్రచ్చిన మేటి పంకజదళా • క్షా నీకృపాభవ్యలో
జలజాక్షీమణు లెవ్వరో యరిగి త • త్సాన్నిధ్యమం దీచ్ఛలో
క్తుల నాడన్విని వారు నమ్ముదురు తో • డ్తో నేఁగు మచ్చోటికు
జ్జ్వలమౌనీ యధరంబు కన్నుగవయు • న్వాడ నగ్గతం బేమొకో.

4. ఆలినీళిలై.

శ్లో. కృతోస్వోదరే శయితవానసి సప్తలోకీం
న్యగ్రోధపల్లవతలే విలయే తదాను,
బ్రహ్మాదయోఽపి నవిదు ర్భగవదీయమాయాం
కే వా వయం బత విమూఢజనాః పరాత్మన్.

చ. భువనములెల్ల మ్రింగి వట ♦ భూజదళంబునఁ బండు నయ్యయా
సవనభుగగ్రగణ్యులును ♦ జాలరు నీమహిమం బెఱుంగ నే
యువిద నెఱుంగనేర్తు నెటు♦యుగ్మలులందఱుఁగూడి యాడఁ ద
త్సవిధమునందుఁ జేరి పశు ♦ సంఘము మేపు నెపంబుతోడ నీ
వవినయకృత్యము ల్సలుప ♦ నౌనని జెచ్చను వోవు మిత్తఱిన్.

5. క ర్ణ రే ల్ నం బి.

శ్లో. స్వామిన్ ద్యౌః పృథివీచ వేత్తి భవతో యద్ధూర్తచేష్టాదికం
కించిన్మే గదితం నిబోధ విలసచ్ఛ్రాకామ్రయుధాలంకృతి,
చోర్యాతిస్మంజుమధుద్రవప్రవచనస్త్వత్ప్రేమభాజః పరం
మ్లానాస్యాస్స్వైరి హాహాపలత్స్వదయితాస్మాస్యందుకక్రీడనమ్.

మ. కపటంబు ల్చరించి నాపునను గ్రసు ♦ క్కంజేయు రాకింక నీ
కపటం బీ క్షితినాకముల్ దెలియు నో ♦ కంజాక్ష మున్నాజిలో
రిపుదాడ్చీకరచక్రహేతి దినముఃఁ ♦ రేజేయు వే యిప్డు నా
లపితం బొక్కటి నాలకింపుము మనో♦హ్లాదైకసంధాయినుల్
కృపకు న్బాత్రులు నీప్రియ ల్మనములో ♦ ఖేదంబునం బొంద ని
మ్రపనాకీరముతోడ నాడకుము కృష్ణా నీకుఁ బుణ్యం బగున్.

6. తు ర గి మొ ం గ ళ్.

శ్లో. కృత్వా ధూర్తవిచేష్టితాని రభసం చాకృష్య నః పుత్రికాం
కిం లబ్ధాసి న నూతనా స్తవ నయం కేయం కృపాఽస్మాసు తే,
యాస్త్రైలోక్యవిమోహనైకచతురా స్స్యందగ్వసారోజ్జ్వలా
స్తా బహ్వ్యస్తవ సంతి మాఽఽత్ర విశ భో శాలిస్వమేతత్రాంతః.

మ. దరహాసప్రణయావలోకనగతి ♦ స్థానాదిలీలారస
స్ఫురణ న్మమ్ముల మోహపెట్టి వెనమా♦బొమ్మఁ గాఁ వారింపంగ నే
మిరనీకైన ఫలంబు నీదు చరితన్ ♦ మేమెల్ల సత్యంబుగా
బరమోదార యెఱింగి యుంటి మిక నీ♦భామామణు ల్మత్తు రీ
పరిహాసోక్తులఁ బొమ్ము వారికడకున్ ♦ వాదేల మాతో హరీ.

7. కన్నమన్నాంగల్.

శ్లో. అంతే స్వోదరగుప్తలోకవితతే నైవోచితం మత్కరా
త్పాంచాలీహరణం తవాఽపి జనయేద్దుష్కర్మపాపం ధ్రువమ్,
సురోత్కృష్టనిగదన్వినోదనపరో ఽస్మాభిస్సహ క్రీడసే
పాదర్వా యది జానతే మమ తతస్త్వాం తాడయేయుర్భృశమ్.

శా. మాచిత్రప్రతిమ న్బలాత్కృతి హరిం ♦ ప న్నీవు మర్యాదగా
దాచాంతాబ్ధిపరీతభూవలయ నీ ♦ కన్యాయ మన్యాయ మా
నీచాపల్యము జూచిన న్మదనుజుల్ ♦ హింసాపరు ల్పాప్యపా
పాచారంబుల నెంచకుండ నిను దం ♦ డాఘ్నునిం జేయరే.

8. పిణక్కాయావైయుమ్.

శ్లో. సర్వత్రేతి లోకనిచయస్య యశః పదం త్వాం
మార్గేఽరుణో వనవిహారసముత్సుకా నః,
ఏతత్త్వదీయదయితా యది జానతే త్వాం
నిందంతి కర్మలమియాదమలం యశస్తే.

మ. సకలస్థావరజంగమాత్మకజగ ♦ త్సర్గావనాదిక్రియా
ప్రకటానల్పయశోవిభూషితుఁడవై ♦ భాస్వన్మహాజ్ఞానివై
యకలంకాత్ముఁడవైన నీ విపుడు మ ♦ మ్మాశంక బోనాడి దా
రికి నడ్డంబుగ నిల్చి యుస్సుటిది నీ ♦ రీతి న్విదూషింపదే.

9. ఉగవైయాల్.

శ్లో. అంభోజాతదళోపమాయతభవన్నేత్రాంతవిక్షేపిచా
బద్ధా నః పరిభూయ సస్మితముఖాంభోజం నహాః తిష్ఠసి,
అస్మాభిశ్చ వినోదనాయ రచితం యద్వాలుకామందిరం
పాదేన ప్రవిలోప్య నందసి ముహుర్న్యాయ్యం హి నైతత్తవ.

ఉ. నీయెడఁ బ్రీతి మామనము ♦ నీటివలె న్గరగింపఁ జేసి నీ
హేయగమైన కన్నుగవచూ ♦ పుల నల్లిన జాలమందు మ
మ్మోమయెడఁ ద్రోచి మేము రచియించిన నీటగు బొమ్మరింటి న

న్యాయముగాఁ బదాబ్జమున • నాగడమొప్పఁగఁ బాడుచేసి కో
కోయని కూయసాగితివి • కూడునె యిట్టిపనుల్మురాంతకా.

### 10. నిన్నిలంగుముడియినాన్.

శ్లో. ధారాతైక్ష్ణ్యలసత్కుఠారదళితక్ష్మాధీశలోకేశతా
భిక్షానాయితమాల్యలంకృతశిరో లోకోచ్చమోత్పాదక,
గోపోజ్జీవనహేతవే యదుకులే స్వేచ్ఛావతీర్ణ ప్రభో
సుత్రామోపలసుందరాంగ భవతా క్లిశ్యామహే సంతతమ్.

మ. మకుటాలంకృతశీర్ష స్పృష్టవిపుల • క్ష్మామండలా ఘోరశా
తకుఠారాంచలఖండితాఖిలమదో • ద్దామావనీనాథ గో
పకులానుగ్రహణైకభావరచిత • వ్యాపారలీలావతా
రకరీంద్రావన శక్రనీలమణిదీ • ప్రచ్ఛాయ మమ్మాశ్వు గో
పికలన్బాధ నలంచుచుంటివిది స • ద్వ్యాపారచిత్రంబె హరీ.

### 11. ఆచ్చియాగియవన్నైయాల్.

శ్లో. ముష్టే హైయ్యంగవీనే ప్రకుపితమనసా లూఖలే బద్ధతుందో
మాత్రా గోప్యా ఽశ్రునాశ్రుప్రకలుషనయనో భీతవద్వ్యారురోద,
తస్యాస్మిన్ స్తోత్రరూపే శఠరిపురచితే పద్యసాహస్రకేఽమూ
గాథాస్తిస్రశ్చ సప్త ప్రపఠితుమనసో దుర్గతిం నోపయాన్తి.

ఉ. వెన్నను దొంగలించెనని • వేగిరపాటునఁ దల్లి గొట్టఁగాఁ
గన్నులనీరునింపకయె • గట్టిగ నేడ్చిన నర్తకాగ్రణిన్
వెన్నుని సన్నుతించి శఠ • భీషణయోగి రచించినట్టి వి
ద్వన్నుతవేదసమ్మితని(ప్రి) • బంధమునందలి యీపదింటినిన్
మన్ననతోడఁ బాడ భువి • మానవు లొందరుగా దరిద్రతన్.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతే రామానుజాయ నమః.

## షష్ఠశతకము – మూఁడవ దశకము.

[నల్కూరవుం శెల్వమ్.]

అవతారిక :—ఆళ్వార్లు సర్వేశ్వరుని గొప్పతనమును తమ నీచతను దలంచి ఆతనిని జేరుటకు నేనయోగ్యుడనని యెడబాయుట కాలోచించుచుండఁగా నిది కని యీశ్వరుఁడు వీరియభిప్రాయమును మాయునట్లుచేసి తనతోఁ జేర్చుకొనెను. ఇదిచూచి ఆళ్వార్లు - ఆహా ! ఇది యేమి అఘటితఘటనాసామర్థ్యమని ఆశ్చర్యము నొందుచుండఁగా నీశ్వరుఁడు వీరిని జూచి “ ఇందు కింత విస్మయము నొందనేల ? నా ఆశ్చర్యములను జూడుడు. లోకములో నెట్టి పరస్పరవిరుద్ధములైన పదార్థము లన్నియు నాలో నెట్లు చేరియున్నవో. లోకములో నిమిత్తమైనది ఉపాదానము కానేరదు. ఉపాదానము నిమిత్తము కానేరదు. నేనే వీని కన్నిటికి నిమిత్తము ఉపాదానమునై యున్నను వానిదోషముల నంటక యుంటిని. ప్రాప్య ప్రాపకములు రెండును నే నయియుంటి నని చెప్పగా సంతసిల్లి యాతనిసౌందర్య సౌశీల్యాదుల ననుసంధించి యిట్టి ఉపకారశీలుఁడైన సర్వేశ్వరుఁడు తిరువిణ్ణగరిలో సన్నిహితుఁడై యున్నాడు. ఆతడే మనకు పరమబంధు వని నిశ్చయించిరి. ఈదశకములో మొదటిపాశురమే ముఖ్యగాథ. [ఉయిర్న్దాట్టు.]

### 1. నల్కూరవుం శెల్వమ్.

శ్లో. సమ్పత్తిశ్చ దరిద్రతా చ నిరయస్స్వర్గశ్చ వైరం తథా
స్నేహో హాలహలం సుధేతి సకలం స్యాద్యద్విభూతిః పరా,
నానాభూతగుహాశయం శ్రితజనత్రాణాయ నానాతనూ
ర్ధృత్వా భువ్యవతీర్ణమంబరపురే౽పశ్యం తమబ్జాసఖమ్.

ము. ధనసంపత్తియు దుఃఖదంబగు మహా ♦ దారిద్ర్యము న్సౌఖ్యసం
జనకంబైన సురాలయంబు నిరయ ♦ స్థానంబు ప్రద్వేషము
న్ననఘప్రీతి సుధావిషంబులును దా♦నై పెక్కురూపంబులున్
తనువు ల్దాల్చి జగంబునిండిన విభున్ ♦ దామోదరు న్సంపదన్
ఘనమైనట్టి వియత్పురీవరమున ♦ న్గన్నారనేఁ గాంచితిన్.

### 2. కండవిన్బమ్.

శ్లో. సుఖం దుఃఖం జ్ఞానం తదితరమథాజ్ఞానమఘకృ
త్ప్రసాదః కోపశ్చ జ్వలనగతమౌష్ణ్యం తదితరత్,

ఇదం సర్వం యత్స్యాత్తమమహామపదం వాఙ్మనసయో
రపశ్యం వాఃపూరోపగతరమణీయేఽమ్బరపురే.

చ. అనుభవగోచరంబులగు ♦ నాసుఖదుఃఖములు న్మనంబునన్
దనరు ప్రసాదమున్ రుషయు ♦ దద్దయు వేడినిఁ జూపు నగ్ని చ
ల్లనిదగు నీడ తానయయి ♦ లాతిపదార్థములెల్లఁ దానయై
ననుఁ దనపాదదాస్యమున ♦ నాటిన లోకవిభుండు శౌరి నె
మ్మినివసియించు తానకము ♦ మేలగు వ్యోమపురంబు చూడుడీ.

### 3. న గ ర ము ం నా డు గ ళు మ్.

శ్లో. యస్యేయం పరమావిభూతివితతిస్స్యాత్పత్తనం ఖర్వట
స్తేజోధ్వాంతచయశ్చ భూమివియతీ జ్ఞానంచ మాధ్యం తథా.
భూభృత్తుంగమహార్ఘ్యసౌధనికరాంచద్వ్యోమపుర్యాం సదా
వాస్తవ్యస్య మురద్విషశ్శుభగుణాన్వృత్తిర్భవేన్ముక్తిదా.

ఉ. దేశములు న్పురంబులును ♦ దెల్వియు నజ్ఞతియు న్సమస్తది
గ్దేశములందు బర్వెడు సు ♦ తేజము చీకటి భూమి యాకసం
బాశలు దానయై గగన ♦ మంటెడు మేడలనుల్లసిల్లు నా
కాశపురంబున న్వెలుగు ♦ కాళియమర్దనకీర్తి దక్క వే
రే శరణంబు లేదు భువి ♦ నేరికి మోక్షపదంబుఁ జేరగన్.

### 4. పు ణ్ణి యు ం పా వ మ్.

శ్లో. పుణ్యాపుణ్యచయోపజాతసుఖదుఃఖావాప్తిరాత్యంతికీ
స్మృత్యస్మృత్యథ శూన్యతా స్థితిరితి స్యాద్యద్విభూతిః పరా,
ఉచ్చాట్టాలకసౌధసంకటవియత్పుర్యాశ్రితస్యోత్కటం
కారుణ్యం ప్రవిముచ్య నాస్తి శరణం వోఽన్యద్ధ్రువే మానవాః.

తే, గీ. స్మృతియు విస్మృతి పుణ్యంబు ♦ వృజినవితతి
యెడయుకయుఁ గలిసియుండుట ♦ యింపుమీర
సత్తసత్తులు దానయై ♦ సరవితోడ
నుచ్చసౌధాళివిలసిత ♦ వ్యోమనగర

వాసియగు కృష్ణు కృపయె మా ♦ బ్రతుకు తెరవు
కల్లగా దిది నమ్ముడు ♦ గట్టిమాట.

5. కై ద వం శై వ్యం.

శ్లో. కౌటిల్యం ఋజుతా సితత్వసహితం నైల్యంచ సత్యానృతే
తారుణ్యంచ జరా నవత్వమథ యజ్జీర్ణత్వమిత్యాదికం,
సర్వం యత్సమభూద్వియత్పురవరాధీశేన తేనాఖిల
త్రైలోక్యం పరిపర్థితోత్తమసుమారారామోపమం పశ్యత.

చ. తెలుపును నల్పనార్జవము ♦ తిన్ననిత్రోవ ఋతానృతంబులున్
లలి శిశుతాజరల్ నవత ♦ లాదిదియైన పురాతనత్వమున్
వెలయగ దానదియై వరణ ♦ వేష్టితమైన వియత్పురంబునన్
విలసిలు వార్ధిజావిభుఁడు ♦ నిష్ణత జేసిన తోట చూడుడీ
జలజభవామరేంద్రసుగ ♦ సంఘసమన్విత మీత్రిలోకియున్.

6. మూ వు ల గం గ ళు మా య్.

శ్లో. త్రైలోక్యంచ వికుంఠమబ్జనిలయా జ్యేష్ఠా ప్రసాదక్రుధా
కీర్తిదుర్యశ ఇత్యనుక్తమఖిలం స్యాద్యద్విభూతిః పరా,
సూరివ్రాతనిషేవ్యమాణగగనస్థానీయవాసీ స మే
జ్యోతీరూపతయా చకాస్తి హృదయే పాపీయసోప్యాదరాత్.

తే, గీ. ముజ్జగంబులు వైకుంఠ ♦ ముసు ప్రసాద
నిగ్రహంబులు జ్యేష్ఠయు ♦ నీరజాత
యశము నయశంబు దానయై ♦ యతిశయిల్లు
దేవసేవ్యవియత్పురి ♦ ధిష్ణ్యుఁ డబ్జ
నాభునికి వాసమగు నెప్డు ♦ నామనంబు.

7. ప రం శు డ రు డం బా య్.

శ్లో. జ్యోతీరూపః ప్రకృతిమలినాపూర్ణదేహో నిగూఢో
మర్త్యానాం దృక్పథముపగతో రామకృష్ణాదిరూపైః,

లోకే చక్రే కుహకనటనం యో వియత్పూర్నివాసీ
తస్యాఙ్ఘ్రిత్వా చరణకమలం నాస్తి నోఽన్యచ్ఛరణ్యమ్.

చ. నిరవధికానవద్యరుచి ♦ నిర్మలసత్త్వమయోరుగాత్రుఁడై
స్థిరచరరూపహేయగుణ ♦ సేవితసర్వజగచ్ఛరీరుఁడై
సరవిని ముక్తహేయుఁడయి ♦ సర్వమునన్ వెలసిల్లువాఁడునై
ధర మనుజాదిరూపమున ♦ దా నవతారములెత్తి యాశ్రితో
త్కరముల బ్రోచుబుద్ధిరిపు♦కాండము ద్రుంచెడునావియత్పురీ
నిరతుని పాదపద్మయుగ ♦ నిష్ఠయె రక్షక మీధరిత్రికిన్.

8. వన్ శరణ్ శురర్క్యమ్.

శ్లో. గీర్వాణవ్రజపాలకో దితిసుతారణ్యాగ్రవైశ్వానర
స్స్వాంఘ్రిద్వంద్వసమాశ్రితానవచణో భక్తైకగోపేక్షితా,
కుంభోద్భూతదశావధూముఖశరీసాక్రే వియత్పత్తనే
సాస్నదేవనపతిర్మమాతిసులభో మహ్యంక మత్ప్రభుః.

మ. సురసంఘావనతత్పరుండు దితిజ ♦ స్తోమాభ్రచండానిలుం
డరిశంఖాంచితపాణియుగ్మఁడు మదీ ♦ యాత్మం డగణ్యోల్లస
ద్ధరిదంతాభ్రపురీనివాసనిరతుం ♦ డబ్జాక్షుఁ డాత్మాంఘ్రిదా
స్యరుచిన్ నాకు జనింపఁజేసిన ఘనుం ♦ డారక్షకుం డెప్పుడున్.

9. ఎన్నప్పన్ ఎనక్కాయిగుళాయ్.

శ్లో. ఇంద్రాశ్మోపమదేహకాంతిరుచిరో నిష్టప్తహేమప్రభో
మన్మిత్రం జననీ సఖా చ జనకో మత్సోదరో మత్ప్రియః,
భాస్వద్రత్నసువర్ణనిర్మితఘనప్రాకారసంవేష్టిత
శ్రీమద్వ్యోమపురీనివాసరసికః ప్రాదాన్నిజాంఘ్రిం మమ.

ఉ. మజ్జనకుండు మజ్జనని ♦ మత్సఖుఁడున్ తపనీయవర్ణుఁడున్
ముజ్జగముల్ సృజించి తొలి♦ మోద మెలర్పఁగఁబెంచి త్రుంచువా
డిజ్జగమందు హేమవర ♦ నేద్యవియత్పురవాసశాలి స
న్నజ్జను జేర్చి కాచె నయ♦ మారగ ధన్యుఁడనైతిఁ దత్కృపన్.

### 10. నిఴల్ వెయ్యిల్.

శ్లో. ఛాయాతపాణుబృహదుచ్ఛ్రితవామనేంగత్
స్థాస్నుప్రపంచవపుషః ఖపురాశ్రితస్య,
పద్మేశితుశ్చరణకంజయుగం విహాయ
నాన్యద్భవేచ్ఛరణమిత్యుపధారయంతు.

తే, గీ ఎండ నీడయుఁ జిన్నది ♦ యొంచఁ బెద్ద
హ్రస్వదీర్ఘ చరాచర ♦ రాజి దానె
యగుచు నంబరపురమున ♦ నలరు దేవు
నంఘ్రిపద్మంబె నాకగు ♦ నవనపటువు.

### 11. కాణ్మినగళ్ పులగీరెన్ను.

శ్లో. లోకాః పశ్యత పశ్యతేతి నిగదంస్తేషాం సమక్షం పదా
క్రాంతోర్వీవలయం ముదావ శఠజిత్పద్యైస్సహస్రేణ యైః,
తేష్వేతద్దశకం వియత్పురపరం యేఽధీయతే భక్తిత
స్తే పూజ్యాస్సురిసంచయస్య సతతం నిస్సంశయం బోధత.

మ. జనులెల్లన్ గనుడంచు పాదసరసీ ♦ జాతద్వయిం జూచి లో
కనికాయంబును గొల్చునట్టి కమలా ♦ కాంతున్ శఠారాతి భ
క్తిని కీర్తించి రచించియిచ్చిన ల ♦ సద్దివ్యప్రబంధంబులో
ననఘంబైన వియత్పురీదశక మ ♦ త్యంతాదృతి న్బాడువా
రనయంబున్ దివిజాహ్వానార్హులిది స ♦ త్యంబంచునూహింపుడీ.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతే రామానుజాయ నమః.

### షష్ఠశతకము - నాల్గవ దశకము.

[కురవై.]

అవతారిక:—ఆళ్వార్లీ తిరువాయ్మొళ్ళిలో వాల్మీకిసామ్యముఁగలవారై యున్నారు. రామావతారమునుదప్ప మఱియొకటి ఆయన యెఱుఁగడు. వీరును

కృష్ణావతారముతప్పయితరగము నెఱుగరు. ఈ తిరువాయ్‌మొళ్ళి కృష్ణవృత్తాంతమును విడిచి మఱియొకటి చెప్పదు. " స్నేహో మే పరమో రాజం స్త్వయి నిత్యం ప్రతిష్ఠితః, భక్తిశ్చ నియతా వీర భావో నాన్యత్ర గచ్ఛతి. " అన్నరీతిగా పరదశను గూడ నపేక్షింపక తిరువడి (హనుమంతుడు) స్వామియందే దృఢలగ్నమనస్కుఁడై యున్నట్లు వీరును కృష్ణావతారముతప్ప అన్య మెద్దియు నెఱుగరు. " శేఖయర్ వాన త్తిరుక్కుఁం తేవపిరాన్ " (ఉన్నతమైన పరమపదమందు వేంచేసియున్న ఉపకారకుడు) అన్నట్లు సన్నిహితుఁడై అనుభవింపలేకపోతి నను కొఱత తీరునట్లు భూమియందే ఉండి అనుభవించిరి. " తొల్లరుళ్ నల్వినైయాల్ శొలక్కూడుం కొల్ " (అనాదియైన భగవదనుగ్రహముచేఁ గలిగిన మంచిసుకృతముచేఁ జెప్పవచ్చునా) అని వీరాళ నొందిరి. " పిఱందవారు " అను తిరువాయ్‌మొళిలో వీరికున్న కొరతయంతయు దీరునట్లు శ్రీకృష్ణుఁడు తన బృందావనవృత్తాంతమునంతయు జూపింపగాఁ జూచి అతీతకాలమందువలెఁ గాక సమకాలమందువలెనే దగ్గరనుండి అనుభవించిరి. ఈ తిరువాయ్‌మొళ్ళిలో "మణ్ణైయిరుందుపారకమ్" అనునది ముఖ్యగాథ. (ఉయిర్పాట్టు.)

## 1. కురవై.

శ్లో. యద్గోపీభిస్సమం సా వ్యరచిచ భవతా రాసగోష్ఠీ ప్రమోదా
ద్యచ్చైలం సప్తరాత్రం సముదవహీథ బలిం యద్ధరిత్రీమయాచీః,
యన్నాగం సంవ్యనైషీర్హ్రదవిహితదృశం యామునే పాథసి త్వం
తత్సర్వస్యాప్యధీయ న్సుఖితమహరహర్వ్యాప్తిసీయాబ్జనాభ.

సీ. రాగిణియై వల్లవీ ♦ రమణులతోఁగూడి
రాసగోష్ఠిరక్తి ♦ రాజిలుటయుఁ
జంఝానిలాహత ♦ సకలగోగోపసం
త్రాణార్థిఁడై కొండఁ ♦ దాల్చుటయును
భీషణవిషవహ్ని ♦ దూషితజలసర
స్స్థితుండైన కాళియుఁ ♦ జెరుచుటయును
విశ్వవిశ్వంభరా ♦ విధృతభారము మాన్ప
వనధిశవితతి జ ♦ క్కాడుటయును

తే.గీ. మొదలుగాఁగల మితిలేని ♦ మురహరకృత
దివ్యలీలల సతతంబు ♦ దీవ్రభక్తి,

జింతఁ జేసెదు నాదు కొ ♦ రంత లెల్ల
దీరెఁ బరు లెవ్వరిఁక నాకు ♦ దీటుభువిని.

## 2. కే యూ త్తీం క ఫ్ఠ లూ ది.

శ్లో. సర్వాశ్చర్యనిధే యదిహాద్య వహ తవోద్వేలత్వరమ్యాధురీ
ధుర్యం వేణురవం గవామనుస్మృతిం సీలాకరాలంబనం,
ఇత్యాద్యా హ్యాదయంగమా స్తవ గృణన్ లీలాఃపరం కౌతుకా
త్కాలం వర్తయతో మమేహ భువనే కో వాధిరూఢస్తులాన్.

మ. మురళీగానరసాతిరంజనము గో ♦ పూగానుయానంబు సుం
దరమత్స్యప్రవిలోలలోచనసుగం ♦ ధపోల్లసత్కేశపా
శరమాసన్నిభసీలఁ బొందుటకునై ♦ సప్తోక్షసంహారమున్
పరమాశ్చర్యములైన నీ యితరది ♦ వ్యవ్యాపృతుల్ సంతత
స్మరణాలంబముగా నొనర్ప గరగన్ ♦ స్వాంతంబు నాకింక నీ
ధరణిన్ లేరు సమాను లన్యులు గనన్ ♦ దామాంచితోరస్థ్సలా.

## 3. ని గ రి ల్మ ల్లై.

శ్లో. తేజఃపుంజతిరస్కృతాబ్జహిత తే మల్లవ్రిజోజ్జాసనం
గోబృందానుస్మృతిర్మహీధరనిభ స్తంబేరమోచ్ఛేదనం,
ఇత్యాదిస్వతిమానుషాణి నిరతం సంస్మృత్య కర్మాణి తే
కాలం యాపయతో మమాద్య నపునః కాచిత్ క్షతిజాయతే.

మ. సమరాశీలురమల్లురస్ యమపురీ ♦ సంవాసులన్ జేయుటన్
సమదానేకపకుంభపాటనము గో ♦ సంఘాతము ల్మేపుటన్,
విమలంబు ల్భవదన్యచేష్టితముల ♦ న్వేనోళ్ల నేపార్తిదు నే
క మతి న్నేస్మరియించుచు న్గడపుదు ♦ న్కాలంబు నా కింక నే
మి మనస్తాపము లుండు నాశ్రితజనో ♦ న్మీలత్కృపామందిరా.

## 4. నో వ వా చ్చి.

శ్లో. త్రైలోక్యాత్యమృతాయితోజ్జ్వలతనో సందానితస్యోదరే
మాతా త్రే రుదితాభినీతిరతిమృద్వంఘ్రిప్రసారచ్ఛలాత్,

గంత్రీపాతనమాశరావిషపయఃపానం తదీయాసుభి
ర్నిత్యం సంస్మరతః కిమన్యదధికాశాస్యం భవేదత్ర మే.

ఉ. నోములపంటవైన నిను ♦ నొవ్వగ నవ్వయు రోటఁగట్టగా
వేమరు వెక్కి యేడ్చుటయు ♦ పిల్లడవై దనుజ న్వధించుటన్
కోమలపాదపద్మమున ♦ గొబ్బున బండిని రాల దన్నుటన్
శ్యామలదేహ యిట్టి భవ ♦ దద్భుతచేష్టల నెల్ల భక్తితో
నామది సంస్మరించుచు న ♦ నారతముం దివసాళిఁ బుచ్చు నా
కేమి యుపేక్షితంబు లిఁక ♦ నింపగు లోకమువారిపోలికన్.

5. వేం డి త్రే వ రి ర క్ష.

శ్లో. అంభోజాతభువార్థితస్య భవతో జన్మాజనస్యావనో
కంసాత్త్రాస ఇతి ప్రసూవచనతస్తే గోకులోత్సర్పణమ్,
గూఢం తత్ర వివృద్ధిమేత్య హననం కంసస్య మల్లైస్సహే
త్యేతత్సర్వమనారతం ప్రలపతో మే స్యుర్విశీర్ణాశ్శుచః.

మ. సననాశప్రకరంబు వేడగ నిజే ♦ చ్ఛన్ దేహబద్ధుండవై
యనని న్నాథతమోవృతార్ధనిశి నీ ♦ వత్యంతగూఢంబుగా
నవతీర్ణుండయి నందగోపుని గృహం ♦ బందుండి వర్ధిల్లి శా
త్రవుని న్గంసుని బిల్కుమార్చిన భవ ♦ త్కల్యాణలీలౌఘముల్
భవము న్బాపగఁ జాలు నాకుఁగలవే ♦ లక్ష్మీశ యేదుఃఖముల్.

6. ఇ గ ల్ కొ ల్పు లై

శ్లో. పాదాక్రాంతజగత్త్రితేస్తవ బకవ్యాపాదనం శాక్వర
వ్రాతోద్ధత్యనిబర్హణం నిశిచరావిష్టావనీజచ్ఛిదామ్,
అన్యానీదృగనేకదివ్యచరితాన్యావర్తయం స్తేఽన్వహం
నిర్ముక్తాఖిలశోకసంతతిరహం స్యామిన్భవేయం కదా.

ఉ. తామరసాక్ష నీవు బక ♦ దానవునిం జముప్రోలి కంపుటన్
భీమవృషంబుల న్బొదివి ♦ బీరముడంచుట కుందభూజ ము

ద్రామబలాతిరేకమున ♦ ధాత్రిని గూల్చుట లోనుగా జగత్
క్షేమవిధానకృత్యములఁ ♦ గీర్తనసేయుచు రేబవళ్లని
శ్రామముతోడ నేఁ గడపఁ ♦ జాలితి నా కికనేమి దుఃఖముల్.

### 7. మనప్పరిప్పోడు.

శ్లో. భక్తౌఘావనదీక్షయా నరసజాతీయోఽవతీర్ణో భువి
వ్యాపాద్యోప్యథవర్తినః ప్రతియుగం యశ్శాంతరుణ్మోదతే,
సశ్రీకస్సంశోభివిశాలవక్షసమహం తం మత్ప్రభుం సంతతం
ధ్యాయన్నిర్భరహర్షమేమి క ఇహ స్యాత్తుల్యభాగ్యో మమ.

ఉ. భక్తజనాళిదుఃఖముల ♦ బాపగ హేయమనుష్యజాతిలో
రక్తిమెయిన్ జనించి భృశ ♦ రమ్యవిదీప్రశరీరధారియై
త్యక్తసుమార్గదానవక ♦ దంబము గూల్చిన రుక్మిణీశు సం
సృక్తవినూత్నమాల్యపరి ♦ వేష్టితకంధరుని న్భజించుచున్
సక్తములన్ దినంబుల న ♦ నన్యమనంబున బుచ్చునాకు నే
డిక్కటమంచుఁ దుల్యులు సు ♦ ధీమణులార కనంగ లేరుగా.

### 8. నీణిలత్రొఘవాన్.

శ్లో. భూత్వా చ్ఛద్మవటుర్బలేర్వసుమతీమాచ్ఛిద్య దానం హరే
స్సంగ్రామే మిషతస్సురాసురగణాన్యస్సూపతేరగ్రతః,
బాణస్యాహవదుర్మదస్య భుజసాహస్రచ్ఛిదాం చేతరా
లీలాస్త్రప్రలవన్మనోగతమహాం ఛింద్యాం తమోఽజ్ఞానజమ్.

మ. సురలు న్మానవులు న్నుతింప సమర ♦ క్షోణి న్మహోవాహినీ
భరము న్మాన్పి నితాంతదుర్దమబల ♦ ప్రాగల్భ్య బాణాసురో
ద్ధురకండూలభుజాసహస్రదళనో ♦ ద్ఘుష్టప్రభావున్ రమా
వరుఁ గీర్తించెదు నాకు లేదు గన నా ♦ వంతైన నజ్ఞానమున్.

### 9. కలక్కవేర్కడల్.

శ్లో. క్రాంత్వా సప్తకులాచలాన్పటురయో నిస్తీర్య సప్తాంబుధీన్
లోకాన్సప్తవిలంఘ్య ధామ పరమం తత్ప్రాప్య సైంద్రైః పురా,

దాగ్రానీయ చిరాన్మృతాన్ ద్విజశిశూన్ప్రత్యర్పయ న్తత్పితు
స్త్వామేవం శ్రితవత్సలం మురహరహం స్తౌమ్యస్తి కో మత్సమః.

ఉ. దక్షిణహస్తపద్మమున ♦ దారుణచక్రము వామహస్తమం
దక్షయనాదమైన దర ♦ మందముగా ధరియించువాని స
త్పక్షమువాని సత్తకుల ♦ పర్వతలోకపయోధులెల్ల నే
కక్షణమందు దాటి నిజ ♦ కారణధామమునందుఁ జొచ్చి తా
నాక్షితిదేవు పుత్రకుల ♦ నందఱఁ దెచ్చియొసంగినట్టి ప
ద్మాక్షుని లీలలన్నియు న ♦ హర్నిశము న్బలవించు నాకు సా
టీక్షితిలోన లేదనుచు ♦ నెంచి వచింపగలాఁడఁ జూనుఁడీ.

10. మ ణ్మి ౖ శ్రై ర్వ రు ం హా ర మ్.

శ్లో. రాజన్యౌఘమిషోద్ధురాసురచమూభారార్దితత్వాం లఘూ
కర్తుం కౌరవపాండురాజతనయానాయోధ్య సైన్యాన్వితాన్,
వ్యాపాద్యాహవసీమ్ని వీరపటలం కృత్స్నంచ పక్షద్వయే
యోఽగాద్ధామ నిజం తమేన భజతః కోఽన్యో నియంతామమ.

తే, గీ. ఉర్వికెక్కిన భారంబు ♦ నుడుప నెంచి
భయదభారతసమరంబుఁ ♦ బన్ని యుంచుఁ
గృత్రిమంబున సేనల ♦ గీటడంచి
నిజపదంబున కేగిన ♦ నీరజాక్షు
నభినుతించెడు నాకు ని ♦ యంత లెవరు.

11. నా యు గ న్మ ౖ వే ౖ ల గు ర్యం.

శ్లో. కల్పాపాయనిగీర్ణసత్ర్యభువనం లోకేశ్వరం మాధవం
పద్మానాం శతకైన్నమైనావ దశభిర్దైత్యేశ్రితానాదిర్మని,
తేష్వేతద్దశకం పరస్పరమయా భక్త్యా నరశ్రీపతే
రంఘ్రిం ప్రాప్య రమేత సూరినివహైస్సంస్తూయమానస్సదా.

శా. లోకస్వామి సమస్తలోకములఁ దా ♦ లోనుంచి రక్షించి యా
లోకంబు ల్వెలిజిమ్మచున్ రవిశతా ♦ లోకంబున న్వెల్గు సు

శ్లోకు న్బాడి శఠారి కూర్చిన లస • త్సూక్తిప్రబంధాన నీ
శ్లోకంబు ల్పదిఁ జెప్పువారు హరికిన్ • లోలు ల్విశుద్ధుల్భువిన్.
శ్రీమతే శఠకోపాయనమః.

శ్రీమతే రామానుజాయ నమః.

## షష్ఠ శతకము – అయిదవ దశకము.

[తు వ ళి ల్ మా మ ణి మా డ మ్.]

అవతారిక :—ఆళ్వార్లీతిరువాయ్మొళ్ళికి క్రిందను మీదనుగూడ సర్వేశ్వరునే కీర్తించియున్నారు. ఈ తిరువాయ్మొళ్ళియందు స్వావస్థను దెలుపుచున్నారు. సింహావలోకన న్యాయముచే "పాయ్నిన్ఱ ఞానమ్" మొదలుకొని యింతవఱకు తమకు భగవద్విషయమందున్న ప్రావణ్యాతిశయమును అన్యాపదేశముగాఁ జెప్పుచున్నారు. ఈతిరువాయ్మొళ్ళి ఆళ్వార్ల ప్రకృతిని దెలుపుచున్నదని మన పెద్దలందఱు మిక్కిలి యాదరమును జూపుచుండెడివారట. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అన్నట్లు వాచామగోచరమైన విషయమును కూలంకషముగా నిరూపింప సమర్థులగు వీరే వీరియవస్థను జెప్పవలెఁగాని యితరులకు శక్యమా ?

సీతాపిరాట్టి జనించిన సమయమందు జనకమహారాజు జ్యోతిష్కులనురావించి "ఈమె జన్మపత్రికను లిఖింపు" మనియాజ్ఞాపింపగా వారీమెజాతకమును జక్కగా వ్రాసి "ఈమె మహాభాగ్యసంపన్నురాలయి యొకసార్వభౌముని చెట్టపట్టి సకలభోగముల ననుభవించుననియుఁ గొన్నాళ్లరణ్యవాసకష్టముల ననుభవించుననియు జెప్పిరి. అట్లులే యీనాయిక పుట్టినప్పుడు తల్లిమొదలగు నాత్మబంధువులు జ్యోతిష్కులచే నీమెజాతకమును వ్రాయింపగా– "నంతయు సరిగానేయున్నది. కాని యీమెకొక అపమృత్యు వున్నది. అది తప్పిపోయినయెడల యావజ్జీవము సుఖముగా జీవించును. ఆ యపమృత్యు వెద్దియనఁగా మీరీమెను తులైవిల్లిమంగళమునకుఁ దీసికొనిపెళ్లకుండ నున్నయెడల నీమె మీకు దక్కును." అని పలికిరి. ఈమె జీవింపకపోయినను బాధలేదు గాని తులైవిల్లిమంగళమును సేవింపకుండ నుండగల సామర్థ్యము లేని వంశమం దీమె పుట్టినది గావున నచటికిఁ బోయి మృతినొందుట యైన మేలని కొందఱు తలంచిరి. పిరాట్టి వనవాసకష్టము ననుభవింపనపుడు గదా ఈ నాయకి తులైవిల్లిమంగళమును ప్రవేశింపకుండ నుండుట. ఇచ్చట సేతునిర్మాతయగు నళునివార్త స్మరింపదగియున్నది. అదెట్లన ; పర్వతములను దెచ్చి సముద్రమున కడ్డుగాఁ గట్టుట సంభావితమా యని వానరులు నళు నడుగఁగా నతడు పెరుమాళ్లరణ్యమునకుఁ బోవుట, అమ్మవారిని రావణుఁ డపహరించుట, పెరుమాళ్లు శోకించుట సంభావితమా? యని ప్రత్యుత్తర మిచ్చెనట. దేహాత్మాభిమానులైన వారి

కెంత జ్ఞానమున్నను, "నేను స్థూలముగా నున్నాను. నేను చిక్కినాను" అను వ్యవహారము వదలనట్లే యాళ్వారును సంసారమందెన్ని దోషములను జూచినను దివ్యదేశములనుండి మళ్లరు. క్షుద్రవిషయమందాసక్తిగలవారు "ఇదిఅధర్మము, ఇది నిందావహము, ఇది నరకప్రదము." అని చెప్పినను మళ్లుకొనరు. భగవద్విషయము గుణాధిక విషయ మగుటచే లోపముల నెంచుట కవకాశము లేదు సరికదా లోపముల నెంచెదమన్న నది గుణాధిక్యమునే వర్ణించును. అది మరింత ప్రావణ్యము గలిగించుటకే హేతువగును. నింద, మతిహీనత కలిగినను దానినిజూచి మళ్లశక్యము గాని అధ్యవసాయము కలవారు. అట్లైనచో నీనాయిక నీ విషయమునుండి మళ్లించుటకుఁ బ్రయత్న మెందుకుఁ జేయవలెననగా; ప్రాయముపండక మునుపే మనమాట లక్ష్యపెట్టనంత ప్రావణ్య మీమెకు పుట్టినది. అది యీమెను జెడుపునేమో యని తల్లి భయమునొందుచున్నది. ఈ అతిమాత్రప్రావణ్యము సాధనలపట్లను గానవచ్చుటచే నొకవేళ నీనాయిక దీనిని (అతిప్రావణ్యమును) సాధనముగాఁ జేసికొనునేమో యని భయముచే తల్లి మళ్లింపఁ బ్రయత్నించుచున్నది అనిగూడనుచెప్పవచ్చును. ఈప్రావణ్యము స్వరూపముకంటె వేరైనపుడు కదా సాధనముం డన్వయించుటకు? స్వరూపభేదము నొప్పుకొన్నచో స్వరూపానురూపమైన కార్యములను గూడ నొప్పుకొనవలదా? యని యీనాయిక అభిప్రాయము. శేషికి నుపాయభావము స్వరూపానుబంధి అయినపుడు శేషభూతునికిఁగూడ ప్రావణ్యము స్వరూపానుబంధి కావడమునకుఁ దగియున్నది.

క్రింద తిరువాయ్మొళిలో (దశకములో) నీ తిరువాయ్మొళికి సంగతి యెట్లనగా; ఈ యాళ్వార్లు క్రింద తిరువాయ్మొళిలో ననుభవించిన కృష్ణగుణానుభవము కేవలము మానసికము. దానివలన బాహ్యసంశ్లేషాపేక్ష పుట్టగా నదిసిద్ధింపకపోవుటచే గలిగిన మనఃకాలుష్యమును అన్యాపదేశముగాఁ జెప్పుచున్నారు. తల్లి యీనాయికప్రకృతి నెఱింగినదైనను తొలైవిల్లిమంగళమునకుఁ దీసికొనిపోగా నీమె- "అరవిందలోచనన్, తేవపిరాన్" అని పరత్వసౌలభ్యవాచకములగు సర్వేశ్వరుని తిరునామములను పలవరించుచుండఁగా భయపడి తల్లి- తోళీమార్ల వద్దకు దీసికొనిపోయి యీనాకొమార్తస్థితి యిట్లున్నది యీమె నీస్థితినుండి మార్పుటకుపాయము జెప్పుమని యడుగఁగా నా సఖి- "అమ్మా! మీరే మొదట నీమె కతిప్రావణ్యము పుట్టునట్లు చేసి యిపుడు మళ్లింపవలెనని ప్రయత్నించుట యేమి ప్రయోజనము? ఇఁక నీమెపట్ల నాశ విడుచుకొనుఁడని" చెప్పుచున్నది. ఇందులో "తిరుందు వేదముం వేళ్వియుమ్" అనుపాశురము యిర్వాట్టు. (తోళీమార్ = చెలికత్తెగారు.)

## 1. తువళిల్మామణి.

శ్లో. నిస్త్రింశోజ్జ్వలరత్ననిర్మితమహాప్రాసాదవీథీకన
త్తుల్యేప్యాసపురీమియం వరతనుర్నానమ్యతే ప్రత్యహమ్,

శంఖం చక్రమితి ప్రఫుల్లజలజప్రఖ్యాచ్ఛనేత్రే ఇతి
ప్రోచ్చార్యాశ్రుముఖీ వ్యథాపరిగతా నిత్యం విలేలీయతే.

శా. సుత్రామోపలనిర్మితోచ్చసదన • స్తోమంబు మాయామహో
ప్రోత్రిధిష్ణ్యము తుల్యచాపపుర మిా • పూఁబోడి సేవించెడున్
గాత్రాభాదీర్తహేమలార విముఁడీ • కళ్యాణిపై నాశలన్
పత్రీడ్వాహాను శంఖచక్రమును ద • త్పంకేరుహాక్షిద్వయిస్
విత్రాసంబును లేక పల్కును సదా • విక్లిన్ననేత్రాబ్జయై.

## 2. కుమిఱుమోశై.

శ్లో. ప్రాగీభూతరమాధవోత్సవరణత్తూర్యప్రతిధ్వానితాం
తుల్యేష్వాసపురీమధఃకృతసుధాసారస్య వాఙ్మాధురీమ్,
నీత్వైనాం విరహాయ్య బంధుజనతః కిం వ్యాకులీభూయతే
చైషా క్రోశతి మాధవేతి సతతం దోదూయతే మానసే.

మ. శ్రుతిపాఠధ్వనిమిశ్రితోత్సవరవ • క్షుభ్యద్ధనుఃపట్టణం
బతివస్ జేకొని పోయి చూప నట నీ • యబ్జాక్షి యిట్లయ్యె నో
సతులారా భవదాశ లీమెకొఱకై • చాలింపుడీ స్తబ్ధయై
సితపంకేరుహనేత్ర సూరివినుత • శ్రీనాథ యంచు న్సదా
ద్రుతచిత్తంబున సాశ్రునేత్రయగుచుస్ • దుఃఖస్థితి న్బొందెడున్.

## 3. కరైగొళ్ పైంబొఴిల్.

శ్లో. వేదాభ్యాసరతైర్మహీసురవరైరధ్యాసితాం యజ్వభి
స్తుల్యేష్వాసపురీం విలోక్య సుతనుర్లజ్జాం జహావంజసా,
ఉద్భ్రాన్తాశ్రువిలోచనా జలనిధిశ్యామేతి లక్ష్మీసఖే
త్వాహ్వానేత్యభిలాషుకీ ముహురసౌ ముగ్ధేక్షణా వర్తతే.

మ. సరిదంబూత్క్షితనిష్కుటామలసర • స్సందోహసౌందర్యభా
స్వరబాణాసనపట్టణంబునకు నీ • వామాక్షిఁ గొంపోవ నీ
కరణి న్నిమ్ముల బాసె నీమె పయి నిం • క న్వేడుడీ యాశలన్

శరధిన్బండుట ధాత్రిఁగొల్చుటయు గో ♦ సంఘంబుల న్గాచుటన్
నిరతంబు న్బలవించుచుం గనుల నీ ♦ నించున్ ద్రవచ్చిత్తయై.

4. ని ర్కుం నా న్మై వా ణ ర్.

శ్లో. తుల్యేష్వాసపురీం మహీసురవరైర్జుష్టామియం సుందరీ
వీక్ష్య స్త్రీసమయోచితాం పరిజహౌ శాలీనతామున్మనాః,
కృష్ణో వార్ధిసవర్ణ ఇత్యనుకలం విద్యేత్యధీతే హ్రియా
త్యక్త్వా తన్మయమేవ పశ్యతి జగత్సర్వం ద్రవన్మానసా.

ఉ. ఈచపలాక్షిచిత్తమున ♦ హెచ్చినప్రీతి ధనుఃపురంబు దా
జూచిననాటనుండియుఁ ద్రప ♦ సూవచనంబు దిరస్కరించె సం
కోచమునొంద దించుకయు ♦ గొల్కుల నశ్రులు జారగా నదీ
శ్మేచకవర్ణ కృష్ణ యని ♦ మీరిన తాపముతోడఁ బల్కెడున్.

5. కు త్రై యుం వా ళ్.

శ్లో. శౌర్యత్కృష్టగుణానుభూతిచపలామేనాం మృగాంకాననాం
తుల్యేష్వాసపురీం ప్రవేశ్య సరసీజాక్షం మహాహ్లాదశీతామ్,
తద్వీక్షాదినతోఽశ్రుసంప్లుతముఖీ వ్యాముగ్ధచేతా ఇయం
తత్కాష్ఠాభిముఖీ సదా ప్రణమతి ప్రోద్గీతలీలా హరేః.

చ. అతిమృదులస్వభావ నతు ♦ లాస్యవిభాజితచంద్రబింబ నీ
సతి గొనిపోయి చాపపుర ♦ సంస్థితుఁడౌ కమలాక్షు రూపని
ర్జితరతికాంతుఁ జూపితిరి ♦ చేడియలార యహర్నిశంబు లీ
యతివవిలోచనద్వితయ ♦ మప్పటినుండియు నంబువాహసం
మితమయి తోఁచె భ్రాంతిమితి ♦ మీరె గరంగుచుమానసంబునన్
నతిమొనరించు నా దెసకు ♦ నాతి మనోజశరార్దితాత్మయై.

6. నో క్కుం ప క్క మె ల్లాం.

శ్లో. ఫుల్లాంభోరుహమండితాచ్ఛసరసీపుండ్రేక్షుసస్యాచితాం
తుల్యేష్వాసపురీం దిదృక్షతి సదా తాం తామ్రపర్ణీతటే,

నాన్యత్పశ్యతి నీలవారిదసదృగ్గాత్రస్య లక్ష్మీశ్రపతే
ర్నామైవావిరతం గృణాతి సుముఖీ పృష్టాఽపి నాన్యద్వదేత్.

ఉ. ఎచ్చటఁ జూచిన న్మిగుల • నెజ్జనిధాన్యపు చేలపంక్తులున్
బచ్చని యిక్షువాటములు • పంకజయుక్తసరోవరంబులున్
హెచ్చయి తామ్రపర్ణిదరి • నింపగు చాపపురంబుదిక్కు నే
పొచ్చములేని భక్తిగని • మొక్కుచు నన్యము జూడరోసి వా
క్కిచ్చును నోట నెల్లపుటు • గోపవధూహృదయేశునామముల్.

7. అన్నెమిారణిమామయిల్.

శ్లో. ఏణీశాబవిలోలదృక్కచరుచిప్రోద్ధూతబర్హప్రభా
తన్వంగీయమనాశ్రవా న కిమపి బ్రూతేఽద్రితాపి స్వకైః,
తుల్యేష్వాసపురీతి న క్తి తదిదం తద్భాగధేయం పురా
పుణ్యస్య ప్రథిమా కిమంబుదరుచేర్దేవస్య మాయా కిము.

మ. నళినాక్షీమణి యీసుకేశి మనయాజ్ఞ స్మీరి వర్తించె నే
పలుకు ల్పల్కదు చాపపత్తనమనున్ • పాగ్జన్మపుణ్యంబొ యా
జలదశ్యాముని మాయయో తెలియ దీ • చంద్రాస్యనోటన్ దదీ
యులసచ్చిహ్నము నామమున్బడసె న • త్యంతంబుచారుత్వముల్.

8. తిరుందువేదము మ్.

శ్లో. కర్మశ్రీవృతయాయజూకభరితామేషాఽసితాక్షీ యదా
తుల్యేష్వాసపురీం దదర్శ తదహః ప్రారభ్య తద్దిఙ్ముఖీ,
ఉత్తంసీకృతపాణిపద్మముకుళా ఫుల్లారవిందేక్షణే
త్యుచ్చైరాలపతి ద్రవీకృతమనాస్తచ్చింతయా సర్వదా.

మ. సతతావర్తితసుస్థిరశ్రుతిగణ • శ్లాఘాస్పదంబై మహా
క్రతుసంతానవిధాననిష్ఠితశుచి • క్ష్మాదేవసంస్థాయమై
సితపంకేజదృగిందిరాసతులకున్ • క్షేత్రంబునై తామ్రప
ర్ణీతటిస్ గ్రాలు శరాసపూర్వరము నీ • నిర్వ్యాజలావణ్యస

ద్రితిఁ దాఁ జూచిననాటనుండియె రమా♦రామేశపర్యాకృతియుం
చతిమోహాంబునఁ బల్కుచుండు మదనా♦త్యంతార్తి పీడింపగన్.

## 9. ఇరంగినాఢూరుమ్.

శ్లో. నిత్యం కృష్ణగుణప్రలాపనరతా బాష్పాంబుసిక్తాంగకా
జంభారాతిమణిద్యుతే నరసఖే త్యాకారయంత్యుచ్చకైః,
ధాత్రీజాంశ్చ దయాకులాన్విదధతీ కేశిద్విషో నాసభూ
స్తుత్యేష్వాసపురీత్యవేత్య పరయా భక్త్యా ముహుర్వందతే.

ఉ. ఈరమణీలలామ మరుఁ ♦ డేచగ గాసిలి సంతతంబు క
న్నీరొలుక న్కుజంబులును ♦ నెట్టన దుఃఖభరంబు బూన జం
భారిమణీసవర్ణయని ♦ పల్మరు కూయిడు కేశిదైత్యసం
హారకుఁడుండుచాపపుర♦మంచుకరంబులు మోడ్చిమ్రొక్కెడున్.

## 10. పిన్నైగోల్ నిలమామగళ్‌గోల్.

శ్లో. కిమేషా నీళా స్యాదుత ధరణిదేవీ కిము రమా
పృథివ్యాం సంజాతా భవతిచ పరం విస్మయపదం,
సదా శ్రీశంతీయం తదతులదయామాత్మనిక్రృతాం
తదీయాం తాపార్తా పరిణమతి సమేష్వాసనగరీమ్.

ఉ. నీలయొ యీమె భూసతియొ ♦ నీరజబాణునిగన్న చానయో
నేలకు డిగ్గె నద్భుతము ♦ నీరజలోచనలార శ్రీశ న
న్నేలు మటంచు మొఱ్ఱలిడు ♦ నివ్యేలనాగ ధనుఃపురంబనన్
వ్రాలినభక్తి వంచినశి ♦ రంబున మ్రొక్కు దదేకచిత్తయై.

## 11. శిందైయాలుంశొల్లాలుమ్.

శ్లో. మాతా మే జనకస్సుహృద్గతిరితి శ్రీకాంతమేవానిశం
వాచా కర్మభిరాత్మనా శఠరిపో రాసేదుషః ప్రాక్తనే,
వాఖ్యాతశ్రుతిమౌళితత్త్వవిలసద్గాథాసహస్రే పరం
స్తుత్యేష్వాసపురీగతం దశకమప్యభ్యస్య భక్తో హరౌ.

చ. మనమున వాక్కునన్ తనుల • మాధవుఁడే మనతల్లితండ్రియం
చనయము నమ్మి కొల్చిన శ • ఠారి రచించిన వేయిగాథలన్
ధనునగరీపరంబులగు • ద్రావిడపద్యము లీపదింటినిన్
మననము సేయువారు ముర•మర్దను కింకరులౌదు రుర్విలోన్.

శ్రీమతే శఠకోపాయ నమః.

---

శ్రీమతే రామానుజాయ నమః.

షష్ఠ శతకము - ఆఱవ దశకము.

[మాలుకు]

అవతారిక :—ఈ యాళ్వార్లనాయికకు క్రింద తిరువాయ్మొళిలో గల్గిన దశ ముదిరి వ్యసన మతిశయించుటచే మూర్ఛనొంది పడియుండగా నది చూచి సహింపలేక సఖియు మూర్ఛనొందగా నీదశయం దీమెను జీవింపఁ జేయుటకుఁదగిన యుపాయముల నాలోచించుచుండెడి యీ మెతల్లి—యీ మెకంకణములు మొదలగు నవి జారిపోవుటను జూచి వానిని వేరువేరుగాఁ జెప్పి మొఱ్ఱబెట్టుచున్నది. క్రింద తిరువాయ్మొళియం దలాభదశ గలదియై పురుషార్థము సిద్ధింపదన్నను విడువశక్యముగాకుండ నీమెమనోవాక్కాయములు భగవద్విషయమందు ప్రవణమైన ప్రకారము చెప్పబడినది. అయ్యలాభముచేఁ గలిగిన పారవశ్య మిందులోఁ జెప్పబడుచున్నది. "పొంప్పమై నీణ్ముడి" అను పాశుర మిందులో నుయిర్పాట్టు.

1. మాలుకు.

శ్లో. కాన్తాఖిలాబ్ధిరశనం సజలాంబుదాభ
మారక్తపంకజదళాయతచారునేత్రమ్,
సంవీక్ష్య తద్గతమనాః కృశతామవాప్య
మద్దారికా గళితదోర్వలయా బభూవ.

మ. జలదశ్యామునిఁ బుండరీకనయనున్ • జకాద్రిదిపంచాయుధీ
కలితానల్పభుజు న్విలాసవిమిత • క్ష్మామండలుం జూచి మా
యళినీలాలక వానిసాయుగముచే • నాకృష్టయై కార్శ్యవి
హ్వాలతన్మ్యానఁ బ్రకోష్ఠకంకణతతుల్ • భ్రంశింబునొందెన్భువిన్.

2. శంగువిల్వాళ్.

శ్లో. పంచాయుధీసుమితసుందరబాహుదండం
బింబాధరం వికచతామరసాయతాక్షమ్,

పుష్పోత్సుగంధితులసీస్రగలంకృతం తం
దృష్ట్వా సుతా మమ విపాండురతామియాయ.

మ. అరిశంఖాసిగదాధనుఃప్రముఖదీ ♦ వ్యద్ధేతిహస్తాబ్జు మం
దరధారి న్నరుణాంబుజాతనయనున్ ♦ దామోద్రిష్ఠు వీక్షించిమా
తరుణీరత్నము పుష్పచాపశరవి ♦ ద్ధస్వాంతయై గాఢరా
గరసస్ఫూర్తి వహించెఁ బాండిమమునం ♦ గంబందునానాటికిన్.

3. ని అం క రి యా ను క్ర మ.

శ్లో. లోకాఘసంగిళనసూచయదోష్ఠముద్రాం
తన్వా౽ల్పయావితబృహజ్జగదండబృందం,
నిర్వర్ణ్య మత్ప్రియసుతా కుటిలాలకేయం
జాతా శనైః ప్రముషితాత్మకులప్రతిష్ఠా.

తే, గీ. భువనముల మ్రింగువాఁడని ♦ బోధసేయు
నధరముగలట్టి యమితమ ♦ హత్త్వశాలిఁ
జక్రిహస్తునిఁ గాంచి ♦ చంచరీక
వేణి కోల్పోయె దనదగు ♦ విపులయశము.

4. పీ డు డై నా న్నా గ నై.

శ్లో. అంభోజసంభవజనిప్రదనాభిపద్మ
మంఘ్రిక్రమప్రమితలోకతతిం పరేశమ్,
సంప్రేక్ష్య పాండునృపపుత్రనిసృష్టదూతం
మత్పుత్రికా౽జహదియం లలనాస్వభావమ్.

తే, గీ. జ్ఞానియగు పద్మజునిఁగన్న ♦ నళిననాభు
ధాత్రిఁ గొల్చిన నెఱజాణ ♦ ధర్మపుత్రు
దూత నాశించి మత్పుత్రి ♦ తోయజాక్షి
హారితాత్మస్వభావగా ♦ నవనిఁ దనరె.

## 5. పఙ్క్తిడై వేదమ్.

శ్లో. దంష్ట్రోద్ధృతక్షితితలే ధృతకోలవేషే
పద్మాసనప్రహితవేదగణే రమేశే,
అంభోధిశాయిని విషక్తమనాస్సతా మే
జాతా ప్రమోపితమతిః కిము వచ్మ్యహం వః.

మ. పరబోధప్రదసర్వవేదగణము ♦ తాపాదించి తావేధ కా
దరమొప్పన్ బఠియింపఁజేసిన ఘనుఁ ♦ దంష్ట్రోద్ధృతక్ష్మాభరున్
శరధి న్పండిన దేవతాపరిబృఢుఁ ♦ జంద్రాస్య వీక్షించి త
త్పరత న్మోహముఁ జెంది కోల్పడె మతిన్ ♦ పల్మాటలింకేటికిన్.

## 6. కల్పగకావన.

శ్లో. కల్పావనీజవిటపోపమబాహుదండే
హేమాద్రిదీప్రముకుటోల్లసదుత్తమాంగే,
సద్యోవికస్వరసరోరుహారక్తపాణా
వాసక్తహృన్మమ సుతాఽవశగాత్రయష్టిః.

తే, గీ. కల్పకారామసన్నిభ ♦ ఘనభుజౌఘు
హేమభూధరసమమహో ♦ ద్దామమౌళిఁ
గల్యసంఫుల్లపంకజ ♦ కల్పకరునిఁ
జూచి వలపూని నాపుత్రి ♦ చోద్య మేమొ
మేనిసొరెల్లఁ గోల్పోయెఁ ♦ జానలార.

## 7. మెయ్యామర్ పల్గలన్.

శ్లో. కాకోదరేశశయనం విలసన్మహార్ఘ
మాణిక్యభూషణవిభూషితదివ్యదేహమ్,
రక్తాబ్జనేత్రమనిశం హృది సంస్మరన్త్యా
లావణ్యమస్తమభజన్మమ దారికాయాః.

తే, గీ. దీప్రమణిభూషణాంచిత ♦ దివ్యదేహు
ఫణిగణోద్భాసిగూఢపా ♦ త్పతిశయాను

రక్తహస్తాంఘ్రిపద్మ మా • రమణి చూచి
కాయకాంతిని గోల్పడెఁ • గాయజార్తి.

8. శాయక్కురుందమ్.

శ్లో. దైత్యావనీజవినిపాతనదృష్టవీర్యం
పాదప్రభగ్నశకటం హృతపూతనాసుమ్,
దృష్ట్వాఽనురక్తహృదయా మమ దారికేయం
సౌందర్యసారపరిహీణవపుర్బభూవ.

మ. తరుదైత్యప్రవరాసువాయుగిళనో • ద్దామోరగగ్రామణిన్
నరకాహిగ్రసనోరగారి శకటీ • నాశోద్యమున్ బూతనా
కరిణీధ్వంసనకూటపాశలుని నా • కంసారి వీక్షించి దు
ర్భరమీనధ్వజచాపముక్తపటునా • రాచప్రవిద్ధాంగియై
తరుణీరత్నము గోలుపోయెఁ దనసౌం • దర్యంబు శాతోదరీ.

9. మాణ్బమైకోలత్తు.

శ్లో. మాయావటుత్వవినిగూఢపరేశభావం
రింగన్మహఃప్రసరభూధరసన్నిభాంగమ్,
స్వేచ్ఛావతీర్ణమిహ నిర్జరకార్యహేతో
ర్దృష్ట్వా సుతా మమ హృతాభరణప్రభాఽఽసీత్.

తే, గీ. నిరవధికదివ్యలావణ్య • నిలయుఁడౌచు
జగతిఁ గొల్చిన వామను • చక్కదనము
దశరథాత్మజు మహిమంబు • దలఁచి తలఁచి
పడతి కోల్పోయెఁ దనుగతా • భరణశోభ.

10 పొన్నైసీణ్మడి.

శ్లో. లోకాధిరాజ్యపిశునోజ్జ్వలరత్నమౌళౌ
మల్లౌఘకాలభుజగాయతబాహుదండే,
సర్వాంతరాత్మని మదీయసుతాఽతివేలం
బద్ధాశయా పరిజహౌ స్థితిమంగనార్హామ్.

తే, గీ. మణికిరీటపరిష్కృత ♦ మౌళిదేశుఁ
దులసిమాల్యోపశోభితు ♦ దోర్బలాతి
మాత్రిసంపిష్టచాణూర ♦ మల్లగాత్రు
సిరచరంబుల కాత్మయై ♦ వరలువానిఁ
గోరి మదిలోన నాపుత్రి ♦ కోమలాంగి
కులలతాంగుల మర్యాద ♦ గోలుపోయె.

11. కట్టెళిల్ శోలై.

శ్లో. శేషాచలేశపదసక్తమనాశ్శఠారి
ర్జగ్రంథ యద్విపులపద్యసహస్రమర్ఘ్యమ్,
తస్మిన్నిదం దశకమాదరతః పఠంత
స్తే భుంజతే పరమఖేఽతులసూరిభోగాన్.

తే, గీ. తావులీనెడు పూదోట ♦ లావరించు
తిరుమల వసించు సామియౌ ♦ హరి నుతించి
శఠమథనయోగి కూర్చిన ♦ సత్ప్రబంధ
మందు నీపదిపద్యంబు ♦ లనఘభక్తి
జదువ నమరులభోగంబు ♦ లొందవు జగతి.

శ్రీమతేశఠకోపాయనమః.

---

శ్రీమతేరామానుజాయనమః.

షష్ఠశతకము - ఏడవ దశకము.

[ఉణ్ణుంశోఱు.]

అవతారిక:—క్రింద తిరువాయ్మొళిలో మూర్ఛపోయిన తనపుత్రిక యొక్క అవసాదమును జూచి తల్లి- "నాకూతురు కంకణములు జారి పోయినవి. శరీరము కృశించినది. శరీరమందు వైవర్ణ్యము వ్యాపించినది." అని మొట్టబెట్టి తాను మూర్ఛనొందినది. తల్లి తిరునామసంకీర్తనము చేయగా కూతురు తెలివితెచ్చుకొని లేచి తిరుక్కోళూరుకుఁ బోవుటకుబయలుదేరినది. కొంతసేపటికితల్లికూడ లేచి చూడగా కూతురు కనబడలేదు. వట్టిపక్క కనఁబడినది. ఈమె తనగర్భ

మందు పుట్టినదగుటచేతను, ఈమె గృహమందున్న దినములలో నీమె దేహయాత్ర నెఱింగినదగుటచేతను తిరుక్కోళూరుకే యీమె వెళ్లియుండునని నిశ్చయించెను. వలయాదులు పోయినను యీమెయైన మనకు దక్కునా యని బెంగపెట్టుకొని మొఱ్ఱబెట్టుచున్నది. "ఉణ్ణుంశోఱు"లో నున్న పిరాట్టివిషయమై భయపడవలెనా? "కళ్వన్గొల్లి"లో నున్న పిరాట్టివిషయమై భయపడవలెనా? అని ఆళవందారు గోష్ఠిలో నొకరు ప్రశ్నింపగా: నొంటిగాఁబోయిన ఆమెవిషయమై భయపడవలెను గాని, యిద్దరు కలిసి వెళ్లినవారివిషయమై భయపడ నవసరము లేదని అచ్చటనున్న పెద్దలు సాదించగా నట్లనకూడదు. చూడుడీ: ఇద్దరు కలిసివెళ్లినవారివిషయమయ్యే భయపడవలెను. ఏలయనగా నొకరికి మఱియొకరు నెత్తిమొత్తించు నుమ్మెత్తకాయ వంటివారు. కావున భయపడవలెను. ఒంటిగాఁ బోయినవారివిషయమై భయపడ నవసరము లేదని ఆళవందారు సాయించిరట. దీనిలో మొదటి పాశురమే ఉయి ర్పాట్టు.

## 1. ఉణ్ణుంశోఱ్.

శ్లో. శయ్యాగేహం ధనాని ప్రవరసుతగణో బంధుతా భోగ్యజాతం
విద్యా వాసాంసి సర్వం శ్రితజనవరదశ్శ్రీశ ఏవేతి మత్వా,
తందాధ్యాత్రిప్రకామంహ్యాదిమురజయినంబాష్పబిందూన్విముంచ
త్యహ్నియ త్రస్యదేణీపృథుకచలదృశా తత్పురీం సంప్రతస్థే.

ఉ. ధారకభోగ్యపోషకవి ♦ తానము కృష్ణుఁడె యంచుఁ గన్నులన్
గారగ సశ్రుబిందుతతి ♦ కంజదళాక్షి మహీతలంబునన్
వారిజపత్రలోచనుని ♦ వాస మదెక్కడనంచుఁ బల్కుచున్
గోరికమీఱ జొచ్చె నల ♦ గోపకుమారకుడుండుదేహళిన్.

## 2. ఊరుంనాడుమ్.

శ్లో. గ్రామ్యాన్ జానపదాన్ జనానపి హరేరుద్గాపయంతీస్వయం
గాయంతీచ గుణానలంఘయదియం దుర్లంఘ్యలోకస్థితిమ్,
పుత్రీ మే సుకృశాంగికా ప్రచలితా శ్రీదేహళీపత్తనం
తిష్ఠేత్తత్ర శుకా నిబోధత తతశ్శీఘ్రం నివర్తేత వా.

ఉ. ఊరును నాడు లోకమును ♦ నొక్కవిధంబుగ దన్నుఁబోలి యా
శ్రీరమణీశునామములఁ ♦ జేష్టల నెల్ల వచింపఁజేయుచున్

గౌరవముం ద్యజించి సిరి ♦ గల్గిన దేహళిపత్తనంబు నా
సారసనేత్రి చొచ్చె నతి ♦ సాహసకృత్యము సల్పె గ్రమ్మరన్
జేరునొ నాదుచక్కటికి ♦ జేరదొ కీరములార తెల్పుడీ.

3. పూవై పైంకిళిగళ్.

శ్లో. క్రీడావస్తుగతప్రమోదమఖిలం తన్నామసంకీర్తనా
ద్విందంతీ మమ పుత్రికా ప్రతిగతా శ్రీదేహళీపత్తనమ్,
గత్వా తత్ర యథామనోరథమముం సంప్రాప్య మోదేతవా
స్వాభీష్టోవహతేర్విలోచనగళద్బాష్పాఽవతిష్ఠేత వా.

ఉ. గోరలు బంతి కీరమును ♦ గుజ్జనగూళ్లను పూలసజ్జ కం
సారియభిఖ్య లేయనుచు ♦ నాదట బల్కును మత్తనూజ శా
సారసమూహరాజదుప ♦ శల్యము దేహళిపత్తనంబు దా
శారి విలోచనద్వయిని ♦ బాష్పములొల్కగ నేమి సేయునో.

4. కొల్లై యెన్బగ్గో లో.

శ్లో. స్వైరస్వాంతతయోత్పథంగతవతీత్యేషా వినిందేత కిం
నోచేదీప్సితకర్మలాభముదితేతీడ్యేత కిం బంధుభిః,
యత్కృతేచణదేహళీపురవరం ప్రాప్తిష్ఠతేషా స్ఫుర
న్మధ్యాత్రిస్తకురంగశాబనయనా ముగ్ధా మదీయా సుతా.

ఉ. శ్రీకరవై యుపేంద్రుడు వ ♦ సించు మహానగరంబు దేహళిన్
నాకొమ చూడబోవ బయ ♦నంబగుచున్నది కంప్రమధ్యయై
శోకములార దీనిని బ్ర ♦ శస్యగుణాలయయందురో భువిన్
లేక కటుప్రభాషిణులు ♦ వేమలు పాంసుల యంచు నెంతురో.

5. మేవినైందు.

శ్లో. క్రీడారసానుభవయోగ్యదశాఽపి నూనం
త్యక్త్వాఽఽదరం సహ సఖీభిరియం విహారే,

శ్రీశావలోకనమనాస్తమవాప్నువానా
శ్రీదేహళీపురమథోపగతా భృశార్తా.

మ. హరికల్యాణగుణావగాఢమతియై ♦ యన్యంబులన్వీడి త
త్పరత న్విద్రుతచిత్తయై యరిగి శ్రీ♦ భామావరుండుండు పూ
ర్వరమా దేహళిఁ జొచ్చియచ్చటిసుమా♦ రామాభిరామత్వముం
వరసీశోభను దేవళంబుసొగసున్ ♦ సద్భక్తి వీక్షించి నా
హరిణీలోచన యంతరంగమున నెం♦ తానందమున్బొందునో.

## 6. ఇ న్నె న క్కు ద వా డు.

శ్లో. ఏషాఽనాదరతో విహాయ జననీం మాం ప్రస్థితా దేహళీ
నాథావాసమగస్త్వదిఙ్ముఖలసత్కాశ్మీరచర్చాఞ్చితమ్,
కస్యాస్సాంబురుహాయతాక్షియుగళం బింబాధరం శార్ఙ్గిణో
దృష్ట్వాఽఽకృష్టహృదంబుజా శిథిలతాం యాంత్యశ్రుపూర్ణేక్షణా.

ఉ. నాసుత నన్ను నొంటి విడ ♦ నాడి కృతాంతదిశాస్య కుంకుమ
స్థాసకమైన దేహళిని ♦ జయ్యన జొచ్చి రమేశునేత్రముల్
భాసిలువాతెర న్గనుచు ♦ బాష్పము కన్నుల నించు సారెకున్

## 7. మ ల్లు నీ ర్ క ణ్ణో డు.

శ్లో. బాష్పావిలేక్షణయుగా హృది జాతమోహా
నక్తం దివం హరిరితి ప్రలపంత్యథోచ్చైః,
మాంతీ శనైస్సుకృశగాత్రితయా కథం మే
వత్సా విశేన్మురహరాలయసన్నికర్షమ్.

మ. స్రవదశ్రూత్కరనేత్రయై హరిగుణా♦ సక్తాంతరంగంబుతోఁ
బవలున్రాతిరియు న్యదూద్వహ హరీ♦పద్మాక్షయంచున్రమా
ధవుని న్బిల్చెడు మత్తనూజ మురజి♦ ద్ధామంబు శ్రీదేహళిన్
జవమొక్కింతయు లేదదెట్లుచనునో♦ చంద్రాస్యయూహింపగన్.

### 8. ఒళింద నుణ్ణిడై మేల్.

శ్లో. శ్రీవక్షోమకరీవిముద్రితలసద్వక్షస్థలస్య ప్రియం
ధామ ద్రష్టుమనాస్సుతా మమ గళద్బాష్పోక్షితోరస్థలా,
దూరాధ్వక్రమకాతరా శ్రమవశాద్విన్యస్య మధ్యే కరం
యాయాత్తత్ర కథం శిరీషకుసుమశ్రీపేశలైరంగకైః.

ఉ. వంగిన సూక్ష్మమధ్యమున ♦ వామకరం బిడి గాసినొంది నా
యంగజ భక్తినిష్ఠహృద ♦ యంబున మమ్ముల బాసి కంటినీ
రంగమునందు జారగ న ♦ నంగునితండ్రి వసించునట్టి యా
రంగగు దేహళీపురి క ♦ రంబుగ నేగె నటంచు నెంచెదన్.

### 9. కారియం నల్లనగళ్.

శ్లో. భోగ్యం వస్తు సమీక్షతే యది భవేత్కృష్ణాహ్వమిత్యన్వహం
మన్వానాఽర్ద్రమనాస్తృణాయతదిదంమత్వాఽఖిలంమత్సుతా,
ఏషా స్వైరపదప్రధావనపరేత్యాక్రుశ్యమానా సయు
జ్నారీభిః ప్రచచాల దేహళిపురం నాస్మాన్ స్మరేజ్జాతుచిత్.

ఉ. మంచిపదార్థము ల్గనిన ♦ మానిని కృష్ణుని కిత్తునంచు దా
నెంచెడిదయ్యె నాతలఁపు ♦ నేకటమూని జగంబునిందకుఁ
గొంచక దేహళీపురికి ♦ గొబ్బున నేగెను నాతనూజ న
న్వంచనఁజేసి మాయుగాని ♦ వారిరుహాననలార కంటిరే.

### 10. నినైక్కిలేన్ తెయ్వంగాళ్.

శ్లో. అస్యా బాలమృగీవిలోలసుదృశశ్చేష్టా న శక్నోమ్యహం
మంతుం లోకపతిత్వసూచకసరోజాతాక్షతారాచితం,
గోవిందం జహతీ న జాతుచిదసౌ తద్దేహళీపత్తనం
యాతాఽస్మద్విమలాన్వవాయపతితం నావేక్షతే దుర్యశః.

ఉ. దేవతలార యీవ్యథల ♦ తీవ్రత సైపగఁజాల నింక నీ
భావజబాణతుల్యయగు ♦ బాలిక సర్వజగద్విధానలీ

లావిధి దేలు నంబుజద • ళాయతనేత్రుని పాదపద్మముల్
భావమునందు నిల్పుకొని • పాయక సన్నుతి సేయుచుండె న
ద్దేవుని దేహళీపురికి • దిట్టతనంబున నేగ నిందకున్
దానలమయ్యె నీమెయిఁగ • దామరసాక్షిరో యేమిచెప్పుదున్.

## 11. వైత్తమానిదియామ్.

శ్లో. నిక్షిప్తోత్తమ శేవధేర్మధుజిత స్త్వస్తాత్మకే శ్రీశఠ
ద్వేష్టా సంగ్రథితే త్రయీప్రతినిధౌ సత్పద్యసాహస్రికే,
శ్రీదేహళ్యధినాథబద్ధదశకం హ్యేతత్పఠంతో నరాః
ప్రాప్తా ముక్తిపదం నిరంతరపరబ్రహ్మానుభూతిస్థిరాః.

శా. నిక్షేపద్రవిణాహ్వయున్ మధురిపున్ • నీరేజపత్రాక్షు ని
ర్విక్షేపాత్ముఁడు శ్రీశఠారి నుతులన్ • బ్రీతాత్ముఁ గావించి స
త్పక్షంబుల్ బొగడంగఁ గూర్చిన ప్రబం • ధంబందు సద్దేహళీ
పక్షీడ్వాహను జెప్పినట్టి యఘభి • త్పద్యంబులౌ నీ పదిన్
విక్షోభం బెదలేక పాడు సుజనుల్ • విందు ల్బలిధ్వంసికిన్.

శ్రీమతే శఠకోపాయ నమః.

---

శ్రీమతే రామానుజాయ నమః.

## షష్ఠ శతకము - ఎనిమిదవ దశకము.

[పొన్నులగాళీగళ్.]

అవతారిక :—ఆళ్వార్లకు క్రింద రెండుతిరువాయిమొళ్లలోఁ గొంతసేపు మూర్ఛయు మఱికొంతసేపు తెలివియు వచ్చుచున్నట్లు చెప్పఁబడెను. ఈ తిరువాయిమొళ్లలో నాయకునివద్దకు దూతలను బంపుచున్నారు. భక్తిరూపాపన్న జ్ఞానముఁ గల వీరికి మూర్ఛ లేదు. బాహ్యపదార్థానుసంధానము లేకుండ విషయములనుండి అంతఃకరణమును మరలించి మనస్సునకు సర్వేశ్వరునే విషయముగాఁ జేసికొని యాతనిగుణముల ననుభవించుటయే వీరికి మూర్ఛ యనఁబడును. అనగా శరీరమైన వాఁడే జ్ఞానమునకు విషయముకాగా తన్ను మఱచిపోవుట. "అహం మనురభవమ్" "సర్వగత్వాదనంతస్య" అని చెప్పబడు స్థితివంటిది. తెలివియనగా "ప్రహ్లాదోఽస్మీతి సస్మార" అన్నట్లు ప్రహ్లాదునివలె తమ్ము తాము తెలిసికొను

టను శక్తిగలవారై జగద్వృత్తాంతము ననుసంధించుటకు సమర్థులై యుండుట. క్రిందను దీర్ఘకాలము సర్వేశ్వరుని గుణముల ననుసంధించుటచే ధరించి బలమును బొంది బాహ్యపదార్థానుసంధానమందు శక్తి గలవారైరి. వీరు పూర్వస్థితికి రాగా చిరకాలమునుండి వీరికున్న ఈశ్వరాలాభమే మరల తలయెత్తి యొకపిరాట్టి దశను బొంది తమస్థితి నన్యాపదేశముగా జెప్పుచున్నారు. క్రింద తిరువాయ్మొళ్రిలో ఆళ్వార్లనాయికతల్లి “ఎంగనే పుగుంగోల్” (ఎట్లుప్రవేశించునో) అని కొంగవెట్టుకొన్నదియే ఫలించెను. తనచాపల్యముచే బయలుదేరిన యీనాయిక తుద ముట్ట వెళ్లజాలక నివసించియున్న పట్టణముయొక్క ఉపవనమందు పడియుండి నాయకునిరాక కానకపోవుటచే తన కచట గానవచ్చిన పక్షులను దూతలగా బంపుచున్నది. మార్గమందు దసహాయురాలై పోవుచు నవసాదముచే మధ్యపడిపోయిన యీమెకు దూతగా వెళ్లువారు లేరు. ఒకవేళ నుండినను యీమెకంటె ముందే యీడుపడి పడియున్నారు. తనసమీపమందున్న పక్షులకంటె నాయకునివద్దకు నడిచి పోవువారు మరెవ్వరు లేరు. ఈ సమయమందు నాదశను స్వామికి తెలుపుడని పక్షుల కాళ్లమీద పడెను. ఈ తిరువాయ్మొళ్రియందు “మిన్నునూల్మార్వన్” అనునది ఉయిర్పాట్టు.

## 1. పొన్నులగాళీరో.

శ్లో॥ భోస్స్నిగ్ధామయిపక్షిణో! దురితకృత్సంప్రార్థయేఽహంహివో
నిర్మాతుః కమలాసనాండవితతేర్నూత్నాంబువాహద్యుతేః,
హర్తుర్మానధనస్య మత్ప్రియవిభోర్నందాత్మజస్యాంతికం
గత్వా బ్రూత మమవ్యథాం యదితతో దద్యాం విభూతిద్వయమ్.

ఉ. నాయెడఁ బ్రీతిఁ జూపు శకు ◆ నప్రజమా! వృజినాత్మ నేను చే
దోయి మొగిడ్చి వేడెదను ◆ తొల్లిజగంబుల సృష్టి జేసి వా
లాయము బ్రోచువాఁడగు బ ◆ లాహకవర్ణుఁడు శౌరికెల్ల మ
త్కాయజబాధ దెల్పి ముని ◆ కాంక్షితముక్తిపదంబు నేలుకొం
డాయది గానిచో ధరణి ◆ నంతయు నేలుకొనుండు ప్రీతితోఁ.

## 2. మైయమర్.

శ్లో. చక్రాలంకృతహస్తపద్మమనఘం బింబాధరోష్ఠం హరిం
దృష్ట్వైషా పరిరబ్ధుమిచ్ఛతి పయోవాహోపమం తే వపుః,

ఇత్యాఖ్యాయ పునర్మదంతికముపాయాత ద్రుతం హేశుకా
హస్తే న్యస్య ఘృతాక్తమోదనమలం వో భోజనేయం ముదా.

మ. అసురానీకనికృంతనైకపటుచ ♦ క్రాభీలహస్తాంబుజా
కిసలాభాధరుఁ జూచి నాదు మదన ♦ క్లేశంబు ప్రాప్తిత్వరన్
వెస వాకుచ్చి శుకంబులార వినుడీ ♦ వేగంబుగా వచ్చి సం
తస ముప్పొంగ సఖీసమక్షమున మ ♦ త్పాణ్యబ్జమందుండి గో
రససంమిశ్రఘృతాన్నమున్ దినుడుసం♦ప్రార్థింతు చెదన్నిమ్ములన్.

3. ఓ డి వం దె న్న ల్.

శ్లో. శ్రేణీభూతమధువ్రతా! బలరిపోః పుత్రస్య యంతృత్వభా
క్పంచానాం విజయాయ కౌరవశతం యః ప్రాగ్దదాహాహవే,
తస్య శ్రీతులసీస్రవన్మధురఘరీపానాద్విశుద్ధాననాః
ప్రత్యేత్య ద్రుతమత్రమత్కచసుమచ్యోతద్రసం పాస్యథ.

ఉ. తుమ్మెదలార మున్ను కడు ♦ దుష్పథవృత్తుల ధార్తరాష్ట్రులన్
దుఃఖ్ముగఁ జేయఁ బార్థునికిఁ♦దోడ్పడి సారథియైనకృష్ణు మా
ల్యమ్మున నుండు తేనియల ♦ నాని ముదాధిని జెప్పి వానికిన్
గ్రమ్మర వచ్చి రేని సుమ ♦ కమ్రముదీయకచాంతరంబునన్
జిమ్మెడు మాకరందరస ♦ శీధువు గ్రోలగ మీరు గల్గెదున్.

4. తూ మ దు వా య్ గ ళ్.

శ్లో. మల్లీవల్లీప్రవాటంతో మధుకరనిచయా! మంజులస్వానరమ్యా
బ్రామ్యంతస్తత్ర తత్ర ప్రసవమధురసాస్వాదలోభేనయాతాః,
మాల్యైర్బద్ధేస్తులస్యాస్సుమహితశిరసం నిత్యసూరిప్రవేశం
దృష్ట్వాకిం తేదయాయాస్సదృశమిదమితి బ్రూతమాభీఃకదాచిత్.

శా. మల్లీపుష్పచరిష్ణుభృంగగణమా ♦ మాన్యప్రసూనోల్లస
ద్వల్లీబృందమరందపానవశతన్ ♦ బంభ్రమ్యమాణస్థితిన్
ఉల్లాసంబున మాధవు న్గని హరీ ♦ యుక్తంబె నీకీపనుల్

సల్లావణ్యపయోనిధానమగు నీ ♦ చార్వాంగి బాయంగనీ
యుల్లం బెట్లు సహించె నంచు జెపుడీ♦యుత్సాహ మేపారగన్.

5. సుంగభృఙ్గయూనురైక్యన్.

శ్లో. మత్తుష్టాశ్శుకసంచయా! స్సకృదిహాయాతా స్తి కార్యం మహ
త్తాత్త్వేణేహ సమేత్య మామకమనోహర్తా సరోజేక్షణః,
నీలాబ్జాభతనుశ్శ్రితామరతరుబింబాధరశ్శ్రీపతి
ర్దృష్టశ్చేత్స యదృచ్ఛయా నదత కిం న్యాయ్యం దయాయా స్తవ.

శా. నేపోషించిన చిల్కలార వినుడీ ♦ నేజెప్పు నీమాటలన్
కోపాలోహితదృక్సుపర్ణతురగున్ ♦ కుక్షిస్థలోకౌఘు నా
పాపం బెన్ని మనస్సు దొంగిలిన యా ♦ పద్మాక్షు నీక్షించి యి
ట్లాపెన్నాభజుబారి కియ్యనగునే ♦ యంచాతని న్బల్కుడీ.

6. ఎన్నిన్నుమాల్మార్వస.

శ్లో. విన్యద్భాస్వరయజ్ఞసూత్రవిలసద్వక్షాః పయోదచ్ఛవిః
కృష్ణస్యాంఘ్రిసమర్పితాం హి తులసీం దద్యాన్మమైవ ధ్రువం,
కీరాః! పాపకృతాం మయా ప్రథమయా సంవర్ధితాశ్శిక్షితా
ముద్యావాచో గదతాశు తస్య నికటం గత్వా భయం మాఽస్తు వః.

చ. పొడలెడు చిల్కలార కడు ♦ మోదముతో జని కాంతులీను జ
న్నిద మొద వెల్గునట్టి నవ ♦ నీరదనీలతనుండు శౌరి తా
పదమున దాల్చుశ్రీతులసి♦బట్టుగ మాకె యొసంగు గాన మీ
రదనున బోయి నాపలుకు♦లన్నియు జెప్పుడు రండు క్రమ్మరన్.

7. పూవైగళ్ళోల్.

శ్లో. కాశస్పర్ధినమూరుచేస్మితసరోజాక్షస్య కేశిద్విష
స్సర్వస్యాంతరవస్థితస్య సకలప్రత్యర్థిభూభృత్పవేః,
ఆశ్చర్యావహచేష్టితస్య సవిధం గత్వా శుకర్యో! జవా
దుక్త్వా మద్విరహవ్యథాం మమ మనోదుఃఖం సమూలం హత.

ఉ. కాశరుచిన్ హసించు తను ♦ కాంతి గలాడు సితాంబుజాక్షుఁడున్
ఈశుఁడు సర్వచేతనుల ♦ కెల్లజగంబుల కంతరాత్మ వా
కాశననాథశాయి యరి ♦ హస్తుఁడునై వెలుగొందు శౌరియ
భ్యాశము నొంది నాపలుకు ♦ లన్నియుఁ జెప్పి సుఖంబుగూర్పుడీ.

8. పా శ ర వె య్ ది.

శ్లో. పాండుక్షామతనుర్వియోగశిఖినా కాలం కియంతం సహే
శ్వేతకాంచి ! మయి ప్రసన్నహృదయా కస్మింశ్చిదహ్నిద్రుతం.
నిర్దుష్టోజ్జ్వలకేశపాశమమరాధీశం విలోక్య ప్రభో
నాన్యత్త్వాం ప్రవిహాయ పశ్యతి పరం సైషేతి నిర్భీర్వద.

ఉ. కాంచి యికెంతకాల మిటు ♦ కంతునిబాధకు సైచియుందు నే
వంచనలేక నాయెడఁ గృ ♦ పన్ యదునాథునివద్దకేగి యో
పంచశరాత్మజాత యెద ♦ బాయక నిన్నె సదాస్మరించు నీ
చంచలనేత్రిఁ బ్రోచుటకు ♦ జాల మొనర్చుట నీకు పాడిగా
దంచితమైన నీదయకు ♦ నర్హత గల్గిన దంచు బల్కుమా.

9. పే ర్తు మ త్తో గ్గ శై.

శ్లో. కచ్ఛే మత్స్యప్రకరవిచితి శ్రద్ధయా సంచరంతః క్రౌంచా!
నాన్యచ్ఛరణమిహ మే దుర్భరాఘూర్ణితాయాః,
ప్రావృణ్మేఘోజ్జ్వలతనురుచేస్తస్య విష్ణోస్సకాశం
త్వందేశానానయధ్వంమయివిరహదశాసన్నగాంత్ర్యందయార్ద్రాః.

ఉ. మిమ్ముల వీడి యన్యు లిక ♦ మేదిని పైనను గాచువారు లే
రిమ్ముల పెంట్లతోడ విహ ♦ రించు బకౌఘములార కాలమే
ఘమ్ముఁదిరస్కరించు తను ♦ కాంతి గలట్టి యదూద్వహున్ బ్రమో
దమ్మున జూచి నామదన ♦ తాపము దెల్పిన నాలకించి తా
గ్రమ్మర బల్కు మాటలను. ♦ కాలము పుచ్చక నాకు దెల్పుడీ.

## 10. వందిరుందుమ్మైయ.

శ్లో. ప్రేయోభిర్నిజబాంధవైశ్చ మిళితా నీరేజషండాంచితే
ష్వచ్ఛాపేషు సరస్సు వీచినిచయే హంస్యస్తరంత్యస్సుఖం,
లక్ష్మీమండితవక్షసం మధురిపుం గత్వా ప్రియా త్వత్కృతే
క్లాంతేత్యాశు నివేద్య తత్ప్రతివచో యూయం పునర్బ్రూత మే.

చ. సహచరబంధుమిత్రతతి ♦ సంగతి బాయక సౌఖ్యయుక్తలై
విహరణశీలతన్ ధరణి ♦ విశ్రుతి కెక్కిన హంసులార శ్రీ
సహచరుఁ జూచి సీగయిత ♦ శంబరవైరిరుజాపరీతయై
యహములుపుచ్చుచున్న దని ♦ యాతనితోఁడరహస్యమందుమీ
కుహనను వీడి చెప్పుడికఁ ♦ గోరిన కోరిక దీర్ప వేడెదన్.

## 11. మాత్తంగళాయ్ందు.

శ్లో. పుష్పారామసుగంధజుష్టకురుకానాథశ్శఠారిః పురా
నిర్దుష్టార్థ్యపదైకతానమకరోద్యత్పద్యసాహస్రికం,
తస్మిన్నేతదనూనపద్యదశకం భక్త్యా పఠన్మానవ
శ్శ్రీశాంఘ్రిద్వయగాఢరాగవశతస్స్యాల్లీనచిత్తో భువి.

ఉ. సూనపితానగంధవన ♦ శోభితసత్కురుకాపురీంద్రుఁడా
పూని శఠారి శౌరిపద ♦ మానితభక్తిని సాధుశబ్దసం
తానమున న్రచించిన వి ♦ దగ్ధసమీడ్యసహస్రమందు న
న్యాసము లీపదింటి మది ♦ నూనిన శ్రీహరిభక్తి చేకురున్.

శ్రీమతేశఠకోపాయనమః.

---

శ్రీమతేరామానుజాయనమః.

## షష్ఠశతకము—తొమ్మిదవ దశకము.

[నీరాయ్నిలనాయ్.]

అవతారిక:—"ఎంగుచ్చెన్నాగిలుం కండు" (ఎచ్చటకి వెళ్లినను సర్వేశ్వరుని జూచి) అనియు, "వానవర్కోనై క్కండు" (నిత్యసూరినాయకుని సేవించి)

అనియు పక్షులను తుమ్మెదలను దూతలుగా బొమ్మని చెప్పినారు. అవి పోవజాలన ట్లార్తధ్వనిచే నేడ్చిరి. “మరంగళు మిరంగుమ్” అన్నట్లు అచేతనములుకూడ వీరి స్థితిఁ జూచి కనికరించుచున్నవి అని చెప్పగా కొంచెము చైతన్యముగల పక్ష్యాదుల మాట చెప్ప నవసరము లేదు. అచేతనములుకూడ వీరదైన్యమును జూచి యేడ్చు చున్నప్పుడు పరమచేతనునివిషయమై చెప్పవలెనా? అని యాలోచించి తమకంఠ ధ్వనితో బిగ్గరగా వానిని పిలుచుట కుద్యమించిరి. తమ యార్తధ్వని యుండగా వేరే మరియొకరు పోవలసియున్నదా? శ్రీవైకుంఠమం దుండజాలక అతిశీఘ్రముగా పరుగిడి వచ్చునట్లు పెద్దకంఠధ్వనితో మొఱబెట్టుచున్నారు. దూతలుగా బోవువారికి కాళ్లతోగాని రెక్కలతోగాని వెళ్లవలసియుండుటచే నేదైన ప్రతిబంధక ముండును. గాని వీరికంఠధ్వని కడ్డులేదు గదా? పిరాట్టి చెరలోనుండుటకు హేతువు చెప్పశక్యముగానట్లు వీరుపొందుచున్న వ్యసనమునకు గూడ హేతువు చెప్పశక్యము కాదు. ఆమె చెరలోనుండుట పరానుగ్రహముకొఱకైనట్లు వీరివ్యసనముకూడ పరానుగ్రహముకొఱ కుపయోగించునదియై యున్నది. పిరాట్టి చెరలోనున్న పరికాగమును శ్రీవాల్మీకిభగవానులు వ్రాసి నేడీలోకము నంతయును సుఖింపజేసినట్లు, నాడీ యాళ్వార్లు వ్యసనమును పొందినను తాము ప్రసాదించిన ప్రబంధములు లోకమునకు చలిపందిరైనవి. తనపిల్లనగ్రోవిధ్వనిచే తిరువాయ్‌ప్పాడి (గొల్లపల్లె) యందున్న గోపికలు పొందిన తహతహను తమ ఆర్తధ్వనిచే నీశ్వరుడు పొందునట్లు చేయుచున్నారు.

“అయ్యా, మీరు నన్నున్నచోట నుండనియ్యక యిట్లేల బాధపెట్టెదరు? నేను మిమ్ములను విడిచి దూరముగా బోయియుంటినా? యేదో యొకదానిని పట్టి నను అది మమ్ములను బట్టియున్నదని చెప్పదగియున్న జగదాకారమును మీకు గనబర్చి యుంటిమే” అని సర్వేశ్వరుడు పలుకగా. నాళ్వార్లు– “అందులో గొరత యేమి? నీవు జగచ్ఛరీరుడవను జ్ఞానము నాకు లేదా? ఈ జ్ఞానమే నీయొక్క అసాధారణాకారమును చూడవలెనని ప్రేరణ చేయుచున్నది. నాకు ప్రాప్యమైనదాని నటుపెట్టి కానిదానిని గనబర్చుట అప్రయోజనము. అదికూడ నీవిభూతికి బహిర్భూతమైనది కాదని ప్రతిపత్తిగలవాడనై యున్నాను. అందువలన నీది నాది అనుకొను భ్రాంతి నివర్తించినది. అర్జునుడును నీ విశ్వరూపమును సేవించినతరువాత “తేనైవ రూపేణ చతుర్భుజేన” అని నీ యసాధారణ దివ్యమంగళ విగ్రహమును కనబర్చవలెనని ప్రార్థించెను గదా.” అని బదులు నుడివిరి. వీరి యార్తధ్వని సర్వేశ్వరుని ఉభయ విభూతులయం దుండనియ్య నట్లున్నది. దీనిలో మొదటి పాశురమే ఈయిర్పాట్టు.

## 1. నీరాయ్ నిలనాయ్.

శ్లో. భూమ్యంతరిక్ష జల వాయు హుతాశనేందు
కంజాతమిత్ర గిరిశాది శరీరధారిన్,

చక్రాది హేతిపరిచిహ్నిత భూనభ స్థ
సంతోషణాయ సకృ దేహి ముదంతికం త్వమ్.

మ. జలభూవహ్నివియన్మరుద్వనజసం ♦ జాతాద్రిచాపార్క్షచో
ములు నీవై భువనంబు లేలు పరమా ♦ మోదంబుతో జక్రమున్
జలజంబున్ ధరియించి నాకవసుధల్ ♦ సంతోషముంబొంద ని
శ్చలతన్ ర మ్మొకసారి నాకడకు నిన్ ♦ జక్షుస్సులంజూడగన్.

## 2. వా మ నా వ తా ర మ్.

శ్లో. దేవానాంచ నృణాం ముదం ప్రజనయన్ ధృత్వాచ రూపం వటో
స్త్వత్సౌందర్యబలప్రహృష్టమనసం తం వంచయిత్వా బలిమ్,
ఊర్ధ్వాధస్స్థితవిష్టపాన్సమిధ హే విష్ణో యథా త్వామహం
దృష్ట్వా హర్షముపైమి సంచర తథా భూమ్యాం సకృన్మాధవ.

చ దివి భువి సంతసింప నతి ♦ తేజముగల్గిన వామనుండవై
దివిజరిపుప్రతాపము న్బలిని ♦ దేరకు వంచితుజేసి యుక్తిచే
దివి భువి గొన్న మాయివగు ♦ దేవ భవత్సవిధంబు జేరి క
న్గవ సఫలంబుగాగ నిను ♦ గన్గొన ర మ్మొకసారి భూమికిన్.

## 3. కా ల కూ ట మ్.

శ్లో. గత్వా భువి స్థిత మితశ్శయితో నిషణ్ణ
స్త్వం రక్షసి హ్యనుయుగం సకలాత్మజాతం,
దేవ్యా శ్రియా సహ భవంతమవాప్య దాసః
క్లేశాన్క్షయచ్చిరముపైతి భవే నిమగ్నః.

మ. ధరపైఁబుట్టి నరాదిరూపముల భ ♦ క్తవ్రాతసంత్రాణత
త్పరతన్ మీరెదు నిన్ను సీదయితయా ♦ పద్మ న్గనన్ లేక దు
ర్భరసంసారమహాబ్ధి మున్గి తరణో ♦ పాయప్రహీణుండనై
సరసీజాక్షయి కెంతకాల మిటు నే ♦ సంతాపము న్బొందెదన్,

4. త శ క ట స్తం ము రిం దు.

శ్లో. త్వత్పాద ఘాతమధిగమ్య విభగ్న దేహా
భూమావపప్తదసురశ్శకటో మురారే,
బ్రహ్మేంద్రరుద్రముఖదేవనుతో మహీం త్వ
మాగత్య దేహి తవ దర్శనమంబుజాక్ష.

చ. శకటము నూరుముక్కలయి ♦ క్ష్మాతలమందుఁ బడంగదన్ని గో
పకవరవర్ణినీభయము ♦ బాపిన దేవ సరోరుహాసనాం
ధకరిపువాసవాద్యదితి ♦ నందను లెల్ల నతోత్తమాంగులై
ముకుళితహస్తులై పొగడ ♦ మోము దివంబునఁ జూప వేడెదన్.

5. వి శ్వ్మే ది రు ప్యా య్.

శ్లో. వైకుంఠవాస భుజగాద్రినివాసదీక్ష
క్షీరాంబుధౌ శయిత భూమిచరాంతరాత్మన్,
సంఖ్యాతిగాంబుజభవాండగతో మమాత్మ
న్యావిశ్య దర్శయసి మే న భవత్స్వరూపమ్.

చ. పరమఖవాసివై భుజగ ♦ పర్వతవేశ్మరతుండవై పయ
శ్శరధిని దందశూకపతి ♦ శయ్యను నిద్దురనొందువాఁడవై
ధరపయి సంచరిష్ణువయి ♦ దాగి జగంబున కంతరాత్మవై
పరగెడు నీవు నాహృదయ ♦ పంకజపీఠి వసించియున్న సుం
దరమగు నీదు రూపమును ♦ దాచక నా కొకసారిజూపుమా.

6. పా దో ర డి వై త్తు.

శ్లో. ఏకేన పాదకమలేన భువం సమస్తా
మన్యేన చోర్ధ్వభువనాని పదా మిమీథాః,
మాయిన్నపంత మవలోకయితుం స్పృహావాన్
లాక్షేవ చాగ్నిసవిధే సముపైమి తాపమ్.

మ. ఒకపాదంబున వారిరాశివృతమా ♦ నుర్వీస్థలిం గొల్చి యిం
కొకపాదంబున నూర్ధ్వలోకనికరం♦ బొక్కుమ్మడి న్గొల్చికొం

చక్రదైత్యేంద్రునిమట్టినట్టి పరమా ♦ శ్చర్యైకతానుండ ని
న్నొకమారైనను జూడఁగోరి మదిలో ♦ నుత్కంఠ పెల్లేచ న
హ్నాకడన్ జేరెను మైనముంబలెను గ్లా♦నిం జెందుచుంటిన్‌హరీ.

## 7. ఉలగిల్ తిరియుమ్.

శ్లో. త్వం కర్మణోస్సుకృతదుష్కృతయోః ఫలస్య
దాతాఽసి కర్మసు నృణామసి చోదకశ్చ,
ఆత్మాఽసి సర్వజగతామపి చేతనానాం
మామజ్ఞమద్య కృపయాఽనుగృహాణ దాసమ్.

సీ. స్వాభిమతంబుల ♦ సాధింప జనులెల్ల
నాదరంబున సల్పు ♦ యాగసమితి
అయోగ్యకర్మల ♦ నాచరింపగ దగు
లోకంబు దానియం ♦ దేకమగుచు
వర్తించువారునై ♦ బల్విడి దత్కర్మ
లన్నియు బచరించు ♦ నాత్మచయము
స్వకృతకర్మల జ్ఞాన ♦ సంకోచ మెఱుగని
సంఖ్యాతిగ విముక్త ♦ సంఘములును

తే, గీ. నీదు సంకల్పవశమున ♦ నెగడుచుండు
జడుడ నజ్ఞుడ సంసార ♦ సక్తమతిని
నిన్ను జూచు నుపాయంబు ♦ నేనెఱుంగ
జూపు మొకసారి నీరూపు ♦ సుందరాంగ.

## 8. అరివిలేనుక్కు.

శ్లో. జ్ఞానీ త్వదేకనిరతో భవతి త్వదాత్మా
తేజిష్ఠవిగ్రహవిరాజిత మద్దయాళో,
అజ్ఞం త్వదేకశరణం భవఘోరగర్తే
పరిక్షేప్తుమిచ్ఛసి కియచ్చిరమబ్జనాభ.

ఉ. జ్ఞానుల నాత్మగాఁ గొనెడు • నాకిను తాంఘ్రిసరోజసౌరభా
మానసుదీపప్రకాయ భవ • నోదన న న్గరుణింపు మజ్ఞునిన్
గానను వేరుపాయముల • గాదని నిన్ను భ్రమింపజేసి నా
మానస మింక దుర్విషయ • మగ్నము జేసి నశింపఁజేతువో.

9. ఆ వి తి గై క్క.

శ్లో. త్వం దేహిషు బాహ్యవిషయేషు రుచిం ప్రకల్ప్య
కిం బాధసే భయదసంసృతిపాతితం మామ్,
భావత్క మంఘ్రికమలం మితసర్వలోకం
మాం నేతుమర్హసమయః కిమనాగతోఽద్య.

ఉ. ఎన్నగరాని బాధలిడు • నింద్రియబృందము పాలుసేసి నం
జిన్నసుఖంబుల న్వలను • జిక్కఁజేసి నిరస్తుఁ జేతువో
పన్నగశాయి లోకములఁ • బన్నుగఁ గొల్చిన తావకాంఘ్రి కా
సన్నుని జేయు కాల మిక • సన్నిహితంబుగ లేదొ మాధవా.

10. కు రు గా నీ శా.

శ్లో. వృద్ధిక్షయాదిరహితం పరిమాణశూన్యం
కైవల్యసౌఖ్యమనఘం ప్రవిచార్యమాణమ్,
త్వత్పాదపద్మయుగళీకృత సేవనోత్థ
సౌఖ్యస్య నార్హతి కలామపి షోడశీం తత్.

చ. క్షయమును వృద్ధి నంతమును • గానని దై కలకాలమున్ను న
వ్యయమగు కేవలత్వమున • నబ్బు సుఖంబు భవత్పదాంబుజ
ద్వయపరిచర్య నెల్లపుడు • పట్టుగఁ జేయక యున్న నో
క్క యగనిమేషమైన నుడి • కాంక్షను జేసిన గల్గు సౌఖ్యసం
చయమున కెట్లు తుల్యమగు • సారసలోచన పాపమోచనా.

11. తె రి ద ల్ ని నై ద ల్.

శ్లో. దుర్జ్ఞేయమే మనసాదిభిర్యతితతిధ్యేయాంఘ్రిపంకేరుహే
శ్రీకృష్ణేఽర్పితచేతసాం తనుభృతామగోచరో మానిరాట్,

చక్రే యచ్ఛఠశాసనోఽతివిమలం సాహస్రమేతత్పరం
స్తస్మిన్పంచకయుగ్మమచ్యుతపదాంభోజే భవేద్భక్తిమాన్.

మ. శ్రుతిశీర్షాగమశాస్త్రవాఙ్మనసం • శ్రుత్యాదిదుర్జ్ఞేయవి
స్తృతమాహాత్మ్యము గల్గు దేవునికి భ • క్తిన్ దాసులౌవారి వి
శ్రుతభక్తుండు శఠారి యోగిపతి స • త్సూక్తిప్రపంచంబుతో
క్షితిపై గూర్చిన వేయిపద్యముల స • క్లిష్టంబులౌ నీపదిన్
సతతం బాదరమొప్ప బాడు సుజనుల్ • శౌర్యంఘ్రిభక్తుల్భువిన్.

శ్రీమతే శఠకోపాయ నమః.

---

శ్రీమతే రామానుజాయ నమః.

షష్ఠ శతకము—పదియవ దశకము.

[ఉలగముండ పెరువాయా.]

అవతారిక:—క్రిందటి తిరువాయ్మొళిలో ప్రాప్యవేషముయొక్క ప్రకాశమును, ఈ తిరువాయ్మొళియందు ప్రాపకవేషప్రకాశమును ప్రతిపాదించినారు. క్రిందటితిరువాయ్మొళిలో నుపాయప్రసంగమున్నను అది ప్రాప్యప్రధానమైనది. ఈ తిరువాయ్మొళియందుపేయప్రసంగమున్నను ప్రాపకప్రధానము. క్రిందటితిరువాయ్మొళి తిరుమంత్రమువంటిది. ఈ తిరువాయ్మొళి చరమశ్లోకమువంటిది. ఈ రెండును అనగా నుపాయత్వము నుపేయత్వము ఈశ్వరునియందుండుటచే ప్రాప్యత్వవిశిష్టుడైనపుడు ప్రాపకత్వవిశిష్టుడై యుండును. కావున నాతిరువాయ్మొళి ప్రాప్యపరమనియు నిది ప్రాపకపరమనియు విభజించుటకు తగునా యని శంక పొడమవచ్చును. అది శక్తియోగముచే గలుగునది. అవస్థాంతరములను పట్టి వచ్చు నీరెండును వేరుగానే యుండును. ఈ యాళ్వార్లు పరమపదమునకు వినవచ్చునట్లు పెద్ద మొఱబెట్టినను సర్వరక్షకుడైన సర్వేశ్వరుడు వచ్చి ముఖము కనపఱ్చకపోవుటచే మిక్కిలి అవసాదము నొందిరి. శ్రియఃపతి, అవాప్తసమస్తకాముడు, ఉభయవిభూతియుక్తుడు, సమస్తకల్యాణగుణాత్మకుడు నగు సర్వేశ్వరుడు—"అనేకులు మద్విముఖులై దుర్విషయప్రావణ్యముగలవారై చెడిపోవుచుండుటగని మనమిట్లుపేక్షింపగూడ"దని తలంచి రామకృష్ణాద్యవతారముల నెత్తి సమకాలికులైన వారికి తన గుణచేష్టితాదులను కనపఱ్చి యనుభవింపజేసెను. తరువాత వచ్చినవారికి రుచిని పుట్టించువాడై లక్ష్మీసనాథుడై తిరుమలయందు వేంచేసియుండి కాలనియమము, అధికారినియమము నక్కఱలేకుండ సకలచేతనులాశ్రయింపదగిన సౌ

శీల్యము గలవాడై యుండుటను చూచి పెరియపిరాట్టి పురస్కారముగా తమ అనన్యగతిత్వమును విన్నవించి శరణాగతిఁ జేసి తమ అధ్యవసాయమును తెలియజేయుచున్నారు. ఇందులో "అగలగిల్లేనిఱైయుమ్" అనునది ఉయిర్పాట్టు.

1. ఉ ల గ ము ం డ పె రు వా యా.

శ్లో. లోకానీకవిఘస్మరాస్య విశదప్రోద్దామకీర్తే హరే
రవ్యోఘప్రతిభాసమాన వినమద్భక్తాన్తరాత్మన్విభో,
పృథ్వీమండనవేంకటాద్రినిలయ ప్రాచీనదాసస్య మే
యుష్మత్పాదసరోజచిన్తనసుధాం దత్వా దయేథాశ్చిరమ్.

చ. విమలగుణవ్రజప్రథిత • విష్టపసంగిళనోరువక్త్ర యు
త్తమతనుకాంతిపుంజజిత • తామరసాస్త్ర మదీశ లోకవి
భ్రమసువిభూషణోపమిత • పన్నగశైలనివాస నాకుల
క్రమమున దాసుడైన నను•గ్రచ్చర జేర్పుము నీపదద్వయిన్.

2. కూ రా య్ నీ రా య్.

శ్లో. తిగ్మాంశూత్కరతీక్ష్ణచక్రహుతిభుగ్జ్వాలౌఘభస్మీకృత
క్రవ్యాత్సంచయ నిత్యసూరిపరిషత్సంసేవితాంఘ్రిద్వయ,
కల్హారోత్పలపంకజాతవిలసద్వాపీసహస్రావృత
వ్యాళక్ష్మాధరవాస మాం తవ పదం నేతుం ద్రుతం చింతయ.

ఉ. క్రూరబలిష్ఠరాత్రిచర • కోటిని భస్మముజేసి మంటిలో
జేరెడున ట్లొనర్చిన వి • శేషపరాక్రమ భీకరద్యుతి
స్ఫారసుదర్శనంబు కర • పద్మమునన్ ధరియించుదేవ కా
సారలసద్భుజంగగిరి • సంస్థిత నీపదభక్తి గల్గున
న్నారట మొంద నీక భవ•దంఘ్రియుగంబున వేగ జేర్పుమా.

3. వ ణ్ణ మ రు ళ్ గొ ళ్.

శ్లో. చక్షుర్మోహకవారివాహసుభగాశ్చర్యస్వరూపేహిత
స్వాంతే మేఽమృతసారరస్య దివిజానీకాధినాథాచ్యుత,

ధారోద్యాంతిసువర్ణమౌక్తికమణివ్రాతప్రదీప్తోరగ
క్ష్మాభృద్వాస విభో త్వదంఘ్రికమలం మాం నేతుముత్కో భవ.

శా. నేత్రానందకరాంబుదాభ క్రతుభు • క్త్రేతా మహాశ్చర్యచా
రిత్రా మద్ధృదయస్థితామృత జల • ధిప్రాప్తముక్తామణి
క్షేత్రీభూతభుజంగశైలనిలయా • శ్రీవల్లభా త్వత్కృపా
పాత్రున్నన్ను భవత్పదంబుదరి జే • ర్పం జూడు శీఘ్రంబుగన్.

## 4. ఆవావెన్నాడు.

శ్లో. లోకానీకవిహింసకాసురకులాన్యావాంత వైశ్వానర
జ్వాలాజాలశరైః ప్రదహ్య జగతో బాధా నిరాస్థః ప్రభో,
లక్ష్మీవల్లభ దేవదేవ మునిభిస్సంసేవితే వేంకట
క్ష్మాభృన్మూర్ధ్నివిరాజమాననయమాం త్వత్పాదయుగ్మం ద్రుతమ్.

చ. కరుణ దొఱంగి లోకముల • ఖండనసేయు నృశంసుల న్నిశా
చరులను జక్కసేయ శర • సంతతి నీనెడు విల్లు బూను శ్రీ
వర నర దేవ దైత్య ముని • వర్గనిషేవిత శేషశైలసు
స్థిర భవదంఘ్రియుగ్మమునుఁ • జేరను పాయము నాకుఁ జెప్పుమా.

## 5. పుణరానిస్న.

శ్లో. నిష్పత్రీకృతసప్తసాల నిహతక్రూరాసురానీక ని
ర్భగ్నప్రాంశుమహీరుహద్వయ జగన్నిర్మాణశిల్పిన్ హరే,
నార్యాహ్వోపమమత్తవారణగణాక్రాంతాహిభూభృచ్ఛిరో
లంకార ప్రియశార్ఙ్గతే పదయుగం దాసః కదా ప్రాప్నుయాత్.

చ. కలిసిన సప్తసాలముల • గాడగ నేసిన చాపచాతురీ
విలసిత భూరుహద్వయము • విక్కన ద్రోసిన సర్వకారణా
జలదసదృక్ష దంతిచయ • సాంద్రభుజంగమహీధరాగ్రని
శ్చలశుభదీప నీచరణ • సారస మెప్పు లభించునో కదా.

## 6. ఎన్నాశేనామ్.

శ్లో. మాతారం భువనత్రయస్య వికచాంభోజాతగర్వాపహాం
దృష్ట్వామశ్చరణం కదేతి దివిషద్వర్గా మనోవాక్తనూః,
ఏకీకృత్య యమర్చయంతి సతతం తస్యాహి సైశేశితు
స్తే పాదాంబురుహం కదా మమ దృశా దృష్ట్వా భవేయంకృతీ.

శా. విశ్రాంతాఖిలవిష్టపంబును నతా • భీష్టార్థదంబుల్ బ్రభా
తిశ్రాంతాంబుజముస్ ద్వదంఘ్రియుగమున్ • దివారాత్రి సేవింపగా
శక్రాంభోజభవాదులే కుధరమున్ • సంఘుంబుగా బోయి ని
ర్వక్రప్రక్రియ నాశ్రయించెదరొ యా • వ్యాఘ్రాద్రిపై నున్నయో
చక్రాలంకృతహస్త నాకెపుడు నీ • సంప్రాప్తి సిద్ధించునో.

## 7. అడియేన్మెవి.

శ్లో. పీయూషాధికభోగ్య సూరిపరిషత్సంస్తూయమాన ప్రభో
యుద్ధోద్యద్భుజగాశనధ్వజ కనద్బింబోష్ఠ సర్వాధిక,
నానాపాపసముత్థదుఃఖనిచయవ్యాధేశ్చ జాయో ఫణి
క్ష్మాభృచ్ఛేఖర తావకాంఘ్రికమలం ద్రష్టుం త్వరావానహమ్.

చ. అనవరతానుభావ్యమరు • దన్నముకై వడి భోగ్యభూతుఁడా
దనుజసరోజషండమద • దంతి భుజంగమువైరికేతనా
యనుపమనిత్యసూరినిచ • యార్చిత బింబఫలాధరోష్ఠ దా
రుణవృజినామయాగద స • రోజవిలోచన దేవ పన్నగా
శనధరవాస మృత్యుభయ • వారకమైన భవత్పదంబు నా
కనులను జూడకుండ దిరిటి • కాలమునైన సహింపజాలరా.

## 8. నోలాదాత్తేన్.

శ్లో. త్వత్పాదాంబుజదర్శనావహమహాభాగ్యేన హీనోఽప్యహం
హిత్వా త్వాం న సహే క్షణం మురహరేత్యత్యంతభక్త్యాన్వితైః,
సత్స్త్రీకైశ్శినవారిజాసనముఖైస్సేంద్రైస్సురైస్సేవితే
శేషక్ష్మాభృతి నిత్యసక్త వితర త్వత్పాదసందర్శనమ్.

ఉ. నీపదనీరజద్వయము • నిత్యము కన్నుల జూడకుండ మే
మోప మటంచు పంకరుహా • యోని గిరీశుడు వాసవుండు స
త్స్రీపరివారులౌచు జని • సేవలు సేయు భుజంగభూమిభృ
ద్దీప కృపాసముద్ర చను • దెమ్మ నను న్గన నాదుచెంతకున్.

9. వం దా య్ పో లే.

శ్లో. భక్తానాం సులభోఽప్యభక్తజనతాదుష్ప్రాప ఏవాసి భో
రక్తాంభోరుహపత్రలోచన సుధాభోగ్యేంద్రనీలద్యుతే,
చింతారత్నవిభానిరస్తతిమిరవ్యాళాద్రికూటస్థిత
స్వామింస్త్వత్పదపంకజం క్షణమపి త్యక్తుం న శక్నోమ్యహమ్.

సీ. ప్రతికూలులకు నెప్డు • భక్తసివలెఁ దోచి
దుష్ప్రాపుఁడై యుండు • దోషదూర,
ఆశ్రితజనతతి • కందనట్లుండియు
సులభుఁడై యుండెదు • సుగుణశీల,
పాత్రస్తనాబ్జశో • భాచ్ఛటాలుంటాక
నేత్రయుగ్మంబున • నెగడువాడ,
పక్వబింబాధర • బాహుచతుష్టయో
పేత మదాత్మరం • జిల్లువాడ,

తే. గీ. బహుళచింతామణిప్రభా • భాసమాన
శేషశైలాగ్రసంస్థిత • శ్రీనివాస
నిముసమైనను నీపాద • నీరజంబు
బాసి నిల్వంగఁజాల నో • పరమపురుష.

10. అగ ల గి ల్లే న్.

శ్లో. హాతుం త్వాం క్షణమప్యధృష్ణురహమిత్యాశ్లిష్టవక్షాః శ్రియా
పంకేజాలయయా వినిర్మలయశోధామన్ త్రిలోకీపతే,
ఆదిత్యైర్మునిభిశ్చ సిద్ధనివహైస్సంసేవితే పన్నగా
హార్యే నిత్యనివాససక్త భవతః పాదాబ్జ మాశిశ్రియమ్.

మ. క్షణమైన న్నినుఁ బాసియుండఁగ న • శక్తిన్ నేనటంచు న్సదా
వనజాతాలయ చేరియుండు విలస • ద్వక్షుండ నిస్తుల్యకీ
ర్తినిధానా భువనత్రయేశ మునులున్ • దేవర్షులు న్భక్త బూ
జనము ల్వల్వ భుజంగభూధరమునన్ • సౌఖ్యంబుతో నుండు పా
వన గత్యంతర మేది నీపదయుగ • ప్రాప్తుండనై మొప్పితిన్.

11. అ డి క్కి ప్ర మ ర్న ము.

శ్లో. హేభక్తాస్సుఖమాప్నుతాశ్రితమదీయాంఘ్రిద్వయాఇత్యురు
ప్రీత్యాభాషితవంతమబ్జనయనం స్తుత్వా శతద్వేషణః,
యుజ్జగ్రంథ సహస్రమ స్తకలుషం తస్మిన్ఫణీశ్మాభృతో
నాథస్యైతదనూనపద్యదశకం దద్యాత్పదః శ్రీహరేః.

శా. నాపాదంబుల నాశ్రయించి కనుఁడీ • నాలోకమంచు న్కృపా
కూపారుండయి యానతిచ్చిన హరిన్ • ఘోరాఘవిధ్వంసకున్
తాపంబుల్ నశియింపఁ గొల్చిన పవి • త్రస్వాంతుఁడున్ వానిని
ష్ప్రాపుండౌ శతవైరి కూర్చిన సహ • స్రంబందు శేషాచలం
బాపాదించెడు నీపదింటి నధికా • ష్లాదంబుతో బాడువా
రాపత్సంతతి బాసి విష్ణుపదమం • దావృత్తి శూన్యస్థితుల్.

శ్రీ మ తే శ ర కో పా య న మః.

ప్తశతకము సమాప్తము.



శ్రీశఠకోపాయనమః.

శ్రీమతేరామానుజాయనమః.

# ఆంధ్రగీర్వాణ శఠకోపసహస్రము.

## సప్తమ శతకము.

### మొదటి దశకము.

[ఉణ్ణిలావియవైవరాల్.]

అవతారిక:—ఈ యాళ్వార్లు క్రింద తిరువాయ్మొళిలో "ఉన్నడిక్కీళ్ అమర్ న్దు పుగుందేనే" (నీశ్రీపాదములక్రింద నమరి ప్రవేశించితిని) అని తమకు శక్యమయినంతమట్టుకు పురుషకారాకించన్యపురస్కారపూర్వకముగా నాతనినాశ్రయించి స్వీకారమందుపాయబుద్ధి నివారించుకొనియున్నను అతడు తమవిరోధినిరసన మొనర్చి స్వప్రాప్తి నొసంగకపోవుటచే సాధనమ ననుష్ఠించినవాడు ఫలము సిద్ధించువరకు శాంతించియున్నట్లు తాముచేసిన ప్రపత్తి ఫలించువరకు తాళియుండక మొఱలిడుచున్నారు. వీరల్లల మొఱబెట్టువలె ననగా: విళంబహేతువులేని సాధనమును పరిగ్రహించినవాడు ఫలము సిద్ధించువఱకూఱకయుండడు. మొఱబెట్టుచునే యుండును. ఈ యాళ్వార్లు లోగడ పెరియపిరాట్టిపురుషకార పురస్సరముగ తమ ఆకించన్యము వెల్లడిచేసికొనుచు తిరువేంగడముడైయాన్ సన్నిధిలో శరణాగతిని జేసియున్నారు. ఆ శరణాగతి "మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే" అన్నట్లు శీఘ్రముగా ఫలింపలేదు. అందుపైనిక సర్వేశ్వరుడు నన్ను విడిచిపెట్టునేమో యని దుఃఖించుచున్నారు. సంసారస్వభావము ననుసంధించి గతిచెడి వానితిరువడియందు ప్రపత్తిచేసినను స్వాపేక్షితము సిద్ధింపజేయకపోవుటచే శరణాగతి జేసినవారిని హింసించుటకు హింసకులను నియమించు కూరగజనులవలె నున్న సర్వేశ్వరుని దలచుకొని భీతిల్లుచున్నారు. సంసారహేయతను మనస్సులోనికి దెచ్చుకొనుట, ఈశ్వరవైలక్షణ్యమును నిరంతర మనుసంధించుట, ప్రపత్తిచేయుట అనెడు వీనికంటె సధిక మేమియు నీశ్వరకృపను సంపాదించుటకు జేయ నవసరము లేదు. ఇంతవరకు ఫలసిద్ధి కాకపోవుటచే బ్రహ్మాస్త్రము మొక్కబోయినదని మొఱబెట్టుచున్నారు. "క్షిపామి" (సంసారములో ద్రోసివేయుచున్నాను.) "దదామి" (బుద్ధియోగము నిచ్చుచున్నాను.) అను నీరెండు నాతనియొద్ద నున్నవి. వానిలో "క్షిపామి" అను వాక్యమునకు నేను విషయము కాలేదని సంతసిల్లుచున్నారు. అదేమి ? వీరికి సర్వేశ్వరుడు తన్ను పొందు బుద్ధియోగము నిచ్చెనే ?:- ఆ బుద్ధియోగము నిచ్చుట కూడ వీరిని బాధించుటకే ఆయెనని తలంచుచున్నారు. తమశక్తిని బెట్టుకొని పురుషార్థమును బొందదలంచియున్నవారు కారు. అతనియొక్క అశక్తిచే జెడినవారు

కారు. పురుషార్థలాభమునకు గావలసినదానిని బూర్వమే చేసియున్నారు. అట్లైనచో వీ రిపుడు చెడుట కవకాశము లేదే? కావున వీరికి బురుషార్థ మెందుకు సిద్ధింపలేదు. ఈశ్వరుడు వీరిని బెట్టి యొకపని చేయించవలెనని తలంచి యూరకున్నాడు. అదిగాక, వీరి కిది చరమదేహమగుటచే వీరు ప్రపత్తిచేసినను వీరితిరుమేనియం దీశ్వరునికుండు ప్రావణ్యముచే గార్యము చేయలేదు. వీరితిరుమేనియందు వానికున్న ప్రావణ్యమే("మంగవొట్టు" చావనియ్యకుము-10-7-10)అని యాతనిని అడ్డినది. సత్యమైన ప్రేమ యున్నచో నిట్లుండదే? ఆతనికిది స్వభావమయిపోయినది. ఈశ్వరుడు తమ్ము బెట్టి యీలోకమును దిద్దుట కిట్లు చేయుచున్నాడని వీరికి దెలిసియుండినను వీ రిట్లు మొఱ్ఱబెట్టుటయేమనగా: నీశ్వరుడు తమచే జేయించ దలంచిన కార్యమును తనయాజ్ఞను మన్నించు మరియొకనిచే జేయించగూడదా యని యీయాళ్వార్ల అభిప్రాయము. వీరికి తానొసగిన జ్ఞానము ధరించియుండుట కుపయోగముగానుండునని యీశ్వరుడు తలంచెను. అదియే వీరికి తొందరపడుటకు హేతువాయెను. ఈశ్వరుడు నింపాదిగా వీరికార్య మొనర్చెదనని శాంతించియుండెను. అదిచూచి వీరు మనలనుఆతడు విడిచిపెట్టెనని తలంచెను. నిత్యవిభూతిని దివ్యమంగళవిగ్రహమును సాక్షాత్కరించి యిప్పుడే శ్రీవైకుంఠమునకు బోయి యీశరీరముతోనే అనుభవింపవలెనని తొందరపడుచున్న వీరు "సంసారముకూడ తదీయమైయుండెడు నొకయాకారము గల"దని జ్ఞానముచే ధరించియుండక, "యాను నీతానాయ్ తెళిందరుం నన్ను మంజువన్ నరగం నానడైదల్"(8ప-1తి-9పా) (నేను నీకు శేషభూతుడనని తెలిసికొన్నపుడెల్ల నరకమును పొందుదునేమో యని మిక్కిలి భయము నొందుచున్నాడను)అని యెంచియున్నారు. ఈరీతిగానున్నతిమ్మను, ఆతనికిరక్ష్యవర్గము కొరతగానున్న ప్రకారమును, ఆతనికి రక్షకత్వము స్వరూపమైయున్న ప్రకారమును, రక్షించుట కుపయోగమైన ప్రాప్తిని, తమ కిందులో సంబంధము లేకుండ నున్న రీతిని, సత్త్వాదిగుణములను, ఆతనికి మూలమైన ధర్మదేహేంద్రియాదులను, నీనికి మూలమయిన మూలప్రకృతిని, మహత్తును, అహంకారమును, తత్కార్యమైన శబ్దాదివిషయములను, అవిద్యాకర్మవాసనారుచులను, ఇవియన్నియు నీశ్వరాధీనములైయున్న ప్రకారము ననుసంధించి విషయములు ఇంద్రియములు ప్రవర్తించుచున్న సంసారమం దుంచినపుడే నీనికి మనలను ఎరగాజేసి విడిచిపెట్టినాడు. "క్షిపామి" అను కోటిలో బ్రవేశించినాము. ఇక నితడు తనపరికరములను చూపుట నన్నెడబాయుట కుపయోగముగా నున్నది. నేను పడుచున్న పాట్లు చూచి అచ్చట నున్నవారితోగూడ ముచ్చటించి చిరునగవు నవ్వుట కుపయోగముగా నిత్యవిభూతిలో విచ్చేసియున్నాడు. మన చరసాలగా నీలీలావిభూతిని జూచుచున్నాడు. ఇతరులవలె సుఖముగా నుండక బాధనొందుచుండుటకే నాకు ఆతడు భక్తిరూపాపన్న జ్ఞానము నిచ్చియున్నాడని నిశ్చయించి వానితిరువడియందు తమశిరస్సు నుంచి వినువారిమనస్సులు నీరై కరుగునట్లు మొఱ్ఱబెట్టుచున్నారు. ఈ దశకము(తిరువాయ్మొళ్ళి)లో మొదటి గాథ(పాశురము) ముఖ్యగాథ(ఉయిర్పాట్టు).

### 1. ఉణ్ణులావియ.

శ్లో. సంఖ్యాతీతసువిస్మయావహగుణవ్యాపార సూరిస్తుత
త్రైలోక్యాధిపతే మదీశ కమలాప్రాణేశ మజ్జీవిత,
దేహాంతస్థితఘస్మరాతిచపలైః పంచేంద్రియశ్వాపదై
రాకృష్య ప్రవిఖాద్యమానమనిశం కిం మాం ముధోపేక్షసే.

మ. గణనాతీతమహాద్భుతైకనిలయా ♦ కారుణ్యవార్ధీ మరు
ద్గణసంసేవిత లోకనాథ యమృతో ♦ ద్గారాధికస్వాద్య స
ద్గుణరత్నాకర యింద్రియావటముల ♦ న్గూలంగఁ ద్రోయించి ని
ర్ఘృణత న్నన్ని భవత్పదం బిడక నన్ ♦ ఖేదంబు నొందించెదే.

### 2. ఎన్నైయాళుమ్.

శ్లో. ప్రావృడ్వారిధరోపమాంగక సుధాధారాతిభోగ్య స్ఫుర
చ్చక్రత్రాణపయోధివేష్టితమహీచక్రప్రియాయాగోచర,
మాం కృత్వా స్వవశే ఽతిపీడనపరైః పంచేంద్రియాఘైః యథా
త్వాం నాప్నోమి తథా కృణోతి భగవన్కాలం కియంతం సహే.

మ. జలదశ్యామ పయోనిధానవలయ ♦ క్ష్మామండలీపాలనో
జ్జ్వలచక్రాంచితహస్త వేదవినుత ♦ ప్రాశస్త్య పీయూషభో
గ్య లలామశ్రితపాల దాసజనర ♦ క్షాకూతి పంచేంద్రియం
బుల కాయత్తుని జేసి రేయిబవలున్ ♦ భూరివ్యథ న్మించి న
న్నలయింపం దగునే భవచ్చరణమం ♦ దాసక్తునిం జేయవే.

### 3. వేదియానిర్కుమైవగాల్.

శ్లో. లోకౌఘసర్గగిళనోద్గిరణాదిలీల
స్సర్వేశ్వరస్సముపలబ్ధసమస్తకామః,
త్వం మాం విధాయ విషమేంద్రియపీడితం కిం
ప్రాప్నోషి తే పదయుగం నయమాముదార.

ఉ. కారణకారణుండ నిజ ♦ కామన నీవసుధ న్సృజించి యా
హారముమాడ్కి మ్రింగి మఱి ♦ యావల బెట్టియు గొల్చి యెత్తి లీ

లారతిదేలు దేవ మణి ♦ లాంఛితదివ్యకిరీట శ్రీశ న
న్నారయ నెట్టు నింద్రియని ♦ కాయము పాల్పడజేసి నీపదాం
భోరుహ మందకుండ నిటు ♦ బోనిడువన్నల మేమి నీకగున్.

### 4. శూ దు నా న రి యా వ

శ్లో. కల్పాపాయే జగన్తి త్వదుదరకుహరే గూహమానోఽర్భకస్స
న్నైన్యగ్రోధదళే త్వం స్వపిషి నిజజనాఘామయధ్వంసమాయో,
అజ్ఞం మామింద్రియాఖ్యైరపహృతధిషణం కారయం స్త్వత్పదాత్తే
దూరీభూతో యథాస్యాం రచయసి చ తథా నోచితం తే కృపాయాః.

మ. చిదచిద్బృందము నీదు తుందమున ని ♦ క్షేపించి వాటావనీ
జదళంబందు ప్రసుప్తిఁ జెందు పరమా ♦ శ్చర్యైకతానార్భకా
విదురస్తుత్యపదాబ్జజాత వృజినో ♦ ద్భేదాగదా నన్ను నీ
పదపంకేజము జేరకుండ విషయ ♦ వ్యాళాననక్షిప్తుఁ జే
య దయాశీలుఁడవైన నీకుఁ దగునే ♦ యజ్ఞాక్ష నీ కేమగున్.

### 5. తీ ర్మ రు ం ది న్ని.

శ్లో. యుద్ధోద్యచ్చక్రధారాపినిహతదనుజానీక సూరివ్రజేశ
క్షిప్త్వాఽస్మిన్ యన్త్రరూపే వపుషి విషయరుక్సంచయేనోద్ధతేన,
వర్గః పంచేంద్రియాణాం శకలయతి మన స్తం సమున్మూల్యశీఘ్రో
ప్రీత్యా త్వత్పాదపంకేరుహయుగళమముం దాసముత్తారయేథాః.

ఉ. సంయుగబద్ధదీక్షమగు ♦ చక్రము బూని సురారిముఖ్యులన్
సంయమనీపురాతిథుల ♦ సారెకు సల్పెడు సూరినాథ వా
చంయమవందితాంఘ్రియుగ ♦ సంతతదుర్విషయామయప్రదా
హంయుశరీరయంత్రమున ♦ నాదట బెట్టి భ్రమింపజేయు దు
స్సంయమ మింద్రియౌఘ మిది ♦ చాల గలంప నుపేక్ష సేయ నో
సంయమివంద్య ధర్మ్యమనఁ ♦ జాలుదువే శరణంబు వేఁడెదన్.

## 6. విణ్ణుళార్ పెరుమాళ్.

శ్లో. యే వైకుంఠనివాసినశ్చ సతతం కింకుర్వతే యేచ తే
తానప్యైంద్రియికంహి కాల్యమధికం బాధేత కిం మాం పునః,
అత్యాక్షీరథ మామనన్యశరణం కావా విపన్నాశ్రయే
ద్భక్తిప్రాప్య మదక్షిగోచర వదోపాయం భవత్ప్రాప్తయే.

ఉ. ఇంద్రియపంచకం బిడి సు ♦ రేశ్వరులౌ భుజగాధిరాజప
క్షీంద్రులకైన మోహ మెద ♦ హెచ్చుగఁ జేయు నటన్న నుర్విపై
సాంద్ర మహాగసు న్మనుజు ♦ జాల్ముని జెప్పగ నేల సత్ప్రభా
రుంద్రి మదీయదుఃఖముల ♦ రూపడగించి కృతార్థుఁ జేయవే.

## 7. ఒన్ను శొల్లి ఒరుత్తినిల్.

శ్లో. మంథానం పరికల్ప్య మందరధరం యోక్త్రీకృతాహిః పురా
క్షీరాబ్ధిం సురదానవైశ్చ మిళితోఽమథ్నాస్సుధాం మత్స్యదే,
న స్యాత్తే యది సత్కృపా మయి విభో క్రూరం పరం చంచలం
నైకభూతమిమం మదింద్రియగణం జేతుం కథం శక్నుయామ్.

మ. తొలి దేవాసురసంఘ మెల్ల ఘనపా ♦ థోరాశిలో మందరా
చలము న్నెచి భుజంగరాజధృఢపా ♦ శాబద్ధముం జేసి దో
ర్బలయుక్తిన్మథియింప నయ్యవనిభృ ♦ ద్భారంబు మోయంగ గూ
ర్మలసద్రూపముఁ దాల్చినట్టి కరితు ♦ భుజ్మందార నీసత్కృపా
బల మావంతయు లేక యింద్రియముల ♦ న్వారింప నెట్లోపుదున్.

## 8. ఇన్నముదెనత్తోన్ని.

శ్లో. మా తేవాతిదయాపర త్రిదశసంసేవ్యాంఘ్రిపంకేరుహ
త్వన్మాయాపరికల్పితం మునిమనోవ్యామోహహేతుం సదా,
ఆపాతాతిమనోహరే విషయసంజాతే సుఖే మే స్పృహాం
సంభిద్యాతిమనోజ్ఞతావకపదధ్యానే రుచిం మే కురు.

శా. స్వామీ సూరిపతీ సుధారససమ ♦ స్వాద్యంబునై ప్రాజ్ఞులన్
వ్యామోహాబ్ధిని ముంచు దుష్టవిషయ ♦ వ్రాతంబున న్మాన్పి నీ

యాం మోదావహదివ్యమంగళతనూ ♦ యష్టి న్మదీయాక్షికిన్
జేరిమంబొప్పగ జూపి నన్ను జపలున్ ♦ బ్రీతాత్ముగా జేయవే.

9. కు ల ము ద ల డు ం తీ వి నై.

శ్లో. స్వామిన్ స్థావరజంగమాత్మకజగత్సర్గస్య హేతో పరం
జ్యోతీరూప కులప్రణాశకమహాపాపవ్రజోత్పాదకే,
ఘోరేఽగాధభవావటే పతితో మాం పాతయిత్వా భృశం
హృష్టస్త్వేంద్రియదంతినో మదమరం పిష్టో సమున్మూలయ.

ఉ. భూభువనాదిలోకముల ♦ బుట్టగ జేసినవాడ కృష్ణ మే
ఘాభ కులాంతకోగ్రదురి ♦ తాళికి గారణమైన సంసృతిన్
క్షోభ జనింపజేసి పడ ♦ శోక మొసంగెడు నింద్రియావళీ
ప్రాభవ మెంతయు న్గెడపి ♦ పద్మవిలోచన నన్ను బ్రోవవే.

10. ఎ న్న ర ం శు డ రే యె న్న.

శ్లో. పీయూషాయ సుధాపయోధిమథనక్లేశిన్ రమేశ ప్రభో
జ్యోతీరూప సముజ్జ్వలేతి భవతో నామాని సంకీర్తయన్,
భక్త్యేద్రేకవశాదహం దురితమనా భూయాస మిత్యర్థయే
త్వం మామింద్రియపీడితం భవపదే పాపిస్యః కిమేతద్వద.

మ. ఉదధిన్ దచ్చిసుధన్ గ్రహించినమహా ♦ ద్యోగా పరంజ్యోతిసీ
పదపంకేరుహయుగ్మభక్తి యనుస ♦ ద్భాగ్యంబు నాకియ్య కా
పదలన్బెట్టి భవంబులో నిడి ననున్ ♦ బాధింపగా బాడియే
సదయాన్తఃకరణుండవై యిక నను ♦ స్సంరక్షితుం జేయవే.

11. కొ ం డ మూ ర్తి యో ర్మ్యా వ రా య్.

శ్లో. త్రైగుణ్యాత్తనవస్త్రికోఽఖిలజగత్సంహారస్పృష్టస్థితీ
రింతర్యామితయా స్థితః ప్రకటయన్ యో వార్ధిపాథశ్శయః,
తస్యాంఘ్రిద్వయభక్తపాదనిరతో మాసీ శతారిః పురా
యజ్జగ్రంథ సహస్రమత్ర దశకం పాపం నృణాం నాశయేత్.

మ. త్రిగుణంబుల్ ధరియించి కేశవవిధా ♦ తృత్ర్యక్షనామంబులన్
జగముల్ బెంచి సృజించి త్రుంచు పనుల ♦ న్సాగించి క్రీడించునా
నిగమాంతప్రతిపాద్యుఁడైన హరికి ♦ న్నేమంబుతో భక్తుఁడై
జగతి న్రాజిలు శ్రీశఠారిముని స ♦ చ్ఛబ్దార్థముల్ గూర్చి తా
దగు గీతి న్రచియించి యిచ్చిన ప్రబం ♦ ధంబందు నీపద్యముల్
పదియు న్పాడెడువారు పాపవితతి ♦ న్బాపంగ దక్షుల్ భువిన్.

శ్రీమతేశఠకోపాయనమః.

శ్రీమతేరామానుజాయనమః.

## సప్తమ శతకము—రెండవ దశకము.

[కంగులుం పగలుం.]

అవతారిక:—ఉణ్ణిలావిలో "తొండర్ తొండర్ తొండర్ తొండన్" అని నమస్కారార్థము ననేకవిధములుగా తదీయశేషత్వపర్యంతముగా ననుసంధించియున్నారు. ఉలగముండ పెరువాయిలో పెరియపిరాట్టిని పురస్కరించుకొని తిరువేంగడముడైయాన్ తిరువడిగళ్లయందు శరణుజొచ్చినారు. విషయములు, ఇంద్రియములు ప్రవర్తింపు సంసారమున దీర్ఘగుడు వీరి నుంచినప్పుడే ఆతడు నన్ను విడిచిపెట్టినాడని మొఱ్ఱపెట్టసాగిరి. ఉణ్ణిలావియందు వ్యభిచార వ్యవధానములు లేని సాధనము నవలంబించినను అది ఫలింపక పోవుటచే వానినిగూర్చి మొఱ్ఱపెట్టుచున్నారు. ఇట్టి యమోఘసాధనము ఫలింపక పోవుట యేమనగా; అది ఫలించుచున్నను యీ గార్బ్యార్థ క్రమప్రాప్తిని సహింపలేక యిట్టి బాధల నొందుచున్నారు. వీరిమార్దవ మీశ్వరునిసర్వజ్ఞత్వము నతిశయించుచున్నది. పిరాట్టివలె "తత్తస్య సదృశం భవేత్" అని శాంతించియుండువారు కారు. సంసారముయొక్క దోషమును సర్వేశ్వరుని గుణోత్కర్షమును అనుసంధించినయెడల శాంతించియుండ శక్యముగాదు. భగవద్విషయమునందు విముఖులైన సంసారిచేతనులతో వీరికి పొత్తు లేదు. భగవదలాభ మెఱుంగని నిత్యసూరులతో వీరికి పొత్తు లేదు. భగవదలాభముచే బాధ నొందువారు వీరొక్కరే. భట్టరువారీతిరువాయిమొళ్ళిని శిష్యులకు సాధించునప్పుడెల్ల "అయ్యో ఆళ్వార్లదశ నెఱుంగక వారిభావవృత్తియు లేనివారమై యున్న మాదృశులు నీ తిరువాయిమొళ్ళిని పరులమనస్సునకు నచ్చినట్లెలా గుపదేశింపగల"

మని తలపై చేతి నుంచుకొని ఊరక యుండువారట. వీరు నిత్యవిభూతికి బోయి యనుభవించు ననుభవ మిచ్చుటనే జరుగుచుండెను గదా. వీ రెందుకిట్లు చింతింపవలెను? విరోధినిరసనము కాలే దను వీరికి గలుగు నతిశంకనుగూడ బోగొట్టెదను. నాలుగుదినములు వెనుకముందు జరుగు నని ఈశ్వరు డూరక యున్నాడు. విలంబమును సహింపజాలని వీరికి మోక్ష మొసంగుటలో నీశ్వరుడు వెనుక బెట్టుట యేమి? అంటే: ఈశ్వరుని తాత్పర్యము మిది.- జ్వరాదులచే పిల్లవాడు లంఘనములు జేయుచున్నను తల్లి యింటికివచ్చిన చుట్టములకు విందుజేసినట్లు వీరు నాలుగుదినములు బాధ నొందిన నొందనిమ్ము. వీరిప్రబంధమును బెట్టి లోకమును బాగుచేయించెద నని తలంచుచున్నాడు. వీ రీలోకమం దొక ముహూర్త మున్నను సర్వశక్తియగు తానుగూడ దిద్దజాలని సంసారమును వీరిని బెట్టి బాగుచేయించెద నని ఈశ్వరుని యభిప్రాయము. ఆళ్వార్లయితే- "నాసంగతి నీశ్వరుడు బాగుగా నెఱింగినవాడు గదా? శక్తిహీనుడు కాడుగదా? ఇష్టములేని నన్ను బెట్టి యీయాపనిని జేయించదలంచి యున్నాడు. ఇష్టమున్న మరెవ్వరిచేనైన నీపనిని జేయింపగూడదా?" అని తలంచిరి. బ్రహ్మాస్త్ర మకించిత్కరమైనయట్లు చేసినప్రపత్తి నిష్ఫలమైనది. శ్రీభట్టార్యను తాతగారియింటినుండి వచ్చి తల్లికి నమస్కరింపగా నామె "రయీ రాజా" అని పలికిన పలుకును విని సహింపజాలక వెంటనే స్వామిసన్నిధికి బోయి శరణాగతిచేసి "స్వామీ! దేవరవారు తిరువయోధ్యకు మరల విచ్చేసి పట్టము గట్టుకొనవలెను." అని యనేకవిధముల బ్రతిమాలినను వినక రాకపోవుటకనేకోపపత్తులను జెప్ప వత్సా! నీవు నన్ను నిర్బంధింపవలదు. నిన్ను స్వతంత్రునిగా జేసిన నాయెదుటనే స్వరూపానురూపమైన పారతంత్ర్యమును లభించితిమ్మి?" అని సాధించిన శ్రీశ్వరుడు గూడ వీరియపేక్షితముతప్ప మరియొకదానినిచ్చి విడుచుకొను స్వభావముగల స్వతంత్రుడు. కావున తనయిష్టప్రకారము కార్యము చేయువాడు గాని పరులయిష్టప్రకారము చేయువాడు కాడు. సర్వజ్ఞుడైన యీశ్వరుడు వీరిదశావిపాకము నెఱింగినవాడైనను దనసర్వశక్తిత్వముచే దానిని నివారింప శక్యముగానట్లు వీరి దశావిపాకమున్నది. ఈ యాళ్వార్లును "విణ్ణుళార్ పెరుమానేయో" (నిత్యసూరులకధిపతీ!) "మున్ననైక్కడైం దముదంకొండ మూర్త్తియో" (త్రొల్లిసముద్రమును మథించి అమృతమును గ్రహించిన స్వామీ!) "పలముద ల్పడైత్తాయ్" (సృష్టికాలమం దనేకవస్తువులను సృజించినవాడా!) అని చెప్పినట్లుగా వీ రీశ్వరుని పరత్వమును, అవతారమును, జగత్కారణత్వమును ప్రలపించుచు మొఱ్ఱబెట్టువారు. ఈమూడింటిలో పరత్వ మనునది లోకాంతరగతమైనదగుటచే మనము దానిని దగ్గిరింపలేమని శాంతించియుండవచ్చును. అవతారము కాలాంతరమందలిది యగుటచే నాకాలమున

నుపయోగించినాము కామని శాంతించియుండవచ్చును. జగత్కారణత్వము తాను తెలిసికొని చేయునది యగుటచే నిది మనచేత జేయశక్యము కానిది యని శాంతించి యుండవచ్చును. ఆ సత్త్వములన్నియు శ్రీరంగము కోవెలలో సదాసన్నిహితుడై ప్రవర్తించియున్న పెరియపెరుమాళ్ తిరువడిగళ్లయందు పడినను స్వాపేక్షితము లభింపక పోవుటచే వీరికి ధరింపశక్యము గాకుండ నున్నది. విషయము దగ్గర లేకపోయినను జ్ఞానమందు కొరతయున్నను ధరించియుండవచ్చును. ఈశ్వరునియొక్క సౌలభ్యమందుగాని పరత్వమందుగాని కొరతయుండుటచే జెడినవారు కారు. ఇట్లున్నను సర్వేశ్వరునివలన నపేక్షించిన ఫలము లభింపక పోవుటచే దమనిజస్థితిని గోలుపోయి యొకపిరాట్టియవస్థను బొందినను తమదు అవస్థను తాము పైకి జెప్పుకొని మొఱ్ఱబెట్ట జాలక తమతల్లి తమయవస్థను జెప్పుచున్నట్లు సాధించుచున్నారు. సంయోగవియోగములయందు గలుగు లాభాలాభములచే దమరు పిరాట్టిమార్గదశ గలవారగుచున్నారు. తిరుమ్మంగయాళ్వార్ స్వభావము నీంకెట్లు కలిగినదనగా - ఏరు రెండుగట్లు పొరలి పారుచున్నను సముద్రములో బ్రవేశించు నంశము కొంతలేకుండ బ్రవేశించునట్లు "అదనిల్పెరియ యెన్నవా" (నాయభినివేశము దానికంటెను పెద్దది) అన్నట్లు వీరియభినివేశ మిట్లున్నది. కావున వీరికందరియవస్థలు రావచ్చును. ఈనాయిక మూర్ఛనొంది యుండగా నీమెదు అవస్థను జూచి బంధువులందరును మూర్ఛిల్లిరి. పెరుమాళ్లయొక్క రక్షణకొరకు ఇష్టైయు పెరుమాళ్లు మేలుకొనియున్న శ్లో మొతల్లియు నీమె సంరక్షణకొరకు మేలుకొనియుండి యెట్టివశయందైనను తమకార్యమును దాము చేసుకొనజాలక సర్వేశ్వరుని కాళ్లమీదబడి తమపనులను జేయించుకొను వంశమందు బుట్టినవారగుటచే నీమెను పెరియపెరుమాళ్ల శ్రీపాదసన్నిధికి దీసికొని వెళ్లి "స్వామీ! యీనాపుత్రిక నీయందు మోహముగలదియై యేడ్చును, సేవించును, మూర్ఛిల్లును, పలవరించును, అసంబద్ధముగా మాటలాడును, నిట్టూర్పు విడుచును, ఒకప్పుడు నిశ్చేష్టురాలైయుండును. ఇట్లుతిశయించిన యార్తిగల యీచిన్నదానివిషయమై దేవరవారు తిరువుళ్లమందేమి చేయుట కాలోచించియున్నారు?" అని మొఱ్ఱబెట్టుచున్నది. అకళంకబ్రహ్మరాయ డడయవళైందాన్ (ప్రాకారము) కట్టించుచున్నకాలములో ప్రాకారముకొరకు కొక శ్రీవైష్ణవునిగృహమును దీసికొనెను. భట్టరువారాసంగతిని విని "మీరు చేయించుచున్న పని పెరుమాళ్లకు రక్షకమని తలంచుచుంటిరా? కాదు సుమండీ. ఇచ్చట నివసించుచున్న నాలుగు కుటుంబములవారు పెరుమాళ్లకు రక్షకులని తలంపుడు? ఇవి యన్నియును మేము చేయుచున్నామని అహంకారమును బొందక మనచే సర్వేశ్వరుడు చేయించుచున్నాడని తలంపుడు? ఇదియే సద్గతికి హేతువు." అనిసాధించినారట. అట్లుగనే

యీనాయికతల్లియును యీచిన్నదానిభావము లన్నియును సర్వేశ్వరునిపై బెట్టి యీ చిన్నదాని నామోద స్తంభములకు పైగా దీసికొనివెళ్లి వానియొక్క అశరణ్యశరణ్యత్వాదిగుణములను విన్నవించుకొనుచు కాలనియమము, దేశనియమము, అధికార నియమము లేకుండ సర్వసమాశ్రయణీయుడైయున్న ప్రకారము ననుసంధించి యీ తిరువాయ్‌మొళ్ళిచే తనకుమార్తెదశను స్వామిహృదయములో నాటునట్లు మొఱ్ఱ బెట్టుచున్నది. ఇందులో "ఇట్టకాలిట్టకైగళా యిరుక్కుమ్" అనునది ఉయిర్పాట్టు.

1. కంగులుంపగలుమ్.

శ్లో. నిద్రాం నైతి దివానిశం నిజకరౌ ప్రక్షాళయత్యశ్రుభి
ర్బద్ధ్వాత్యంజలిమస్య చక్రజలజే స్మృత్వా తదీయేక్షణే.
కంజాతే ఇతి భాషతే కథమహం త్యక్తా త్వయా ప్రాణిమి
త్యేవం వక్తి విభో ప్రియాం త్వయి రతాం కిం కర్తుమీహా తవ.

ఉ. నిద్దుర సెంగ నెట్టిదియు ♦ నీరజనేత్రి యెఱుంగ దయ్యె నే
ప్రొద్దును గంటినీరు దన ♦ ప్రొల్పగు చేతుల జిమ్ముచుండె నున్
సద్దు సెలంగ చక్రిముని ♦ శంఖమటంచును కేలుమోడ్చు నా
కెద్ది తెఱంగు నిన్విడచి ♦ యెట్లుసురుల్ నిలుపంగనేర్తు నా
యుద్దియ నిష్ఫలంబనుచు ♦ నుర్వికచంబులు సల్కుచుండు నీ
ముద్దియ నేమి సేయ నెద ♦ ముచ్చట బుట్టెనొ రంగమందిరా.

2 ఎన్ శెయ్‌గిన్నాయ్.

శ్లో. సుష్వప్సతిచ నో నిశాం క్షిపతి బాష్పబిందూన్సదా
నఖాగ్రధుతిభిః కరౌ ముకుళయత్యుపేతవ్యథా,
జలేజమితి చక్రమిత్యనిశమాలపంతీ భృశం
విహాయ దయితం కథం విరహసాసహిష్ణుర్భవేత్.

ఉ. తామరసాక్షు నన్నిటుల ♦ తాపదనంబున వైవనెంచితో
యేమియొనర్చెదాననని ♦ హెచ్చుగ వెచ్చనియూర్పుబుచ్చుచో
ల్వ్యామున జేసినట్టి ఘన ♦ పాపము రమ్మిక నాదుమ్రోలకున్
శ్యామపయోధరాభ మది ♦ జాలియు బుట్టదె యంచు బల్కు నీ
కోమలి తొల్లిలోకముల ♦ గూర్పరిగ్గామె సృజియించి పెంచి యు
ద్దామజవంబున న్గొలిచి ♦ దాటిన దేవ గదాగ్రజా హరీ.

## 3. వళ్ళిలళిరైయుమ్.

శ్లో. నిర్లజ్జేంద్రమణిప్రభేతి గదతి వ్యోమైవ పశ్యత్యసౌ
రక్షఃప్రాణహరేతి వక్తి సతతం దోదూయతే మానసే,
నేత్రాదృశ్య సకృత్ప్రదర్శయ శుభాం దివ్యాం త్వదీయాం తనూ
మిత్యేషా ప్రియరంగ వక్తి కిమిమాం కర్తుం సమీహా తవ.

సీ. విడనాడె సిగ్గును ♦ వేమారు బిల్చును
పాకవైరిమణిప్ర ♦ భాంగ యనుచు
నింగివైపున దృష్టి ♦ నిగుడించు నెప్పుడు
భ్రాంతమానసయౌచు ♦ వగల బోగులు
లోకకంటకదైత్య ♦ లోకాసుమారుత
గ్రసనోగ్రదండశూ ♦ కంబ యనుచు
దుఃఖితచిత్తయై యునా ♦ రతదుఃఖమును జెందు
కంటిచే గనరాని ♦ ఘనుడ నిన్ను

తే, గీ. జూచుతెర గద్ది చెప్పుమా ♦ సుందరాంగ
వర కకుత్స్థకులాంభోధి ♦ వనజవైరి
యనుచు బ్రలపించుచుండు నా ♦ యనుగుబిడ్డ
వరణవేష్టితరంగని ♦ వాసరసిక
యీతరుణి నేమి సేయంగ ♦ నెంచినావొ.

## 4. ఇట్టకాలిట్టకైగళాయిరుక్కుమ్.

శ్లో. త్వద్విశ్లేషకృశా నిజాంఘ్రికరముప్యుద్ధర్తు మప్యక్షమా
హా కామస్య నృశంసతేతి భజతే మూర్ఛాం ముహుస్సుందరీ,
చక్రిన్వ్యాధిసవర్ణ నిర్ఘృణతరోస్యాయాహి మాం ద్రష్టుమి
త్యాఖ్యాతి ప్రియరంగ కిం ప్రియతమామేనాం విధత్సే వద.

సీ. సఖీకరాంభోజాత ♦ సన్యస్తగాత్రయై
మూర్ఛాబ్ధి బల్మారు ♦ మునుగుచుండు
తేరి చేమోడ్పుల ♦ దేవుని సేవించు
వలపు కష్టంబని ♦ పలుకు సతము

అంభోధివర్ణ నీ ♦ పతిన్నృశంసుఁడ వను
సవ్యహ స్తస్థిత ♦ చక్ర యనును
నాకడ కేతెంచి ♦ నాకంటి కోకపరి
దర్శనం బిమ్మని ♦ తత్తరించు

తే, గీ. యోగిచింత్యపదాంభోజ ♦ భోగిశయన
సహ్యజాతీరవినివిష్ట ♦ సదన రంగ
నాస యీవారిజాక్షియ ♦ వస్థ యిద్ది
యేమి సేయఁదలంచితో ♦ యెఱుగరాదు.

5. శిందిక్కుం తిశైక్కుమ్.

శ్లో. సాయంశాతనఖాగ్రదీర్ణపలభుగ్వక్షాస్సుధాభోగ్యవా
రాశేర్మాధక తావకాంఘ్రికమలప్రాప్త్యుత్సుకైషా ప్రియా,
ధ్యాయత్యాత్మని ముహ్యతి ప్రతికలం బద్ధాంజలిర్వందతే
శ్రీరంగేశ్వర మత్ప్రియేతి వదతి ప్రోత్సృజ్య బాష్పోత్కరమ్.

సీ. సాంధ్యవేళ నృసింహ ♦ సంహారకుండవై
గూల్చితి వసురేంద్రు ♦ గుండెఁజీరి
కల్లోలమాలికా ♦ కలుషాంబునిధి ద్రచ్చి
యమృతంబు దీసిన ♦ యమృతభోగ్య
నీపాదకమలంబు ♦ నెమ్మితోఁ జేరంగ
నాశించుచున్న యీ ♦ యంబుజాక్షి
భ్రాంతినొందించెడు ♦ పద్మాక్ష రంగేశ
చింతించు నీరూపుఁ ♦ జిత్తమందు

తే, గీ. మూర్ఛనొందును తేరును ♦ ముగుద మ్రొక్కు
గడుగు గన్నీట జేతుల ♦ గమలనాభ
రమ్మటంచును బలుమారు ♦ రమణి పలుకు
నీమె నెటుసేయఁ దలచితో ♦ యెఱుగ నయ్య.

6. మైయల్ శెయ్ దెన్నై.

శ్లో. ఆశ్చర్యావహాలీల మామకమనోలుంటాక బింబాధర
స్వామిన్ శక్రమణిద్యుతే విమలవాఃపూరాద్రిరంగేశయ,

చక్రాబ్జాసిగదాధనుర్వరలసద్బాహూ సుపర్ణాధిపే
త్వత్ప్రాంతం వదతి ద్విజిహ్వాశయన స్నిగ్ధాం దయేథా ఇమామ్.

మ. నను మోహాబ్ధిని మగ్నఁ జేసి యటు పై ♦ నాస్వాంతము౦ గొన్న యో
వనజాక్షా యను మాయవాడ యను బిం ♦ బప్రఖ్యదంతచ్ఛదా
యను సహ్యప్రభవాంబువర్ధితవన ♦ శ్యామేద్ధరంగప్రియా
యను చక్రాబ్జగదాసిచాపవిలస ♦ ద్ధస్తా యను న్సారిసం
ఘనిషేవ్యాంఘ్రియుగా యనన్ భుజగభో ♦ గప్రీత యీ ముగ్ధ నీ
పనుకంపామతి నేలుమన్నఁ యిది నా ♦ యత్యుగ్రపాపోత్థమా.

7. హాలతున్నంగళిన్నఁగళ్.

శ్లో. భక్తానాం సుఖద ద్విషామసుఖద త్వయ్యేవ సక్తాత్మనాం
త్రాతార్వర్ధిజలేశయాంబుధిరుచే శ్రీకృష్ణ లక్ష్మీపతే,
మత్స్యాఘూపిలశీనోదకమయశ్రీరంగధామప్రియే
త్వాలప్యాశ్రు విముంచతీయమసకృన్నేత్రే కోమలాంగీ విభో.

ఉ. ఈమృదుశీల భక్తులకు ♦ నెంతయు సౌఖ్యము శత్రుకోటి క
ష్టేమము జేయువాడ నుం ♦ కీర్తితసద్గుణ వార్ధిశాయి మ
త్స్యామయశంబరౌఘపరి ♦ షిక్తతరువ్రిజరంగమందిర
స్థేమ యటంచుఁ బల్కు దన ♦ చెన్నగు కన్నుల నీరు నించుచున్.

8. కొఴుందువానవర్గళ్కెన్నమ్.

శ్లో. గోత్రోత్క్షేపసురక్షితవ్రజవధూగోగోప దేవౌఘసం
స్తుత్యే త్యేవ విరుత్య రోదితి నమస్తే మాధవేత్యాహ సా,
ఉష్ణం నిశ్వసితం విముంచతి కథం త్వామద్య పశ్యేయమి
త్యాఖ్యాతి ప్రియరంగ కిం ను విదధే తస్యాముపాయం వద.

సీ. నిత్యసూరుల కెల్ల ♦ నేత యంచు వచించు
గోవర్ధనత్రాత ♦ గోప యనును
వెక్కెడ్చుచును జోత ♦ వెట్టు వెచ్చగ నూర్చు
నంజనవర్ణ య ♦ టంచు నుడువు

అనిమిషాక్షియుగాన ♦ నంతరిక్షము జూచు
నే తెఱంగున నిన్ను ♦ జూతు నను
సహ్యకన్యానీర ♦ సంసిక్తకుసుమోప
వనరమ్యరంగని ♦ వాస యనును

తే, గీ. నల్లగల్వలఁబోలెడు ♦ నయనయుగ్మ
మశ్రుసంతతి వర్షించు ♦ ననవరతము
లక్ష్మిఁబోలిన యీశుభ ♦ లక్షణాంగి
రీతి యిట్లుండె నే నేమి ♦ సేతు నయ్య.

9. ఎన్ తిరుమగళ్ శేర్.

శ్లో. క్రీడత్స్థాపితకంజగేహా స్పృహా రే పాపోణేశ దంష్ట్రోద్ధృతా
త్మాచక్ర ప్రహితాసురాంశజనితక్రూరోక్ష నీళాపతే,
పుష్పారామసుగంధబంధురనభ స్స్వజ్జుష్టరంగప్రియ
త్వాం ధ్యాయత్యనిశం కదాఽన్తమయా తే శోక స్తదీయః ప్రభో.

శా. పారావారతనూభవాశ్రయమలస ♦ ద్వక్షా యనున్ జీవితా
ధారా కొమ్మన నెత్తినట్టి ధరణీ ♦ తన్వంగికి న్నాయకా
శ్రీరామామణి బోలు నీళఁ గొనని ♦ స్త్రీంశోక్షసంహారకా
వారిప్రాప్తతరంగచంద్ర యిఁక నీ ♦ వామ న్గటాక్షింపవే.

10. ముడివివళ్ తనక్కొన్ను.

శ్లో. శ్రీరంగప్రియధామ పంకజభవశ్రీకంఠనిత్యోఘుప్రా
ప్తీరీనిత్యనివాసదీక్షిత హరే త్రైలోక్యరక్షాచణ,
శోకస్యాస్య నివారణక్రమమహం నావైమి నాథేత్యసా
వాక్రశ్యాంబుదనీలసుందరతనుం త్వాం ప్రాప రంగేశ్వర.

ఉ. ఈ విరహాగ్ని వేదన శ ♦ మించు నుపాయము నే నెఱుంగ నో
భావితసర్వలోక యను భగూఁడ వీ వను ♦ బ్రహ్మ వీ వనున్
జేవదలిర్ప రాక్షసుల ♦ జీరిన జెట్టి వనున్ భవత్పదద్వయీ
సేవ నెఱుంగన ట్లలరి ♦ చేరె తలోదరి నీపదద్వయిన్.

## 11. ముగిల్వణ్ణనడియై.

శ్లో. మేఘశ్యామపదద్వయాశ్రయణతో ధన్యాత్మనా మానినా
పుష్పోద్యానవిలోకనీయకురుకానాథేన కృష్ణస్తుతా,
యత్సాహస్రమతాని పద్యదశకం తస్మిన్నిదం మానవా
భక్త్యాఽభ్యస్య భవంతి హర్షజలధౌ మగ్నాః పరే వ్యోమని.

చ. జలధరవర్ణుపాదజల ♦ జాతరతాత్ముఁడు తాఁ బ్రవర్ణన
జ్జలపరిపూతరమ్యవన ♦ సంకులసత్కురుకేశుఁడౌ విని
ర్మలశఠకోపమౌని సుక♦రంబుగఁ గూర్చిన యా సహస్రమం
దలి దశకంబు దీని మదిఁ ♦ దప్పక భక్తిఁ బఠించువార లా
జలనిధివర్ణుధామమున ♦ సంతసముబ్బ వసింతు రెప్పుడు

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతే రామానుజాయ నమః.

## సప్తమశతకము—మూఁడవ దశకము.

[వెళ్ళిచ్చుళిశంగు.]

అవతారిక:—క్రింద తిరువాయిమొళ్ళిలో నీయాళ్వార్లనాయక "ఇట్టకాలి ట్టకై" అన్నట్లు మూర్ఛిల్లియుండఁగా నీమెకంటె ముందే యీమె తల్లియుఁగూడ నీమె యవస్థను జూచి చైతన్యము లేక పడియుండఁగా తల్లి యొకతె యీమెదశ ననుసంధించి దగ్గర నుండెను. "పత్తిలార్ పత్తనిన్నానే" అన్నట్లా మెతల్లిగారు పెరియ పెరుమాళ్లయొక్క అశరణ్యశరణ్యత్వము మొదలగు గుణములను సౌందర్యాది విగ్రహగుణములను వర్ణింపఁగా విని తేరి తెలివిఁదెచ్చుకొని ప్రాణములను నిలువ బెట్టుకొన్నది. గుణస్వభావము పోయినప్రాణమును మరలింపఁగల శక్తి గలది. ఈ నాయకను దిగువ తిరువాయిమొళ్ళిలో బుట్టిన మోహాతమన్ను విరిసిపోయి తెలివి వచ్చినది. తెలివి రాఁగానే విశ్లేషవ్యసనము ననుసంధింప మొదలిడినది. తరువాత వానిసన్నిధికి బోకుండ నిక నిలువలేనంత ఉత్కంఠ గలదియై తత్సన్నిధ్య లాభముచే నవసాదము నొందెను. ఇంతలో నీమె తృష్ణకు దగినట్లు దగ్గరనున్న తిరుప్పేరను దివ్యదేశమందు వేంచేసియున్న స్వామియగు 'మకరనెడుంకుళైక్కాతన్'

(మకరాయతకర్ణపాశుఁడు)యొక్క చూపులచే నపహృతచిత్తయై అతఁడున్న చోటికి బోవలెనని యుద్యోగింపగా పూర్వమువలెనే తల్లియు చెలులును యీమెను బట్టు వారుకొని "నీ కిట్టి అతిమాత్రపారవశ్యము తగదు, మనవంశమున కిది అపయశోదాయకము"ని బోధింపగా నామె- 'యిక మీమాటల గట్టిపెట్టుడు. మీమాటలవలన బ్రయోజన మేమియు లేదు. వానిచే నపహృతచిత్త నైతిని గావున నిచట నిలువజాలను. నన్ను మీ రచటికి దీసికొని పొండు ' అని బదులు పలికెను. అనంతర మీమె చెలులు తల్లియు ' నిదేనా నీనిశ్చయము' అని యడుగగా 'నిదియే నా నిశ్చయము. అమ్మవారు పెరుమాళ్ల వెనుక నరణ్యమునకు బోయినట్లు నే నాస్వామి విచ్చేసియున్న చోటికి వెళ్లక మానను. మీరు నన్నచటికి దీసికొని పోయి విడువు' డనగా వా రందుకు సమ్మతింపలేదు. అపు డీచిన్నది తానే యొంటరిగా నచటికి బోవ నమకట్టెను. మనకు శబ్దాదివిషయములనుండి యింద్రియములను మరలింప శక్యము గాన ట్లీయాళ్వార్లను భగవద్విషయమునుండి మరలింప శక్యము కాదు. మనది కర్మమూలమయినది. వీరిది భగవత్కటాక్షమూలకము. తాయారు (తల్లి)మాటలుగా వచ్చిన వన్నియు నాళ్వార్లకు కలిగిన దశావిశేషము. నాయికగా జెప్పిన మాటలు వీరికి బుట్టిన అవస్థావిశేషము. అందులో నిషేధించుచున్న తల్లి ద్వారా వచ్చినమాటలు స్వరూపప్రయుక్తమైన పారవశ్యము నుపాయము చెడిన యెడలఁ జేయున దేమున్నదని మనకు బోధించుచున్నవి. ఉపాయము అతడే గావున పారవశ్యము స్వరూపమే యగు నని నాయికతాత్పర్యము. కాఁగా నీ రెండుముఖములచే జెప్పబడిన యీరెండధర్మములను ఆళ్వార్లనుసంధించిన ప్రకారము చెప్పబడినది. దీనిలో " శెంగనివాయిన్ తిఱత్తదాయున్ " అనునది ఉయిర్పాట్టు.

## 1. వెళ్లైచ్చురిశంగు.

శ్లో. ధృత్వా చక్రం సశంఖం సరసిజనయనస్సర్వలోకైకనాథో
మత్వాంతేతార్క్ష్యవాహంనయతిముహురితిజ్ఞాతుమేతన్నశక్తాః,
యత్ర శ్రీనామనామ్నాం క్రమనుపరతశిశుక్రీడనస్యోత్సవానాం
వేదస్యాపి ప్రఘోషో బధిరయతి దిశస్తాం పురీమద్యయాయామ్.

మ. అరిశంఖంబులఁ దాల్చి పంకరుహపత్రాక్షుండు నాస్వాంతమం
దురగారాతిహయంబు నెక్కి వడితో నుత్సాహముప్పొంగ ద్రి
మ్మరు చందంబును మీ రెఱుంగరు జగన్మాన్యావనీదేవవే

దరవంబు న్విమలాస్త్రబద్ధవిశిఖా ♦ ధావచ్ఛిశుక్రీడనో
ద్ధురనాదంబు సురాలయోత్సవరణ ♦ త్తూర్యస్వనంబు న్నిరం
తరమై యెప్పుడు నామసంజ్ఞకపురిన్ ♦ దర్శింప నేఁ బోయెదన్.

## 2. నానక్కురుంగుఴల్.

శ్లో. సౌగంధ్యప్రచురాలకాన్తవదనాస్సఖ్యో రమావల్లభే
సక్తం చిత్తమిదం వశే న మమ తద్రోద్ధుం న శక్నోమ్యహమ్,
భృంగోద్ఘుష్టసుమద్రుమాళివిలసచ్ఛ్రీనామపూర్వాసిన
శ్శ్రీకాన్త్రశ్రాభతనూజ్జ్వలస్య నృహరేర్బింబాధరే స్నిహ్యతి.

శా. సౌరభ్యోత్కటకేశపాశ సఖి కం ♦ సద్వేషణాకర్షణా
ధీరంబైన మనంబు నిల్ప నిఁక శ ♦ క్తిక్షీణనై యుంటి త
ల్లీ రాత్రిందివ మిద్ది పోయి భ్రమరో ♦ ల్లీఢాతిసౌగంధ్యపు
ష్పారామావృత నామసంజ్ఞకపురం ♦ బందుండు తద్దేవు శృం
గారంబందు నిమగ్నమయ్యె వశమే ♦ కాదమ్మ వారింపఁగన్.

## 3. శెంగనివాయిన్.

శ్లో. ఆశాన్తోత్సవతూర్యనాదముఖరశ్రీనామపుర్యాశ్రిత
శ్రీశస్యాధరబింబకాంతివిభవే తద్రత్నమాలే తథా,
చక్రాబ్జాదిసరాయుధోజ్జ్వలకరాంభోజాతయుగ్మే సరో
జాతాక్ష్ణోర్మమ మానసం రతిమధాత్సంత్యజ్య లజ్జాం సఖి.

మ. సకియా నా మన మెప్పు డుత్సవసమా ♦ జప్రాజ్యకోలాహల
ప్రకటంబై యలరారు నామపురిలో ♦ వర్తిల్లు సర్వేశునం
గకసౌందర్యవిభూషణావళుల ల ♦ గ్నంబౌచు నిర్లజ్జమై
వికృతిం బొందె నికేల మీవచనము ♦ ల్వేవేలు చాలింపుఁడీ.

## 4. ఇఴందవెమ్మామై.

శ్లో. తన్మృష్టం భవదంగకాన్తివిసరం ప్రత్యాహరేయం క్షణా
దిత్యాఖ్యాయ తదంతికం గతమిదం మన్మానసం నైతి మామ్,

ఏకాకిన్యహమబ్ధిఘోషసదృశశ్రుత్యుచ్చపాఠధ్వన
చ్ఛ్రీనామాఖ్యపురీశితుర్నిపతితా మాయాస్వహం కిం రుషా.

శా. తల్లీ దానవవైరిముచ్చిలిన సౌం ♦ దర్యంబు నేఁ జెత్తు నం
చుల్లాసంబున జన్న నామనము దే ♦ వోత్తంసుఁ గూడె న్మదీ
యోల్లాపంబు వినంగ నెవ్వ రిట సా ♦ మోద్యత్స్వరశ్రోత్రియా
ఘోల్లోకోజ్జ్వలనామనామకపురీ ♦ యోగ్యాలయు న్మాధవున్
పల్లీనోత్సుని జూడఁ బోయెదను నా ♦ బాధావిరామం బగున్.

5. ము నిం దు శ గ డ ము దై త్తు.

శ్లో. కోపేనాహత్య గంత్రీంవిషమయదనుజాత్క్షీరమాస్వాద్య గత్వా
మధ్యే భూజద్వయస్య ప్రహాతదధిషలో వత్సవిక్షేపణాద్యైః,
తస్మిన్నద్రిక్తరాగాత్పరిగళితభయాప్రీకమాస్తే సునో మే
తస్యశ్రీనామనామ్నీంనయతిపురమరంబ్రూతనిర్భర్త్స్యమాంకిన్.

మ. శకటంబు న్భరిమార్చి పూతనవిష ♦ స్తన్యంబు భక్షించి భూ
జకము ల్గూల్చి కపిత్థవత్సులను వే ♦ జక్కాడి గోపవ్రజం
బకృతోపప్లుతి గాచినట్టి నవకం ♦ జాక్షుంను మల్లజ్జ దా
గిరురింతస్ హరియించెనో చెలియ మీ ♦ కిన్కన్ ఫలం బేమి స
న్నిక నారామపరీతనామపురిలో ♦ నింపొందగాఁ జేర్పుడీ.

6. కా లం పె ర వె న్నె.

శ్లో. నీలాబ్దాభతనుర్విభుర్మమ పురస్తిష్ఠేత్సదా నో కర
ప్రాప్యస్తద్విషయా మమాధికతరా ప్రీతిస్సముద్రాదపి,
ఉగ్రాఖ్యం తద్వసతిం మహీసురసవప్రారంభపూతస్థలీం
మాతర్మాం నయ సర్వసస్యమహితాం శ్రీనామనామ్నీం పురీమ్.

మ. జలదశ్యాముఁడు చేతికందక యె నా ♦ సాన్నిధ్యముం జేరు నా
వల పన్నన్ జలరాశికంటె నధిక ♦ ప్రాగ్భారమై యొప్పు ను
జ్జ్వలధాత్రీసురతన్యమానసవప ♦ ప్రోత్థధూమచ్ఛటా

సీ. సఖులార నాయడ ♦ సదయలై వర్తిల్లు
తల్లులార సతీమ ♦ తల్లులార,
విరహాగ్ని వేదన ♦ వేగుచుండెడు నాకు
నిర్యోడ మీపల్కు ♦ లింపుగాఁవు,
ననువీడి నామనం ♦ బనయంబు నళినాక్షు
నందె సక్తంబయ్యె ♦ నేఁడు కేమిఁ,
జేయుదు నిత్తఱి ♦ సింధుసంవేష్టిత
వసుమతి మ్రింగిన ♦ యమసమాయసురుని.

తే. గీ. చేతనులగావ నయతోడ ♦ జేరినట్టి
పూతజలపూర్ణ కేదార ♦ భూషితంబు
వేదభాసురభూసుర ♦ వితతియుతము
నాముపురి కేగ నెంచితి ♦ నాసఖులార.

10. నగరముంనాడున్.

శ్లో. సఖ్యో భూధరమస్తకోన్నతమహాసౌధాళిరాజత్తటే
శ్రీనామాఖ్యపురే వసన్ జలధరశ్యామః పయోజేక్షణః,
రాజత్కుండలమండితశ్రుతియుగో దేవశ్చిరాన్మే మనో
హృత్వాఽగాద్విచినోమి దేశనగరగ్రామేషు తం నిస్త్రపా.

మ. ధరణీభృచ్ఛిఖరోచ్చరత్నమయసౌ ♦ ధగ్రామరాజత్పురీ
వరమౌ నామపురిన్వసించు సజలా ♦ బ్దస్పర్ధిగాత్రుండు నా
భరణాలంకృతసర్వగాత్రుడు మరు ♦ ద్వంద్యుండు నాస్వాంతమున్
హరియించెంజెలితొల్లివాని నెమకన్ ♦ హాపట్టణంబుల్ గ్రామోద్యదన్.

11. ఊళ్లశోధనము.

భిన్నాఖ్యాకృతికర్మణాం సముదయం బిభ్రజ్జగద్రక్షిణాం
కుర్వాణాం ప్రతికల్పమబ్జనయనం స్తుత్వా శఠద్వేషిణః,
సాహస్రీంవ్రతనోచ్ఛ్రయాం నిరుపమాంతిస్యాంనాగేనానమప్రా
ర్వాస్తవ్యస్య శఠన్నిదం పిం దశకం కైంకర్యనిష్ఠోభవేత్.

చ. ప్రతియుగమందు భిన్నమగు ♦ రమ్యగుణంబులు నామరూపక
ర్మతతులు దాల్చి లోకముల ♦ రక్షణసేయు హరిన్ స్తుతించి స
ద్వ్రతుఁడు శఠారి కూర్చిన ప్రబంధమున న్వినులార్థశబ్దగుం
ఫితమయి నామసంజ్ఞపుర ♦ విష్ణునివాసముఁ జెప్పునట్టి యీ
సుప్రమితపంచకద్వయము ♦ గూఢముగాఁ బఠియించువారికిన్
సతతము రమేశుకింకరత ♦ సంధిలుఁ బ్రీతియవార్యమై తగన్.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతే రామానుజాయ నమః.

సప్తమ శతకము — నాల్గవ దశకము.

(ఆళి యెళ.)

అవతారిక :— ఈ యాళ్వార్లు భగవద్విషయము ననుభవించుచున్నట్లు క్రింద తిరువాయిమొళిలోఁ జెప్పబడినది. క్రింద వీరికిఁ గలిగిన యవసాద మొకటి యిచ్చి మాన్పుటకు గాని యొకరు నివారించుటకు గాని శక్యమైనది గాదు. వీర విషయమై యిఁక నేమి చేయవచ్చునని యాలోచించి యీశ్వరుడు అంతకంటె వీర విషయమై చెయ్యవలసినది మరేమియు లేదని తలఁచి తాను పూర్వము నొనర్చిన విజయపరంపరలను గనబడునట్టుగాఁ జూపి హర్షమును బొందించుచున్నారు. వానినుపయోగించునపుడు తాము కావలెననియు వాని నుపయోగింపనపుడు తాముకూడ నక్కర లేదనియుఁ దలంచెడు "వశ్యవ్యములగు" నందుఁ బ్రతిపాదింపబడిన యాళ్వార్లే కదా వీరు. వీరు తమకు నష్టము గలిగినను ఈశ్వరునికి మేలు చేయువారు. సర్వేశ్వరుడు వీరిప్రకృతి నెఱింగినవాఁడగుటచేఁ దన విజయాపదానముల నన్నింటిని గనపర్చి సమాధానము చేయగా వాని ననుభవించి సంతసిల్లిరి. ఈశ్వరుడు మొదట వీరి కావిజయాపదానముల నన్నింటిని సాక్షాత్కరించుటకుఁ దగిన సామర్థ్యము నొసంగి తరువాత భూతకాలమందు జరిగినవానిని సమకాలమందునవలెనే ప్రత్యక్షవిషయముగాఁ జేసి కనపర్చెను. క్రిందటి "మారునిగ్గరిలై కుక్కన్" అనునది ఈయిర్వాటు.

4. నాథమెట్ల.

శ్లో. కాలం ముహూర్తఘటికాదిమయం ధరిత్రీ
వాయ్వాదిభూతనిచయం శశిభాస్కరాదీన్,
భూభృద్గణం జలనిధీనిహ యద్ధిచాన్య
త్సర్వం జగార విలయే హరిరస్మదీశః.

తే. గీ. కళ ముహూర్తంబు కాష్ఠ నా • గలుగుకాల
మవని మారుత సలిలాన • లాదికంబు
సకలకులపర్వతంబులు • చంద్రసూర్య
తారకావళి లయమందు • దనుజవైరి
మొసవె నొకముద్దగా నెంత • మేటి యతఁడు.

5. ఊనుడైమస్లర్.

శ్లో. నాథస్య భారతరణేఽర్జునసారథిత్వే
వీరౌఘపాతనినదో నృపముక్తరావః,
సంగ్రామవీక్షణకుతూహలినాం సురాణాం
స్తోత్రధ్వనిశ్చ సమభూత్తుముల స్తదానీమ్.

తే. గీ. వీరభటకంఠకర్తన • ఘోరరవము
శౌర్యవీర్యాఢ్యవార్యరా • జన్యభీతి
జనితరావంబు నంబర • చరసుపర్వ
జాలనుతిఘోష మొదవెను • శౌరిభార
తాజిసారథ్య మొనరించు • నవసరమున.

6. పోర్త్రదుమెలింద.

శ్లో. మాయామృగాధిపతనోర్మధుసూదనస్య
సాయంనిశాచరవధే సప్రవదస్రపూరమ్,
సర్వస్య చాతనుత విస్మయమద్రిశృంగో
చ్ఛేదైకవిక్రమనిధిర్మృగరాడివాత్ర.

మ. కనకక్ష్మాధరశృంగమం దతులవి • క్రాంతిస్ఫురచ్ఛౌర్యభీ
ష్మనినాదంబున రేగి సింహము విని • శ్శంకంబుగాఁ దత్కుభృ

ఘ్నసకూటంబుఁ బగల్చున ట్లసురవ ♦ క్షఃపీఠి ఖండింప ద
త్తనునిర్గచ్ఛదసృగ్ఝరీప్లుతముగాఁ♦దాఁ జేయుడే లోకమున్.

7. మా రు ని రై.

శ్లో. బాణానలే దశముఖస్య పురే హుతే స
త్యుర్వ్యాం నిశాతశరఖండితరాక్షసౌఘాః,
పేతుర్మహీధ్రశిఖరా ఇవ వారిరాశిః
పూర్ణోఽసృజా నివవృతేచ నదీముఖేషు.

తే. గీ. ఈశుఁ డిల రాముఁడవతార ♦ మెత్తి లంక
బాణకీలిశిఖాతతి ♦ భస్మముగనుఁ
జేయ రాక్షససముదాయ ♦ కాయనిర్య
దధికలోహితపూరంబు ♦ నంబునిధుల
నిమ్నగాజాతమును జెంది ♦ నించె నపుడు.

8. నే ర్ శ రి ం దా న్.

శ్లో. కృష్ణేన జన్యభువి బాణభుజాసహస్ర
సంవ్రశ్చనే శరజనిః ప్రపలాయితోఽభూత్,
భీత్యా కృశానురభజత్కృశతాం త్రినేత్రో
నేత్రే పిధాయ సమరాంగణతోఽపయాతః.

తే. గీ. వాసుదేవుండు బాణుని ♦ బాహువనముఁ
జక్కఁ జేసిన సమయాన ♦ శంకరుండు
బీరముడివోవ బరచెఁ గు ♦ మారకుండు
కాందిశీకత నొందెను ♦ కలగి భీతి
నగ్నులును శాంతతేజంబు ♦ లయ్యె నపుడు.

9. అ న్ను మ ణ్ణే ర్.

శ్లో. సర్వేశ్వరః క్షితిమరుజ్జలపావకాభ్ర
శైలాదికానితరవస్తుచయాన్ససర్జ,
తారేశపద్మహితబుక్షకదంబకంచ
దేవాదికానరరచత్ప్రథమం జగచ్చ.

తే. గీ. చక్రి సృజియించెఁ దొలి భూమి • జలము గాలి
నాకసము నగ్ని నద్రిల • నంబునిధుల
నర్కచంద్రాదితేజఃప • దార్థములను
నాకివర్గంబు మర్త్యుల • లోకములను.

## 10. మే య్ ని ర్రై వే ర్.

శ్లో. వృష్టిం యదా నిరసితుం హరిరుజ్జహార
గోత్రం తదా పశుగణా వివిశుస్తదధస్తాత్,
కూలంకషాస్సమభవన్సకలాశ్చ నద్యో
లీనంచ గోపకులమస్య గిరేరధస్తాత్.

తే. గీ. నిజమఖవిఘాతకుపితుఁడై • నిజరేశుఁ
డతులజంఝానిలంబున • నధికపీడ
నొనగఁ గృష్ణుండు గోవర్ధ • నోద్ధరణము
సలిపి గోపకగోవత్స • సమితిఁ గాచె.

## 11. కు న్న మె డు త్త పి రా న్.

శ్లో. గోవర్ధనోద్ధరణరక్షితగోపసంఘే
నందాత్మజే రతిహ్రదా శతవైరిణా యత్,
తేనే సహస్రమమలం దశకం కిలైత
త్తస్మిన్పఠన్ విజయమృచ్ఛతి మానవోఽత్ర.

తే. గీ. కుధరమెత్తిన గోపాలుఁ • గొలుచు భక్త
వరులలో నొక్కఁడౌ శత • వైరివరాని
ధరను గూర్చిన వేయిప • ద్యములలోన
నీపదింటినిఁ జదువువా • రేపుమీర
భవజయంబును బడయుదు • రవనియందు.

శ్రీమతే శతగోపాయ నమః.

శ్రీమతేరామానుజాయనమః.

సప్తమ శతకము—ఐదవ దశకము.

[కర్పూరిరామపిరాన్సై.]

అవతారిక :—ఆళ్వార్లు క్రిందతిరువాయ్మొళ్లియందు సర్వేశ్వరుని విజయాపదానముల ననుభవించియున్నారు. అవియన్నియు నాశ్రితార్థమై వాఁడు చేసినవి. వాఁడీచేతనులకొరకు పాటుపడుచుండ వీరు బాహ్యవిషయప్రావణ్యముఁ గలవారగుచున్నారని మీ గాశ్చర్యపడుచున్నారు. దక్షిణమున కేకాంతమయిన జన్మము లెత్తిన ప్రకారమును తనస్వరూపరూపగుణాదులను పరాయత్తముగాఁ జేసిన ప్రకారమును దానికి మూలమైన కృపనే తనకు శరీరముగా గలవాఁడై యున్న ప్రకారమును కృపా కార్యమైన వ్యాపారములను అనుసంధించి “ అపవరకే హిరణ్యనిధిం నిధాయ ఉపరిసంచరంతో నద్రక్ష్యంతి ” గదిలో హిరణ్యనిధి యున్నదని యెఱుఁగక మీదమీద సంచరించువారివలెనే యీసంపదను వాఁడు తమకధీనము చేసియుండగా సంసార్లు బాహ్యవిషయములచేఁ బ్రొద్దుఁ బుచ్చుచున్నారని యాళ్వా ర్లాశ్చర్యపడుచున్నారు. “ పేరెయిల్ శూల్ కడల్ తెన్నిలంగై శెత్తపిరాన్ (పెద్దప్రాకారములచేతను సముద్రముచేతను చుట్టబడి దర్శనీయమైన లంకాపురమును సంహరించిన స్వామి-7-3-7) అనియును. “ మారు నిరైత్తిరెక్కుంశరంగళ్ (7-4-7 ఎదురుపడి యెదురుకొని ఘోషించుచున్న బాణములు) అనియును క్రింద ప్రస్తుతమైన శ్రీరామవృత్తాంతము ననుసంధించి యాహూగణముగా నవతారముల నన్నిటిని యనుసంధించినారు. ఇతరావతారప్రావణ్యముఁ గలవారు కూడ రామావతార ప్రస్తావము రాగా “ శ్రీరామచంద్రుఁడు మనస్సునకతిభోగ్యుడని ” చెప్పుదురు. శ్రీభట్టరువారికి శ్రీరామావతారమందు హెచ్చుపక్షపాతమని విని దానిని చాలనఁ జేయుట కొకనాఁడు శిరియాత్తాన్ “ అయ్యా ! పెరుమాళ్లకు సకలసద్గుణములున్నను మెడలో చీటిగట్టి దూతగాఁ బోన్కు ” అని చెప్పఁదగిన శ్రీకృష్ణుని సౌలభ్యము లేదే అని నుడువఁగా నందుకు భట్టరు- “ అదికాదు సుమండీ వీరి మెడలో చీటిగట్టి దూతగా వెళ్లుమని చెప్పగలపాటివా రెవ్వరును లేకపోయిరి. రాజ్యమును కిరీటమును పరిహరించి జటావల్కలములను ధరించి యరణ్యమునకుఁ బొమ్మనఁగాఁ బోయిన స్వామి దూతగాఁ బొమ్మనఁగాఁ బోయి రారా? మీ రరణ్యమునకు వెళ్లినను “ యత్ర నూక్తం దురుక్తంవా సమం స్యాన్మధుసూదన ” అన్నట్లున్న దుర్యోధనగోష్ఠికి వెళ్లదగిన వారుకారు. పాండవులకయినూళ్లు చాలునన్న వార్తను నూదిపట్టినంత ప్రదేశమునైన నేనియ్యనన్న దుర్యోధనుని వార్తను తారతమ్య మెఱుగని గోష్ఠిలో

కృష్ణుఁడు వెళ్లి ప్రవేశించెను. రామావతారమందు దూతగా వెళ్లిన తిరువడియొక్క అతిశయమును తమ హృదయమం దుంచుకొన బట్టిగదా శ్రీకృష్ణావతారమందు "పిన్నోర్ తూదాదిమన్నర్క్కాగి పెరునిలత్తార్ ఇన్నార్ తూదనెన నిన్నదు" అన్నట్లు జగత్ప్రసిద్ధముగా పాండవదూత ఆయెను. దీనిలో మొదటిపాశురమే ఉయిర్పాట్టు.

## 1. కర్పార్.

శ్లో. స్వాయోధ్యానగరీనివాససుకృతా ద్ధన్యా నశేషాంశ్చర
స్థాస్నూన్ప్రాణిచయాన్నినాయ కృపయా యస్స్వీయధామ ప్రభుః,
తం రామం రఘువంశవార్ధిశశినం భక్తామరానోకహం
ముక్త్వా కేఽన్య ముపాసతే బుధవరా నిశ్శ్రేయసాయాత్మనః.

శా. వైరాగ్యంబును భక్తి బోధములు ర◆న్వొందైన లేనట్టి ని
స్సారంబైన తృణాళికిన్ క్రిములకున్ ◆ సాకేతవాసైకనిష్ఠా
రాధ్యత్వనిభంబున న్నిజపదం ◆ బామోదితుండై యిచ్చి వి
స్తారంబైన యశస్సు గాంచినమహా◆దారున్ ఘనశ్యామునా
శ్రీరాము న్భజియించువా రితరులన్ ◆ జేకొందురే యెన్నఁడున్.

## 2. నాట్టిల్పిరందవర్.

శ్లో. భక్తత్రాణపరోఽవతీర్య జగతి ప్రాప్తశ్రమో మర్త్యవ
ల్లోకా నర్దయతః ఖలాన్ దితిసుతా నన్విష్య నిర్మూల్య తాన్,
యః క్షేమం విదధాతి లోకవితతే ర్ముక్తిప్రదానాదిభి
స్తం నారాయణమాదిదేవమనఘం ముక్త్వా కుతోఽన్యోఽవితా.

శా. ఈలోకంబున బుట్టి దుస్సహములౌ ◆ నెన్నో మహాబాధలన్
జాలిం బొందియు లోకకంటకుల ర◆క్షస్సంఘముం గూల్చి స
జ్జాలార్తి న్నిరసించి ప్రోచి మరల ◆ న్స్వస్థానముం జేరె న
న్నాలాపంబు నెఱుంగువారు దశకం◆ఠారాతి వర్జించి కా
కోలప్రఖ్యుల నన్యదైవతముల ◆ న్గొల్వంగ మేకొందురే.

## 3. కేళ్పార్గళ్ కేశవన్.

శ్లో. శ్రోత్రశ్రోత్రతుదుస్సహైః పరుషవాగ్జాలై ర్నృపస్యాధ్వరే
నిందంతం శిశుపాల మస్తధిషణం దీర్ఘం స్థితం శాత్రవే,

యః కారుణ్యవశా న్నిజాంఘ్రి మనయ త్తస్యైవ కేశిద్విష
స్సత్కల్యాణగుణా న్విహాయ సుధియ శ్శ్రీణ్వంతినాన్యత్పరమ్.

మ. వినువార ల్చెవి మూసికొం చవలకు న్వేవేగ బోవన్ జిరం
తనవైరంబున దుశ్శ్రవంబులగు నిందావాక్యము ల్బల్కు దు
ర్జనుడౌ నాశిశుపాలు నంతమున తన్సాయుజ్యము న్గూర్చి ప్రో
చిన లక్ష్మీశుని కీర్తిదప్ప విబుధుల్ చింతింతురే యన్యమున్.

4. త స్మై య రి బ వ ర్.

శ్లో. సష్టే పురా చిదచిదాత్మకభూతసర్గే
శూన్యే లయే సృజనహేతుమపో విరచ్య,
సంకల్పతః ప్రథమ మబ్జభవం తతోన్య
ద్వ్యస్సృష్టవాన్మునిగణైశ్చ స ఏవ చింత్యః.

చ. సురనరతిర్యగాదివిధ సూచితసర్గము శూన్యమైన య
త్తఱి జలమున్ సృజించి యట తామరసానను జేసి మున్ను రూ
పరిన పదార్థజాతమును బాగుగ గ్రమ్మర సృష్టిజేయు నా
పురుషవరేణ్యుతత్త్వమును బుద్ధి నెఱింగినవారు వానికే
నిరతము దాసులౌదు రిల నేత్రముల న్గననొల్ల రన్యులన్.

5. శూ ర్ల ళ్ శి ం ది క్కి ల్.

శ్లో. గంభీరపాథసి నిమగ్నతనుం ధరిత్రీం
యో దంష్ట్రయా విధృతవాన్ ధృతకోలరూపః,
తస్యావతారగుణకర్మసు సక్తచిత్తా
వాంఛంతి నాన్య దపహాయ పదం తదీయమ్.

మ. ప్రళయాంభోధినిమగ్నధాత్రి నిజదం ష్ట్రాకోటిచే నెత్తి ని
శ్చలత న్నిల్పిన దంభదంష్ట్రి పరమా శ్చర్యైకతాను న్వాని
ర్మలచిత్తంబున జింతసేయు మనుజుల్ మాన్యంబులౌ తత్పదం
బుల నెక్కాలము నాశ్రయింతు రితరంబు ల్వీడి ధన్యాత్ములై.

6. కేట్టు ముణర్న్దవర్.

శ్లో. అశ్రాన్తౌదార్యరాజద్బలిదనుజబలాక్రాన్తధిష్ణ్యైస్సురౌఘై
ర్భక్త్యా సంప్రార్థిత స్తత్పరిభవమఖిలంమార్ష్టుకామో దయాళుః,
ధృత్వామాయావటోర్వ్యుః ప్రశమయుతతనుంయాన్విలాసాన్వితేనే
తాన్ జ్ఞాత్వాధ్యాయిన స్తత్పదయుగళరతా నేతరాన్సంశ్రయంతే.

శా. అశ్రాన్తామితదాతృతాజనితది • గ్వ్యాప్తాచ్ఛకీర్తిచ్ఛటా
సశ్రీకుండు బలీంద్రు డెల్లసురలన్ • సంపీడ నొందింపగా
నశ్రీయంబని వామనుండయి జగం • బాత్మాంఘ్రివిక్రాన్తిచే
నిశ్శ్రీకుం బలిఁ జేసి దేవతతికి • న్నివ్వ న్వస న్నాపు నా
శ్రీశ్రీనాయకు దప్ప వేరొకని జే • జేగా బుధు ల్గొల్తురే.

7. కండుం తెళిందుమ్.

శ్లో. దీర్ఘాయుఃప్రాప్తికామం మధుపగణరవోద్ఘుష్టమాల్యం మృకండోః
పుత్రం రుద్రేణ నీతం స్వసవిధ మధికప్రీతియుక్తోఽనుగృహ్ణన్,
కృత్వా జైవాతృకం తం వ్యతనుత నికటస్థాయినం యోమహాత్మా
తస్యైతద్ జ్ఞాతవంతో జగతి న హి భజంత్యన్యదేవాన్వినాతమ్.

చ. మధుకరఘుష్టమాల్యపరి • మండితదేహు మృకండుజర్షికిన్
విధుధరు డాయు వియ్యుమని • వేడిన నంత చిరాయువిచ్చి స
న్నిధి నెడబాయకుండ దన • నెయ్యునిగా దయజూచినట్టి యా
విధము నెఱుంగువారు మన • వెన్నునిదప్ప మఱొక్క దైవమున్
విధిజెడియైన గొల్వరని • వేరుగ జెప్ప నికేల వాదముల్.

8. శెల్లవుణర్న్దవర్.

శ్లో. తప్త్వా సుదుశ్చరతపో వరదానదృప్తం
ఘ్నంతం హిరణ్యకశిపుం క్రతుభుక్కదంబమ్,
యో దంభకేసరివపు ర్నిజఘాన తస్య
కీర్తిం విహాయ విబుధాః ప్రవదంతి నాన్యత్.

చ. తప మొనరించి పద్మజుని • దర్పితుజేసి వరోద్ధతిన్ త్రివి
ష్టపగతులౌ సుపర్వులకు • జాల గలంతనొనర్చి ధాత్రిలో

రిపుకథలేని దైత్యవరు • రీతి నెఱింగి నృసింహుఁడై నిశా
తపటునఖాగ్రఖడ్గముల • దద్దురువక్షము జీరినట్టి మా
యాపుపని విన్నవారు భువి • నన్యకథ ల్విననొల్ల రెంతయున్.

9. మా య మ రి బ వ ర్.

శ్లో. దాయందాతుంనిషేధ్యాన్ ఖలమతిసచివాన్ ధార్తరాష్ట్రాన్విజేతుం
కర్తుం పంచాపి రాజ్ఞ స్సమరజయరమావల్లభాన్స్వాంఘ్రిభక్తాన్,
కుర్వన్సారథ్యగాత్యేతదరినృపచమూనాశయిత్వాయయాస్వం
ధామేత్యేత ద్విదిత్వా విబుధతతిరముం సేవతే జాతు నాన్యమ్.

ఉ. దాయము మీకు లేదనుచు • దబ్బరలాడెడు ధార్తరాష్ట్రుల
న్యాయపరుల్ నశింప దన • యాప్తులు పాండుసుతు ల్జయింపగా
బాయక యుద్ధభూమి నరు • బండిని దోలెడు యంతయాచు సై
న్యాయువు గంటిచే మెసవు • నచ్చెరువెల్ల నెఱుంగువారు శ్రీ
నాయకు నంఘ్రిపద్మములె • నమ్మిక గొల్చెదువార లిద్ధరన్.

10. వా ర్తై య రి బ వ ర్.

శ్లో. జన్మవ్యాధిజరామృతీః ప్రశమయ న్నైష్కవల్యవాంఛాం హరన్
ప్రాపయ్య స్వపదాబ్జమేవ మధికక్షేమంకరస్య ప్రభోః,
తాస్తాః క్షేమవిధాయినీ రుపకృతీ స్సంస్మృత్య బోధోజ్వలా
స్తస్యాంతో క్తివిదో విహాయ పరమం తం నాన్యదైవం విదుః.

చ. జనిమరణామయాదిభవ • సంజనితాఖిలదుఃఖపుంజమున్
దనకృపచేత బోనడచి • తద్ద నిజాంఘ్రియుగంబు జేర్చు నా
ఘనుఁ డొనరించునట్టి యుప • కారములెల్ల నెఱుంగువారలా
ఘననిభగాత్రు దాసులయి • కాంచెద రిమ్ముల మోక్షసంపదన్.

11. తె ళి వు త్తు పి వి న్ని.

శ్లో. స్వాంఘ్రిద్వంద్వైకనిష్ఠాప్రవిమలమనసాంముక్తిదే వాసుదేవే
భక్తానామగ్రణీ శ్శ్రీశఠమథనముని ర్యత్సహస్రం వ్యతానీత్,
తస్మిన్నాథా దశైతా మృదుపదరచితా శ్శ్రద్ధయా యే పఠేయు
స్తేస్యుః ప్రజ్ఞానవిద్యోతితహృదయగుహాః పాపపూర్ణేఽత్రలోకే.

మ. హరియే మాకిక సాధ్యసాధనయుగం♦బౌనంచు స్వాంతంబునన్
స్థిరవిజ్ఞానము గల్గువారలకు ము♦క్తి న్గూర్చు సర్వజ్ఞుఁ బం
కరుహాక్షు న్నుతియించి శౌరిజుడు తా ♦ గల్యాణ మేపారగా
ధరపై గూర్చిన వేయిపద్యములలో ♦ దత్త్వానుసంధానత
త్పరముల్ పద్యము లీపదిం జదువ ద♦త్త్వజ్ఞాన ముత్పన్నమౌ.
శ్రీమతే శఠకోపాయనమః.

---

శ్రీమతే రామానుజాయనమః.

సప్తమ శతకము - ఆఱవ దశకము.

[పామరుమావులగుమ్.]

అవతారిక:— అనిష్టముల నిరసించి యిష్టముల నొసంగువాఁ డీశ్వరుఁ డొక్కఁడే గావున నాతఁడే యుపాయమని తెలిసికొన్న తరువాత పురుషార్థలాభమునకు మొర బెట్టుటతప్ప కర్తవ్యాంశము మఱేదియు లేదు. ఇట్లుకానిచో సంసారము మంచి దనే యుందురు. " అమ్మంగియమ్మాళ్ " అనునొక భాగవతుఁడీ తిరువాయ్ మొళ్ళిని విని యనుభవించి " యిందులో బ్రతిపాదింపబడిన నమ్మాళ్వార్లఆర్తి మనకు వాచామగోచరమైయున్నది " అని సాధించునట. దిగువను "అర్చియొళ్ళు చ్చుంగు " లో సర్వేశ్వరుఁడు కనబఱ్చిన విజయముల ననుభవించుట కుపయోగ ముగా నాతని యపదానముల ననుసంధించిరి. అప్రసంగములో నాతనియవతారము లను, అందుకు మూలమైన యాతనికృపాదిగుణములను అనుసంధించి 'యాత డిట్టిగు ణవంతుడైయున్నను, ప్రాప్తిగలవాడైయున్నను తాము చేతనులైయున్నను సంసారి చేతను లిట్లుచెడిపోనా' యని యాశ్చర్యమునొందుచున్నారు. బద్ధచేతనులు భగవ ద్విషయమందు వైముఖ్యముగలవారగుటచే జెడుట యుక్తమే. భగవద్విషయమం దపేక్షగల మనము చెడుట యుక్తము కాదని తలంచి యాతనియవతారములను యాతనిదివ్యమంగళవిగ్రహసౌందర్యమును అనుభవించెదమని యాలోచించి యాతఁ ణమందే ఆతని ననుభవింప లభింపకపోవుటచే మిక్కిలి యవసన్నులై సర్వేశ్వరుని పరమపదనివాసముకూడ దుర్లభమై తోచునంత ఆర్తితో మొఱబెట్టుచున్నారు. దీనిలో " కండెయ్దుమా అడియేన్ " అనునది ఉయిర్పాట్టు.

## 1. పా మ రు మా వు ల గు మ్.

శ్లో. సర్వస్థావరజంగమాదికలితత్రైలోక్యసర్గక్రియా-
లంకర్మీణ పదాంబుజాతవిమితత్రైలోక్య భక్తావన,

పంకేజాతదళాక్ష రక్తసరసీజాతోపమశ్రీకర
త్రాతర్దాసజనస్య తే పదయుగం విష్ణో కదా ప్రాప్నుయామ్.

ఉ. స్థావరజంగమాదిసము ♦ దాయసుపూర్ణజగత్త్రయీసము
ద్భావననాభిపంకరుహ ♦ పాదసరోజమితాబ్జజాండ స
త్సేవిత కంజనేత్రకర ♦ శ్రీరమణీప్రియ నీదుపాదరా
జీవయుగంబు నేనెపుడు ♦ చేరగలాడనో చెప్పుమా హరీ.

2. ఎన్నుగోల్ శేర్వదందో.

శ్లో. పృథ్వీవాయుజలానలాచ్యుతపదప్రాణ్యాదికస్యాఖిల
స్యాన్తర్యామితయా స్థిత త్రిదశరాడ్వంద్యాంఘ్రిపద్మ ప్రభో,
ఛత్రీకృత్య మహీధరం పశుగుణస్యార్తిం సమత్కృత్తవన్
శర్వబ్రహ్మసమాశ్రితం తవ పదం స్వామిన్ కదా ప్రాప్నుయామ్.

ఉ. క్ష్మాసలిలాగ్నివిష్ణుపద ♦ గంధవహాదుల కాత్మకోటికిన్
భాసురకారణంబగుచు ♦ భాసిలు దేవ నగోద్ధృతి వ్రజ
త్రాసనివారకా స్మరహ ♦ రద్రుహిణస్తుతపాదపద్మ నే
జేసిన పాప మేమి నిను ♦ జేరగ నెన్నడు గల్గునో హరీ.

3. కాత్తవెంకూత్తావో.

శ్లో. ఉర్వీభృదుద్ధరణవారితగండవృష్టే
రుద్రాత్మభూప్రముఖలేఖచయాంతరాత్మన్,
మత్ప్రాణభూత సవిలాసమనోజ్ఞచేష్ట
సంప్రాప్నుయాం కథమహం తవ పాదపద్మమ్.

మ. అలగోవర్ధనభూధరంబు దనబా ♦ హాస్ఫూర్తిచే నెత్తి గో
కులము న్గోవుల గాచినట్టి వరదా ♦ గోవింద మాల్యాంచితా
నళినోద్భూతహరాద్యమర్త్యనివహా ♦ న్తర్యామివై యుండు నా
యలఘుప్రాణమ నన్ను జేర్చుకొనుమా ♦ యంఘ్రిద్వయీసన్నిధిన్.

4. ఎంగుత్తలైప్పెయ్ వన్.

శ్లో. అశ్రాంతస్రుతమాకరన్దలహరీతిమ్యత్సుమస్రక్కన
త్కోటీరద్యుతిరంజిత వ్రజవధూప్రాణేశ గోపాలక,

త్ర్యక్షబ్రహ్మపురందరాదిదివిజోత్కర్షస్తవాయత్త ఇ
త్యాచష్టే శ్రుతిమౌళివాక్యవితతిః క్వాహం భవంతంలభే.

మ. తులసీసగ్గ్రయమండితోరుమకుటా ♦ దోర్వీర్యవిద్రావితా
ఖిలదైత్యప్రకరా చతుర్ముఖగిరీ ♦ ట్కృత్త్రాదిప్రఖ్యాదిదే
వులు నీవే భువనంబు లీవె తలపన్ ♦ భూభృత్తతుల్ నీవె యే
వల నొప్ప న్నిను జూడగల్గుదునొ దే♦వా నీవె యోచింపుమా.

5. ఎ న్ను క్షై కో న ల నే.

శ్లో. హే గోపాలక వాసవాశ్మరుచిభృద్దేహ త్వయా నిర్మితే
శబ్ద్రాగా ప్రవణం మదీయహృదయం హిత్వా తదాస్వాదనమ్,
తేజఃపుంజమయే వికుంఠనగరే నిత్యైస్సదాసేవితం
త్వాం శక్నోతి న లబ్ధు మచ్యుత నయ త్వత్పాదమేవ ద్రుతమ్.

శా. నాగోపాలక నాసుపర్వపతిర ♦ త్నంబా భవన్నాభికం
జాగారోత్థజగత్త్రయీవితతశ ♦ బ్దాదిప్రసక్తాత్మద
న్నాగఃపూర్ణుడనైన నే నెటుల నీ ♦ యర్చిశ్ఛటాదీప్తిసం
యోగాలక్ష్యవికుంఠధాముగతు ను ♦ ద్యోగించెదర్ జూడగన్.

6. వ ం దె య్ దు మా అ టి యే స్.

శ్లో. శోణాశ్మప్రకరప్రమండిత సునాసీరోపలక్ష్మాధరం
న్యక్కుర్వన్నివ లోహితచ్ఛవిఝరీముగ్ధైర్మనోజ్ఞైః పరం,
క్షౌమోద్భాసికటీకరాంఘ్రినయనశ్రోణ్యాదిభిశ్శోభితం
బిభ్రాణంవపురాశ్రితేందిరమహం సంప్రాప్నుయాంత్వాంకథమ్.

తే. గీ. నీలమాణిక్యమందొక ♦ నిరుపమాన
రక్తమణి పూచినవిధంబు ♦ రాజిలంగ
దివ్యతనునీలకాంతుల ♦ దీప్తివలన
పీతవసనాంఘ్రినాభికం ♦ జాతచరణ
కౌస్తుభశ్రీవిశోభివ ♦ కుస్థలాక్షి
వదనరక్తాంశువితతిచే ♦ భాసమాను
నిన్ను జూడక నేనుండ ♦ నేరనయ్య
చెప్పుమా నాకు వెరవొండు ♦ శ్రీరమేశ.

### 7. ఎ న్ తి రు మా ర్బం ద నై.

శ్లో. లక్ష్మ్యాలింగితవక్షసం మృడసురజ్యేష్ఠాదిబృందారక
స్తోమస్యాత్మతయా స్థితం కిటివపుర్ధృత్వా ధృతోర్వీభరమ్,
స్వాంఘ్ర్యర్చాపరభక్తకోటిఫలదం వైకుంఠనాథం హరిం
నేత్రాభ్యామభివీక్షితుం జడమతేరప్యస్తి భాగ్యం మమ.

చ. కలుషములలేమ రొమ్మునయి ♦ గల్గినవాని హరాంబుజాతభూ
బలరిపుముఖ్యదేవతల ♦ పాలిటిభాగ్యము నుద్ధృతావనిన్
జలదవినీలగాత్రవరు ♦ సాగరశాయిని సర్వసద్గుణో
జ్జ్వలు నిను జూచు మార్గ మిక ♦ వారిరుహాయతనేత్ర చెప్పవే.

### 8. ఆ ళి మై క్కా ణ్బా రి యా య్.

శ్లో. సింహత్రస్తసృగాలసంచయ ఇవ త్యక్త్వా స్వలంకాస్థితిం
ధావిత్వా బలిసద్మగూఢవసతీన్ దైత్యాన్సుమాల్యాదికాన్,
ఆగుహ్య ద్విజరాజవాహనమరం గత్వా రణే తాన్ క్షణా
ద్యశ్చక్రేణ తతహా తం మురరిపుం వీక్షే కదాఽహం ముదా.

చ. కరిరిపు జూచి పారెడు మృ♦గంబులభంగి సుమాలిమాలియున్
వెరపున లంకగాపురము ♦ వీడి రసాతలమందు డాగగా
గరుడతురంగమెక్కి చని ♦ కాంచి సురారుల ద్రుంచినట్టియా
సురపతితమ్మునిన్ గనుల ♦ జూడగ నెన్నడు గల్గునో కదా.

### 9. కాం డుం గో లో నెం జ మే.

శ్లో. క్రూరే కర్మణి నిష్ఠితం భుజబలోత్సిక్తం రణోత్సాహినం
హత్వా పంక్తిముఖం సపుత్రసచివం తస్యానుజం తత్పదే,
కారుణ్యాదభిషిచ్య కోసలగతాన్ సర్వాంశ్చరస్థావరాన్
యోఽనైషీన్నిజధామ సూరిమహితం ప్రేక్షే కదా తం హరిమ్.

మ. బలియున్ గ్రూరుని లోకకంటకుని బా♦పస్వాన్తు నారావణున్
బొరియం జేసి విభీషణున్ దదనుజున్ ♦ బుణ్యాత్ము దద్రాజ్యని
శ్చలలక్ష్మీయుతు జేసి యాత్మధరణీ♦సామ్రాజ్యసంపన్మహో
జ్జ్వలుడై క్రిమ్మర నైజధామమునకున్ ♦ జన్నట్టి సీతాపతిన్
జలజాతాయతపత్రనేత్రుని మన♦స్సా నెన్న డీక్షించెదన్.

## 10. ఏత్తరుంవైగుందత్తై.

శ్లో. ఆహూతో ధనురాహవాయ మధురాం గత్వా గజం కంసమ
ప్యాపిష్య స్వబలేన పాండుతనయేష్వాబద్ధకామ శ్శ్రియమ్,
యో దుష్టం ధృతరాష్ట్రపుత్రశతకం సైన్యైశ్చ సాకం వ్యసుం
కృత్వా ధామ నిజం జగామ స హరిర్దద్యాద్ధి నస్స్వం పదమ్.

ఉ. గోపకులావతీర్ణుఁడయి ♦ కూరిమి గోపకులందు జూపుచున్
బాపుని గంసుఁ బోనడచి ♦ పాండునృపాలసుతుల్ జయింపఁగా
బ్రాపయి యుద్ధమందు ధృత ♦ రాష్ట్రతనూజుల జంపి లోకసం
తాపకుల న్వధించి నిజ ♦ ధామము నొందిన దేవకీసుతుం
డాపద లెల్ల బాపి మన ♦ కాత్మపదంబు నొసంగు జూడుడీ.

## 11. పుక్కవరియురువాయ్.

శ్లో. ప్రాదుర్భూయ నృసింహదివ్యవపుషా తీక్ష్ణైర్నఖాగ్రైః పురా
హంతారం సురవిద్విష స్తుతిపదై స్సంస్తుత్య కార్యాత్మజః,
యచ్చక్రే శఠజిత్సహస్రమమలం తస్మిన్ దశైకాః పఠన్
వైకుంఠాలయవాసిభి రనిశం సంవీజ్యతే చామరైః.

మ. ఘనానాకేసరియై హిరణ్యకశిపున్ ♦ గ్రూరాత్ము జెండాడి ని
ర్మోహుం దత్సుతు గాచినట్టి హరికి ♦ న్మోదంబు సంధిల్ల మో
క్షేహుండైన శఠారి చెప్పిన సుశబ్దే ♦ ద్ధప్రబంధాన న
త్యాహార్థంబుల నీపదింటిఁ జదువన్ ♦ యోషామణీసంఘము
త్సాహంబొప్పగ నూడిగంబుసలుపన్ ♦ సౌఖ్యంబుగాంతుర్దివిన్.

శ్రీమతేశఠకోపాయనమః.

శ్రీమతే రామానుజాయనమః.

సప్తమ శతకము – ఏడవ దశకము.

[ఏఱైయరావి.]

అవతారిక :— ఆళ్వార్లు క్రిందతిరువాయ్ మొళిలో "మల్లునీళ్ చ్చుడర్ తళై ప్పశెంజుడర్ శోదిగళ్" (7–6–6) అని చెప్పినట్లు సర్వేశ్వరుని విగ్రహసౌందర్యము ననుసంధించినారు. ఆ విగ్రహసౌందర్యము హృదయమందు స్థిరముగా నిలువగా దానిని భావించి భావించి యాభావనా ప్రకర్షముచే బ్రత్యక్షసమానాకారము కాగా నది ప్రత్యక్షమని నిశ్చయించి చెయ్యిజాచగ అతడు దొరకక పోవుటచే తమకు గలిగిన విరహావస్థను, సర్వేశ్వరునితో గలిసికొని యుండజాలినయొక విరహిణివాక్కులచే జెప్పుచున్నారు. సాధారణముగా లోకములో స్త్రీపురుషులకు పరస్పరానురాగము కలుగుటకు బ్రథమకారణము దృక్సంగము. తరువాత మనస్సంగసంకల్పావ్యవస్థలుపొడమును. అందవలన వీరును మొదట సర్వేశ్వరుని నేత్రసౌందర్యాకృష్టచిత్తులై దానిద్వారా ముఖసౌందర్యము ననుసంధించి తరువాత మఱికొన్నింటికొఱకు మనోరథింపగా నాక్షణమందే అవి లభింపకపోవుటచే బాధపడుచుండగా నీమెయవస్థను జూచిన చెలులు తల్లి నీకేమిబాధయని యడిగిరి. అందుకు చిన్నది అతని ముఖకమలసౌందర్యము నన్ను మిక్కిలిబాధించుచున్నదనెను. అందుపైని వారు నీవిట్లు నీ స్త్రీత్వమునకు, నీస్వభావమునకు, నాతనినాయకత్వమునకు నెంతమాత్రము తగదనిరి. కావున నీప్రలాపమునుచాలింపుమని హితముచెప్పి నిందింపగా నామె నేను మానను. ఇకమీరు నాయాశను విడుచుకొనుడని నిష్ఠురముగా బలికెను.

సర్వేశ్వరునిగుణములయందాశపడుటయు, అది మానసికానుభవమై యుండుటయు, అనుభూతగుణములను విడిచి గుణాంతరములయందపేక్షపుట్టుటయు, వాని క్రమప్రాప్తిని సహింపకపోవుటయు, అదదిగువనున్న తమస్థితిగా మాచునట్లు చేయుటయు ననునివియే యీయాళ్వార్లకు తిరువాయ్ మొళియందున్న స్వభావము.

దీనిలో "కోళిళై త్తామరైయుమ్" అనునది ఉయిర్పాట్టు.

## 1. ఏ ఱై య రా వి.

శ్లో. కిం కృష్ణస్య విలోచనే కిమథవా మృత్యుద్వయం తద్గత
స్వాన్తానామసుఖుస్మరం కిమపి తద్ జ్ఞాతుం నశక్నోమ్యహమ్,
సఖ్యః కింతు పరీత్య మాంచ పరితః ప్రోన్మీలదజ్ఞానవ
ద్దృశ్యేతే బత మాతరః పరిగతా దుఃఖేన కర్తాఽస్మి కిమ్.

మ. చపలస్త్రీల వధించు మృత్యుయుగమో ♦ చక్రాంకునేత్రంబులో
విపులాక్షీమణులార నే నెఱుగ న ♦ న్వేష్టించి సద్యస్స్ఫుటా
సుషమాంభోజముఖులిఁక జూచుకొలదిన్ ♦ నూత్నంబుగా దోఁచెడిన్
చపలాస్పర్ధిశరీరలార యెటులే ♦ సైరింతు నీదుఃఖమున్.

2. ఆ ట్టి యుం తూ త్తి యు మ్.

శ్లో. అంబా మా మతిసింధురైః పరిలపితైర్నిర్భర్త్స్య కిం లభ్యతే
మత్వా శ్వేతపరివర్ధితామరతరో శ్శాఖా కిమేషా భవేత్,
నోచే త్తత్కుసలం భవేదితి మనస్సందేహసంధాయినీ
నాసా ముష్టపయఃకణోక్షితతనోర్మన్మానసే దీపికా
జ్వాలేవాతిసముజ్జ్వలాం స్థితిమితః మాం బాధతేఽహర్నిశమ్.

చ. సురతరువల్లియో దనుజ ♦ సూదను నాసికయో యెఱుంగనో
తరుణిరో చొచ్చి నామనము ♦ నిద్ద దహింపగ నాయె నక్కటా
స్ఫురనురుదీపకార్చినలె ♦ సుక్కి ముదంగ నికేల యిప్పుడీ
పరుషపుమాటల స్సలికి ♦ బాధనొసంగుట పాడియే చెలీ.

3. వా లి య దో ్ క ని గో ల్.

శ్లో. కిం వైతద్రుచిరం ఫలం కిము మహాత్పాపం పురామత్కృతం
స్నిగ్ధం మంజులవిద్రుమస్య శకలం కింవా న జానామ్యహమ్,
నీలాంభోధరకాంతిహారివపుషః కృష్ణస్య బింబాధరో
మత్ప్రాణానపహర్తు ముద్యత ఇవ ప్రత్యాశమాలక్ష్యతే.

మ. ఫలమో విద్రుమఖండమో నను సదా ♦ బాధించుపాపంబో యా
జలదశ్యాముని సుందరోష్ఠము చెలీ ♦ సందేహమయ్యెన్మదిన్
దెలియం జాల నదేమొ సద్దెసల దా ♦ దీపించు నాప్రాణముల్
చలమొప్పన్ హరియింపనున్నదిసుమీ ♦ సాంత్వోక్తిజాలింపుమీ.

4. ఇ న్న యా ర్కే ళ్లై య ర్.

శ్లో. హంతుం క్షీణబలాన్భృశం పినమతీ కిం కార్ముకే బ్రూత మే
కామస్యోత్కుశరాసనే కిము జగజ్జైత్రే మనోజ్ఞే పరమ్,

పంచేషోరపి భావజస్య రతిరాట్త్రాతస్య కిం భ్రూయుగం
స్థిత్వా మత్సవిధే హినస్తి మదసూ న్నక్తం దివం చాజహాత్.

మ. స్మరతప్తాంబుజలోచనాసురహమా ♦ చాపద్వయంబో నిరు
త్తరసౌందర్యవిరాజితాత్మభవకో ♦ దండంబొ చూడంగ శం
బరవిద్వేషినిగన్నతండ్రిబొమలో ♦ మత్ప్రాణముల్ ద్రుంపగా
స్థిరమై నాకడ నిల్చునెప్పుడు చెలీ ♦ చెప్పంగ నింకేలనే.

5. ఎన్నునిస్నేతిగట్టుట.

శ్లో. స్థిత్వా మన్నికటే తిలోహితకచం విద్యుత్ప్రవాలీ సితా
కిం స్యాత్ప్రాణహరం మనోజ్ఞమతులం ముక్తాఫలం కింభవేత్,
బాహూత్క్షిప్తమహీభృతి స్స్మృతలవో మాం శాధతే సంతతం
కింవా సాధనమద్య న స్ఫురతి మే మత్ప్రాణరక్షావిధౌ.

చ. స్థిరతవహించి కాంతులను ♦ జిమ్ముతటిల్లతయో సువృత్తభా
స్వరములు మౌక్తికంబులొకొ♦సాససనేతునిదంతపంక్తియో
తరుణి యెఱుంగజాల నిది♦తథ్యమొ మిథ్యయొ చిత్ర మీవిధం
బరయగ నింక నాకిది ♦ యమ్మరొ ప్రాణము లెట్లునిల్చుగున్.

6. ఉయ్యిడమేఖైయుర్కు.

శ్లో. క్రీణా మాసురరక్షసాంచ మనసః పీడాకరం తేజసాం
సంస్థానం ఫణిరాజభోగశయనస్యాంభోజగేహాపతేః,
పద్మాక్షస్య సకుండలం శ్రుతియుగం మాం బాధతే సర్వదా
కిం కుర్యామిహ మాతరో వదత మే నిర్భరాత్స్యాత్కింమాంభవేత్.

తే. గీ. మకరకుండలదీధితి ♦ మండితంబు
నూతనారుణపల్లవ ♦ ద్యోతిరుచిర
మంబుజాక్షుని శ్రవణద్వ ♦ యంబు నన్ను
వదకి బాధించుచున్నది ♦ వెలదులార.

7. కాణ్మినగశైన్నయగ్గాళ్.

శ్లో. శుక్లాష్టమ్యుదితః కిమంబుజరిపుః కింవా విపత్త్మారుహా
స్స్యాదిత్యాత్మని సంశయస్య జనకః కంసద్విష శ్శ్రీపతేః,

పద్మాక్షస్య లలాటమేత్య మదనూన్నంపీడయత్యుద్ధతం
తద్బాధాం మమ మాతరిత్థమితి తే బ్రూయాం కథం పాపినీ.

తే. గీ. భుజచతుష్టయశాఖావి ♦ భూతి బొల్చు
కల్పభూరుహ మనదగు ♦ కంజనేత్రు
శుక్లపక్షాష్టమీచంద్రు ♦ శోభదనరు
ఫాలమొప్పడు బాధించు ♦ బడతి నన్ను.

## 8. కోళిత్రైత్రామహైరయమ్.

శ్లో. కాలోన్మీలితపుండరీకయుగళం వల్లీం ప్రవాళం ధను
ర్లావణ్యాస్పదమాక్తికం కిసలయం ఖండం హిమాంశోస్తథా,
ఇత్యేతైః పరిమండ్యమానమురుతజ్జ్యోతిర్వితానం హరే
రాస్యీభూయ శృణాతి మానసమలం మాతర్బ్రువే కిం తవ.

మ. నయనాంభోజము నాసికాప్రతతియున్ ♦ నద్రోష్ఠబింబంబుభ్రూ
ద్వయచాపంబును మందహాసమనుము♦క్తాదామమున్ శ్రోత్రకా
హ్వయసత్పల్లవమున్ ముఖాంబుజరిపున్ ♦హర్షంబుతోడానలం
క్రియగా గైకొని వెల్గుతేజము సము♦ద్రిక్తాత్మకాంత్యుజ్జ్వలం
బయిదీపించు రమేశుమోము ననున♦త్యంతంబు బాధించెడున్.

## 9. కొల్గిన్న కోళిరుత్రై.

శ్లో. లోకాచ్ఛాదకమేదురాంధతమసప్రాగ్భారసారోచ్ఛ్రయా
రబ్ధస్నిగ్ధసుసూక్ష్మతంతునివహాభ్రాంతిప్రద శ్రీహరేః,
రాజచ్ఛ్రీతులసీప్రసూనసురభి స్తత్కేశపాశ స్సదా
మత్ప్రాణానపహంతి వేద భవతీ నైతద్రుషా కిం భవేత్.

తే. గీ. బహుళసంతమసాఖ్యకా ♦ ర్పాసవితతి
వడికి తీసిన తంతుసం ♦ భారమేమొ
కావు శ్రీకృష్ణు కురులివి ♦ కానియెడల
దోరమా తులసిగంధంబు ♦ దోచు నెట్లు.

## 10. ని త్తి ము త్త త్తు ళ్.

శ్లో. కిం త్వం తిష్ఠసి చత్వరే ప్రవిశ తే సద్మేతి కిం నిష్ఠురం
మాం సంతర్జయత ప్రభాషటలసంఘన్నావృష్టకాష్ఠాతతేః,
మాళేనందతనూభవస్య నితరాం నిఘ్నం మదీయం మనో
మయ్యాశాం ప్రజహీహి మాతరతనుక్లైశైః కృశాయాంభృశమ్.

ఉ. అందరిలోన సిగ్గు విడ ♦ నాడి చరించెదవంచు నన్ను మీ
రందఱు గూడి చుట్టుకొని ♦ యీవలికిం జననీక తర్జనం
బెందుకు జేయుచుంటిరిక ♦ నేమి వచించెద నామనంబు గో
విందుని మాళియందు విని ♦ వేళితమయ్యె మదాశ మానుడీ.

## 11. క ళ్ళ రి య పి ర మ న్.

శ్లో. అంభోజప్రభవోగ్రవాసవముఖాప్రాప్యంహరిం సంస్తువ
ఛక్త్యా శ్రీకురుకాపురీవరవతి ర్మానీ శఠద్వేషణః,
యజ్జగ్రంథ సహస్రమత్ర దశకం హ్యేతత్పఠన్మానవో
నిత్యైస్సూరిభిరన్వితః పరమఖే వాసం భజేచ్ఛాశ్వతమ్.

మ. జలజాతప్రభవత్రిలోచనశివ ♦ స్పత్యాద్యదృగ్గోచరున్
జలజాతాక్షుని సంస్తుతించి శఠజి ♦ త్సంజ్ఞుండు మానీశ్వరుం
డిలపై గూర్చినవేయిపద్యములలో ♦ నీపంచకద్వంద్వ మ
చ్ఛలభక్తి న్పఠియించువారు దివిను ♦ త్సాహంబుదీపింప సూ
రులతోగూడి భజింతు రెల్లపుడు నా ♦ రుక్మాభు లక్ష్మీపతిన్.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతేరామానుజాయనమః.

## సప్తమ శతకము - ఎనిమిదవ దశకము.

[మాయావామననే.]

అవతారిక :— క్రిందటిరువాయ్మొళ్లి రూపసాక్షాత్కారమును బ్రతిపాదించుచున్నది. ఈ యాళ్వార్లు రూపసాక్షాత్కారము కలిగినను ఈశ్వరుడు చేతికి

దొరకకపోవుటచే నిది రూపసాక్షాత్కారమని యెఱుఁగరు. ఇఁకను సర్వేశ్వరుడు తాను చేయించదలంచిన కార్యము సమాప్తినొందువఱకు నన్నివిభూతిలోనే యుంచదలంచి యున్నాడన్న యంశమునుగూడ నెఱుగరు. అయినను వానిని విడిచి ధరింపజాలనివారుగావున నీయంశమును దలంచి శాంతించి యుండుటకుగూడ శక్తి లేనివారు. విరోధులను పోగొట్టవలెనని ప్రార్థించినను అతడు వీరిచేత జేయించ దలంచిన ప్రతిబంధములు సమాప్తినొందువఱకు వీరియపేక్షితము చేయడు. ఈశ్వరుడు వీరియపేక్షితమును చేయకపోయినను వీరి నిచ్చట నేయుంచి జీవింపజేయు నుపాయముల నెఱింగినవాడు. మత్స్యములు మొదలగు పదార్థములను చావకుండ దత్రవ్యాంతరముతో గలిపి యుంచినట్లు వీరిని చావనియ్యక బ్రతుకనియ్యక మధ్య స్థితిలోనుంచి బాధించుచున్నప్రకారము నాలోచించి, స్వామీ! ఈసంసారమునం దుండుట దానునికి పరమాసహ్యమైయున్నదని మొఱ్ఱబెట్టుచున్నను దానుని యిందు లోనే యుంచడపు ఆశ్చర్యమేమో సాదించవలెనని వీరడుగగా నొకటి యడిగిన వారికి మఱియొక ప్రత్యుత్తర మిచ్చువారివలె " అళ్వార్ ! ఇదొక్క ఆశ్చర్యము నేనా మీరు చూచినారు ? ఇట్టి యాశ్చర్యము లసంఖ్యాతములు నాయొద్దనున్నవి. నాయొక్క విచిత్రజగదాకారమును చూడుడీ" యని తనయొక్క ఆశ్చర్యజగదాకారమును జూపింపగా జూచి యదియు వీరి కభిమతమగుటచే బ్రీతిహేతువై యుండెను. వీరొకదాని నడుగగా నాత డనేకాశ్చర్యములను గనబర్చెను. అక్రూరుడు యమునలో మునిగి స్నానము చేయుచుండగా యమునాజలములోపల శ్రీబలరామకృష్ణులను జూచి యొడ్డుకువచ్చి చూడగా రథముపై మరల గనపడిరి. " అంతర్జలే యదాశ్చర్యం దృష్టం తత్ర మయాచ్యుత । తదత్రాపిచ పశ్యామి మూర్తిమత్పురతః స్థితమ్ । జగదేతన్మహాశ్చర్యం రూపం యస్య మహాత్మనః । తేనాశ్చర్యవరేణాహం భవతా కృష్ణసంగతః॥ "అని ఆశ్చర్యమునొందినట్లు ఈయాళ్వార్లును సర్వేశ్వరుని విచిత్రజగదాకారము ననుసంధించి విస్మితులైరి. దీనిలో " పాశంగళ్ నీక్కి " యనునది ఉయిర్పాట్టు.

## 1. మా యా వా మ న నే.

శ్లో. మాయిన్వామన మధ్వరే మయి దయాం కుర్వీంద్రనీలద్యుతే
పృథ్వీవాయుజలాంబరానలతనో సర్వాసుభృత్సంతతేః,
త్వం మాతాఽసి పితాఽసి బాంధవజన స్త్వం పుత్రపౌత్రాద్యసి
త్వం సర్వం నృహరే విధా స్తవ బత స్యుః కీదృశా బ్రూహి మే.

శా. మాయా వామన మధ్వరీ నను దయ • న్మన్నింపుమా మాధవా
వాయుక్ష్మాజలవహ్ను లీవె నభము • న్వార్వాహముల్ నీవె కా
నాయాత్మందును తల్లి దండ్రి సుతు ల • న్యంబంతయు న్నీవె యా
యాయిస్థావరజంగమంబులకు నీ • వంతర్యామి కావే హరీ.

2. అంగన్మలర్.

శ్లో. పుష్యచ్ఛ్రీతులసీస్రజిష్ణుమకుట శ్రీశానుకంపస్వ మాం
సూర్యాచంద్రమసోశ్శుభాశుభనిదానానాం గ్రహాణాం తథా,
వృష్టేర్ధ్వాంతచయస్య కీర్త్యయశసో ర్మృత్యోఃపురాకే స్తథా
చాంతర్యామితయా స్థితోఽసి భగవన్ చేష్టా విచిత్రాస్తవ.

శా. చ్యోతత్సాంద్రమరందబిందుతులసీ • సూనావబద్ధోరుస్ర
గ్వ్రాతాంచన్మకుటా శశాంకదినకృ • ద్వర్షాంధకారాంబుభృ
చ్ఛీతోష్ణాదిక మెల్ల నీవ యశముల్ • శ్రీమృత్యువుల్ నీవ ని
ర్ధూతేంద్రారిసమూహ నీచరితలు • ద్భూతాశుభంబుల్గదా.

3. శిత్తిరత్తేర్వలవా.

శ్లో. జన్యే స్యందనవాహచోదనపటో చక్రిన్ యుగానాంపతే
నానాకారవిలక్షణాత్మవితతే రాత్మన్పయోజేక్షణ,
సర్వాంభోజభవాండసంతతిజనిస్థిత్యంతహేతో భవ
చ్చేష్టా జ్ఞానవతాం మనాంస్యపి పరం సంమోహయంతి ప్రభో.

ఉ. భారతసంప్రహారమున • పార్థునిసూతుడవై జయద్రథున్
మారితుజేయ జక్రమున • మాటొనరించినవాడ భాస్కరున్
స్ఫారయుగోత్కరప్రథిత • సర్వజడాజడనేతృతాస్ఫుర
త్సారయశోనిధీ సుగుణ • సంచయ పేటి యిదేటి చిత్రముల్.

4. కళ్ళవిఙ్తామరైక్కణ్.

శ్లో. ఫుల్లాంభోజదళాయతేక్షణ హరే సంఖ్యాతిగానాం చితాం
నిత్యానామచితాం క్షణస్థితిజుషాం నిర్వాహకోఽసి ప్రభో,
క్షీరాంభోనిధివిస్తృతాహిశయనే స్థిత్వా జగద్రక్షణోపాయాం
శ్చింతితవాన్ బహూనపి మనస్యాశ్చర్యధుర్యా హి తే.

శా. సద్యఃప్రస్ఫుటపుండరీకనయనా ◆ సాంద్రాంబువాహచ్ఛవీ
విద్యుత్పుంజవిభావిశోభివసనా ◆ వేదాంతవాగ్బోధ్య స
ద్విద్యోక్తామలరూప సర్వచిదచి ◆ ద్విస్తారనిర్మాత సం
రాధ్యా వార్ధిఁ ఫణీంద్రతల్పమున ◆ విశ్రాంతుండవై లోకర
క్షోద్యోగంబున నుండువాఁడ కరుణా◆యుక్తుండవై బ్రోవుమా.

5. పా శ ం గ ళ్ నీ క్కి.

శ్లో. సౌరభ్యాకృష్టభృంగీముఖరితసుమనోదామసంవీతమౌళిన్
స్వామిన్నాశ్చర్యచేష్టాగుణవిభవనియంతాఽసి జన్మాంతయోస్త్వమ్,
అజ్ఞానాదీన్వినాశ్య త్వదమలచరణాంభోజయుగ్మే నివేశ్య
ప్రాస్థస్సంసారసింధో మురహర భవతః కో విజానాతి మాయాః.

శా. సౌరభ్యప్రచురప్రసూనతులసీ ◆ స్రగ్బృందరమ్యాత్మకో
టీరా మద్భవపాశఖండనము తు ◆ ష్టిం జేసి రక్షింపు కుం
భీరగ్రస్తమతంగజార్తిహరణా ◆ భీతిప్రదాసారసం
సారాంభోనిధి నన్ను ద్రోయుటిది నీ◆చాతుర్యమే చెప్పుమా.

6. మ య క్కా వా మ న నే.

శ్లో. మాయామానవవేషవంచితబలే త్వాం జ్ఞాతుమేకం పదో
పాయం మే స్మృతివిస్మృతీ త్వమసి సంతాపశ్చ శైత్యం తథా,
ఆశ్చర్యావహవస్తుసంతతిరసి త్వం పుణ్యపాపే ఫలం
చాసి ప్రోద్ధతదానవాద్రికులిశ త్వద్రీతి రత్యద్భుతా.

తే. గీ. సుఖము దుఃఖంబు దుష్కృతి ◆ సుకృతములును
స్మృతియు విస్మృతి యుష్ణంబు ◆ శీతతయును
పరిభవము జయము మొదలగు ◆ ద్వంద్వములకు
నీవు నిర్వాహకుండవై ◆ నెగడునట్టి
శీల మెఱిగించి నను బ్రోవు ◆ శ్రీరమేశ.

7. తు య ర ం గ ళ్ శె య్యు మ్.

శ్లో. మాణిక్యోజ్జ్వలమాలిభాసిత భవద్భక్తౌఘదుఃఖప్రద
శ్రీకృష్ణాఖిలచేతనేషు బహుదుఃఖోత్పాదకా స్సర్వదా,
కామక్రోధమతిభ్రమానపి భయాహంకారగర్వాదికా
న్నిత్యం సంజనయస్యనంతవిభవో లీలా స్తవైతా బత.

మ. ఉదయార్కప్రతిమల్లరత్ననికరాం • శూచ్ఛప్రభాసంచయా
స్పదమాళీ భవదీయచేతనతతిన్ • శబ్దాదులం దోసి యా
పదల న్బెట్టుట లీలలంచు మదిలో • భావింతువే నిర్దయా
స్పద నీ కిద్దియె లీల వార్ధితనయా • ప్రాణేశ నాగావనా.

8. ఎ న్న శ ం డా య ం గ ళ్.

శ్లో. అస్మత్పాలక నందనందన యశోదాపుణ్యవారాంనిధే
త్వల్లీలాః పరమాద్భుతా మధురిపు స్త్వద్భక్తయా వర్తతే,
ఇత్యద్ధా భవదీయతత్త్వమమరా అప్యక్షమా వేదితుం
సృష్ట్వేదం బహిరంతరస్య లలసి త్వచ్ఛీలమత్యద్భుతమ్.

తే. గీ. నన్ను రక్షించు శ్రీకృష్ణ • నళిననేత్ర
యిట్టిదని నీదు తత్త్వంబు • నేర్పరింప
నెవ్వరికి శక్యమగు నయ్య • యీజగంబు
లన్ని సృజియించి వానిక • నంతరాత్మ
నయ్యు వెలి దోచెద విదేటి • యద్భుతంబు.

9. ఎ న్న వి య క్కై గ ళా ల్.

శ్లో. శ్రీకృష్ణ వృష్ణికులనాథ దశేంద్రియాఘ
సంవేద్యమానవిషయా విహితా స్త్వయైవ,
త్వత్తోఽపి సూక్ష్మతరవస్తు న చేహ లోకే
వక్తి శ్రుతి స్త్వమణుతోఽపి భవస్యణీయాన్.

తే. గీ. వాక్కు కరపాదము లుపస్థ • పాయువనెడు
పంచకర్మేంద్రియంబులు • పంచధీంద్రి

యంబులును శబ్దరూపాది • కంబు నీదు
మాయచేఁ గల్పితములయ్యె • మారజనక.

10. ఇ ల్లై ను ణు క్కు ం గ ళే.

శ్లో. పంకేజాతదళానువిద్ధతులసీమాల్యాంచితోరస్స్థల
స్థూలాయాః ప్రకృతే రణిష్ఠపురుషస్యాప్యంతరాత్మా భవాన్,
ఇత్యాఖ్యాతి సరస్వతీ చిరతమా త్వాం ప్రాజ్ఞమానీ యథా
శక్తి స్తౌతి యది త్వదీయమహిమోదన్వత్కణస్స్యాన్నుతః.

ఉ. స్థూలము సూక్ష్మమై భువిని • దోఁచు చరాచరవస్తుకోటి కె
క్కాలము నంతరాత్మవయి • క్రాలుదు వస్తువులు గొప్పవారలున్
జాలరు నీమహామహిమ • సన్నుతిసేయఁగ నంచు వేదవా
గ్జాలము చెప్పు పంకరుహ • సంగతసత్తులసీస్రగంచితా.

11. ఆ మ్ వ ణ్ణ మి న్న దె న్ను.

శ్లో. తత్త్వం యస్య యథాస్థితం కథయితుం జ్ఞాతుం న కోపి క్షమ
స్తస్యానుగ్రహత స్తదీయమహిమాంభోరాశిపారంగతః,
యచ్ఛ్రేణి శఠజిత్సహస్రిమమలం తస్మిన్ దశైతాన్వదన్
మర్త్యో భక్తివశో బుధౌఘమహితో ధన్యో భవేద్భూతలే.

మ. తెలియన్ శక్యముగాని దివ్యమహిమున్ • దేవర్ యథార్థంబుగా
దెలియంజాలిన శ్రీశఠారిముని సం • దీప్తార్థరుచ్యంబులౌ
పలుకుల్ గూర్చి రచించినట్టి ద్రవిడ • ప్రోక్తోక్తిపద్యాళిలో
నిలపై నీపదిపద్యము ల్జదువువా • రెంచన్ గృతార్థాత్ములే.

శ్రీమతే శఠకోపాయ నమః.

---

శ్రీమతేరామానుజాయనమః.

సప్తమ శతకము - తొమ్మిదవ దశకము.

[ఎన్నైక్కు మెన్నై.]

**అవతారిక :—** ఈయాళ్వార్లు క్రింద ననేకపర్యాయములు సర్వేశ్వరుని లభించువారికి ప్రతిబంధకములున్నను తానే వానిని నిరసించి తన్ను వారికొసంగు

వాడై యుండగా వానివలననే పురుషార్థమనియున్న నన్నీ సంసారమందుంచుట యేమి యని సర్వేశ్వరు నడిగిరి. ఆతడును యిందుకు దగిన పరిహారమును చేయక యేదో యొకగుణావిష్కారమును చేసి వీరి కన్యపరతను గలిగించి స్వాపేక్షితమును మరచునట్లు చేయును. క్రిందతిరువాయ్ మొళిలో 'స్వామీ నన్నీసంసారమందుంచకుము. నాకిది మిక్కిలి దుస్సహముగానున్నది. నిన్ను విడిచి నాకు వేరు రక్షకులు లేరు. నీవే నాకుపాయభూతుడవని మొఱ్ఱబెట్టుచున్నను నన్నిచటనే యుంచి చావకుండ బ్రతికింపజేయు నీయాశ్చర్య మిదేమి ? ' యని వీరడుగగా : ఆళ్వార్ ! ఈయొక ఆశ్చర్యమునేనా నాయొద్ద మీరు చూచితిరి? చూడండి యెన్ని యాశ్చర్యములున్నవో నాయొద్దనని తనవిచిత్రజగదాకారమును జూపించి ప్రకృతమును మరపించెను. వీరును దానినిజూచి కొంతసేపు దాని ననుసంధించి తిరిగి 'స్వామీ ! దుస్సహమైన యీసంసారమం దింక నన్నుంచుటకు హేతువేమి'యని నిర్బంధించి యడుగగా: మీకింక రుచివాసనాదులు నశింపలేదు. అందుచే నింక నిచట నుండ వలసివచ్చినది' యని యీశ్వరుడు చెప్పెను. 'నే నితరులకంటె నతిశయములో నుండుటకు నాకు భక్తిరూపాపన్నజ్ఞానము నొసంగియును మరల నన్నీసంసారమం దెందుకుంచితి' వనిగట్టిగా నిర్బంధించి యడుగగా: 'నీకొఱకు నన్ను పరిగ్రహించవలెను. నాకొఱకని అక్కరలేదు. అని మునుపు మీరంటిరే ? అందుచేత నేను మిమ్ములను నాయిష్టమువచ్చినట్లు వినియోగపఱచుకొందును. మాకతిశయమును కలుగజేయుట మీకు స్వరూపముకాదా ? అందువలన పూర్వము శరతల్పమందుండి బాణవ్రణవేదనచే మిక్కిలి బాధనొందుచున్న భీష్ములవారిని బెట్టి లోకమునకు సకల ధర్మముల నుపదేశింపజేసినట్లు లోకోపకారార్థము మీచే గొన్ని ప్రబంధములను రచింపజేయ దలంచియున్నాము గావున నంతవఱకు మిమ్ముల నిచటనుంచకతీరదు. అని యీశ్వరుడు ఖండితముగా బ్రత్యుత్తరమిచ్చెను. దానిని విని యీయాళ్వార్లు అయ్యో సర్వేశ్వరుడవై అవాప్తసమస్తకాముడవయి సర్వప్రకారపరిపూర్ణుడవైన నీకొక కొరతయుండుట, ఆకొరత నన్నుబెట్టుకొని తీర్చుకొనుట అనునది కేవల మసంబద్ధముగా గానవచ్చుచున్నది. నిజముగా నీవు గొన్ని ప్రబంధములను రచింపజేయవలయునని బుద్ధి యుదయించినయెడల నందుకు దగిన జ్ఞానశక్త్యాదులుగల శ్రీవేదవ్యాసులవారు, శ్రీపరాశరులవారు, శ్రీవాల్మీకిభగవానులు, “ సెందమిళ్ పాడువార్ ” అని ప్రసిద్ధులైన ముదలాళ్వార్లు మొదలగువారుండగా వారిచే నీపని జేయింపక యనాదికాలమునుండి సంసారములో గొట్టుకొనుచు శబ్దాదివిషయములయందు ప్రావణ్యముగలవాడనై “ అసన్నేవ స భవతి ” అన్నట్లు

అసత్కల్పుడనైన నన్ను బెట్టి ప్రబంధరచన జేయించుట యనెడు వార్త యేమి వార్త? ఇది యేమి సౌలభ్యము? అని యీశ్వరుడు తమవిషయమై చేసిన మహోపకారము ననుసంధించి దానికి దగిన ప్రత్యుపకార మేమి యని తల్లడపడుచున్నారు. దీనిలో "ఇన్ఱివిపాడుం పరమకవిగళాల్" అనునది ఉయిర్పాట్టు.

## 1. ఎన్నైక్కుమె న్నై.

శ్లో. మాం జ్ఞానశూన్య మనుగృహ్య విధాయ విజ్ఞం
త్వద్దాప్రిపక్తి ర్గుణవర్ణనచారు తాఢ్యమ్,
ఏకం ప్రబంధమిహ కారితవాన్మయా త్వ
మేతస్య కాం ప్రతికృతిం కరవాణి దేవ.

ఉ. జ్ఞానములేనివాడనయి ♦ నాశకరాక్షయసంసృతివ్యథా
దూనుడనైన నన్ను దన ♦ తోరపుసత్కృప గావనెంచి సు
జ్ఞానిగ జేసి సూరిగణ ♦ నవ్యగుణాస్పదుడైన తన్ను న
న్యూనరసోజ్జ్వలంబగుచు ♦ నొప్పు ప్రబంధము జేసి పాడగా
నాన యొసంగినట్టి వన♦జాక్షుని యీ ఋణ మెట్లు దీర్చెదన్.

## 2. ఎన్ శొల్లినిర్పన్.

శ్లో. అంర్యామితయా స్థితః కమలభూశ్రీకంఠయో స్సృష్టిసం
హారౌ సంవిదధ త్స్వయం తదుభయం తత్కర్తృకం చేతి సః,
లోకే సంప్రథయేద్యథా ప్రథమతో మాం శిక్షయిత్వా తథా
తస్యేయం కవితేతి సంప్రథితవా న్మహోపకారక్రమమ్.

చ. తనకృపచే మదాత్మ గను ♦ ధన్యముగా నొనరించి పంకజా
సనునికి గృత్తివాసునిక ♦ జస్రము దానయి యంతరాత్మగా
నొనరిచి సర్గసంహృతుల ♦ నొప్పగ నవ్వి తదీయకర్మలం
చును బ్రకటించుమాడ్కి నిజ♦సూక్తినిబద్ధమహాప్రబంధము
ఘనముగ మత్కృతంబెయని ♦ కల్పన జేసిన కైటభారి కా
వనజదళాయతాక్షునకు ♦ బ్రత్యుపకారము జేయ శక్యమే.

## 3. అముదల్వ నివనె న్ను.

శ్లో. లోకానామయమేవ కారణమితి జ్ఞానం మమోత్పాద్య మ
జ్జిహ్వాగ్రస్థితిమేత్య మంజులవచోమాధుర్యధుర్యాం మహత్,

భక్తశ్రోత్రపుటాంజలిప్రకరసంచూష్యం ప్రబంధం మయా
శీఘ్రం కారితవానిభో కథ మహం త్వాం విస్మరేయం వద.

తే. గీ. ధరణి భక్తులు పాడి సం ♦ తసమునొంద
నాదు జిహ్వాగ్రపీఠిక ♦ మీఁద నిల్చి
పావనంబగు ద్రవిడప్ర ♦ బంధ మొసగి
నేనె కారణమౌదు నీ ♦ నిఖిలమునకు
ననుచు దెల్పిన యుపకర్త ♦ నౌనె మఱువ.

4. అ ప్ప నై యె న్ను మ ర ప్ప న్.

శ్లో. వ్యాజీకృత్య జడం వివేకవిధురం మాం శుద్ధశబ్దార్థసం
శుంభత్కావ్యవరం విరచ్య భగవా న్స్వస్మిన్స్వయం కేశవః,
కర్తృత్వం వినివేశ్య మయ్యవికలం చోత్తారయామాస మాం
జ్ఞాత్వా తస్య సుశీలతాం కథమహం తం విస్మరేయం హ్యాది.

తే. గీ. నన్ను నీచుని యుపకర ♦ ణంబుఁజేసి
తనవిషయమైన కవితను ♦ దానె చెప్పి
నన్ను నుత్తీర్ణుఁజేసిన ♦ నళిననాభు
కరుణ నెఱిఁగిన నేనెట్లు ♦ మఱువనేర్తు.

5. శీ ర్కొ ౦ డు గొ ౦ డు.

శ్లో. తత్కల్యాణగుణావబోధవిధురం తస్మి న్మనోహారిణీం
కర్తుం సత్కవితాం చ శక్తివికలం సంయోజ్య మాం ప్రజ్ఞయా,
స్వస్మిన్ శ్రీముఖసూక్తికావ్యమమలం తత్కారయిత్వా మయా
లోకే ప్రపథదీదృగస్య మహిమా స్యాత్కస్య వాచాంపదమ్.

తే. గీ. తద్గుణంబుల నెఱిఁగియు ♦ దగినభంగి
కృతి విరచించు నేర్పు నా ♦ కతికరుణను
గలుగఁజేసి ప్రబంధంబు ♦ కర్త వీవె
యని జగంబున జాటిన ♦ యనఘుమహిమ
మెట్టివారికినైనను ♦ తింప దరమె.

6. ఇ న్క వి పా డు మ్.

శ్లో. నిర్వాణంద్వప్రతిభాప్రసూతకవితాలోకాతిగా న్సత్కవీ
న్వ్యాసాదీనపహాయ సంప్రతి మహాహాహోల్లసన్మానసః,
మత్సాన్నిధ్యముపేత్య సాధనతయా స్వీకృత్య మాం స్వప్రథా
విస్తారప్రతిపాదకం రచయతి గ్రంథం రమేశోఽద్య మామ్.

తే. గీ. కవివృషభులంచు సత్కీర్తి ♦ గాంచినట్టి
వ్యాసవాల్మీకిఋషులను ♦ వదలి నన్ను
స్వప్రబంధంబు రచియింప ♦ నెలమి జేసి
తన్ను జరితార్థునిగ మది ♦ దలచువాని
శీల మెవ్వరికైనను ♦ జెప్పఁదరమె.

7. వై కుం ఠ నా ద న్.

శ్లో. మత్పాపాని వినాశ్య మహ్యమమలం జ్ఞానం వితీర్య ప్రభు
ర్వైకుంఠ స్సతతం మదీడితనిజైశ్వర్యప్రభావాదికః,
ఆత్మానం మనుతే విభూతియుగళేశానత్వసంశోభితం
తృప్తిర్మే న భవేత్తమేవ హృదయే భక్త్యా సదా ధ్యాయతః.

తే. గీ. కరుణ వైకుంఠపతి నాదు ♦ దురితములను
బాపి తనతో సమానుని ♦ బరగజేసి
మధురకవితను దనపైని ♦ మాన్యముగను
జెప్ప జేసిన పరిశుద్ధ ♦ శీలుఁ గృష్ణు
నెంత నుతియించినను ♦ దృప్తి యెట్లుదీరు.

8. ఆ ర్వ నో వా ర్.

శ్లో. స్వాం స్తోతుం మందబుద్ధే ర్మమ కవనవిధా నైపుణం సంప్రదాయ
స్వాదిష్టం సత్ప్రబంధం స్వనవనకలితం కారయిత్వామయా సః,
సౌశీల్యం సర్వలోకస్తుతివిషయమిదం ఖ్యాపయామాస చక్రి
స్సర్వైర్భక్తైస్స్తువం స్తచ్ఛుభగుణవితతింనాహమాప్నోమితృప్తిమ్.

తే. గీ. జ్ఞానహీనుడనౌ నాకు ♦ జ్ఞాన మొసగి
ద్రవిడభాషామయస్తోత్ర ♦ రచనకర్మఁ

కరుణ నాచేత జేయించి ♦ వరలు కృష్ణు
శీలము నుతింప నెవ్వరు ♦ జాల రిలను.

9. తి ర త్తు క్కే తు ప్పా ర.

శ్లో. మాం జ్ఞానగంధరహితం స్వసమం విధాయ
కావ్యం మయాఽమలమజీగపదబ్జనాభః,
తస్యోపకారపరివృత్తితయా తదీయా
న్కాలత్రయే శుభగుణాన్నువతో న తృప్తిః.

తే. గీ. తెలివి యిసుమంత లేకుండ ♦ దిరుగునాకు
దెలివి గలిగించి తనమీద ♦ దివ్యగాథ
లోకసహస్రంబు జేయించె ♦ నొప్పమీర
నిట్టియుపకారమున కేను ♦ నెప్పుడతని
యశము బొగడిన బ్రతికృతి ♦ యానె చెపుమ.

10. ఉ ద వి క్కై మ్మా రు.

శ్లో. లక్ష్మీశశోవక్తృతేరహం ప్రతికృతిం కర్తుం మమాత్మా యది
ప్రత్యర్ప్యేత తదీయమేవహి భవేత్స్వం సోఽపి కిం దీయతే,
స్వస్మిన్నాపయతో మ్రదిష్టసువచస్సంద్రృబ్ధకావ్యం మయా
దేవస్యాస్య సమర్పణోచితమిహాముత్రాపి నో లభ్యతే.

తే. గీ. హరియొనర్చిన యుపకార ♦ మరసి నేను
నందధుజ్ఞానములకెడ్డ ♦ మందిరంబు
మామకీనాత్మ నర్పించి ♦ మాఱుపకృతి
జేసితినిగాని యదియును ♦ శ్రీశుసొత్తు
యింక నేమున్న దతనికి ♦ నియ్య నాకు.

11. ఇ ం గు మ ం గు మ్.

శ్లో. సోముత్రేహచ కృష్ణఏవ శరణం నాన్యోఽస్త్యతో మేఽవితే
త్యాత్మన్యధ్యవసాయవాన్ శతరిపుర్మానీ కురూకాధిపః,

యజ్జగ్రంథ సహస్రమత్ర దశకం హ్యేతద్యథావా తథా
చాభ్యస్యన్మనుజో భజేత పరమానందం పరబ్రహ్మణః.

తే. గీ. ఉభయలోకంబులందును ♦ నభయమొసగ
హరియె రక్షకుడని నిశ్చ ♦ యాత్ముడైన
శఠరిపుండు రచించిన ♦ సరసపద్య
సంచయంబున నీపది ♦ జదువువార
లీశ్వరానందసంప్రాప్తి ♦ నెసగువారు.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతే రామానుజాయనమః.

సప్తమ శతకము - పదియవ దశకము.

[ఇన్బంపయక్క.]

అవతారిక :—క్రింద తిరువాయ్మొళిలో సర్వేశ్వరుడు తమ్మును బెట్టి తిరువాయ్మొళిని పాడించిన మహోపకారమునకు బ్రత్యుపకారమును వెదకి కానలేక తల్లడమును పొందిరి. వీరు తమభ్రాంతిచేత నాతని కొక ప్రత్యుపకారము చేయవలయునని యాలోచించిరి గాని యథార్థముగా జెప్పబోతే నాతనికిచ్చుటకు వీరి కొక్కవస్తువు లేదు. అతడును వీరివలన నొకవస్తువును స్వీకరించి తనకొరత దీర్చుకొను సాపేక్షుడైయుండ లేదు. తమయుపకారస్మృతి తమ్ము నున్నచోటనుంచక గందరగోళము చేయుటచే నిట్లు చేయుచున్నారు. అయినను తాళియుండ లేరు. ఇకను మనను ఆతనికేదైన సమర్పించవలెను. ఆతడు మనవద్దనుండి యేదైన లభించవలెను. అనునది యొకటి యున్నది. కావున నాతనికి యోగ్యమైనకైంకర్యము చేయుటయే తనకొక ప్రత్యుపకారముగా దలంచు స్వభావముగలవాడు. కాబట్టి తమకు స్వరూపానురూపమైన అత్యంతదాస్యమందు ప్రవేశించుట కాలోచించిరి. శ్రుతివాక్యములను "స్వేన రూపేణాభినిష్పద్యతే" అని స్వరూపప్రాప్తివరకును జెప్పి అటపైని కైంకర్యమనునది దంపగా బుట్టిన చెమటవలె దానంతట నదియే కలుగునని బ్రహ్మప్రాప్తివరకు చెప్పి విడిచెను. తక్కిన ఆళ్వార్లందఱు "వళు విలావడిమై శెయ్యవేండునామ్. 3-3-1. (మనను విడుపులేని దాస్యమును చేయ

వలయును.) అని చెప్పుదురు. వారు ప్రాప్తిఫలమైన కైంకర్యమందుండు రుచిచేత ‘సంసారము త్యాజ్యము ఈశ్వరు డుద్దేశ్యుడు’ అను జ్ఞానముకలిగి భగవత్సమాశ్రయణము జేసినవారు. “భేషజం భగవత్ప్రాప్తిః” అన్నట్లు భగవత్ప్రాప్తికొఱకెదురుచూచువారు. వారికంటె “మయర్వఱమదినలమరుళినన్” భగవత్ప్రసాదలబ్ధమైన జ్ఞానముగల యీనమ్మాళ్వార్లకు తారతమ్యమిది. కైంకర్యము చేయుటలో శరీరవిగమానంతరము పరమపదమును పొంది కైంకర్యమును జేసెదమని శాంతించి యుండువారు కారు. వీరి యుపకారస్మృతి వీరిని హెచ్చుగా బాధించుచున్నది. అందుచేత శ్రీవాల్మీకిరచించిన శ్రీరామాయణమును వినుటకు తిరువయోధ్యయందు పెరుమాళ్లు లక్ష్మణస్వామితో పేరోలగంబుతో విచ్చేసియున్నట్లు సర్వేశ్వరుడును మనము పాడిన తిరువాయ్మొళిని వినుటకు ‘తిరువారన్విళై’యిలో పర్యంకవిద్యలో జెప్పబడినట్లు తిరువనందాళ్వానుపై నాయ్చ్చిమార్లతోను నిత్యసూరులతోను విచ్చేసియుండును. అచటికిబోయి యీతిరువాయ్మొళ్ళిని వినిపింపవలెనని మనోరథించిరి. ఆమనోరథానుసారముగా సర్వేశ్వరుడు ప్రాప్యుడైనచో నర్చిరాదిగతి దేశవిశేషము మొదలగునవి యన్నియుఁ బ్రాప్యాంతర్గతములే. అనగా మున్న ప్రాప్తమై తరువాత నుపాసనకు ఫలములుగా గలుగునవి కొన్నియున్నవి. అవి యన్నియును ప్రాప్యాంతర్గతములే. అట్లే ‘తిరువారన్విళై’లో వేంచేసియున్న సర్వేశ్వరుని తిరువడిగళులందు కైంకర్యమును చేయుదము. అదియు నవసరములేదు. ఆదేశప్రాప్తియే చాలును. అదియు నక్కరలేదు. ఇచ్చటనేయుండి యచ్చటికి బోవ మనోరథించుటయే చాలును. మన మాదేశము ప్రాప్యమనియెంచి అచ్చటికి బోవునట్లు మన మున్నచోటి కతడును వచ్చును. అంతవఱకు మనము వాని ననువర్తించి అచ్చటికి బోయి ప్రవేశింతము. ఆదేశమే మనకుఁ బ్రాప్యము. అచ్చటికి బోయి ప్రవేశింపగా మన విరోధులన్నియును బోవును. ఇక నేను వేఱొకదానియందిచ్ఛగలవాడనైనను నామనస్సు “భావో నాన్యత్రగచ్ఛతి” అన్నట్లు మఱియొక దేశమునకు దాస్యముచేయదు. కాబట్టి తిరువారన్విళైయిలో బ్రవేశించి యాతనికి కైంకర్యముల నొనర్చుటకు మనోరథించి సంతసిల్లుచున్నారు. శ్రీరామాయణమునకు నీతిరువాయ్మొళ్ళికి గల తారతమ్యమిది. దీనిని గ్రంథకర్తయే వినిపించెను. గ్రంథప్రతిపాద్యుడే వినెను. “సీతాయాశ్చరితం మహత్” అని ప్రతిపాదింపబడినను గ్రంథప్రతిపాద్యురాలైన అమ్మవారిని విడిచి స్వామి యొకరే విన్నవారు. పాడినవారు శ్రీవాల్మీకిభగవానుడు. వినిపించినవారు కుశలవులు. ఈ తిరువాయ్మొళిలో మొదటిపాశురమే ఉయిర్వాట్టు.

## 1. ఇ న్బ ం ప య క్క.

శ్లో. సోల్లాసం స ప్తలోకీం కమలనిలయయా పాలయంతం పరేశం
భక్తానా మీప్సితార్థ ప్రద మమరపతిబ్రహ్మరుద్రాదివంద్యమ్,
పుష్పోద్యానైః పరీతే ద్విజవరవిత తే శ్రీనదిద్వృద్ధిపుర్యా
మాసీనం దేవదేవం వినమితశిరసా తం కదాఽహం నమామి.

శా. ఆనందానుభ వైక నిష్ఠనిరతం • బంభోజినీ గేహతో
నానాభూతతతిప్రకీర్ణజగతీ • నాథత్వసంపన్నుడై
మానాథుండు వసించు పుష్పవనభూ • మాంచన్నదీవృద్ధియ
స్థానీయంబు నమస్కరించుదినముల్ •సంప్రాప్త మెన్నండొకో.

## 2. ఆ గు ం గో ల్.

శ్లో. పాదద్వయీవిమితలోకత తే నివాసం
ప్రోత్తుంగసౌధనదివృద్ధిపురం కదాఽహమ్,
పానీయమచ్ఛసురభి ప్రవికీర్య భక్త్యా
కృత్వా ప్రదక్షిణశతాని కృతీ భవేయమ్.

చ. పదమితసర్వలోకుడగు • పద్మదళాక్షుడు వామనుండు దా
నదలకయుండు నంబుధర • న ర్తనతధ్వజమండితోచ్ఛస
త్సదనసుహర్మ్యసంఘువర • సాలపరిష్కృతనిమ్నగాపురిక
నదమలగంధవారి గొని•చల్లుచు మ్రొక్కుట యెన్న డొకో.

## 3. గూ డు ం గో ల్ వై గ లు మ్.

శ్లో. గోవిందం మధుదానవద్విపశిరోనిర్భేదపంచాననం
దృష్ట్వా పన్నగశత్రువాహనగతం తస్య ప్రియం ధామచ,
తత్కల్యాణగుణాభివర్ణనపరా న్వేదా న్పఠద్భి ర్ద్విజై
రాపూర్ణం నదివృద్ధినామకపురం వీక్షే కదా భక్తితః.

శా. గోవిందు న్మధుదానవాంతకు హరి • న్గోపీప్రియు న్బంకజా
దేవీవల్లభు దార్క్ష్యుపైని గని భ• క్తి న్మ్రొక్క వాడుండు భూ
దేవౌఘశ్రుతిపారశబ్దితముౖనై • దివ్యద్రుమోద్యానవా
టీవారావృతమా సరిత్పురము జూ•డ్కిన్ జూడ నెన్నండొకో.

4. వా య్ క్కు ం గొ ల్ ని చ్చ లు మ్.

శ్లో. కేదారాఘవిరోహదిక్షువనసంఛన్నం సరిద్వృద్ధిరి
త్యాఖ్యాతం పుర మాశ్రితం త్రిభువనాధ్యక్షం శుభైకాస్పదమ్,
జాతం శ్రీమధురాపురే కుధరభిన్నీలద్యుతిం మాధవం
స్థిత్వైవైన లభేయ కిం హృది సదా ధ్యాతుం విహాయేతరత్.

శా. కాంతారేక్షువనోత్కరోపవనికా • కైదార్యకల్లోలినీ
కాంతంబై గనుపట్టు శ్రీనదిపురి • న్గల్యాణకీర్తి న్రమా
కాంతుణ్ లోకపతి న్సురేశ్వరమణీ • గాతుర్ త్రయీశీర్ష వాం
క్రాంతిప్రాపకవైభవు న్నతమున్ • ధ్యానింప నా కబ్బునే.

5. మ ల ర డి ప్పో దు గ ళ్.

శ్లో. ధ్యాతుంస్వాంఘ్రియుగంమదీయహృదయేయోనుగ్రహేణస్వధా
ద్యః ప్రాంశూజ్జ్వలహర్మ్యమండితధునీవృద్ధ్యాఖ్యపుర్యాశ్రితః,
తస్య శ్రీదయితస్య లోకవితతాం కీర్తిం సదా గాయతాం
నః పాపం విలయం వ్రజేల్లవణవత్ క్షిప్తం పయోధౌ క్షణాత్.

మ. నిజపాదాంబుజయుగ్మమెప్పు డెదలో • నిశ్చింతగానిల్పి నే
భజియింపం దయజూచి యిప్పుడు లస • త్ప్రాకార వేశ్మధ్వజ
వ్రజసంశోభితమౌ సరిత్పురమునన్ • వాస్తవ్యుడై యుండు పం
కజపత్రాక్షు యశంబు బాడ నఘముల్గాంచు న్వినాశస్థితిన్.

6. ఒ న్ను ని ల్లా కె డు మ్.

శ్లో. యః పూర్వం శిశుపాలపక్షపతితం రుక్మిం తదీయాన్నృపాన్
జిత్వోపాయత భీమరాజతనయాం పంకేజపత్రేక్షణామ్,
యోఽధ్యాస్తేసతతంమదీయహృదయంసంస్తూయమానోమయా
ధిష్ణ్యం తస్య సరిద్వివృద్ధినగరం పాపాపనుత్త్యై స్తుత.

మ. శిశుపాలాదుల గెల్చి యుద్ధమున నా • శ్రీరూపిణి న్రుక్మిణిన్
శశిబింబానన బెండ్లియాడి కృప మ • త్స్వాంతస్థితుండౌ ఫణీ
శ శివేంద్రాదినుతుండు సంతతనివా • సప్రీతి జెన్నొంద స
ద్యశము ల్గల్గు సరిన్మహానగరమున్ • దర్శింపగాఁ బోవుడీ.

7. నీణగరముదువే.

శ్లో. గత్వా బాణపురీం పురత్రయరిపుం క్షిప్రం నిరస్యాహవే
దోఃఖర్జూపరిగర్జద్రసపపతే శ్ఛేత్తుర్భుజానాం తతేః,
పుష్పారామపరీతశీతలసరిద్వృద్ధ్యాఖ్యపూర్వ్యాసినో
విష్ణోః పాదసరోజమేవ శరణం స్యాన్నః కిమన్యద్భవేత్.

మ. సుమవాటీవృతమౌ సరిన్నగరమై ♦ శోభిల్లు వైకుంఠమం
దమరాధీశమణిప్రభాంచితతనుం ♦ డంభోజనేత్రుండు బా
ణమహాదైత్యభుజాటవీప్రలవనో ♦ న్మానప్రతాపుండు శ్రీ
రమణుండే మన కెల్లకాలము పరి ♦ త్రాణంబు గావింపగా
క్షము డన్యుండిల లేడు రక్షకుడు వి♦శ్వంబందు నూహింపగన్.

8. అన్నిమత్తోన్నిలస్.

శ్లో. త్వత్పాదాంబురుహం విహాయ శరణం నాస్త్యన్యదిత్యార్తితః
క్రిందంతం విపదో గజం కరుణయా త్రాతుం జవాద్యో గతః,
తస్యాతిప్రియధామ పుష్పవనికారమ్యం సరిద్వృద్ధిరి
త్యాఖ్యాతం నగరం పరీత్య నమత ప్రాజ్ఞా శమేత్కిల్బిషమ్.

శా. నీపాదాబ్జముదప్ప రక్షక మిల ♦ న్నేగాన నన్యంబు నో
గోపీవల్లభ కావవే యని మహా ♦ కుంభీరవక్త్రాంతర
వ్యాపాద్యుండగు దంతియూథపుని కు♦య్యాలించియయ్యాపదన్
బాప న్బోయినవాని వేశ్మ సుమనో ♦ వాటాపగాపూర్వరం
బేపార న్వలగొంచు మ్రొక్కులిడగా ♦ నే దుఃఖముల్లగ్గునే.

9. తీవినైయుళ్లత్తిన్.

శ్లో. పాపానాం నికరం వినాశ్య పరమం ప్రాప్తుం పదం వాంఛతో
మే స్వాంతం కరశ్రైః స్త్రీభిర్బుధవరై స్సంసేవ్యమానం ముహుః,
సాంద్రారామనివారితోష్ణకిరణప్రాచండ్యమచ్ఛం సరి
ద్వృద్ధ్యాఖ్యం నగరం పరీత్య నతిభి స్తోతుం సదా సస్పృహమ్.

తే. గీ. నిత్యసూరుల నుతులచే ♦ నివ్వటిల్లు
నిమ్నగావృద్ధిపురమును ♦ నీరజాక్షు

పరమపదమును నాకు సం ♦ ప్రాప్తమైన
పరమసుఖంబును వీడి నా ♦ స్వాంత మెప్పు
డాశతో నిమ్నగాపురి ♦ నభిలషించు.

10. శిం ద్రై మ త్రో న్ని స్.

శ్లో. భూదేవైః కరణత్రయేణ సతతం సంసేవ్యమానం మనో
హ్లాదోత్పాదకరామణీయకజుషి ప్రాప్యే విరక్తాత్మనామ్,
శ్రీవైకుంఠేత్యభిధానపత్తనవరే నిత్యానుషక్తం హరిం
త్యక్త్వాఽన్యన్మమ మానసం న మనుతే జానాతి తచ్ఛ్రీపతిః.

ఉ. భూసురసంఘము ల్గలిసి ♦ భూరినుతుల్పచరించి దాసులై
వాసముజేయుచున్న నది ♦ పట్టనమందు మదీయమానసం
బాసజెలంగ సక్తిగనె ♦ నన్యమెఱుంగదు కైటభారియున్
మోసము గాదటంచెఱుగు♦మున్నె సమస్తమెఱింగియుండుటన్.

11. తీ ర్థ ను క్ల త్త పి స్.

శ్లో. శేషీభూయ హరేః పదాంబుజయుగాదన్యన్న మే రక్షకం
స్యాదిత్యేవ ధృతవ్రతస్స కురుకానాథ శ్శఠారి ర్మునిః,
యచ్ఛక్రే పరమం సహస్రమమలం తస్మిన్ దశైతా న్పఠన్
దేవీనాం పురతస్సుపావన ఇతి ప్రోద్ఘుష్యతే సూరిభిః.

ఉ. పావననాముడైన నవ ♦ పద్మదళాక్షునికంటె వేరుగా
దైవము లేడటంచు మది ♦ దార్ఢ్యముగల్గిన శ్రీశఠారి స
ద్భావముతో రచించిన ప్ర ♦ బంధమునందలి యీపదింటి శ్ర
ద్ధావశులై పఠింపగల ♦ ధన్యులు తీర్థసమానులంచు నా
దేవగణంబు మెచ్చి తమ ♦ దేవులతోడ వచింతు రాదృతిన్.

శ్రీ మ తే శ ఠ కో పా య న మః.

సప్తమశతకము సమాప్తము.

శ్రీశఠకోపాయనమః.

శ్రీమతే రామానుజాయ నమః.

# ఆంధ్రగీర్వాణ శఠకోపసహస్రము.

## —♦ అష్టమ శతకము. ♦—

### మొదటి దశకము.

[తేవిమాగావార్.]

అవతారిక :—పిరాట్టిమార్లతో నిత్యపరికరము సేవింపగా పర్యంకవిద్య యందు జెప్పబడినట్లు సర్వేశ్వరుడు తిరువనన్దాళ్వానై వేంచేసి యుండి మనము రచించిన తిరువాయ్మొళ్ళిని వినుటకు తిరువారన్విళైయిలో సిద్ధముగా నున్నాడు. మనమచ్చటికి బోయి యాగ్రంథమును వినిపించి కైంకర్య మొనరించి భగవంతుని యనుభవించెదమని వీరు మనోరథించిరి. కాని యిది మనోరథమాత్రమేగాని నిజముగా నెన్నడు ఫలింపలేదు. పిరాట్టిమార్లు సమీపమందుండగా నిత్యసూరులు చుట్టివారుకొని యుండగా ననుకొన్నట్లు కార్యము కావడమునకు దగిన యైశ్వర్యము పూర్ణమై యుండగా ఆశ్రితులిష్టపడిన ద్రవ్యమే తనకు తిరుమేనిగా స్వీకరించి యుపకరించు స్వభావము గలవాడై యుండగా నాకు రుచిపూర్ణమై యుండగా నేననుకొన్నట్లు కార్యము కాలేదే యని యీయాళ్వార్లు మిక్కిలి దుఃఖితులైరి. ఈయాళ్వార్లు తమకు రక్షకములని తలంచియుండు రెండుస్వభావములు ఈశ్వరుని కున్నవి. అవి యెవ్వియనగా : ఒకటి ఆశ్రితపరతంత్రుడై యుండుట, రెండవది స్వవ్యతిరిక్తసమస్తవస్తువులు తనకు ప్రకారముగాను తాను ప్రకారిగాను నై వీనికి వచ్చిన వ్యసనము తనకు వచ్చినట్లు తలంచుప్రాప్తి. ఈశ్వరునియొక్క యీ రెండుస్వభావములు తమపట్లను కార్యకరము లగుట వీరు చూడలేదు. నేనుండుటంబట్టి కాబోలు యీశ్వరుని యీరెండుస్వభావములు అసత్యమై పోయినవి. ఇదియు నాదురదృష్టమేయని శంకించినారు. గుణజ్ఞానముచే జీవించువారలు గుణములయందతిశంక పొడమినచో జీవింప జాలరు. ఇంతలో నీశ్వరుడు వీరిని మనము పోగొట్టుకొన గూడదు. వీరిని సమాహితులనుగా జేయునుపాయ మెద్దియో యని యాలోచించి, ఆళ్వార్ ! ఇట్లొకసారి రండు. మీరు చూచిన ప్రతివిషయ మందును మీకెందు కింత శంక ? నేను మీకేమియు జేయలేదా ? ఇంతవఱకు మీ కుపకారము చేసినవాడ నికమీద జేయలేనా ? మీకిట్టి సంశయ మవసరము లేదు.

అని చెప్పి తనవిస్రంభణీయత్వప్రముఖములైన కల్యాణగుణములను తానిదివరకు వీరి విషయమై చేసిన యుపకారములను కనబర్చి వీరి శంకను పోగొట్టి సమాధానము చెప్పగా సమాహితులై సంతసిల్లిరి. ఈతిరువాయ్మొళికి ఆళవందారు— “ఖ్యాతః ప్రాజ్ఞః కృతజ్ఞశ్చ సానుక్రోశశ్చ రాఘవః, సద్వృత్తో నిరనుక్రోశ శ్శంకే మద్భాగ్యసంక్షయాత్.” అను శ్లోకమును సాధించువారట. “ఇఱందదుం నీయే ” అను నది ఉయిర్పాట్టు.

## 1. తే వి మా రా వా ర్.

శ్లో. త్రైలోక్యం తవ శాస్య మబ్జనిలయాధాత్ర్యౌ మహిష్యౌ సురాః
కింకర్వాణగణా స్తవాఖిలమిదం యు త్తద్వపుస్తే హరే,
ద్రష్ట్రస్వాంతమువిష్ణునాయితసరోజాక్ష ప్రవాళాధర
తుఙ్మభృద్భిన్మణిభాసముజ్జ్వలతనో త్వద్దర్శనం దేహి మే.

శా. శ్రీభూదేవులు నీకు దివ్యమహిషుల్ ♦ చిత్తంబు రంజింప శ్రీ
ద్ధాభక్తిప్రవణు ల్సుపర్వులు భవ ♦ ద్దాస్యైకదీక్షారతుల్
నాభీపంకజసృష్టపంకజభవా ♦ ండంబెల్ల నీపాల్యమా
స్వాభీష్టంబగు రూపమే మహదుపా ♦ స్యంబైన రూపంబు స
ద్భాభా సీయధరప్రవాళజలజా ♦ క్షిద్వయీసంస్ఫుర
చ్ఛోభల్ నన్ను గలంచుచున్నవి కుభృత్ ♦ కుంభాంబురాశీ భవ
ల్లాభానందము గల్గునట్లు కృపతో ♦ లక్ష్మీశ వీక్షింపుమా.

## 2. కా ణు మా అ రు ళా య్.

శ్లో. ఆత్మానం మమ దర్శయేతి ముహురప్యార్తశ్య సాశ్రుస్త్వయి
న్యాకాశ స్తవ నామ సంతతమహం జల్పన్ప్రతీక్షే కృపామ్,
మద్భాగ్యామరభూజపక్వఫల సద్భక్తామృతాధోక్షజాఽఽ
స్థాయ క్రీడతనుం మహీం జలగతాముత్క్షిప్తవన్కేశవ.

సీ. ఒకపరి దర్శనం ♦ బొసగుమయ్యా యటంచు
గన్నుల నశ్రువు ♦ ల్గట్టకుండ
మొఱవెట్టుచుంటి నే ♦ మురహార నాయాస
దీరంగ నీదగు ♦ దివ్యనామ

వితతి నే నెప్పుడు ♦ విసువక వాక్రుచ్చ
గరుణింపుమీ నన్ను ♦ గమలనాభ
మదోభ్గ్యసురభూజ ♦ మధురఫలోపమ
యదుకులాబ్ధిశశాంక ♦ సదయహృదయ
తే. గీ. ప్రళయపాథోధిపాథఃప్ర ♦ వాహమగ్న
కాశ్యపీమండలోద్ధృతి ♦ కలితసార
కుటిలదంష్ట్రావిభూషిత ♦ క్రోడరూప
శ్రీశ నినుజూచు విధమెద్ది ♦ చెప్పుమికను.

### 3. ఎ దు త్త పే రా ళ న్.

శ్లో. శ్రీమన్నందయశోదయోర్నిధిరివ ప్రాప్తోతిసౌలభ్యతో
మన్నాథ క్రకచోపమాత్మనఖరక్షుణ్ణాసురోరస్థల,
స్వామిన్నామయికం వపుః పరిగతో మాం నోపసర్పేర్యది
త్వద్వాత్సల్యగుణైకతానమతయస్త్వాం విశ్వసేయుః కథమ్.

ఉ. నందునిపుణ్యపుంగని య ♦ నంతమహాహిశయానుఁ డంబుజా
నందకరుండు దాసజన ♦ నాకమహీరుహ మంబుజాసనా
మందవరప్రదానమద ♦ మత్తహిరణ్యవపుర్విదారణా
నంవకతుల్యశాతనఖ ♦ నన్ను దయామతి నేలు మచ్యుతా.

### 4. ఉ ను రు క ం దు క ం ద పు రు వ మ్.

శ్లో. శౌరవ్యధ్వజినీవనౌఘదమునా గీర్వాణపీయూషవ
దోభ్గ్య క్రవ్యభుగంతకాయిత హరే మద్ధారకాబ్జాసఖ,
భక్తేష్టం వపురేవ నైజతనురిత్యంగీకరోషి ప్రభో
భక్తాహ్లాదకరాం స్తవాద్భుతగుణాన్యంకే మృపేతి స్ఫుటమ్.

చ బవరము బన్ని దుష్టనర ♦ పాలసమూహము బిల్లుమార్చి యీ
భువి భరమెల్ల మాన్పిన వి ♦ భుప్రవరా సుధమాడ్కి భోగ్యుడా
సవనవిరోధివర్గనిష ♦ సామ్య మదీయవరిష్ఠజీవమా
భవదఘభిత్పదాంబురుహ ♦ భక్తు లొసంగిన రూపనామముల్

భవదభిమానపాత్రముగ ♦ భావన సేసెద వీవు పద్మసం
భవభవముఖ్యదేవనుత ♦ భక్తజనావళినిమ్ము చేప్టితా.

5. ఆ ర యి రే యో.

శ్లో. యః స్సృష్ట్వా విశ్వమేత న్నిగిరతి విలయే యః పున స్సర్గకాలే
నిష్ఠీవత్యంతరాత్మా నిఖలతనుభృతాం యో మమేచ త్రిలోకీమ్,
యేనాఙ్గా స్సృష్టమంభః ప్రమధనశయనో త్తాపనై స్సంస్కృతంతం
త్వాందేవందేవతానాంకథమహముపయామ్యాశ్రితానిష్టహారిన్.

సీ. జగమెల్ల సృజియించి ♦ జలనిమగ్నంబైన
ధాత్రిని బోత్రియై ♦ దంష్ట్రనెత్తి
ప్రళయకాలంబున ♦ భంగంబు రాకుండ
కడుపులోనుంచి యు ♦ ప్పాడమిగాచి
వెలినిడి సృష్టిలో ♦ విధృతవామనవేష
మున గొల్చి రక్షించి ♦ ముదముతోడ
గలశపాథోరాశి ♦ జిలికి సువర్వుల
కమృతం బొసంగియు ♦ నవనిజాత

తే. గీ. కొఱకు వార్ధిని బంధించి ♦ కుటిలదైత్యు
జంపి జగముల రక్షించు ♦ జాణవీవు
దేవతలకెల్ల నెక్కుడు ♦ దైవమీవె
యిట్టినిన్నెట్లు పొందంగ ♦ నెంచువాడ
నీవె నాకడ కేతెంచి ♦ కావుమయ్య.

6. ఎం గు వం ద ను గో.

శ్లో. స్వామిం స్త్వంసర్వలోకా స్త్వమసిసురగణ స్తద్గతైరచ్యమాన
స్త్వం తల్లోకస్థజీవోత్కరకృతమఖిలం కర్మ విద్యా స్త్వమేవ,
అండాద్యావ్యాప్తితాని ప్రకృతిమహదహంకారతత్త్వాన్యదృశ్యా
జీవా స్త్వది వ్యాప్యసర్వంస్థితమిహ జడధీఃకుత్రలప్స్యేభవంతమ్.

సీ. ఎచ్చట నిను బొంద • నిచ్ఛగించెద సామి
యీరేడులోకంబు • లీవెకావె
తల్లోకముల నుండు • దైవంబులును నీవె
వారొనర్చెడు కర్మ • భార మీవె
పద్మజాండమునకు • బైనున్న మహదాది
తత్త్వజాతం బెల్ల • దలప నీవె
ప్రళయకాలంబున • బ్రభచెడి సూక్ష్మమై
శేషించియుండెడు • జీవు లీవె

తే. గీ. చక్షురాదీంద్రియంబుల • సమితి వీవె
నీవుకానిది యెచ్చోట • నెమకి నేర్తు
'నేతి నేతి' నిషేధంబు • నీకె చెల్లు
నేను యత్నించి నినుజూడ • నేరనయ్య.

7. ఇ ఱ ం ద దు ం సీ యే.

శ్లో. సద్యోదుగ్ధపయోఘృతామృతరసస్వాదిష్ఠ తత్స్వాదన
ప్రీతిప్రస్ఫుటరూప సద్గుణనిధే నీళావధూవల్లభ,
త్రైకాల్యప్రతిబద్ధజీవవితతే రాత్మేతి సంప్రత్యయా
జ్జీవామ్యత్ర విశంకతే మమ మనః పాపీయస శ్రీసఖ.

సీ. అప్పుడు పితికిన • యావుపాల్ నెయ్యియు
గాచిన నేతిలో • గమ్మదనము
క్షీరాబ్ధి దప్పితీ • సిన నూత్నపీయూష
మందున వర్తిల్లు • నధికరసము
నిస్సార మివియని • నిరసించుభోగ్యత
గలవాడ నీళాస • ఖా రమేశ
కాలత్రయంబున • గల్గుపదార్థణంబు
లన్ని నీకాయంబు • లబ్జనాభ

తే. గీ. అఖిలశేషివి సర్వాత్మ • వఖిలశక్తి
వనుచు నిగమాంతవాగ్వంది • గణము బొగడు

నీగుణంబులు పమ్మగు • నీరజాక్ష
నన్ను గృపజూచి రక్షింప • నున్న నేడు.

8. మ ణ ం ద పే గా యా.

శ్లో. నీళాబాహులతోపగూహనమహామోయిన్యురార్యంతక
శ్రీమన్ దాసజనాతిహింసకగుణస్తోమాహిభుగ్వాహన.
క్షీరాబ్ధౌ ఫణిరాజభోగశయనే నిద్రాణ ముద్వాఙ్మనః
కర్మాణి త్వదధీనతాముపగతాన్యక్ష్ణో నమేయం కథమ్.

సీ. నీళాస్తనద్వయీా • నిర్భరాలింగన
పీనవక్షస్థలీ • విలసితుండ
దాసహృద్విదళన • దక్షమంగళగుణ
పాథోనిధీ జగ • త్పావనుండ
పన్నగాశనకేతు • పరిమండితశతాంగ
దైత్యసందోహావి • దారకుండ
విస్తృతఫణిఫణా • విమలపర్యంకుండ
క్షీరాంబునిధిశాయి • మారజనక,
తే. గీ. విబుధనుతిపాత్ర పాపాట • వీలవిత్ర
నేను కరణత్రయంబును • నీయధీన
మగుట నే నెట్లు నుతిసేయ • దగుదునయ్య
విమలచారిత్ర విస్ఫుట • కమలనేత్ర.

9. యా ను సీ దా నే.

శ్లో. ఏషోఽహం త్వమితి ప్రమా జగదిదం స్యాత్తే శరీరం తతో
ముక్తిర్వా నిరయోఽథవాస్తు మమ కా హాని స్తథాపి ప్రభో,
స్మృత్వాఽహంభవదీయతాంమయిబిభేమ్యధ్యాసితుంసంసృతిం
త్వత్పాదౌ మమ దర్శయాచ్యుత పరవ్యోమాధివాసిన్ హరే.

సీ. శ్రీనాథ నీకు నే • శేషభూతుడనన్న
శాస్త్రోక్తి నిజము సం • శయము లేదు

అమితదుస్సహఘోర ♦ యాతనాసందోహ
దాయకంబులు శోత్రి ♦ దారకములు
నరకంబులును మహా ♦ నందసందాయకం
బగు మోక్షపదము నీ ♦ వగుటవలన
నరకమొందిన నేమి ♦ పరమసుఖంబొందిన
నేమి రెండును నాకు ♦ నిష్టదములె

తే. గీ విధిశివాదిసుధాశనా ♦ భీష్టదములు
వికచవంకేరుహాద్వంద్వ ♦ విభ్రమములు
భవదవప్లుష్టపరితాప ♦ భంజకములు
నీపదంబుల నొకసారి ♦ జూపు మయ్య.

## 10. తా ళ్ గ శై యె న కే.

శ్లో. త్వత్పాదాబ్జరుచిం వితీర్య సుమహాన్ దేవోపకారః కృతః
తం వా నిష్కృతి మస్య వేద్మి భగవన్ కించి త్తథాప్యర్పయే,
ఆత్మానం మమ పూర్ణపాత్రవిధినా గృహ్ణీష్వ పాదాబ్జదృ
గ్బాహాశీర్షసహస్ర దాసజనతానల్పోపకారి న్విభో.

తే. గీ. హస్తశీర్షాంఘ్రినేత్రస ♦ హస్రములును
నామములు వేయిగలవాడ ♦ నాకు నీదు
పదయుగం బిచ్చినందుకు ♦ బ్రీతిగ నీకు
నాత్మ నర్పించితిని దీని ♦ నవధరింపు.

## 11. పె రి యు వ ప్ప నై.

శ్లో. నాథం సర్వచరాచరస్య పితరం రుద్రస్యచ బ్రహ్మణో
ధ్యేయం యోగిజనస్య దేవవితతేరీశం పతిం చాత్మనామ్,
స్తుత్వా కారితనూభవేన మునినా గీతే సహస్రే లస
ద్వాగ్బద్ధం దశకం త్విదం పఠతిచేత్సంసారవార్థిం తరేత్.

శా. లోకస్వామి హిరణ్యగర్భజనకున్ ♦ లూనాంధకస్రష్ట నా
కౌకస్సన్మునిగమ్యు దైత్యచయహ ♦ త్యుద్ధామునిన్ గృష్ణు న

స్తోకశ్రద్ధ నుతించి కారిజుడు సు ♦ శ్లోకుండు దా గూర్చి యీ
లోకంబందున నిల్పినట్టి ద్రవిడ ♦ శ్లోకౌఘమం దీపదిన్
పీక న్బాడెడు భక్తులొందుదురు శ్రీ ♦ విష్ణ్వంఘ్రికంజాతమున్.

శ్రీ మ తే శ ఠ కో పా య న మః.

శ్రీమతేరామానుజాయనమః.

## అష్టమ శతకము—రెండవ దశకము.

[సంగశ్వరివశై.]

అవతారిక :— క్రిందతిరువాయ్మొళ్ళి ప్రాపకప్రధానము. ఇది ప్రాప్యప్రధానము. ఈయాళ్వార్లు క్రిందతిరువాయ్మొళ్ళిలో వాని గుణములయందు స్వరూపమందు నతిశంక గలవారై కొనకు తెలివి దెచ్చుకొని "వణంగుమా అఱియేన్" అని తమయందు సాధనయోగ్యతను విడుచుకొని "యానునీతానే యావదో మెయ్యే" అని వానియందు తమ స్వస్థిగతను జెప్పి యిట్లు ప్రాసంగికముగా "వాడే ప్రాపకుడు" అను నంశమును నిష్కర్షించుచున్నారు. అతడే ప్రాపకుడైనప్పుడు పురుషార్థలాభమునకు విలంబహేతువు లేకుండ నుండగా నాతడు వచ్చి ముఖము కనబర్చకపోవుట కేదో యొక హేతు వుండవలెనని యాలోచింపగా నట్టిదోషము ఆతనియం దెద్దియు గానరాలేదు. ఇందుకు మూలము మనయందే యుండవలెనని తలంచిరి. "మమైవ దుష్కృతం కించి న్మహాద స్తి నసంశయః" అని పిరాట్టియు సాధించిరి. వీరు నారీతిగానే చిరకాలము సంసారమందుండి కంటికి గనబడిన విషయమందెల్ల రుచిగలవాడనై యుంటిని. మన పూర్వవృత్తమును మనప్రకృతపుస్థితిని సర్వజ్ఞుడైనవాడు తెలియనివాడుకాడు. నేను వానియెడల నుండవలసిన రుచిలో గొంత నొందియుంటినని యాలోచించి "అది యుండనిమ్ము లేకపోనిమ్ము" బాహ్యవిషయములయందు నాకు రుచిలేదను సంగతిని నాతని మనస్సులో బడునట్లు చేయుదమని తలంచి ప్రాప్యవిరోధులయందు ప్రాపకవిరోధులయందు తమకు రుచిలేదని యన్యాపదేశముఖముగా సాధించుచున్నారు. సర్వేశ్వరునితో సంశ్లేషించి వియోగమును జెందిన యొకపిరాట్టి, నాయకుడు తనవద్దకు రాకపోవుట జూచి నాయకు డున్నచోటి కభిసరింప నుద్యోగింపగా నామెచెలులు మొదలగువారిది చూచి "నీకిది తగదు సుమా" యని హితము చెప్పి మగిలించుటకు బ్రయత్నిం

పగా "ఇక మీతో నాకు సంబంధము లేదు. నాయాశను మీరు విడుచుకొను" డనిచెప్పిన మాటలచే బాహ్యవిషయములయందు తమకు రుచిలేదని సర్వేశ్వరునికి దెలియ జేయుచున్నారు. ఇందులో "ఇడైయిల్లైయాన్" అనునది ఉయిర్పాట్టు.

1. సంగశ్వరివశై.

శ్లో. మన్మాతుః పురతో మదాధికథనాజ్జిహ్రేమి సఖ్యో భృశం
తదోవ్య వక్తుమనా విచార్య సగిరా శక్నోమి మోక్తుం మనః,
శేషాద్రీశమహీంద్రవ్యడాసన మహం బద్ధాభిలాషా గతా
ద్రిష్టుం పశ్యత దుర్విధిం స్తనతటీ వైవర్ణ్యమాపద్యతే.

మ. చెలులారా మనశత్రుసన్నిధిని నే • జెప్పంగ లజ్జించి యీ
పలుకు ల్మీకు వచించెద న్వినుడు మా • పద్మాక్షు దర్వీకరా
చలశృంగాగ్రనివక్తు శ్రీదయితునిన్ • సౌందర్యసారాస్పదున్
గలయం జూడ నురోజయుగ్మము పిము • క్తప్రీతిణీయత్వమై
చెలగెం జా రెను కంకణావళులు హా • చ్చె న్మేన వైవర్ణ్యముల్.

2. వేండిల్ శెన్నా న్ను.

శ్లో. సఖ్యః ప్రాణసమాః కథం మనసిజోద్దామవ్యథాం వచ్మి వో
ద్రిష్టుస్వాంతవిమోహకారుణసరోజాతాయతాక్షో హరిః,
దేవానామధిపో జహార వలయైస్సాకం విసీతిం మమ
ప్రత్యాదాతుమిదం ద్వయం చిరమహం క్లిష్టా ప్రతీక్షే కియత్.

తే. గీ. నాకు సమదుఃఖసుఖులైన • నాతులార
యేమి జెప్పుదు మీకు నే • నెంచిచూడ
మద్గుణంబుల హరియించి • మరుగువడిన
కమలనాభుండు వెదకిన • గానరాడు.

3. కాలమిశై క్కిలల్లాల్.

శ్లో. నీలాంభోదనిభాత్మదేహరుచినా కృష్ణేన ముష్టాం తను
చ్ఛాయాం మే వలయైస్సమం పునరపి ప్రత్యాగృహీతుం దృఢా,
ఆతత్ప్రాప్తి తమన్వితాచ సతతం నోపారయా మ్యుద్యమా
ల్లోకేచ పరిధిశం మమాప్యపయశః కిం వా భవే ల్లజ్జయా.

శా. నీలాంభోధరకాంతిహారివికస • న్నీరేజపత్రాక్షుడున్
నీళోత్తుంగకుచోపగూహనరసో • న్నిద్రైకనిష్ఠుండు నా
లీలామండనజాతమున్ దనుఁగుచిన్ • లేకుండ దా మ్రుచ్చిలెన్
రోలంబాలకలార వానిపిరుదన్ • రూఢాతిసంతాపనై
శీలభ్రంశమునైన సైచి చనగా • శ్రీనాయకాంఘ్రిద్వయీ
లోలస్వాంతలె నొందె నిద్ధయనుచున్ • లోకంబు సన్నాడెడున్.

4. కూ డ చ్చె న్నె న్.

శ్లో. ప్రాకారధ్వజహర్మ్యశోభితమహాకాసారపుర్యాశ్రితం
చక్రాలంకృతసవ్యపాణిమమితాశ్చర్యైకతానం హరిమ్,
ఆదృత్యానుసరామి పాణివలయస్వాంతాద్యశేషం త్రపాం
ముంచామ్యస్య సమీపఏవ మమ కిం హాతుం పరం శిష్యతే.

ఉ. అంబరచుంబిహర్మ్యగణ • మై దనరారెడు కుంభఘోణమం
దంబుజసంభవాదిసుర • లంఘ్రి నుతింప వసించుచుండు న
య్యంబుజలోచనుండు పర • మాద్భుతలీలుడు దైత్యమర్దనా
ఘ్యంబగు చక్రముం దనదు • హస్తమున న్గలవాడు నాదు హ
స్తంబుల కంకణాదులను • స్వాంతమునున్ హరియించె నేమనన్.

5. ఆ ట్రి వ ల వ నై.

శ్లో. సఖ్య స్స్పష్టు విచారితే నిరుపమజ్ఞానాత్మనాం యోగినాం
నిత్యజ్ఞానజుషామగమ్యమహిమా మాయా రథాంగాంచితః,
సర్వాది ర్విహతాఖిలప్రతిభటో జ్యోతిర్మయ శ్శ్రీపతి
ర్ధ్యాతో౽స్మత్సవిధం వ్రజేదితి భవేత్కిం సిఘ్ను మస్మాదృశే.

సీ. పడయ శక్యముగాదు • విడుపు డాశలనంచు
బలుకంగ నగునె యా • పరమపురుషు
సుగుణాంబునిధి బరం • జ్యోతిస్స్వరూపుని
సర్వేశు సర్వాది • సర్వమయుని
శంఖచక్రగదాసి • శార్ఙ్గాదిదివ్యాయు
ధోపేతు సర్వాత్ము • నుదధిశాయి

సంతతధ్యానైక ♦ సక్తసనందన
సనకాదులకు నైన ♦ సన్నుతింప
తే. గీ. దరముగాని మహత్త్వంబు ♦ దాల్చువాని
సేవనాత్రియసంగవి ♦ శోషణమున
నాశ భజియించి పొందంగ ♦ నవనిమీద
జాలుదురుగాని విడువంగ ♦ జాలరెపుడు.

6. తొ ౦ డ ర డి ప్పొ డి.

శ్లో. సా రామాఘుబృహత్సరోవరపురే సుప్తో ఽతిథాస్వత్తను
ర్మద్వాచోవిభవాతిలంఘిమహిమా బ్రహ్మాదిసంశీలితకృత్,
మత్సౌందర్యనుపాహర న్నతులసీదామ్నా స్వపాదార్పితే
పత్రిం వా న దదాతి కస్య పురతః క్రిందామి మే శంసత.

శా. వల్లీసంచయవేష్టితావనిరుహా ♦ వ్రాతాంచదుద్యానస
మ్యల్లోకోత్తరకుంభఘోణనగరీ ♦ వాస్తవ్యుడౌ వాడు సం
ఫుల్లాంభోరుహపత్రనేత్రు డుదయ ♦ త్పూవపరీభాదుస్సహాకం
డుల్లోలాబ్ధిశయుండు శౌరి కపటో ♦ ద్యోగంబున న్మ్రొచ్చిలెం
దల్లీ నాతనుకాన్తి జిన్నతులసీ ♦ దామంబు నాకియ్యగా
నొల్లం డేమియొనర్చెద న్వరులు లే ♦ రున్నారె కూపెట్టగన్.

7. మా ల రి కే శ వ న్.

శ్లో. వ్యాముగ్ధ స్స్వజనే హరి ర్మధురిపు ర్నారాయణః కేశవో
గోవిందోఽవతు మా మితి ప్రతికలం చాక్రోశయ న్నామయమ్,
నో మే దర్శయతి స్వరూపమథవా స్వావాసచిహ్నం బహోః
కాలా దప్యవిలోక్య తం న విరమా మ్యేతన్మదీయవ్రతమ్.

మ. శ్రితదేవావనిజంబు కేశవుడు మ ♦ చ్చేతోహరుం డంబుజా
పతి నారాయణుడంచు బల్మరు నను ♦ న్వాకుచ్చగా జేసి దు
ర్మతి పీడ న్గనబర్చ డాత్మవపువున్ ♦ రమ్యాత్మచిహ్నంబునున్
సతులారా యిక వాని జాడక మదు ♦ త్సాహంబు భగ్నంబగున్.

## 8. ఇడైయిల్లై.

శ్లో. మత్పుష్టా శ్శుకబర్హిణాః పరభృతో మే నాస్తి వస్సంగతి
ర్మత్స్వాంతంవలయానికాయరుచిమప్యామూలమాజహ్రివాన్,
వైకుంఠం కలశోదధి ర్వృషగిరి శ్చాసన్నభూమా వను
చ్ఛిన్నే సంసృతిబంధనే ఘమ న తాన్సంచరణయే చ్ఛ్రీపతిః.

సీ. ప్రీతితో బెంచిన ♦ పికశుకశారికా
తతులార బర్హిణ ♦ వితతులార
తనజగన్మోహన ♦ తనువు నాకగపర్చి
మామకతనుకాంతి ♦ మంజిమమును
సంతతానుస్యూత ♦ చింతనామృతపాన
మత్తమైయుండెడు ♦ మన్మనంబు
మత్కాంబుజలగ్న ♦ మహితకంకణములు
మొదలగువానిని ♦ మోసపుచ్చి

తే. గీ. శౌరి హరియించె నైనను ♦ చపలనేత్రి
విడిచినను గాని మీపొత్తు ♦ విమలు డతడు
పరమపదమును క్షీరాబ్ధి ♦ ఫణికుధరము
మనకు నేదిష్టమైయున్న ♦ గన నశక్య
మెంతెయభిలాష మున్నను ♦ చెంత జేర.

## 9. కాణ్కొడుప్పాన్.

శ్లో. దుర్దర్శో యమినామపి త్రిభువనం వైరోచనాదాత్తవా
న్మాయావామనభూమికా ముపగతో దేవాధిదేవో హరిః,
రాజీవాక్షిజనిభాననాః ప్రియతమా స్సఖ్యో జవోరాచ్యుతో
లజ్జాం మద్గుణపూర్తి మన్యదపివా దాతుం కి మస్యాస్తి మే.

చ. నిరుపమరామణీయకము ♦ నిస్తులకల్పకశాఖశాఖసుం
దరభుజయుగ్మమండితము ♦ దారము నొ వటువేషమూని దే
వరిపు బలీంద్రు జన్నమున ♦ బారి పదత్రయమూనమేదినీ

వరణమునన్ జగత్త్రియము ♦ వంచనగొన్న పరేశు డెవ్వడున్
పరమమునీంద్రయోగిజన ♦ భావనకైన నగమ్యు డట్టివా
డరుదగుమద్గుణోత్కరము ♦ నమ్మరొ మ్రుచ్చిలెనేమిసేయుదున్.

## 10. ఎన్నుడైనన్నుకల్.

శ్లో. శృంగాగ్రప్రవిషక్తసూర్యశశభృద్బింబోజ్జ్వలజ్జంగమా
నీలక్ష్మాధరవత్కరద్వయులసచ్చక్రాబ్జశోభాజుషః,
కృష్ణస్యాంఘ్రిసరోరుహాం శ్రితమిదం సంత్యజ్య మాం మన్మనః
కిం కుర్యా మధునా సహాయవిధురా రాకేందుబింబాననా.

చ. ధృతరవిచంద్రబింబమయి ♦ దృష్టివిలోభకనైల్యవిస్ఫురత్
క్షితిధరశోభ దాల్చు కర ♦ సిద్ధసుదర్శనశంఖధారియై
ధృతజలవారిదాభుడగు ♦ దేవుని సన్నిధి కేగె నామనం
బతిశయితానురాగమున ♦ నచ్చటనుండియు రానటంచు నో
యతివ వచింపుచున్న దిక ♦ నోన భవద్ధితవాక్యబోధనల్.

## 11. పాదముదైవదన్.

శ్లో. యః శ్రీకృష్ణపదాబ్జభక్తివివశో ముక్తాన్యసంగః కృతీ
నాథ శ్రీకురుకాపుర శ్శమవతా మగ్రేసరః పావనః,
తేన శ్రీశఠకోపమౌనిశశినా గీతే సహస్రే త్విదం
గాయంతో దశకం సమృద్ధిముపయాంత్యద్ధా పరత్రేహచ.

ఉ. శ్రీపతిపాదలగ్ననిజ ♦ చిత్తత సంసృతిబంధశృంఖలన్
ఏపున దుంచివైచిన య ♦ హీనయశస్కుడు శ్రీశఠారి సం
తాపితదైత్యుడైన హరి ♦ తద్దయు బాడి రచించినట్టి శ్లా
ఘాపదమా సహస్రమున ♦ గన్పడు నీపదిపద్యము ల్సదా
రేపకడ న్పఠింప నతి ♦ రిక్తరతి న్భువనద్వయంబునన్
బాపము బాసి పూర్ణులయి ♦ భాసిలుచుందురుసర్వకాలమున్.

శ్రీమతేశఠకోపాయ నమః.

శ్రీమతేరామానుజాయనమః.

అష్టమ శతకము—మూఁడవ దశకము.

[అంగుమింగుమ్.]

అవతారిక :—క్రింద తిరువాయ్మొழிలో నున్న పదియవ పాశురమందు "ఓర్ కోలనీల నన్నెడుంకున్నం వరువదొప్పాన్" (ఒక నీలపర్వతము నడిచివచ్చునట్లువలె) అని సర్వేశ్వరునిదివ్యమంగళవిగ్రహసౌందర్యము ననుసంధించి యిదివరకు తాము పొందినక్లేశమును మరచి "ఇట్టి విగ్రహసౌందర్యముతో సంసారమందు వచ్చియుండి యొంటరిగా సంచరించుచుండును. ఇచ్చటనున్న వారందఱు శత్రువులు, మధ్యస్థులు, ప్రయోజనాంతరపరులునుగాని వీనియందు స్నేహము జూపువారెవ్వరును లేరు. ఇట్లు ప్రీతిజూపువా రెవ్వరును లేని యీసంసారమందు యాచకుల అపేక్షితములను పూరించుటకొరకు సంసారిసజాతీయుఁడై తన అవతారమునకు వెనుక బడినవారికి కోయిలలయందు గృహమునయందు సన్నిహితుఁడై వర్తించు వీనిసౌకుమార్యము నెఱింగి స్నేహించువా రెవ్వరును లేరు. నేనును వాని కుపయోగింపక పోతిని." అని యీయాళ్వార్లు భీతినొందగా, "నాయందు బ్రీతిగలవా రెవ్వరును లే"రని మీరు భయపడవలదు. ముముక్షువులు, ముక్తులు, నిత్యసిద్ధులు అసంఖ్యాకులై యున్నారుగారా ? నాయందు బ్రీతిజేయుటయే వారికి నిత్యయాత్రకాదా ? అని సర్వేశ్వరుడు తన సర్వశక్తిత్వమును గనబఱచి సమాధానముచేయగా సమాహితులై సంతసించుచున్నారు. ఇందులో "ఆళుమాళార్" అనునది ఊయిగాప్పాట్టు.

1. అంగుమింగుమ్.

శ్లో. ఊర్ధ్వాధోభువనేషు దేవపలభుఙ్మర్త్యాశ్చ తత్త్వం తవా
జానంత శ్శకనాదికాన్ శుభగుణానావర్తయంతో ముహుః,
శ్రీభూనాగ్నజితీభి రాశ్రితతను శ్చక్రాబ్జరాజత్కర
శ్శ్రీనారాయణఏవ రక్షకఇతి ప్రఖ్యాపయంతి ప్రభో.

ఉ. మీఁదజెలంగు లోకముల ♦ మేదినిపైని రసాతలంబునన్
మోదముతోడనుండుసుర♦ముఖ్యులుమానవులు న్సురారులున్
గోదయు శ్రీయు భూమియును ♦ గోరిక లీరికలెత్త గాంతలై
మోదమునింప జక్రదర ♦ ముల్గ్రహియించి వెలుంగు దేవుడే
ఖేదములేక మమ్ము గృప♦గృప్యుల జేయుచు బ్రోచువాడటం

చాదరబుద్ధి గాని మరి ♦ యాతనిదేహావరాయుధాళి కే
బాధయు లేక మంగళము ♦ బాడెదువా రిలలేరు చూడుడీ.

శరణాగతియు.

శ్లో. ఐశ్వర్యాదిపుమర్థసాధనపరా న్వేదాన్నిరస్యాంజసా
లోకద్విష్టసురారిసైన్యదహనాచ్చిరత్మలభాగ్భవత్,
చక్రం భక్తజనావనైకనిరతం యస్యాయుధం తద్విభో
ర్దాసీభూయ జరామయాదివికృతి గుచ్ఛిన్నవంతో వయమ్

స్వర్గనివాసజన్యములు ♦ సారపుభోగముల న్విధించు వా
గ్వర్గము దోసిపుచ్చి సుర ♦ బాధకదైత్యచమూవిమర్దనా
నర్గళచక్రధారి సుర ♦ నాథవినీల మణిప్రభాంగునిన్
భర్గముఖామరస్తుతుని ♦ పాదము బట్టి జరామయాదిదు
ర్వర్గము బారదోలితిమి ♦ భద్రము గంటిమి వాని సత్కృపన్.

3. అభయశ్లోకః.

శ్లో. దేవ స్స్వయం వహతి హేతివరాన్కరేణ
నైకం నియోజయతి తద్వహనే స్వభృత్యం.
నాన్వేతి కోఽపి ధృతచాపధను స్తదీయః బా
హ్వాంఘ్రిదర్శనరతో విచినోమి నిత్యమ్.

ఉ. ఎవ్వరులేరు కింకరుల ♦ దేమియొగాని స్వశంఖచక్రముల్
దవ్వులకేగు మోసికొని ♦ తామరసాక్షుడు ఖడ్గచాపముల్
చివ్వలవెంట దీసికొని ♦ శీఘ్రముగా జనువారులేరుగా
బువ్వులవంటి పాదముల ♦ బూజలొనర్పగ జాలనైతినే
కవ్వడి భంగినేవెదకి ♦ గానగ నాతరమే ధరాస్థలిన్.

4. బాలంపోనకంపత్తి.

శ్లో. భూత్వా శిశు ర్నిగళితాఖిలలోకనూత్నే
న్యగ్రోధపల్లవపుటే శయితా స్మదీశ,

భావత్కసుందరతనుద్యుతిదర్శనేప్సో
ర్లేశః క్షణో మమ భవే చ్ఛతకల్పకల్పః.

చ. శిశువయి లోకముల్మెసవి • చెన్నగు మఱ్ఱిని బండినట్టి యో
వశివినుతా భవఘ్ననని • భవప్రభ జూచెదు వేడ్క చేతనే
కృశతవహించియుంటిగదు • కృచ్ఛ్రముతోఁ ద్రుటికల్పమయ్యెనీ
నిశలు మహాంధకారమున నిండె నికేమి వచించెదన్ హరీ.

5. కో డి యా ర్మా డ.

శ్లో. ఉచ్ఛ్రధ్వజాంచితగృహాళివిరాజితే శ్రీ
కోళూరుపత్తనవరే లలితామ్లపుర్యాం
నిద్రాసి నిశ్చలతయా స్వజనార్తినాశ
శ్రాంత్యా కిము క్షితితల క్రమణశ్రమో వా.

తే. గీ. ధ్వజపరిష్కృతకోళూరు • వరపురాన
నామ్లనగరంబునను దేవ • యతిసుఖముగ
బవ్వళించుట భక్తుల • బాధలుడుప
గలిగినశ్రమంబుననో లేక • కమలమృదుల
చరణముల లోకములగొల్చు • శ్రమయో చెపుము.

6. ప ణి యా వ మ ర ర్.

శ్లో. సూరివ్రజేన సతతస్తుతసద్గుణౌఘ
శ్చక్రాబ్జమండితకరశ్చ వికుంఠవాసీ,
లోకస్య తాప మపనేతు మిహా వతీర్ణః
పాకారి నీలమణి సుందరవిగ్రహస్సన్.

ఉ. సూరిజనౌఘదివ్యనుతి • శోభితుఁడై రమణీయశార్ఙ్గ శం
ఖారివరాయుధోత్కరము • హస్తములన్ ధరియించువాఁడె జల
భారిమణిప్రభాంగయుతుఁ • డై శ్రితచేతన సంసృతివ్యధా
వారణబుద్ధి నీవసుధ • పై జనియించె మనుష్యదేహుఁడై.

## 7. నరువార్ శెల్వార్.

శ్లో. ఆయాంతి యాంతి బహవః పరిశారపుర్యాం
పద్మాలయాధ్యుషితరమ్యభుజాంతరస్య,
ధృత్వా యుధాని తవ పృష్ఠమనుప్రయాతు
మస్తీహ కశ్చిదితి కోపి న వేదయేన్మామ్.

తే. గీ. వచ్చువారును జనువారు ♦ హెచ్చుగాని
వెలయు బరిశారపురవర ♦ నిలయుడైన
శ్రీపతికి శంఖచక్రముల్ ♦ చేతబట్టి
వెంట జనుదెంచుదాసుడు ♦ వేడ్కమీర
నుండె నొకడంచు జెప్పవా ♦ డొకడులేడు.

## 8. ఎన్నేయెన్నై.

శ్లో. పాదాంభోజమితాబ్ధివేష్టిత జగత్సందోహ చక్రిన్విధో
పంకేజాత భవామరేంద్రముఖగీర్వాణౌఘ సంసేవిత,
సౌందర్యైకనిధాన మంఘ్రియుగళం ప్రాపయ్య మాం కింకరం
కర్తుం శ్రీశ కదా వ్యవస్యసి తతో ధన్యో భవిష్యామ్యహమ్.

శా. సప్తార్చిర్నిచయాతిభీషణమహా ♦ చక్రా రమేశా హరీ
సప్తద్వీపకులాచలాంబునిధియా ♦ త్మామండలంబెల్ల సం
గుప్తప్రక్రియ గొల్చి మించిన భవ ♦ ద్గూఢాంఘ్రి నజ్ఞానసం
సుప్తిం జెందిననన్ను జేర్చి భవమున్ ♦ శోషింపగా జేసి ప్రా
జాప్తిన్ ధన్యుని జేయ నీమనములో ♦ నాహ్లాద మెన్నండొకో.

## 9. తిరుమాల్ నాన్మగన్.

శ్లో. లక్ష్మీకాంత! సరోజసంభవమృడస్వారాణ్ముఖా నిర్జరా
స్తోతుం త్వన్మహిమైకదేశమపి నో శక్తాః కియంతః పరే,
ప్రీత్యా త్వయ్యరవిందనేత్ర కలుషీభూతాంతరాత్మా జగ
ద్ధేతో నీలతనుద్యుతే మమ పరే త్యుచ్చైః ప్రజల్పామ్యహమ్.

మ. సరసీజాక్ష భవన్మహత్వ మెఱుఁగన్ • సామర్థ్యహీనుల్ భవుం
డరవిందాసనుఁ డన్యచోదితుఁ దే • వాళు ల్గనన్ శక్తులే
పరమా సర్వజగన్నిదాన స్పృహారీ • ప్రావృట్పయోదాభకా
య రమావల్లభ యంచు నిన్ను సతతం • బాళించి కీర్తించెదన్.

10. కలక్క మిల్లా.

శ్లో. అజ్ఞాతసంస్కృతికథా మునయశ్చ ముక్తా
నిత్యాశ్చ తం మథితవారినిధిం స్తువంతి,
అజ్ఞాశ్చ దుర్విషయసక్తహృదః పరేశం
కార్త్స్న్యేన తం నుముక్షతి భ్రమమేవ యాంతి.

చ. సనకసనందనాది ముని • సంఘము ముక్తులు సత్తపస్వులున్.
ఘనవిమల ప్రబోధ మొద • గల్గిననిత్యులు వారిజేక్షణున్
వనధి మథించినట్టి నవ • వారిదసన్నిభగాత్రుని న్సదా
వినతశిరస్కులై నుతుల • బ్రీతుని జేయుచునుండగా నకిం
చనులు నుతింప నేమియగు • శర్వముఖామరసేవితాంఘ్రికిన్.

11. ఉరైయా వెన్నోయ్.

శ్లో. శ్రీతేనిశాసక ముదోగతికంజగేహం
స్తుత్వా కృతే శఠజితా విమలే సహస్రే,
ఏతద్ది పంచకయుగం మనుజాః పఠంతో
లోకేఽత్ర జన్మ న కదాచిదతి ప్రజేయుః.

చెప్పనశక్యమైన గుణ • శీఘ్రము బోవగ శార్జ్గధన్వుపై
నొప్పఁగ శ్రీశఠారి పద • యుక్తిని గూర్చినవేయిలోని యీ
తప్పులు లేనిపద్యముల • దప్పక నిత్యము బాడుచుండువా
రప్పులదీర్చి పొందగల • రవ్యయలోకనివాససౌఖ్యముల్.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతే రామానుజాయనమః.

## అష్టమ శతకము - నాల్గవ దశకము.

[వార్కడావరువియాన్డై.]

అవతారిక :—క్రింద తిరువాయిమొళ్ళిలో సర్వేశ్వరుడు సంసారిచేతనుల యపేక్షయే యాలంబనముగా సంసారమం దవతరించి యొంటరిగా సంచరించుచుండును. సంసారులును తమ తమ యపేక్షితములను లభించుకొనుటకు వానియొద్దకు బోవుటతప్ప వానియతిశయమును దెలిసికొని వానియందు ప్రేమజేయువారు లేరు. ఏమి యనర్థము వానికి సంభవించునో అని భయపడిన యీయాళ్వార్లకు సర్వేశ్వరుడు భయము తీరునట్లు "మాయందు ప్రీతిగలవారున్నారు. ఒకరిప్రేమతో నవసరము లేని శక్తియు నాకున్నది" అని తనరీతిని గనపర్చి సమాధానము చెయ్యగా సమాహితులైరి. "కాతలై మ్రయలేరి కర్కాలంగి" అన్నట్లు యీయాళ్వార్లు ప్రేమస్వభావులై యున్నారు. ముక్తులు నిత్యులు నీవిభూతియందు లేరు. సనకాదులెల్లపుడు తపోధ్యానసమాధులలో మగ్నులై యుందురు. సముద్రమును మథించుట దేవజాతికొరకేకదా ? అని కాలుష్యమును జెందగా నీశ్వరుడు వీరికిట్టి భయమిక నుండగూడదని యోచించి తనశౌర్యవీర్యాదిగుణములను, సృష్ట్యాద్యద్భుతకర్మములను, ఎదిర్చిన శత్రువర్గమును కంకటివేరుతో నున్మూలింపగల శక్తిని గనపర్చి అందుకుపైగా నతిశయితజ్ఞానశక్తులు గలవారై తనయందు ప్రేమగల మూడువేలమంది బ్రాహ్మణులున్నారని కనపర్చగా జూచి కృతార్థులై వానివిగ్రహసౌందర్యమందు సక్తమనస్కులయి యనుభవించి సంతసించుచున్నారు.

శ్రీవిభీషణాళ్వాన్ "రాఘవం శరణం గతః" అన్నట్లు వచ్చిపడ్డప్పుడు మహారాజా పెరుమాళ్లయందున్న ప్రేమచే "వీడన్నవార్గ పెరుమాళ్ల చెవిలోబడిన యడల ననర్థము సంభవించునని భయపడి "స్వామీ, రాక్షసుడు రావణుని తమ్ముడు దేవరసన్నిధికి వచ్చుచున్నాడు, వాడిచటికి రాకూడదు" అని పలుకగా స్వామి నాయందు ప్రీతిచే నితడిట్లు పలుకుచున్నాడు మనశక్తి నితనికి దెలియజేయగా నితనికీభయము పోవుననియోంచి "పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాంచైవ రాక్షసాన్ అంగుళ్యగ్రేణ తాన్ హన్యా మిచ్ఛన్ హరిగణేశ్వర" అని తమ లోకోత్తరపరాక్రమమును వెల్లడింపగా దెలిసికొని సుగ్రీవుడు "కిమత్ర చిత్రం ధర్మజ్ఞ లోకనాథ సుఖావహ" అనిపలికి నిర్భయుడైనట్లును మల్లయుద్ధమందు "నసమం యుద్ధ మిత్యాహుః" అన్నట్లు మల్లులను జంపి ప్రక్కనున్నవారి భయమును తీర్చినట్లు సర్వేశ్వరుడు తమభయమును తీర్చగా కృతార్థులై ఆళ్వార్లు

సర్వేశ్వరుడే మనకు ధారకపోషకభోగ్యములని ప్రీతులై మునుపు వానివిగ్రహసౌంద ర్యమునుజూచి భయపడిన వీరు దానియందే సక్తమనస్కులై యనుభవించుచున్నారు. ఇందులో మొదటి పాశురమే ఉయిర్వాట్టు.

1. వా ర్క డా వ రు వి ధ్యూ నై.

శ్లో. చ్యోతద్దానాంబుధారద్విరదధరణిభృద్దంతికూటం నిహత్య
ప్రాణాపేతం విధాయ ప్రకటభుజబలా న్నాగపాలంచ రంగే,
మల్లాన్వ్యాపాద్య మంచస్థితన్పవిత తే ర్భితి ముత్పాద్య హంతా
కంసస్యా ల్పిష్టసద్యాదరపురినికటే రాజమానో గతి ర్నః.

సీ. స్యందమానమదాంబు ♦ సరిదావృతకరీంద్ర
దంతికూటంబులు ♦ దండి విరిచి
దంతిపాలకు జంపి ♦ తద్దంతముసలాయు
ధంబుల ధరియించి ♦ తాను ముసలి
రంగమధ్యంబున ♦ బొంగుచుజోరబారి
సింహపోతద్వయు ♦ శ్రీ వహించి
మంచోపరిస్థిత ♦ మానవేంద్రులు జూడ
నుచ్చాసనంబున ♦ నున్న కంసు

తే. గీ. కేశపాశంబు చేబట్టి ♦ క్రిందకీడ్చి
వధనొనర్చిన చిన్నిగో ♦ పాలుడుండు
శేంగునూరిని చిత్తారు ♦ శీఘ్రముగను
బోయి సేవింప ప్రాప్య మిా ♦ పుడమిలోన.

2. ఎం గ ళే శే కి శా ర్వ.

శ్లో. మత్ప్రాప్యంచ మదేకభోగ్య మమరాధీశం మదీశం హరిం
లోకానాం సృజనావనాంతక రణవ్యాసక్తమూర్తిత్రయమ్,
దుర్దర్శం విషయప్రసక్తమనసాం శ్రీశంఖ పుర్యాం స్థితం
క్షుద్రాయా స్సరిత స్తటే మురరిపుం ముక్త్వా న మేన్యాగతిః.

సీ. నాకెల్ల ప్రాప్యుండు ♦ నాసుధాభోగ్యుండు
నాస్వామి సూరుల ♦ నాయకుండు

మూ_ర్తిత్రయంబున ♦ ముజ్జగంబుల జేసి
రక్షించి తుంచెడు ♦ దక్షుడతడు
శఫరీవిలోడిత ♦ జలసరస్సముదాయ
విహితోపశల్యతా ♦ ప్రీతికరము
శెంగునూరుపురస్థ ♦ చిత్తారునిమ్నగ
తీరమందు ♦ న దివ్యతేజమెసగ

తే. గీ. వెలుగుచుండెడి లోకాళి ♦ బీజభూతు
సిద్ధసాధ్యాదిసురముని ♦ సేవితాంఘ్రి
భక్తజనముల పాలిటి ♦ పారిజాత
మంబుజోదరు విడిచి న ♦ హాయ మెవరు.

## 3. వి న్న మ ర్ పె రు మా ళ్.

శ్లో. నిత్యానామధిపం మదీశ మమలం దంష్ట్రోద్ధృతోర్వీభరం
మత్వాపాని వినాశ్య మాం నిజపదాంభోజాతదాస్యే సదా,
స్వీకృత్యాప్తముదం దిశః పితృపతే రుద్దీపకే శంఖపు
ర్యల్పాయా స్సరితస్తటే మురరిపుం ముక్త్వా న మే న్యాగతిః.

ఉ. వామనరూపుడై విబుధ ♦ వైరిబలీంద్రుని యజ్ఞవాటికన్
భూమిసుర ల్మహోన్నతము ♦ బొందగ బాదమిత్తోర్వి గోరి ని
స్సీమ వపుర్ధృతిం జగము ♦ చేకొని కొల్చి సుపర్వసంచయ
క్షేమవిధాయియై భువిని ♦ జెంగుపురంబున జిన్న యేటిపై
బ్రేమదలిర్ప నుండుహరి ♦ శ్రీపదకంజమె నాశరణ్యమా.

## 4. పి రి ది ల్లై యె న క్కు.

శ్లో. మానాతీతవివర్ధితాత్మవపుషా విక్రాంతలోకావళే
రంభోధే ర్మథితు స్తనుద్యుతిజితస్వారాణ్మణేరీ శితుః,
మోచాపూగవనావృతే దర పురే క్షుద్రాపగాయా స్తటీ
మధ్యాస్య స్ఫురతః పదాబ్జయుగళం త్యక్త్వా న మే న్యాగతిః.

సీ. నిర్వ్యాజరమణీయ ♦ నిర్జరసందోహ
సంసేవ్యసౌందర్య ♦ సారుడగుచు
నిస్సీమవర్ధిత ♦ నిజరూపపరిపూర్ణ
విపులవిష్టపసన్ని ♦ వేశుడగుచు
మందరోర్వీధర ♦ మథితసుహారవ
పాథోధియగుచు దే ♦ వతలకొరకు
మరుదధీశ్వరనీల ♦ మణిమేచకచ్ఛవి
లోభనీయసమస్త ♦ లోకుడగుచు

తే. గీ. బహుళఫలపుంజభరనమ్ర ♦ పనసపూగ
నారికేళ ఘురాజద్వ ♦ నాళియగుచు
చెంగునూరుని చిత్తారు ♦ చెంతనున్న
విష్ణుపాదాబ్జములు తప్ప ♦ వేరుమనకు
రక్షకము లేదు నమ్ముడు ♦ భ్రాన్తివిడిచి.

5. అ ల్ల దో ర ర ఙ్.

శ్లో. సర్వేష్వంబుజనాభ ఏవ నివసత్యే తన్న మిథ్యా తథా
ప్యత్ర త్మే మేల్పసరిత్తటీగతహరిం ముక్త్వా న యాత్యన్యతః,
తస్మాద్దైవ్యదికితన్యమానసవనప్రోద్యాతధూమచ్ఛటా
సంఛన్నాబ్జపురాంతికస్థకుసరిత్యాస్యన్నశ్వరణ్యాం సదా.

సీ. దివ్యదేశంబుల ♦ దేజరిల్లెడు దేవు
లందరు నొక్కటి ♦ యయినగాని
తలపనాస్వాంతంబు ♦ దామోదరునియందు
నాసక్తమైయుండు ♦ ననవరతము
కాన వాడుండెడు ♦ ఘననివాసస్థలం
బవనితీర్థాలలో ♦ నధికతరము
బాడబక్రియ మాణ ♦ బహుళయాగసముత్థ
హోమధూమాచ్ఛాది ♦ తోడుపథము

తే. గీ. దర్శనీయోచ్చసౌధాగ్ర • దష్టచంద్ర
మండలము పుష్పతరుషండ • మండితంబు
చెంగునూరుని జెన్నారు • చిన్నదిదియె
మనకు దిక్కని నమ్ముడు • మనములోన.

6. ఎనక్కునల్లరణై.

శ్లో. స్వాజ్ఞాతస్వమహత్త్వభూరిజలధేః పారం సదారక్షకం
నిత్యానాంపితరం ప్రసూం చ జలధౌ భోగీంద్రశయ్యాగతం,
సర్వజ్ఞాంబుజసంభవోపముఖైర్దేవోత్కరైస్సేవితే
సౌధప్రోజ్జ్వలశంఖపత్తనవరేఽద్రాక్షం మదక్ష్ణోః ఫలమ్.

ఉ. నాకును నిత్యసూరులకు • నాకులకు న్వివిధాత్మబంధువై
శ్రీకరదుగ్ధసింధువున • జెన్నుగ నిద్దురజెందువాడు న
వ్యాకులతన్ జగంబులను • బాలనసేయు పటిష్ఠుడు న్సురా
నీకనుతప్రశస్తగుణ • నీరధి సత్ఫలపుష్పరాజితా
నోకహమైన శంఖపురి • నూత్నఘనాభుని గంటి భక్తితోన్.

7. తిరుచ్చెంగున్నూరిల్.

శ్లో. చిత్తారాఖ్యతరంగిణీతటగతశ్రీశంఖపుర్యాం మయా
దృష్టశ్శ్రీలలనాపతిర్వికసితాంభోజాతనేత్రో హరిః,
వక్షోనాభికరోష్ఠపాదకటినా రక్తేన సంశోభితో
హారేణోరసి రాజితో వసతి మత్స్వాంతే ప్రహృష్టోఽనిశమ్.

శా. చెంగున్నూరిని నేను గన్నవిమల • శ్రీకంఠు నాస్వామి తా
గంగోత్పాదకపాదపంకజుడు ర • క్తాంభోజనేత్రుండు హే
మాంగప్రోజ్జ్వలకాంతిలోహితపటీ • హస్తాంఘ్రియుగ్మోష్ఠుడీ
శృంగారంబు వెలుంగ నామనములో • జేరె న్సుమీ ప్రీతుడై.

8. తిగళ్వెన్శిందై.

శ్లో. ప్రీత్యా మన్మనసిస్థితం శ్రుతివచఃపారంగతత్స్మాసుర
స్తోత్రైకాశ్రయశంఖపుర్యనుగతక్షుద్రాపగాయాస్తటే,

రాజంతం త్రిదశోత్కరైకశరణం దైత్యౌఘవిధ్వంసకం
లోకోత్పత్తిలయావనాదిచతురం దేవం స్తువీయాం కథమ్.

సీ. నిజమంగళగుణౌఘ ♦ నిరతలోకోత్పత్తి
పాలనసంహార ♦ లీలుఁడగుచు
భక్తినిష్టసరోజ ♦ భవఖండ పరశుసు
త్రామాదివిబుధశ ♦ రణ్యుఁడగుచు
సురవైరిసంచయా ♦ సుమరుత్స్రిభూషణ
సక్తదర్వీకర ♦ స్వామియగుచు
వేదవిద్యాభసుర ♦ బృందసంతతసేవ్య
మానాంఘ్రికంజాత ♦ మహితుఁడగుచు

తే. గీ. చెంగునూరిని నివసించి ♦ చెన్నమీర
నామనంబును గైకొన్న ♦ నళినసేత్రు
నిత్యసూరీశ్వరు సుతించు ♦ నేర్పు నాకు
నేవిధంబున నలవడు ♦ నెఱుఁగరాదు.

9. ప ద్మ ప్రా దు కే దు ప్పా.

శ్లో. భక్తిజ్ఞానవతాం త్రయీపథజుషాం హార్యర్చనాశాలినాం
విప్రాణాం నికరైస్సదా విలసితే శ్రీశంఖపుర్యాం శ్రితే,
చిత్తాఖ్యనదీవిశేషనికటే రాజన్మకుందో జగ
త్సంప్రాప్యాగా నిరత స్సవపరిశో బ్రహ్మాంతరాత్మాచ మే

ఉ. ధాతుల కెల్ల పిద్యలను ♦ జక్కగనేర్పి తమంతవారిగా
ధాతులజేసి లోకమున ♦ బర్వినకీర్తిగలట్టి భూసురుల్
స్తోత్రముజేసి పూజనల ♦ దుష్టునిజేయుగ జెంగునూరిలో
చిత్రచరిత్రుడై వెలుగు ♦ శ్రీపతియే జగదాది పద్మభూ
గోత్రభిదాద్యమర్త్యులక ♦ గోచరుడైన పసందు చూడుడీ.

10. అ మ ర ౯ ం ద నా ద నై.

శ్లో. నాథం భక్తజనేప్సితార్థఘటనాశీలం శరణ్యం హరిం
కాసారావృతశంఖపుర్యనుగతత్రుదాపగాయా స్తటే,

ధాత్రీ దేవసహస్రసద్మని కృతావాసం మహామాయినం
రుద్రాబ్జంభోజభవాదిదేవవితతే రంతస్థితం పాత్రిప్లవమ్.

మ. ప్రవరానేకమహీసురార్చితపదా ♦ బ్రాతుండు స్వాంఘ్రిశ్రిత
ప్రిపణస్వాంతత వాంఛితాధికఫల ♦ వాత్రిపద్రుం డబ్జసం
భవరుద్రాదుల కంతరాత్మ సరసీ ♦ వాఃపూరసంవర్ధిత
ద్రుమవనీసంభృత శేంగుమూరిపురమం ♦ దుగ్ల దేవునిన్ జూచితిన్.

## 11. తె న్నై న న్నా ళ్లై.

శ్లో. క్షౌద్రక్షీరసుధాతిభోగ్య మమురాధీశోపలాంగద్యుతిం
నాభిపంకజస్పృష్టపంకజ భవం స్తుత్వా శఠారి ర్మునిః,
యచ్ఛ్రకేత్రీ వచసాం నిబంధ మతులం తస్మిన్ దశైతా న్వరన్
దివ్యం స్థానము పేత్య సంస్తుతిపరీతా పా స్వఖండార్ద్ర ద్రితమ్

చ. నిరుపమభోగ్యశైలె నవ ♦ నీరజనేత్రుడు స్వీయనాభిపం
కరుహసుజాత తామరస ♦ గర్భుడ డసంఖ్యగుణాస్పదుండు నో
హారిపయి శ్రీశఠారి విను ♦ లార్థములతో రచియించినట్టి యీ
నిరతిశయప్రబంధమున ♦ నిస్తులగాధల నీపదింటి నా
దరమున శౌను వారు భవ ♦ తాపముల న్నశియింపజేసి తా
మరసదళాక్షుసన్నిధి న ♦ పూనసుఖంబులు గాంతు రెప్పుడున్.

శ్రీ మ తే శ ఠ కో పా య న మః.

---

శ్రీమతే రామానుజాయనమః.

## అష్టమ శతకము - ఐదవ దశకము.

[మాయక్కూత్తా]

ఆళ్వార్ల పరులచే భగవత్తత్త్వము నశింపజేయబడుచున్నదని క్రింది రెండు తిరువాయిమొళ్లులచే భయమునొందిరి. దీనిలో దమఆర్తనాదముచే వానిని చెడ గొట్టవలంచియున్నారు. క్రిందతిరువాయిమొళ్లిలో వానియందు ప్రేమగలవారున్నా రని నిశ్చయులై వానిననుభవించిరి. ఆవిగ్రహసౌందర్యము “ తిగళ్లు వెళ్లి శింపైయు

శిరం దాఁ” (ప్రకాశింపగా నాచిత్తమందున్నాడు.) అన్నట్లు వీరి మనస్సులో స్థిరమైయుండుటచే బుట్టిన బాహ్యాసంశ్లేషాపేక్ష సఫలము కాకపోవుటచే గ్రింద తాముపొందిన క్లేశజాలమంతయు దీనిలో నొకకళామాత్రమన్నట్లు బాధనొంది దావాగ్నిపరీతులవలె సంతప్తులై తమకంటె నధికతరముగా నాకులమైన కరణగ్రామముగలవారై నావిదాహము తీరునట్లు దివ్యావయవములు, మణికిరీటము దివ్యమంగళవిగ్రహము మొదలగునవి ప్రకాశింపగా వఘూఁకబలాహకమువలెను దయార్కమండలద్యుతితో నాకడకు రావలెనని మొఱ్ఱబెట్టగా వానిరామిజూచి యీక్లేశముతోనే నేను మృతినొందగలవాడనని విరమించుచున్నారు. ఇందులో “ కాణవారాయ్ ” అనునది ప్రధానగాథ.

## 1. మా యు ర్కూ త్తా.

శ్లో. అత్యాశ్చర్యగుణౌఘచేష్టిత మదీయాక్షీభవద్వామన
స్వచ్ఛాంఘ్రిద్వయమాస్తయుగ్మనయనద్వంద్వాబ్జ పుష్పాంచిత,
రక్తోత్పాంబుజకుట్మలశ్రీ తితనూపత్ర స్సుగంధోల్లస
త్కాసారప్రతిమో మదంతికము పైహ్యాశు ప్రమోదాత్సకృత్.

ఉ. నేత్రకరాంఘ్రిపుష్పములు ♦ నీటగువాతెర మొగ్గ శ్యామమౌ
గాత్రము పత్రసంచయము ♦ క్రమసరోరుహసారభంబునఁ
చిత్రముగా ధరించిన వి ♦ చిత్రసరోజతటాకముంబలెఁ
గోత్రభిదాదిదేవనుత ♦ గొబ్బున రమ్మొకసారి నేఁ గనఁ.

## 2. కా ణ వా రా య్.

శ్లో. ఉద్యద్భాస్కరరశ్మిరంజితమహానీలావనీధ్రస్ఫుర
న్మాల్యాభ్యాసితమస్తకాగ్ర భగవఁ శ్రీవామనాస్మత్ప్రభో,
మాం ద్రష్టుం సముపైహి మన్నికట మిత్యాక్రోశతో మే ముఖం
నే తేచా పి విశుష్యతశ్చ కృపయా త్వద్దర్శనం దేహి మే.

సీ. ఒకసారి దర్శనం ♦ బొసగుమయ్యాయటంచు
పలుమారు మొఱపెట్ట ♦ పద్మనయన
నోరెండసాగెను ♦ నొప్పియు జనియించె
గనుదోయి కాయలు ♦ గాసెనయ్య

అయిన నీస్వామికి ♦ నవనివారలు నిన్ను
దయ లేనివాడని ♦ తలతురనుచు
భీతిజెందెద గాన ♦ బ్రీతితో నొకపరి
డంబు మీరెదు కిరీ ♦ టంబుతోడ.

తే. గీ. చండకరరశ్మిసంతతి ♦ మండితేంద్ర
నీలమాణిక్యభూధర ♦ లీలనడచి
రమ్ము నాయొద్దకొకసారి ♦ రాక్షసారి
పౌరుహూతమణిప్రభా ♦ ధారమైన
దివ్యమంగళ విగ్రహ ♦ దీప్తిమెఱయ.

3. ము డి శే ర్ శె న్ని.

శ్లో. సౌరభ్యోత్కటచైత్యజుష్టతులసీస్రజ్మండితో రక్షల
స్వామి న్మౌళివిదీప్రశీర్షణ జలదస్యామేతి జల్ప న్ముహుః,
రోది మ్యత్ర తథాపి కుండలయుతం రమ్యప్రవాళాధరం
వృత్తస్ఫీతభుజార్గళం తవవపు ర్నో దర్శయ స్యంజసా.

మ. తులసీమాల్యపరిష్కృతోరుమకుటా♦తో తెంచు నాయొద్ద కం
చలత న్నే నిను జేర కుండలలస ♦ ద్గాత్రావళీసింహాను
ధ్యలలాటార్ధసుధాంశుబింబమహికా ♦ యస్వ ధీబాహార్గళో
జ్జ్వలవార్వామముమాడ్కినచ్చి వెసనా♦సంతాపము ల్మాన్పవే.

4. తూ నీ ర్మ గి ల్పో ల్.

శ్లో. మద్యేఽపాం రజతావనీభృతి వినీలాంభోధరో వా పయః
పారావారతరంగవిస్తృత ఫణీట్పర్యంకశాయిన్ హరే,
పాతఃపూర్ణపయోదసన్నిభతను బింబాధర స్తే విభో
కంజాతోపమలోచనే చ వివిశు ర్మన్మానసే కిం బ్రువే.

మ. రజతక్ష్మాధర మస్తకాగ్రిసయిత ♦ ప్రావృట్పయోవాహరీ
తి జెలంగ న్గలశాంబురాసి భుజగా ♦ధీశోరు తల్పంబునన్
బ్రిజల నోప్ప్రవగ నిద్రజెందు వికస♦త్పద్మాక్ష నీకాయమున్
భుజబింబాధరము ల్మనంబున సదా♦పూర్ణంబులై యుండెడున్.

5. శో ల మా టే న.

శ్లో. కల్పాంతప్రవిగీర్ణవార్ధిరశనక్షోణే పయోదాభ తే
పాదా నిస్తులదీప్తిమద్దినకరద్వంద్వోపమా మన్మనః,
ఆవిశ్య స్ఫురత స్తతో మమ హృది ప్రాదుర్భవే త్సంస్మృతి
క్రూరక్లేశవితానసంభవమహాదుఃఖాంధకారః కథమ్.

మ. ప్రళయగ్రస్తసమస్తలోక శితిహా ♦ ర్యాహోభగాత్రా భవ
జ్జలజాతాస్త్రయుగప్రభాపటలసం ♦ చన్నాంఘ్రియుగ్మంబు చం
చలమా నామన మేచసాగె నకటా ♦ సహ్యంబుగా దింక నే
బలుకంజాలనుపాయ మొక్కటి నిను♦న్నాశ్రయంగ వాక్రుచ్చుమీ.

6. కొం డ ల్వ ణ్ణా.

శ్లో. ప్రావృడ్వారిధరాభదేహ ఘటనాత్రాభ్యాసపారీణ మ
న్నేత్రీభూత యదూద్వహేతి సతతం త్వాం భావయామ్యే కేశవ,
వైకుంఠే తవ ధామ్ని వా క్షితితలే క్షీరాంబుధౌ వా న్యత
స్త్వత్పాదాబ్జయుగం ప్రదర్శయ సకృచ్చాభ్యుపేత్య మత్సన్నిధిమ్.

శా. మేఘశ్యామలదేహ కుంభనటకా ♦ మీనాంకలావణ్య నా
నాఘస్ఫూర్తినివారకా యదుపతీ ♦ యంచు న్మొఱల్వెట్టినన్
నాఘోషస్విన గావు క్షీరనిధిలో ♦ నన్ లేక నీయుండుసం
శ్లాఘాపాత్రపదాననైన నినునే ♦ సంతుష్టితో జూడ దే
వౌఘప్రస్తుత దర్శనం బొసగుమా ♦ యుద్యత్కృపాదృష్టివై.

7. వం దు తో న్నా య్.

శ్లో. రక్తాంభోజసదృక్షపాణిచరణాక్షిద్వంద్వ మాలోహితం
చోష్ఠం బిభ్ర దనంతదీప్తిజటిలో నీలో వివస్వానివ,
ఆత్మానం సముపేత్య దర్శయ విభో నో చే త్త్వదంఘ్రిద్వయం
మాం నీత్వానుగృహాణ కింకరతయా మత్ప్రార్థనైతావతీ.

శా. శోణాబ్జాభకరాంఘ్రినేత్రయుగళీ ♦ శుంభత్ప్రవాళోష్ఠముల్
తానైదాల్చిన క్రొత్తసూర్యుడు నిజో♦ద్దామద్యుతి స్ఫూర్తిచే

నానాదిక్కుల దేజరిల్లుపగిదిన్ ♦ నాయొద్ద కేతేరగా
మానంబైన యెడ న్నిశాతావని భవ♦న్మాన్యాంఘ్రిసాన్నిధ్యమున్
దీనున్ జేర్పుము నన్ను దాస్యవిధముల్ ♦ తీంద్రించ లక్ష్మీన్మపతీ.

8. ఒక్కమమ్మాన్.

శ్లో. దృష్ట్వానీలపయోధరోత్కర మహం త్వద్గాత్రకాంతిప్రతి
స్పర్ధిత్వాకలయన్ భవామి శిథిలస్వాంతః పరం చింతయా,
ప్రీత్యా పాండుసుతేషు వాసవిరథే యంతాభవ న్నంయుగే
హంతః కౌరవసంతతే స్సకృ దుపైహ్యేషా కిము త్వద్దయా.

మ. జలదవ్రాతయు నేను జూచుతరి కం ♦ జాతాక్షు నెమ్మేనుతో
దులయౌనంచు గృశించె దన్మనములో♦దోరంపు దుఃఖంబునన్
ఖలుల న్మార్గగ ధార్తరాష్ట్రులను సం♦గ్రామంబులో జంపగా
నరవిన్యచ్చుని తేరు దోలిన హరీ ♦ త్యక్తాన్యసంగుండనై
కలకాలంబు భజించు నన్నిటుల నీ♦కారించుటల్ న్యాయమే.

9. ఇదువేపారుత్తమ్.

శ్లో. చక్రాలంకృత తార్క్ష్యవాహన సుపర్ణాంచద్ధ్వజేద్య క్కిము
ప్రీతి బాధకమిత్రిపరోదిమిమిహనుస్వాంద్రష్టు మాశాంవహన్.
పృథ్వీభారనివారణయ మధురా మాసేదివాం స్త్వం హరే
మద్వృత్తం సమవేక్ష్య చింతయసి కిం త్వన్మానసే మత్ప్రభో.

మ. గరుడాలంకృతకేతనా పతగరా ♦ డ్గంధర్వ చక్రాంచితా
వరదా యంచును వెక్కిగొడ్చి నధరన్ ♦భారంబుమాన్పన్మరం
దరసాపూరితనిష్కుటాళిమధురా ♦ ధామంబున న్పుట్టిదే
వరిపువ్రాతము గూల్చినట్టి హరియే ♦ భంగిన్ దలంచు న్ననున్.

10. పిరందమాయా.

శ్లో. ఆకాశాగ్నిసమీరణాంబుధరణీ ష్వాత్మ్రవ్రజేచేతనే
ష్వంతర్యామితయా స్థితో౽పి షృతపత్ క్షీరే నిగూఢో౽స్యసి,

లోకతాన్త్రిణకృతావతార పరమాశ్చర్యైకధామ పృథ్వీ
కుత్రత్వాం ప్రవిలోకయేయమమరాధీశార్చితాంఘ్రిద్వయమ్.

చ. అవతరణంబు లెత్తి ధర ♦ నద్భుతచేష్టలొనర్చినట్టి మా
యివి యయిన స్వమీరమున ♦ కిమ్మహికిన్ గగనానలాదిభూ
తవితతి కంతరాత్మవయి ♦ దాగొనియుందువు పాల నెయ్యిబోల్
నవజలదాభ నిన్నుచట ♦ నాకు గనుంగొన వచ్చు దెల్పవే.

## 11. ఎం గే కా ణ్ణే న్.

శ్లో. పశ్యేయం కుతర్హి దేవం నవదళతులసీమాల్య మిత్యచ్ఛవాచాం
గుంభే శ్రీశపర్భావే శఠరిపురచితే పద్యసాహస్రకేఽస్మిన్
గాథాహ్యేతా దశాపిస్వరుచిమనుసరన్యః పఠేచ్ఛ్రద్ధయాసః
ప్రాప్నోత్యానంద మేతజ్జనుషి నిరుపమంపశ్యతాంమానవానామ్.

మ. తులసీమాల్యసమంచితు న్గమలనే ♦ త్రున్ శౌరి నేనేడ దృ
క్కుల జూడంగలనంచు మానసమునన్ ♦ గోర్కెల్విజృంభింప మం
జులవాక్పంజసుధారసంబు లొలుకన్ ♦ శుంభత్కురూకాపురీ
నిలయుండైన శఠారి సంయమి దయన్నిర్మించి దానింపుతో
ధరలో నిల్పిన వేయిపద్యముల వి ♦ ద్వత్స్తోమణం బీపదిన్
స్థలితంబేది పఠించువారికి మహాసౌఖ్యం ♦ బెప్డు చేకూరెదున్.

శ్రీ మ తే శ ఠ కో పా య న మః.

శ్రీమతే రామానుజాయనమః.

## అష్టమ శతకము - ఆరవ దశకము.

[ఎల్లియుమ్.]

అవతారిక :—మాయకూత్తయం దాళ్వార్లకుగలిగిన భగవద్విషయక మైన తృష్ణ వాగ్విషయమయినది గావున పైకి జెప్పగలిగిరి. వీరివిషయమై యీశ్వరునికి గలిగిన తృష్ణ వాచామగోచరమగుటచే నాతడు చెప్పజాలకపోయెను. "ఊర్ధ్వం మాసా న్నజీవిష్యే" అని ఆళ్వార్లతృష్ణ ; "న జీవేయం క్షణమపి వినా తా మసి

తేక్షణామ్ '' అని సర్వేశ్వరుని తృష్ణ; మాయకూ_త్తయందు వీరికి గలిగిన తృష్ణకు నేనేమియు నుపకరింపజాలకపోతినని ఈశ్వరుడు సంతప్తుడై ఆకులుడై " హ్రీ రేషా హి మమాతులా'' అన్నట్లు లజ్జించి, 'ఇప్పుడు నేను శీఘ్రముగా బోయి కనబడిన యెడల వానందోద్రేకముచే నాళ్వార్లు చనిపోవుదు' రని భయపడి శాంతించి వెళ్ల వలెనని తలంచి పదునాలుగు సంవత్సరములు పెరుమాళ్లవియోగక్లేశముచే బాధనొందిన శ్రీభరతాళ్వానుని ధరింపజేయుటకు తిరువడిని ముందుపంపి తాము భరద్వాజాశ్రమమం దున్నట్లును, పాండవదూతగా బోయినపుడు ప్రేమపరవశులైన విదురాదులకు శాంతించి ముఖము కనబఱ్చుటకు " ఉపప్లవా దిహ క్షత్త ఉపయాతో జనార్దనః, కుశస్థలే నివసతి సచ ప్రాత రిహైష్యతి " అన్నట్లు కుశస్థలమును విడిచి మరునాడు హాస్తినపురమునకు వేంచేసినట్లును తమతో సంశ్లేషించుట కున్ముఖుడైన సర్వేశ్వరుడు తమప్రీతి శాంతించిన తరువాత తమతో గలిసికొనుటకు తిరుక్కడిత్తానమందు వేంచేసియుండి తమపట్లను కనబర్చిన వ్యామోహము ననుసంధించి సంతసించి యనుభవించుచున్నారు. క్రిందతిరువాయ్మొళిలో వ్యసనహేతువైన తలంపే యిపు డుజ్జీవనహేతువగున ట్లీశ్వరు డొనర్చెను. "శేమం శెంగో నరుశే శెరువారు నట్పాకువర్ " (తిరువిరుత్తము—27 పా.)(భగవంతునికృప యున్నయెడల బాధకులే బంధువు లగుదురు.) ఇందులో " తానవగర్గళ్ '' అనునది ఉయిర్పాట్టు.

## 1. ఎ ల్లి యు ం కా లై యు మ్.

శ్లో. రాత్రిందివం న్వచరణావార్ణణమానసేషు
యు స్సత్కృపాం నిజజనేషు కరోతి శశ్వత్,
తస్యోల్లసత్తులసిమాల్యపరిష్కృతస్య
వాసస్థలం కటిపురీతి భువి ప్రసిద్ధా.

తే. గీ. సంతతము తన్ను భజియించు ♦ సజ్జనులకు
మంగళంబుల నొడగూర్చు ♦ మాధవునకు
వసతి సద్భక్తిసంపద ♦ వన్నెకెక్క
దాసులుండెడు నాకటి ♦ స్థానపురము.

## 2. తి రు క్క డి త్తా న ము న్.

శ్లో. సంగ్రామదుర్మదదశాస్యముఖానురోఘ
తృష్ణ్యాం దదావ శరవహ్నిచయైః పురా యః,

సోయం కటిస్థలపురం మమ మానసంచ
స్వస్థో వసత్యమరబృందనిషేవితాంఘ్రిః.

తే. గీ. తొల్లి దుర్గర్వదైతేయ ♦ దోర్బలంబు
శితశిలీముఖపావక ♦ శిఖలలోను
వ్రేల్చి మించిన జగదేక ♦ వీరు డెవుడు
శ్రీకటిస్థానపురము నా ♦ చిత్తపదము
వీడకుండగ వసియించు ♦ వాడు చూవె.

3. ఒరువరిరువర్.

శ్లో. ధర్తేవ కాయవితతే రవభాసమానో
లంకాపురే నిశిచరాన్ప్రజఘాన యః ప్రాక్,
సోఽయం రమాశ్రితతనుస్సరసీరుహాక్షః
స్వస్థోఽధితిష్ఠతి కటీపురమద్య రమ్యమ్.

తే. గీ. ఒక్కడైనను లంకలో ♦ నుక్కుమిగిలి
యందఱికి నన్నిరూపులై ♦ యసురబలము
జక్కుజేసిన శ్రీరమా ♦ సఖుడు ప్రీతి
దప్పక వసించు శ్రీకటి ♦ స్థానపురిని.

4. మాయప్పిరాన్.

శ్లో. తేజిష్ఠసూరిపరిషత్స్పృహణీయధామ
సౌగంధ్యనిర్భరలతాంతవనీపరీతః,
రమ్యం కటీపుర మధిష్ఠితవా న్మదీయే
స్వాంతే వసత్యఖిలపాపనివర్తక స్సన్.

తే. గీ. పరమసూరిజనాళికిఁ ♦ బ్రాప్యమగుచు
సురభికుసుమాకరోద్యాన ♦ శోభ నెపుడు
దాల్చుచుండెడి శ్రీకటి ♦ స్థానపురము
వాసముగ గొన్నశౌరి నా ♦ పాపములను
బాపి నాలోన నివసించె ♦ వరదుఁడగుచు.

5. కోయిల్కొండాన్దన్.

శ్లో. సంసేవ్యమానచరణ స్త్రిదశై ర్వికుంఠే
వాసీ ఘటప్రకటనర్తక ఆదిదేవః,
సాకం కటీపురవరేణ మనో మదీయ
మంగీచకార నిజవాసగృహం దయాళుః.

తే. గీ. నిత్యసూరిజనంబులు ♦ నిత్యసేవ
సలుప వైకుంఠమునసుండు ♦ శార్ఙ్గపాణి
శ్రీకటిస్థానవసతిని ♦ స్వీకరించె
దానితోఁగూడ నామన ♦ స్థానమొందె.

6. కూత్తవమ్మాన్.

శ్లో. పాపీయసోపి మమ దుఃఖవినాశకస్య
భక్తాత్మహారినిజసద్గుణచేష్టితస్య,
స్థానం కటీపురవరం స్తుత దుఃఖపుంజం
నశ్యేద్ధ్రువం మమ వచోఽహ్యాదయేఽవధత్త.

తే. గీ. దివ్యచేష్టలుగలవాఁడు ♦ భవ్యయశుఁడు
దాససకలాఘనాశన ♦ దక్షుఁడైన
మధురిపుండు వసించెడు ♦ మాననీయ
శ్రీకటిస్థాన మెప్పుడు ♦ చేరికొల్వ
దుఃఖమెల్లను నమ్ముడు ♦ తొలగిపోవు.

7. కాణ్మినిడర్కెడ.

శ్లో. గోవిందపాదకమలం మితభూనభస్కం
యత్ప్రాప్య మానవసుపర్వగణశ్చ నిత్యమ్,
సంసేవతే కటిపురం తదఘాదివజ్రం
దుఃఖాపనోదనపరా హృదయే నిధత్త.

తే. గీ. మన్ను మిన్నును గొల్చిన ♦ మాధవాంఘ్రి
పద్మమును గొల్వ నిత్యులు ♦ వసుధవారు

నాశ్రయించెడు రమణీయ • మైనయట్టి
శ్రీకటిస్థానపురమును • చిత్తమందు
సంస్మరింపంగ భవతాప • శాంతియగును.

8. తా న న గ ర్ గ ళ్.

శ్లో. క్షీరాబ్ధిభూపరమఖాదిషు దివ్యదేశే
ష్వన్యేషు సత్సు బహుషు ప్రథితేషు నాథః,
మన్మానసం కటిపురం నిజదాయలబ్ధం
ప్రీత్యా నివాసగృహమిత్యభిమన్యతే స్మ.

తే. గీ. వసుమతీదుగ్ధవారాశి • పరమఖాది
దివ్యదేశంబులం దెల్ల • దేవుడుండు
గాని యతనికి శ్రీకటి • స్థానపురము
మన్మనంబును దాయాప్తి • మహితమైన
వసతులని ప్రీతి వర్తించు • వాడు సతము.

9. తా మ ప్ప డి గ ళ్.

శ్లో. సర్వే ష్వనాదిషు పవిత్రతరేషు దివ్య
దేశేషు సంతతనివాసరతో మురారిః,
సూరివ్రజాప్యకటిపు ర్యధికాదరేణ
వాసం కరోతి యదువంశపయోధిసోమః.

తే. గీ. శ్లాఘ్యమైనట్టి దివ్యదే • శములయందు
ప్రీతి నివసించియున్నవా • డాత డెపుడు
కాని సూరిజనప్రాప్య • కలుషదూర
శ్రీకటిస్థానమున హెచ్చు • ప్రీతినుండు.

10. అ ప్పా ద న్నా రా య ణ న్.

శ్లో. సత్కీర్తిరాజదవనీసురవేదఘోష
సన్నాదితే కటిపురే ప్రథితే ధరణ్యామ్,
అశ్రాన్తవాసరసికో కుహనావటు
నారాయణో వసతి మద్హృదయేఽధునా సః.

తే. గీ. ప్రౌఢవైదికజనబృంద ♦ పఠ్యమాన
వేదనిస్స్వనముఖరమై ♦ వెలయుచుండు
శ్రీకటిస్థానమున నివ ♦ సించియుండు
నాథుడెప్పుడువదలడు ♦ నామనంబు.

11. శ్లో తైత్తిరు క్కాడి త్తా న త్తు.

శ్లో. ఉద్యానశోభితకటీపురవాసలోలం
స్తుత్వా శఠారి రకరోద్యదిదంసహస్రం,
తస్మి న్నృతన్ దశక మేత దఘాపనోది
లబ్ధ్వా పదం పరమఖే సముపైతి హర్షమ్.

తే. గీ. రమ్యసుమసంభృతారామ ♦ రాజితంబు
నగుకటిస్థానపురమున ♦ నమరియున్న
శ్రీశుపయి కారిజుని భక్తి ♦ జెప్పియున్న
యతిమనోహరగాథాస ♦ హస్రిమందు
దశక మియ్యది మోక్షప్ర ♦ దంబు చూవె.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతేరామానుజాయనమః.

## ఎనిమిదవ శతకము - ఏడవ దశకము.

[ఇరుత్తుంవిళుందైన్రె.]

అవతారిక:— పురుషార్థమునకు కృషిచేసిన ప్రకారము దిగువను పూర్ణముగా ప్రతిపాదింపబడినది మీదగ్రంథము పురుషార్థమునకు వర్ధకమై యున్నది. ఈతిరువాయిమొళ్ళియందు చేయునది యేమనగా చిరకాలము తాము బుద్ధిపూర్వకముగా జేసిన ప్రాతికూల్యములను పూర్ణముగా మరచిపోయి, అనుకూల్యము పుట్టిన తరువాత ప్రామాదికముగా జేసినవానిని జూడక తమ పురుషార్థమునకు తామే ప్రయత్నించి తమకు బుట్టిన తృష్ణ తీరునట్లు సంశ్లేషించి, తనపురుషార్థమయియున్న రీతి ననుసంధించి "తానే అర్థియై తనపురుషార్థముగా వచ్చి సంశ్లేషించిన వానిని మన మర్థులమై మొట్టబెట్టితిమని లజ్జించి "ఒకసంసారిచేత

ముని మొదల సర్వేశ్వరుడు చేయు విషయీకార మహా యెట్లున్నది" అని ఆశ్చర్యవిద్ధులగుచున్నారు. "రాఘవేణా భయే దత్తే సన్నతో రావణానుజః, విభీషణో మహాప్రాజ్ఞో భూమిం సమవలోకయన్" అన్నట్లు రావణానుజుడనైన నేను రఘుకులసంభూతులైన వారికి దాసులమైతిమని పెరుమాళ్లవద్దనుండి యరుళప్పాడు రాగా "నన్నైనా యిట్లు స్వామివారు పరిగ్రహించుట ఆహా ? రావణానుజత్వప్రయుక్తనీచత యెచ్చటికి బోయినదో" అని వేరు తెగిపోయిన వృక్షమువలె కూడి వచ్చిన నలుగురుమంత్రులతో పెరుమాళ్ల పాదములయందు పడినట్లును, లేశమైనను రామగుణసంకీర్తనము సంభవించని అశోకవనమందు తిరువడి—"సంశ్రవే మధురం వాక్యం వైదేహ్యా వ్యాజహార హ" అని పిరాట్టి లబ్ధసత్తాకురాలగునట్లు రామగుణసంకీర్తనము చేయగా "నామె యిచ్చటరామగుణ సంకీర్తన మసంభావ్యము గదా "కిం ను స్యాచ్చిత్తమోహోఽయం భవే ద్వాతగతి స్త్వియమ్, ఉన్మాదజో వికారో వా స్యాదియం మృగతృష్ణికా" నాకిది చిత్తమోహముచే గలిగినదియా, వాతగతియా, ఉన్మాదమువలన గలిగినవికారమా లేక మృగతృష్ణికా అని పలుతెరగుల శంకించి, ఎవడో ముందు నిలువబడి మాటలు చెప్పుచున్నాడు ఇదివిని నేను వికృతినొందితిని ఇంతమట్టుకు నిజము ఇదిసత్యమే యగునని జనకరాజదుహిత తెలుసుకొని సంతోషించినరీతిగా నీయాళ్వార్లును యిది భ్రమస్వప్నాదులని శంకించి "కాదు" "సత్యమే" యని తెలుసుకొని ప్రీతులై "మన కద్వేషాభిముఖ్యములను బుట్టించి తప్పువిడిచి యుడలేకపోవుటను గలిగించి తనపరత్వమును జూడక నాకు శేషభూతుడై వచ్చి నాతో సంశ్లేషించెనే—ఆహా–ఇదేమి ఆశ్రితపారతంత్ర్యము ? ఇదేమి సౌలభ్యము, అని వాని రీతిననుసంధించిసంతసించుచున్నారు. ఇందులో "అరియేన్మత్తరుశే" అనునది ఉయిర్పాట్టు.

## 1. ఇరుత్తుం వియం దెన్నై.

శ్లో. స్వామిం స్త్వదంఘ్రినికటం నయ మాం సుశీఘ్ర
మిత్యార్తితో విరచితం మమ విప్రలాపమ్,
ఆకర్ణ్య వామనతయా మితసర్వలోక
మదాత్మని వసత్యధికప్రమోదాత్.

మ. భవదంఘ్రిద్వయమందు జేర్చుకొనుమా ♦ వం కేతుహాత్మా యటం
చ విరామంబుగ మొఱ్ఱవెట్టిన మదీ ♦ యప్రార్థన న్నారిదా

ను విచారింపక సత్కృపాబలముచే • నున్నాత్ముఁడై నామనో
భవనంబందు వసింపసాగె నిక నే • భవ్యుండ నైతి న్గదా.

2 ఇరుందాన్కుండు గోండు.

శ్లో. ఔద్ధత్య మాత్మవశగీకృతమానసస్య
పంచేంద్రియారివిహతేః ప్రవినాశ్య దేవః,
మచ్చిత్తసీమ్ని నివస త్యతిహృష్టచేతా
దంతావళస్యకియదాచరితం హి తేన.

తే. గీ. మామకేంద్రియదుర్వృత్తి మాన్పి కరుణ
నన్ను గాచుటకంటెను • నళిననేత్రు
డల్లగజరాజు బ్రోచుట • యధికమనుచు
నా మనంబున దలపను • నమ్ముడిద్ది.

4. అరుళ్ తానిని.

శ్లో. నేతో౽స్తి మే౽ధికపుమర్థ ఇతి ప్రచింత్య
విధ్వంసయ న్నిబిడమోహమహాంధకారమ్,
దేవో మదీయహృదయే నివస త్యజస్రం
కిం సత్యమేత దుత మే మనసి భ్రమోవా.

మ. పురుషార్థంబులకంటె నిద్దియె మహా • పుణ్యావహంబైనస
త్పురుషార్థంబని యెంచి శ్రీధరుడు మ • త్పూర్వార్జితం ద్రోసిస
త్వరుడై నామనమందు నిల్చెనిక నా • వాంఛ ల్ఫలించెంజుమీ
పరిశీలింపగ నిద్ది సత్యముగునా • భ్రాంతుండనేమో రమా
వరు కారుణ్యమ దేడ నీచుడను పా • పాత్ముండ నే నెక్కడన్.

4. మాయామయక్కు.

శ్లో. సూరివ్రజేడ్యచరితో యదువంశదీప
స్సందర్శయ న్మయి కృపాం వపురుజ్జ్వలం స్వమ్,
మన్మానసే నిహితవా న్భువి సుప్రసిద్ధ
మేతద్భ్రమో నచ మృషా నచ సత్యమేవ.

తే. గీ. నిత్యసూరీశ్వరుడ ♦ త్యమలుడు
లోకమెఱుగంగ న ♦ స్గృప స్వీకరించి
తనదు తేజోమయంబైన ♦ తనువునాదు
స్వాంతమున నిల్పెనాతఁడ వం ♦ చకుడు గాడు.

5. తి గ ఝుం త న్ తి రు వ రు ళ్.

శ్లో. సందర్శనాయ న్మయి కృపా మతులాః పరేశో
మాం సర్వలోకనుతివాగ్విషయం చకార,
రాజన్మణీక్షితిధర ప్రతిమోఽంతరాస్తే
కింస్యాదితో గురుతరామలకీర్తిహేతుః.

తే. గీ. అమలనిర్హేతుకాను ♦ గ్రహంబు జూపి
నామనంబున నిల్చిన ♦ నళిననయను
జనులు పొగడెదుపొగడిత ♦ ఘనముగాని
యితరనుతివాక్కు నేరీతి ♦ నింపు నించు.

6. పొ రు ళ్మ త్తె న క్కు.

శ్లో. అస్మిన్ పుమర్థ మపరం వితరామ్యహం చే
ల్లోకే పుమర్థ ఇతి మాం వృణుతే న కోపి,
ఇత్థం విచింత్య స హరి ర్మయి బద్ధభావో
హ్యాత్మాన మప్రతినివృత్త్యదదాచ్చ మహ్యం.

మ. బలభిన్నీలధరాధరాగ్రముపయి ♦ న్భాసిల్లు శోణాంబుజా
వళిమాడ్కి న్విలసిల్లు రక్తరుచిమ ♦ ద్వక్షఃకరాక్షిద్వయా
మలనాభీనయనంబు లొప్పెడు రమా ♦ మాన్యుండు తుచ్ఛంబులౌ
ఫలముల్ నాకొసగంగ దన్నుగొను స ♦ ద్భక్తు ల్మరెవ్వారలం
చిలలో వారికి వాని నిచ్చి దయనా ♦ కిచ్చె న్స్వదివ్యాకృతిన్.

7. శె వ్వా యుం ది.

శ్లో. రక్తాధరాచ్ఛరదనావళినాభికర్ణ
పత్రాదికాంతినిచయే ప్రథమంసమేత్య,

మాం ప్లావయ త్యమలహా సపరిష్కృతాస్య
స్సోంత ర్వివేశ మమ పద్మదళాయతాక్షః.

తే. గీ. దివ్యతేజావయవశోభ ♦ తేజరిల్ల
మందహాసప్రభాంకూర ♦ మండితుడయి
నామనంబున నిల్చిన ♦ నయముదక్క-
నన్యమెన్నఁడు స్మరియింప ♦ నవనిమీఁద.

8. అ రి యే స్మ ర్త రు ళ్.

శ్లో. స్వాంగీకృతా న్స్మరరిపు ర్దయతే దయాళు
ర్నిర్హేతుకం మమవిభుః కమలాలయేశః,
కుక్షౌనివేశితజగ త్త్రియ ఆదిదేవో
మన్మానసే స్థిరనివాస మభిప్రపేదే.

తే. గీ. నన్ను దయతోడ నేలిన ♦ నళిననేత్రు
డహరహలను నూరక యెబ్బ్రోచు ♦ నవనిమీఁద
భువనములనెల్ల లయమున ♦ బొజ్జఁబెట్టి
కాచెడుఘనుండు నాలోనఁ ♦ గాపురంబు.

9. వ యి త్తి ల్కొం డు.

శ్లో. లోకత్రియం సకమలాసన మాత్మకుక్షౌ
నిక్షిప్య నిర్వికృతిరేవ సదా వతీ శః,
తత్త్వాద్యగావపురుషః జగతాం నిదానం
మన్మానసే స్థిరతయా న్యదధాం ప్రహృష్టః.

తే. గీ. సరసిజాసనముఖదేవ ♦ సంచయంబు
నెల్లజగముల దనకుక్షి ♦ నింపుమీఱ
నుంచుకొని నిర్వికారత ♦ నుండువాని
నామనంబున నిడుకొన ♦ నాకుగల్గె.

10. వై త్తే స్మ ది యా ల్.

శ్లో. లోలోల్లలద్బహుళ శీతలవీచిమాలా
సంబాధవారినిధివి స్తృత శేషతల్పే,

నిద్రాణ ముజ్ఝనయనం మమ చిత్తసీమ్ని
నిక్షిప్తవా న్నవిజహామి కదాచి దేవమ్.

తే. గీ. ఉత్తరంగితకలశాబ్ధి • నురగనాథ
తల్పమున నిద్రజెందెడు • దనుజవైరి
చేరి నాచిత్తమున నుండఁ • జేసికొంటి
వాని నెడబాయ నికమీఁదఁ • బ్రతిననాకు.

11. శుడర్ పాంబణై.

శ్లో. లక్ష్మీశ్రుతే భుజగరాట్ఛయనస్య పాదం
ప్రాప్తుం శతాని రివ యత్కృతవా న్సహస్రం,
తస్మిన్నిదం దశక మాదరతః పఠంత
స్సంతస్స్వజన్మవిపినం సహసా దహేయుః.

తే. గీ. భుజగశయనునిపాదంబుఁ • బొందఁగోరి
భవము విరమింపశఠవైరి • పరమభక్తి
రచన జేసిన వేయిలో • రమ్యమైన
దశకమిద్దానిఁ బఠియించు • ధరణిజనులు
పీతభవులౌదు రబ్జాక్షు • ప్రీతిఁదగిలి.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతే రామానుజాయ నమః.

## అష్టమ శతకము – ఎనిమిదవ దశకము.

[కణ్గళ్ శివందు.]

అవతారిక :— మాయుక్కుత్తయుం దిరుమాళ్వార్లకుఁ గలిగినతృష్ణ తీరునట్లు వచ్చి సంశ్లేషించి యీశ్వరుడు తనతృష్ణనుగూడఁ దీర్చుకొని యిట్లు ప్రవర్తించిన సంశ్లేషము శిథిలము కాకూడదని తలంచి వీరును "వశవేద్యులగు" యందుఁ బ్రతిపాదింపబడిన ఆళ్వార్లు మమ్ము సమీపించుటకు తా మనర్హులమని నీచులమని తలంచెదరు. అందువలన మమ్ముల నెడబాయ జూతురు. ఇట్టి యభిప్రాయమును తీసివె

య్యవలేవని ఆలోచించి ఇంకను వీరు మమ్ముల నెడబాయ దలంచుట అనాదికాలము సంసారదూషితమైన యీయాత్మ మమ్ముల బొందుట కయోగ్యమనిగదా వీరియభిప్రాయము ఇది సరికాదు. ఆగంతుకమైన యీయాత్మయొక్క అయోగ్యతనుజూడక దీనిమూలమును జూడుడని- ఈయాత్మవస్తువుయొక్క వైలక్షణ్యమును వీరి మనస్సునకు దోచునట్లు చేయవలయునని ఈశ్వరుడు వీరిని బిలిచి "అయ్యా ఇటుచూడండి. మీయాత్మ జ్ఞానానందములు లక్షణముగా గలది. మా కత్యంతశేషభూతమైనది. మీరుమాదగ్గిరకి వచ్చుట నాకవద్య హేతువు కాదు మీయాత్మ మాకు కౌస్తుభముతోను పిరాట్టితోను సమానముగా నౌజ్జ్వల్య హేతువగుచున్నది" అని వీరి స్వరూపవైలక్షణ్యమును వీరిమనస్సుకు నచ్చజెప్పెను. అట్లు చేయుటలో "మీయాత్మస్వరూపమున్న రీతినిజూచుటకు రండియని యీశ్వరుడు వీరిని బిలువగా మెరుగుడిపురుగువలె నున్న దీనివస్తుత్వమేపాటి యని వీరిష్టపడలేదు. అందుపైని యీశ్వరుడు "మావిగ్రహ సౌందర్యమున దీయాత్మ సక్తమైయుండును. నేను ముందు నిలిచి నాకు ప్రకారభూతమైన యీయాత్మస్వరూపమును వీరికి గనపర్చెదనని ఆళ్వార్లను బిలిచి. "మావిగ్రహసౌందర్య మెట్లున్నదో చూచినారా? మమ్ములను జూచిన చూపులో మిమ్ములను గూడ జూడవచ్చును." అని తనవిగ్రహసౌందర్యమును ముందు గనపర్చి పిదప కటకమకుటాదిభూషణములవలె నత్యంత భోగ్యమై అత్యంతశేషమయి యుండు నాత్మస్వరూపమును గనపర్చగా దాని ననుభవించి సంతసిల్లుచున్నారు. ఇందులో "నిన్నవో న్నెయుణకం దేనుక్క" అనునది ఈయిర్పాట్టు.

## 1. కణ్గాళ్ శివందు.

శ్లో. రక్తం లోచనయుగ్మ మంబుదనిభం కాయం ప్రవాళాధరం
తేజిష్ఠాతివిళక్షదంతనికరం రత్నప్రభే కుండలే,
నానానర్ఘ్యమణిప్రవేకరుచిరం మౌళించ బాహుద్వయీ
యుగ్మం హేతి తతించ బిభ్రదనిశం మయ్యేవ కశ్చిత్ స్థితః.

శా. రక్తాంభోజదళాయతాక్షుడు విధీ ♦ ప్రప్రోచ్చకోటీరు డు
ద్రిక్తారుణ్యసమంచితాధరుడు నై ♦ రివాప్రితభీష్మారిని
ర్ణిక్తాసిప్రముఖాయుధప్రవరరు ♦ డ్నీరాజితాంగుండు సం
సక్తాంభోరుహగేహినీనిలయవ ♦ క్షస్కుండు నిత్యంబు సం
రక్తి న్నాహృదయంబున న్నిలిచె స ♦ ద్రక్షాచణుండై కృపన్.

## 2. అ డి యే ను ల్లా న్.

శ్లో. అండాంతర్గతసర్వవస్తునిచయం చాధ్యాస్య యో భాసతే
జ్ఞాతుం నప్రభవంతి యం సుమనసో బ్రహ్మాదయో యత్నతః,
దుఃఖామిశ్రితనిత్యసిద్ధపరమానందైకతానశ్చ యః
స్సోయం సంప్రతి మానసే వపుషి మే వాసం కరో త్యచ్యుతః.

చ. సరసిజసంభవాండమున • సర్వచరాచరవస్తుకోటికిన్
గురుమహదాదితత్త్వముల • కు న్బొలుపారగ నంతరాత్మయై
నిరుపమబోధనందధుల • నీరధి నిస్సము డబ్జనేత్రుఁడా
దరమెసగ న్వసించె సతతంబు మదీయమనోవపుస్సులన్.

## 3. ఉ ణ ర్వ లు ం బ ర్.

శ్లో. సూరివ్రాతనిషేవితాంఘ్రికమలం లక్ష్మీశ మీహో న్నర్మమ
స్వాంతే న్యక్షిప మాదరాత్సచకృపాపూర్ణో మయి త్పుల్లకే,
కృత్వా మాం స్వపదాంబుజాతయుగళీబద్ధాభిలాషం భవే
చోత్వా ద్వ్యారుచి మంతరాత్మని వస త్యానందదాయీ మమ.

ఉ. హేతువు లేకయే పరుడ • హీనకృపన్ దనయందు నాకు వి
శ్వాతిగభక్తి నిల్పి విష • యంబులనుండి మరల్చి నామనః
ప్రీతిగ దాస్యకర్మనిడి • వెల్గు మదాత్మను నాకుజూపె నా
కే తగునాదుసాటి మరి • యీక్షితిఁ దుల్యులులేరు నాకికన్.

## 4. యాం ను ం తా నాయ్.

శ్లో. హేతు స్సర్వచరాచరస్య కమలానాథాబ్జభూశూలభృ
ద్రూపేణ స్థితిసర్గసంహృతికరో లోకస్య సర్వాత్మకః,
మిశ్రీభూతపయస్సితామృత రసక్షౌద్రాదివద్భోగ్యతా
బుద్ధిం చాత్మని మే విధాయ రమతే మయ్యేవ శశ్వ ద్ధరిః.

చ. చిదచిదశేషకారణుడు • చిత్తజవైరికి బ్రహ్మకున్ జని
ప్రిదుకు జగంబుఁజేయఁ బరి • పాలనము న్బచరింప దుృంప స

మ్మదమునంజెందువాని సుధ మాడ్కిని భోగ్యనిమగ్నమనంబులోఁ
గుదురుగనున్నవాని హరిఁ గోర్కులుమీఱ నెఱింగితిం జుమీ.

5. ని న్న వో న్నె.

శ్లో. అజ్ఞాసిషం పరమయా కృపయైవ తస్య
జీవస్వరూప మపరే న విదు ర్యథాహాం,
అజ్ఞాసిషు ర్యదిత మిందియ కాయధీభ్యో
భిన్నం విలోకయితు మత్రి నశక్నువంతి.

తే. గీ. నీరజాక్షుని కృపచేత నేనుగన్న
మామకాత్మస్వరూపంబు మానవులకుఁ
దెలిసికొనఁటకు శక్యమా తెలిసికొన్న
కాక బుద్ధీంద్రియంబుల కంటెమిగుల
భిన్నమగుదాని నేభంగి గన్నుజాచు.

6. న న్యా య్ జ్ఞా న మ్.

శ్లో. యోగాభ్యాసపటు ర్జితేంద్రియగణో హేయత్వమస్యాస్తనో
ర్జాత్వా వైషయికంవిహాయచసుఖందూరోజ్ఝితాశేషశుక్,
గేహే వత్యకళత్రవిత్తపచయే త్యక్త్వా మమత్వం భజ
న్నైరాశ్యం పురుష స్సఏవ చతురో హ్యాత్మానముద్వీక్షితుమ్.

శా. యోగాభ్యాసముచేసి జేంద్రియగణో దోగంబు వారించి ని
ర్యోగక్షేముడు నిర్మముండుసుఖదుఃఖోన్ముక్తుఁడై యుండువా
డే గాఢంబుగ జూడ శక్తుడగువా డీయాత్మరూపంబులన్
యోగు ల్కేవలముక్తి యందురిది దు ర్యోగు ల్గనన్ శక్తులే.

7. ఆ దు వే పి దు.

శ్లో. సా కైవల్యవిముక్తి రిత్యభిహితా యాఽఽత్మానుభూతిః పరా
మోక్షాప్తా వనుభావ్య నందధురపి హ్యాత్మానుభూతిస్సృతా,
ఏతస్యాః ప్రతికూల మన్యదఖిలం సంత్యాజ్య తేచే త్తదా
కైవల్యం సమవాప్య తే జడధియో నైతదహాస్యం విదుః,

తే. గీ. ఆదియె కైవల్యముక్తి యా • త్మానుభవము
నందు గలిగెడునానంద • మదియెచూవె
ప్రకృతిసంబంధ మెట్లు స • వాసనముగ
విడువగలిగిన మోక్షంబుఁ • బడయువచ్చు
నిట్లుదెలియంగ నోపని • హీనమతులు
సంసృతిక్లిష్టులగుదు రీ • క్ష్మాతలమున.

8. ఎ య్ తా ర య్ తా ర్.

శ్లో. అస్తం యాస్యతి మాన మేవ నభవే దిత్యా ప్తవర్గే౽ భితః
క్రందత్యుచ్చరవేణ దారతనయే ష్వాబద్ధరాగో౽ధికమ్,
బుద్ధిభ్రంశ ముపైతి మానవ ఇహ ప్రైష్యం స్తదా శౌరిణా
హ్యాత్మా తుల్యఇతి స్మరే ద్యది భజ త్యంతే స సిద్ధిం పరామ్.

ఉ. ఆశలపీడి యిందిరియచ • యంబు జయించిన వీతరాగియున్
నాశమునొందు వేళఁ దన • నాతియుఁ బుత్రులు దగ్గిరించి యా
క్రోశము జేయు బుద్ధిచెడి • క్రుంగునుగాని నిజాత్మయెప్డు స
ర్వేశుని శేషభూతమని • యెంచగ నిర్మలమైనదంచు దా
లేశము నంతిమస్మృతియు • లేనిజనుండు విముక్తి నొందెడున్.

9. కూ డి త్తా గి ల్.

శ్లో. అంతే స్వాత్మస్మృతిమా న్యది ప్రభజతే సిద్ధిం పరాం మానవో
హ్యైక్యం జీవపరేశయో శ్శశివిషాణోత్పత్తితుల్యం భవేత్,
తస్మా జ్జీవపరేశయో శ్శ్రుతిగణో వక్తి ప్రభేదం సదా
కేచి ద్భ్రాంతజనా స్తదైక్యమితి న శ్రద్ధేయ మేతద్వచః.

ఉ. జీవుడు తత్త్వబోధమును • జెందిపరేశత నొందుగాన స
ద్భావముతోడ నంతమున • స్వాంతమున న్స్మరియింపగావలెన్
దేవునటంచుఁ బల్కుటిది • దేశిక లోప్పనిమాట బ్రహ్మకున్
జీవునికి న్విభేదమది • సిద్ధ మనాదిగ నుండుగాని మా
యావిమతస్థు లివ్వసుధ • నట్లు వచింతురు భ్రాంతచిత్తులై.

## 10. ఉళరుమిల్లై

శ్లో. న స్యాం యథా కుమతిగర్తనిపాతితోఽహం
కృత్వా తథా స్వవశగం హృదయే నివిష్టః,
తస్మాన్నిరాస్థ మఖిలం మమ దుఃఖజాతం
యత్కార్యమానసకృతం కృపయైవ తస్య.

తే. గీ. దుర్మతమునందుఁ జొరకుండఁ ♦ దోయజాక్షు
డధిక కారుణ్యమున నామన ♦ మందు నిత్య
వాసమొనరించుచుంట నా ♦ వనటదీరె
నిదియె హరి నాకొనర్చిన ♦ తుదియుపకృతి.

## 11. తెరుళుంమరుళు మ్.

శ్లో. భక్తాజ్ఞానవినాశకం కమలభూశర్వారిదేవప్రిజ
స్యాత్మానం నిజపాదసంశ్రితజన స్యాంఘ్రిద్వయీప్రాపకమ్,
స్తుత్వా శ్రీశఠకోపమాని రకరో ద్య త్పద్యసాహస్రికం
తస్మిన్నేతదనూనపద్యదశకం దద్యా త్పదం శ్రీహరేః.

చ. హరునకు పంకజాసనుని ♦ కం తరవస్థితుడై నవాని సంసరణ
మహాహిదష్టజన ♦ జాంగులికున్ కమలాయతాక్షు నా
దరమునఁ గారిజుండు నుతి ♦ తర్పితుఁజేసి రచించినట్టి సుం
దరమగు వేయిపద్యములఁ ♦ దప్పక యీదశకంబుఁ బాడగా
సరసిజనేత్రు నంఘ్రియుగ ♦ సన్నిధి యబ్బును నిశ్చయంబుగన్.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతే రామానుజాయనమః.

## అష్టమ శతకము – తొమ్మిదవ దశకము.

[కరుమాణిక్కమలై.]

అవతారిక :— క్రిందితిరువాయిమొళ్ళియందు మొదటిరెండధర్ధ పాశురము
లచే సర్వేశ్వరుని సౌందర్యశీలాదుల ననుసంధించి వానితోఁబాటు విలక్షణమయి

యనన్యార్హలై యుండునాత్మస్వరూపమును మిగిలినపాశురభాగముచే ననుసంధించి సంతసిల్లినారు. ఆశేషత్వరసముచే ప్రీతులై ప్రీతిపారవశ్యముచే తమస్వస్వభావమును పోఁగొట్టుకొని యొకపిరాట్టిదశను పొంది తమదశను అన్యాపదేశముగా జెప్పి సంతోషించుచున్నారు. ప్రీతిచే నన్యాపదేశముగాఁ జెప్పుట యీయొకతిరువాయిమొళ్ళియందే యని కూరత్తాళ్వాన్నిర్వాహము. తిరుప్పులియూరునందు వేంచేసియున్న స్వామితో యాదృచ్ఛికముగా సంశ్లేషించి యడబాసిన యొకపిరాట్టి వానిచే నపహృతచిత్తయయి యున్నప్రకారము నామెప్రాణసఖి యొకర్తు చూచి యీయామె శరీరమందు వాక్కులయందు వైలక్షణ్యమునుబట్టి సంశ్లేషము జరిగినదని తెలుసుకొన్నది. వీనిలో నొకదాని సెఱుంగక "పతిసంయోగసులభం వయో దృష్ట్వాచ మే పితా" అన్నట్లు చిన్నదానికి పరువము నిండినదన్న యంశమునే గ్రహించి తండ్రిమొదలగువారు స్వయంవరమునకు రాజపుత్రులను రావించి తూర్యములను వాయించుచుండగా విన్నచెలికత్తె "నీవు రాజావయితివి" అని వాయించిన మంగళవాద్యధ్వని చెవిలోఁబడగా శ్రీభరతాళ్వాను పడ్డ బాధనంతయు ను పడి "యీ తూర్యధ్వని యీచిన్నదాని చెవిలోఁబడినయడ "మానిడవర్క్కెన్ఱు పేచ్చుప్పడిల్ వాழగిల్లే నక్కండాయ్ మన్మదనే (నాచ్చియార్ తిరు-1-5) అన్నట్లు వెంటనే మృతినొందును. దీనిని శీఘ్రముగా నివారింపవలెను. తిరుప్పులియూరు నందు వేంచేసియున్న స్వామితో నీమెకు సంశ్లేషము జరిగినదని వెల్లడిచేసెను. అట్లుచేయనిచో నీమె మృతినొందును. ఇకనిపుడు చెయ్యవలసిన దేమున్నది. అని చెలులందరొకచోటగూడి "ఈమెశరీరమందు వైలక్షణ్యము కానవచ్చుచున్నది. ఇందుకు హేతువేమియని యాలోచించిరి. ఇంతలో నీమె ప్రాణసఖియు నేనుగూడ వీరితోగూడి యాలోచించి యిందుకుఁ దగినహేతువును బాగుగా నిరూపింపవలెనని తెలుసుకొని నివారింపవలెనని తలంచి" ఈమెశరీరమునుబట్టి చూడగా తిరుప్పులియూరుస్వామితో నీమెకు సంశ్లేషము జరిగినది. వానిగుణచేష్టితములనే యీయామె తరుచుగా ననుసంధించుచున్నది. మీప్రయత్నములను మానుడు అని ధర్మమును చెప్పెను. ఇది ధర్మము కాదనెను అందుపైని వారు నీవుచెప్పిన తిరుప్పులియూరు స్వామికి సౌందర్యము, వీరత్వము, సద్గుణములు, ఐశ్వర్యము, ఔదార్యము, ప్రణయిత్వము, వేదార్థతత్త్వజ్ఞానము మొదలగు యోగ్యతలున్నవా యని యడిగిరి. అందుపై నీమె ఆయన గుణసముద్రుడని బదులుచెప్పి. యీగుణములనుపట్టియే యీయామె ఆస్వామి కనన్యార్హయయినది కావున మీప్రయత్నము మానుడని నివారించెను. ఇందులో "పున్నైయిన్ గళిప్పు" అనునది ఉయిర్పాట్టు.

1. కరుమాణిక్కమలై మేల్.

శ్లో. నీలాశ్మావనిభృత్తటాకవిలసత్పద్మాటవీస్పర్ధిని యు
ద్వక్షోనాభికరాధరాక్షిచరణం పీతాంబరం బిభ్రతః,
లక్ష్మీశస్య సమృద్ధశీతలజలై ర్వ్యాప్తైః పరీతే పురే
వైయాఘ్రే వసతః ప్రవక్తి సతతం నామాని పుత్రీ మమ.

శా. జంభారాతిమణీమహీధరముప్పై • సంఫుల్లపద్మాటవీ
శుంభత్పాదకరాంఘ్రియుగ్మములచే • శోభిల్లు నారాయణున్
కుంభీంద్రావనదక్షు భక్తజనతా • ఘోరాఘవిధ్వంసనా
రంభున్ వ్యాఘ్రపురీవరస్థితుని యీ • రమ్యాంగి వీక్షించి ని
ర్దంభప్రక్రియ వాని నామ మనుసం•ధానంబు సేయున్నదా.

2. అన్నైమీరిదర్కన్ శెయ్ గేన్.

శ్లో. హేమక్ష్మాధరమస్తకోపరిచరన్మార్తాండతారాగణ
ప్రఖ్యై రుజ్జ్వలరత్నమాళివిమలప్రాలంబికాద్యైః పరైః,
భూషాఘైస్సమలంకృతస్య నృహరే రుత్తుంగసద్మాంచితం
వైయాఘ్రంపురమేవ సంతతమియం లాలప్తి పుత్రీ మమ.

ఉ. మేరునగేంద్రమస్తకము • మీఁద దివాకరతారకాదివి
స్ఫారరుచు ల్వెలుంగుగతి • వారిధరోపమకాయకాంతిపై
మీఱిన దివ్యమాలిమణి • మేదురరశ్మిచయంబు హారవి
స్తారవిభూషణాళి పవి • ద్యుతులు బ్లసిలంగనొప్పు శ్రీ
శ్రీరమణీశు వ్యాఘ్రపురిఁ • జెప్పినఁ బెంచును సంతతంబు మ
ద్దారిక తల్లులార యివి • ధాత్రిని గంటిరె మీర లెప్పుడున్.

3. పుగఴుమివళ్.

శ్లో. ఆభీలానలకీలసంచయసమాలీఢాంబురాశిప్రభం
చక్రం చేతరహేతిజాల ముభయో ర్ధృత్వాచ పాణ్యోరణే,
యః కోపాన్నిచకర్త దైత్యనివహం తస్య ప్రభో స్సద్మన
శ్శ్రీశార్దూలపురః ప్రణౌతి సతతం రమ్యాత్వ మేషావధూః.

ఉ. ఈసుదతీలలామమన ♦ సెప్పుడు శ్రీసుదర్శనాయుధో
జ్జాసితదైత్యుఁ డంబుధర ♦ సన్నిభగాత్రుఁడు కంజనేత్రుఁ డ
ధ్యాసితతార్క్ష్యవాహనుఁడు ♦ దానివసించెడు సౌధవీధికా
భాసితమైన వ్యాఘ్రపురి ♦ భాగ్యమునే నుతియించుచుండెడున్.

4. ఊర్వశంకిళర్.

శ్లో. శాతేయేక్షువనీపరిష్కృతతలే కాసారసంశోభితే
శ్రీశార్దూలపురే స్థితస్య జఠరే నిక్షిప్తలోకావళేః,
దేవానీకవిభోస్సముద్రతనయాహృద్యస్య నామోత్కరం
త్యక్త్వా నాన్య దియం బ్రవీతి ముదితా మత్పుత్రికా పశ్యత

శా. నానాసూనవనీక్షువాటనిచయా ♦ నాహోరుకైదారకో
చ్ఛానాపాచ్ఛవికస్వరాంబుజవనీ ♦ శుంభత్తటాకావృతం
బై నిత్యోత్సవఘోషితంబు పులియూ ♦ రందున్సదా వాసియై
సూనాస్త్రప్రతిమల్లసుందరతనూ ♦ శోభాంచితుండై నమ
ద్దీనైకావను నీవె బాడు నెపుడున్ ♦ తీవ్రాబ్జబాణార్తయై.

5. పునైయిత్తైగళణిఫ్రన్.

శ్లో. అస్యాస్త్రిస్తవిలోలశంబరవధూదృష్టేస్తరుణ్యాస్తనో
స్సౌందర్యం మణిభూషణౌఘసుషమావాచాంపదం నోభవేత్,
ఫుల్లాంభోరుహషండమండితసరస్సందోహశైత్యాంచితాం
శ్రీశార్దూలపురీ మధిష్ఠితవతో మగ్నా కృపాయా మియమ్.

శా. ఈలావణ్యవతీశరీరరుచియుం ♦ హెచ్చైన భూషామణీ
జాలోద్యోతము వర్ణనాతిగము లౌ ♦ సారప్రఫుల్లాబ్జినీ
లోలాళీస్వనసాదితంబయి సహా ♦ లోకౌఘసంసేవ్యల
క్ష్మీలీలాస్పదమైన వ్యాఘ్రపురి శ్రీ ♦ కృష్ణున్ ప్రశంసించుచున్
గాలం బెవ్వడుపుచ్చు వానిదయ మ ♦ గ్నత్వంబునొందెం జుమీ.

6. తిరువరుళ్ మూఴ్గి.

శ్లో. సౌందర్యం వచసా మగోచర మియం కాంతిశ్చ భూషోజ్జ్వలా
సంశ్లేషా దభవ ద్గృహీతవసతే శ్శార్దూలపుర్యాం హరేః,

ఇత్యావేదయితుంచ జిహ్వామధరోఽస్యా స్తత్పురీవాసినః
పద్మాక్షస్య కృపైధితస్య సదృశః పూగీఫలానాం తతేః.

మ. క్రముకారామపరీతమై దనరు వ్యా ♦ ఘ్రగ్రామవా స్తవ్యుఁడౌ
విమలాంభోజదళాయతాక్షు కృపకీ ♦ బింబోష్ఠపాత్రంబటం
చమరం జెప్పఁగ జిహ్వ యొక్కటియెయీ ♦ యబ్జాక్షి యోష్ఠంబుత
త్క్రముకాళీఫలసామ్యలబ్ధిగని ని ♦ క్కంబిద్ది యూహింపగన్.

7. మె ల్లి లై చ్చె ల్వ.

శ్లో. నానాపుష్పలతావృతోచ్చకదళీపూగాదిధాత్రీరుహ
వ్రాతాకీర్ణవనాళికృష్ణనిబిడామోదానిలాసేవితే,
శ్రీశార్దూలపురే స్థితస్య వినమద్బ్రహ్మాదిబర్హిర్ముఖ
స్తోమప్రస్ఫుటమౌళిరత్నకిరణప్రద్యోతితాంఘ్రిం శ్రితా.

శా. నానాపుష్పలతాకుడుంగనిచయో ♦ న్నమ్రాతిసంఖ్యద్రుమా
నూనోద్యానపరంపరాపరిచల ♦ న్మందానిలాసేవిత
స్థానంబై దనరారు వ్యాఘ్రపురిలో ♦ సంతుష్టుఁడై యుండు నా
శ్రీనారాయణు పాదపద్మములఁ జే ♦ రెన్ బాల సంప్రీతయై.

8. మ డ వ ర ల నై న్న మీ ర్.

శ్లో. కిం బ్రూయామిహ మాతరః ప్రవరభూదేవోత్కరాణాం సవే
ష్వాజ్యైస్తర్పితవహ్నిధూమపిహితామర్త్యాలయే భాసురే,
శ్రీశార్దూలపురే ఫణీంద్రశయనే సుప్తస్య లక్ష్మీపతే
స్త్వక్త్వా నామతతిం మమ ప్రియసుతా సంభాషతే నాపరమ్.

ఉ. ఏమని మీకుఁ జెప్పెద మృ ♦ గేక్షణలార సమస్తవేదశా
స్త్రామలబోధదీప్రసవ ♦ నాహరణాతులయత్నభీతసు
త్రామపదాభిలాషులు ధ ♦ రాసురవర్యులు సల్పు నధ్వర
స్తోమవహుతాజ్యహోమ ♦ తతధూమశిఖావృతనాకమై మహా
శ్రీ మితిమీరు వ్యాఘ్రపురి ♦ శేషశయానుని నామజాతమున్
యేమరకుండఁ జెప్పు మరి ♦ యేమియుఁ బల్కదు వేరుమాటలన్.

### 9. వరవాళివళ్ నిన్ని తాప్పగల్.

శ్లో. ప్రావృడ్వారిధరౌఘసన్నిభతనోః కృష్ణస్య కంసద్విషః
పేష్ఠ స్యావసథస్య సామపఠనై శ్శబ్దాయమానస్య చ,
కాసారప్రకరప్రఫుల్లనళినీసౌగంధ్యసంసేవినః
శ్రీశార్దూలపురస్య నౌతి సతతం కీర్తిం మమేయం సుతా.

ఉ. వారిదసన్నిభాంగుఁడగు ♦ వారిజనేత్రుని ధామమై సవి
త్రోగ్రయశఃప్రకాశితులు ♦ నుత్తమవిద్యులు భూసురాళి వే
సారక పాడుచుండు శ్రుతి ♦ సారము సామముచే జనించును
చ్చారవ మెప్పుడు న్గలిగి ♦ యమహాజనాళినివాసమై జన
క్షేమకరంబు వ్యాఘ్రపురి ♦ కీర్తిని నాసుత పాడుచుండెడిన్.

### 10. అన్నిమత్తోరుపాయమ్.

శ్లో. క్ష్మాభృత్తుంగమహారత్నకలిత ప్రాసాదసంశోభితే
కుంభీడింభదిశావధూముఖపరిష్కారే ధనాఢ్యాస్పదే,
శ్రీశార్దూలపురే కృతాధివసతే శ్శ్రీశస్య లేభే కృపా
మేషా మత్తనయా నచేద్వపుషి సౌరభ్యం తులస్యాః కథమ్.

శా. గ్రావోచ్చామలచంద్రకాంతమణి సం ♦ ఘాబద్ధహర్మ్యోఘమై
సేనాధాగతభక్తసంకులమునై ♦ శ్రీధామమై యొప్పి రా
జీవాప్తాంగజదిగ్వధూతిలకమై ♦ చెన్నొందు శార్దూలపు
ర్యావాసంబున నున్న శౌరికృప నీ ♦ యబ్జాక్షి ప్రాపించె నీ
హావం బేమియు లేనిచో తులసిగం ♦ ధాఢ్యాంగి యెట్లౌనొకో.

### 11. నేర్పట్టనిదై.

శ్లో. త్రైలోక్యైకపతేర్మురాసురజితః పాదాబ్జదాసాశ్రిత
వ్రాతాంఘ్రిద్వయదాసదాసనికరశ్రీపాదసంసేవినా,
మౌనీంద్రేణ శఠారిణా విరచితే గాథాసహస్రే త్విదం
గాథానాం దశకం ప్రదాపయతి తత్కైంకర్యభాగ్యం హరేః.

చ. జగముల కెల్లనేతయగు • సారసలోచను పాదభక్తిచే
నెగడెడువారి భక్తులకు • నిర్మలభక్తుడు శ్రీశఠారిదా
నిగమవచోవిలాసముల • నిర్మితిజేసిన వేయిలోనివా
సుగమము లీపదిం జదువు • సూరులు శౌరికి నిత్యకింకరుల్.

శ్రీ మ తే శ ఠ కో పా య న మః.

శ్రీమతే రామానుజాయనమః.

అష్టమ శతకము - పదియావ దశకము.

[నెడుమాల్కడిమై.]

అవతారిక :— క్రింద రెండుతిరువాయి మొఝ్ఝులచేతను ఆత్మయొక్క అనన్యార్హశేషత్వము చెప్పబడినది. అది పరులకు తనకు గూడ నుపయోగములే కుండ బ్రతిపాదింపబడినది. ప్రణవమందు మధ్యమపదముచేతను నమఃపదముచేతను చెప్పబడిన యర్థమును చెప్పుచున్నది అనన్యార్హశేషత్వమును పరమావధితదీయ శేషత్వము. తదీయులకు క్రయవిక్రయార్హుడైనప్పుడే తచ్ఛేషత్వము స్థిరపడుట. “ ఎందమ్మై విర్కవుం పెరువార్గళ్ ” అని న్యాయము. అమ్మణియాళ్వాన్ అనునాతడు పోశళరాజ్యమునుండి వచ్చియున్నదినములలో భట్టరువారాతని గటాక్షించి “ ఓయీనీవు భాగవతులపట్ల మిక్కిలి పారవశ్యముగలవాడవని వినియున్నాము. కావున నీవు నెడుమాల్కడిమై ” అను తిరువాయిమొఝ్ఝిని వినవలయునని సాదించిరట. ఈశ్వరశేషమని తెలుసుకొన్నప్పుడు భ్రమించి మళ్లిపోవచ్చును. తదీయశేషత్వపర్యంతము తెలుసుకొన్న యెడల మళ్లనవసరములేదు. “ స్వస్వాపత్యభావ మతివేల మబుద్ధ్యమానో లక్ష్మీసహాయ గుణామంగళపంకలగ్నః। తద్భక్తిని ఘ్నమనసాం క్రయవిక్రయంశ్లోకా నాగ్రప్రతారితఇవ త్వరితో బభూవ ” అనిన్యాయము. కొందరైశ్వర్యము పురుషార్థమందురు. మరికొందరాత్మలాభము పురుషార్థమనియు నింకొకతెగవారు భగవచ్ఛేషత్వము పురుషార్థమనియు, మంరొకమతస్థులు ఈశ్వరుడై ఆనందమయుడు కావడము పురుషార్థమందురు. ఇట్టి పురుషార్థములన్నియు సమస్తముగాను వ్యస్తముగాను దీనికొన్నను నేనుపట్టిన భాగవతశేషత్వముతో సమానములు కావు. ఇట్టి యీభాగవతశేషత్వమే కాలతత్త్వమున్నంతవరకు నాకు నాసంబంధులకు ఫలించునుగాక అనిప్రార్థించి సమాప్తి

నొందించుచున్నారు. పయిలుంశుడరొళికంటె నీతిరువాయిమొళ్రికున్న భేద మేమనగా "భాగవతులు శేషులని అచ్చట చెప్పబడినది. భాగవతులు భోగ్యులని యిందులో జెప్పబడినది. గచ్ఛతా మాతులకులమ్" శ్రీశత్రుఘ్నాళ్వానుకు యీాయాళ్వార్లకు నీయర్థమురుచించుట— "నిత్యశత్రుఘ్నః" పెరుమాళ్ల భోగ్యతయందు కంటిని బ్రసరింప జేయనివారు శత్రుఘ్నాళ్వాను. ఇందులో "తనిమాప్పగత్తేయెణ్ణాన్నమ్" అనునది (ఉయిర్పాట్టు.)

1. నెడిమాల్కడినై.

శ్లో. శ్రియః కాంతే విష్ణౌ స్మృతిపథగతే దోషనివహో
మమాజ్ఞాతం నేశు జ్జనయతి తదాశ్చర్య మతులమ్,
తతోఽహం దైత్యారిశ్రితచరణకంజాతియుగళం
పరిత్యజ్య శంసే నహి సురపతేశ్చాపి విభవమ్.

ఉ. పంకజనాభు దాసుడని • పైకినటించిన తోడనే మహా
పంకములెల్ల నన్ను వడి • బాసి నశించె నిరన్వయంబుగా
శంకలికేల నాకిపుడు • సర్వనియంతృపదారవిందస
త్కింకరులైనవారి పద • కింకరత న్పొసవ్రాని నేను ని
శ్శంకముగాద్యజించెదను • సర్వజగద్విభవంబు లబ్బినన్.

2. వియన్మావులగు.

శ్లో. కైవల్యం భువనత్రయాధిపతితాం లబ్ధ్వాఽపి నహోర్ణున్ముఖ
స్నిగ్ధాంభోధరసన్నిభాత్మవపుషః కృష్ణస్య సర్వేశితుః
మాల్యాలంకృతపాదపద్మయుగళే యైర్దాస్య మంగీకృతం
తేషామంఘ్రిసమాశ్రయోత్థసుఖవ న్నాన్యత్ప్రమోదాయ మే.

ఉ. శ్రీరమణీప్రియాంఘ్రిసర • సీరుహసంతతచింతనామృతా
సారమున స్ప్రశాంతిభవ • సంజ్వరులై విలసిల్లుభక్తులన్
జేరి తదీయపాదముల• సేవలొసర్చగ గల్గుసౌఖ్యముల్
సారవిహీనమా ద్రవిణ • సంచయ కేవలముక్తులిచ్చునే.

3. ఉరుమోపావియేనుక్క.

శ్లో. కాయేష్వేషు నిజేషు హిమ్ని గురుషు శ్రీనాథభక్తే ష్వమీ
ష్వ ప్యైవ ప్రతిసంచర త్స్వపచితిం తేషాం విహాయాదరాత్,

హ్రస్వామాత్మతనుం హఠాదుపచితిం ప్రాపయ్య లోకత్రయీ
మాతుః పద్మదళేక్షణస్య చరణప్రీతి ర్న క్షేమే రోచతే.

ఉ. శ్రీమురభిత్పదాంబుజము • జేరి భజించెడువారు గాసు న
స్నీమహి నేలువారు నగు • సీమహనీయుల సంత్యజించి శ్రీ
వామనరూపత న్మొదట • వంచన జేసి బలి న్వదాన్యు ని
స్సీమవివృద్ధకాయమున • శీఘ్రముగా భువనత్రయంబు స
ర్వామరు లుల్లసిల్లగ ని • జాంఘ్రుల గొల్చిన వాని గొల్తునే,

4. ఇంగేతిగిందేర్కు.

శ్లో. యో లోకా న్ప్రళయే నిగీర్య పున రప్యుద్గీర్య సృష్ట్వా వవ
త్యారక్తాధరలోచనో మయి విభు స్సందర్శయా న్స్వాంకృపాం,
మద్వాణ్యా మతిమంగళా న్నిజగుణా న్మన్మానసే స్వం వపు
ర్హస్తే మే సుమసంతతిం యది కరో త్యత్ర క్షతిః కా చ మే.

మ. వసుధ న్సర్వము మ్రింగి గ్రమ్మరబహి • ర్వ్యక్తంబుగా జేసి రా
క్షసుల న్గూల్చిన కంజనేత్రుని యశో • గానంబు వాగ్బృందమం
దు సుమంబుల్కరమందు బూజసలుపం • దోరంబుగా సర్వతః
ప్రసర త్కాంతి తదీయదేహము మనో • భావంబున న్గల్గు న
య్యసమానాభ్యుదయంబు వానికృప నా • కబ్బంగ నేనిమ్మహిన్
వసియింప న్కొఱతేమి దివ్యపదసం • ప్రాప్తిన్స్పృహాశూన్యుడన్.

5. వత్రిపట్టోడవరుళ్.

శ్లో. దేవస్య దానవరిపోః కరుణావిశేషా
త్సంప్రాప్తమోక్షసుఖమ ప్యహ మాద్రియే న,
తత్కీర్తివర్ణనపరే విమలే ప్రబంధే
ప్రీతిస్తు మే సుమహతీ భవతీహ నిత్యమ్.

తే. గీ. మాధవుం డిచ్చు దివ్యధా • మంబునందు
ననుభవించెడు నానంద • వనధి యెంచ
వకుళభూషణనవ్యప్ర • బంధపఠన
జనితనిరవధికాహ్లాద • మునకు సరియె

6. సు గ ర్చి యు రు మో.

శ్లో. యః ప్రాగ్జంగమభూధరోపమమదస్తంబేరమం భీప్రదం
క్రవ్యాత్సంచయ ముచ్చకర్త భుజగవ్రాతారివాహస్తు యః,
తస్య శ్రీదయితస్య మంగళగుణగ్రామస్తవాపాదకే
కావ్యే యా హి రసానుభూతి రధికా తస్యా స్తులాం కో భజేత్.

మ. ద్విరదప్రాణహరుండు దానవచమూ • విద్రావణోద్యద్భయం
కరచక్రాసిగదాది హేతి గరుడా • క్రాంతధ్వజుండై సురా
సురకోటీరమణిప్రభాస్థగితప • చ్ఛోణాబ్జుడై యొప్పునా
హరికళ్యాణగుణానుభూతిజనితా • హ్లాదంబుతో సాటియే
తరమెంచంగ జగత్త్రయస్థితిలయో • త్పత్తిప్రభుత్వప్రథల్.

7. త ని మా ప్పు గ ఴై.

శ్లో. రాజత్కీర్తివితాన మత్రభువనే నేతుం చిరస్థాయితాం
జాత స్యోజ్జ్వలతేజసో భగవత స్సేవాపి నేష్టా మమ,
తద్భక్తై ర్మమ దేశికైః ప్రియతమై ర్నిత్యం భజా మ్యచ్యుతం
తత్ప్రీత్యై ప్రతిజన్మ సిద్ధ్యతు మమ త్వేషైవ సంప్రార్థనా.

చ అనుపమితాత్మ కామమున • నై త్రివిధంబగు కారణంబు దా
ననువున ముజ్జగంబుల స • యత్నముగా సృజియించువాని శో
భనగుణవర్ణనంబు సలు • ప న్మది లేదిసుమంత వాంఛయున్
నిరతము తత్పదాశ్రితుల • నిత్యసపర్యయె నాకు గావలెన్.

8. నా ళు ం వా య్ క్క.

శ్లో. సృష్ట్వాఽగ్రే జలరాశి మత్ర బహుదోఃకల్పావనీజవ్రజః
సంఖ్యాతీతకిరీటభాస్కరతతి ర్మాణిక్యశైలేంద్రవత్,
యశ్శేతే నిభృతం సరోజనయన స్తస్యాత్మభూతై ర్మమ
శ్రేష్ఠై ర్భక్తజనై స్సదా భవతు మే సంగో వియోగం వినా.

చ. జలధి సృజించి యందు దన • చారుభుజంబులు హస్తపాదముల్
తలలును జూపి తెందు నవ • తామరసాక్షు ననారతంబు ని
శ్చలమతి నన్యసంగమును • సర్వముపీడి భజించు భక్తులన్
విలసితభక్తి గొల్చుటయె • వేడుక నాకు మహీతలంబునన్.

9. తమర్గభ్యాట్ట.

శ్లో. భక్తాఘౌఘనిషద్వరాపహరణే సంవర్తకోష్ణద్యుతే
శ్చక్రాబ్జాసిగదాదినుండితచతుర్బాహో స్సురారిద్విషః,
పాదాబ్జాశ్రితదాసదాసచరణద్వంద్వాశ్రితానాం సదా
దాస్యం స్యాత్పరిపరఃపుమర్థఇహ మే నాన్యద్వృణే వాంఛితమ్.

చ. తనకు ననన్యభక్తులయి • తద్ద భజించెడువారి పాపముల్
వినిహతి నొందజేయు గృప • విస్ఫురదాయుధదీప్తిహస్తుడై
మనుజునిభంగి బుట్టిన న • మర్త్యపతి ప్రపిచింత్యమానప
ద్వనజుని భక్తభక్తులగు • వారికి భక్తుడనౌట గోరెదన్.

10 వాయ్క్కతమియేర్క్క.

శ్లో. కాశస్పర్ధితనూరుచే రరిలసత్పాణేః పయోజాలయా
సంశ్లిష్టస్య చతుర్భుజస్యనిరతం యే స్యుః పదాబ్జాశ్రితాః,
తేషాం దాసజనస్య దాసనిచయా మత్స్వామిన స్సంతతం
తద్దాస్యైకరసజ్ఞతైవహి మమ స్యాత్పూరుషార్థః పర

మ. అతసీపుష్పసమాన దేహరుచితో • నాయామబాహాలతా
ద్యుతితో ధిక్కృత హేళిసంచయవిభా • దుర్దర్శచక్రంబుతో
సతతం బొప్పు రమావధూహృదయుకం • జాతాళికిన్ దాసులై
క్షితి బాలించెడువారి దాసులను సే•సేవింతు నశ్రాంతమున్.

11. నల్లకోళ్ళాట్టు.

శ్లో. త్రైలోక్యవ్యాప్తకీర్తేర్వికచవనరుహాక్షస్య దేవస్యభక్తో
మానీంద్ర శ్శ్రీశతారి ర్విమలతరపదై ర్యత్సహస్రం తతాన,

తస్మిన్నాథా దృశ్యైతాః ప్రముదితమనసా వర్తయంతః పుమాంసో
జీవేయుర్దారపుత్రైః పరమసుఖమవాప్యాత్ర శమేఽత్రద్వితీయే.

మ. భువనస్రష్ట రమేశునుజ్జ్వలనవాం ♦ భోజాతనేత్రున్ హరిన్
నమనంబుల్ప్రచరించి కారిజుడు దా ♦ నవ్యార్థసందర్భస
త్కవితాయుక్తముగా రచించిన మహా ♦ కావ్యంబునందీపదిన్
జవిఁ బాడెడువార లైహికసుఖా ♦ స్వాదైకనిష్ఠుల్భువిన్,

శ్రీ మ తే శ ర ణో పా య న మః.

అష్టమశతకము సమాప్తము.



శ్రీశఠకోపాయనమః.

శ్రీమతేరామానుజాయనమః.

# ఆంధ్రగీర్వాణ శఠకోపసహస్రము.

## — నవమ శతకము. —

### మొదటి దశకము.

[కొండపెండీర్.]

అవతారిక :— ఆళ్వార్లు క్రిందతిరువాయిమొళ్ళిలో భాగవతశేషత్వ మవధిగాగల నిరతిశయపురుషార్థమును నిఖిలవిరోధినివృత్తిపూర్వకముగా సర్వేశ్వరుడు కనపర్చగా జూచి యట్టిమహోపకారము నతిప్రీతితో ననుసంధించి "శయమేయడిమైతలైనిన్నార్ తిరుత్తాళ్వణంగి (8-10-2) స్వయంప్రయోజనమైన దాస్యముయొక్క పైభాగమందున్న శ్రీవైష్ణవులయొక్క శ్రీపాదములను ఆశ్రయించి" అనియు, "నీక్కమిల్లావడియార్" (8-10-10) ("విశ్లేషించని దాసులు") అనియు, "కోదిలడియార్" (దోషములేనిదాసులు) (8-10-9) అనియు భాగవతులను శ్లాఘించి యున్నారు. అప్పాన్ తిరువళ్ళుందూరరైయర్. (అళగియమనవాళప్పెరుమాళ్ తిరువళ్ళుందూరరైయర్. అని వీరివ్యవహారనామము) కూరత్తాళ్వాననాశ్రయించియే తిరువాయిమొళ్ళి నభ్యసించిరి. శ్రీభరతాళ్వాన్ వంటివారిని "శయమేయడిమైతలైనిన్నార్" అనియు, "ఇళైయపెరుమాళ్" వంటివారిని "నీక్కమిల్లావడియార్" అనియు, శ్రీశత్రుఘ్నాళ్వాన్ వంటివారిని "కోదిలడియార్" అనియునాళ్వార్లు శ్లాఘించియున్నారని కూరత్తాళ్వాను సాదించువారట. ఇట్టి భాగవతశేషత్వరూపమైన పురుషార్థమును మనకు గటాక్షించిన సర్వేశ్వరుడే మనకు నిరుపాధికబంధువు. తక్కినవారందరు సోపాధికబంధువులు. వాడే నిరుపాధికసుహృత్తు. తక్కినవారి సౌహార్దము సోపాధికమనియు, ప్రాప్యాభాసములను ప్రాపకాభాసములను విడిచి సర్వేశ్వరుడే ప్రాప్యమనియు, ప్రాపకమనియునిశ్చయించుటవలన గలిగిన ప్రహర్షముచే"మీరు సోపాధికబంధువులయిన వారినందరినివిడిచిపెట్టి సర్వేశ్వరునేఆశ్రయించి ఉజ్జీవింపుడని చేతనులకుపదేశించుచున్నారు. "సర్వేషామేవలోకానామ్" అనియు, "అవ్యయఃపితా" అనియు, సర్వేశ్వరుడే తల్లియు దండ్రియు నగుచున్నాడు. లోకములోని తలిదండ్రులనుకతోజే

సినపిచ్చుకగూడువలె నాలుగుదినములుండి నశించెదరు. ఎన్నడు నశింపనివాడు, శాశ్వతుడు నగు సర్వేశ్వరుడే మనల నేకరీతిగా రక్షించు తండ్రి. తనకు హితముపదేశించిన తమ్ముడగు విభీషణుని రావణుడు "త్వాంతు ధిక్కులపాంసనమ్" అని వెడలగొట్టెను. అట్టి విభీషణుడే నాకు ముఖ్యుడని స్వామి సాధించియున్నారు. అన్నయగు వాలిచే బాధింపబడిన సుగ్రీవుని స్వామి చేపట్టి రక్షించిరి. కన్నతండ్రి పరమశత్రువై సకలబాధల నొందింపగా ప్రహ్లాదుని స్వామి రక్షించిరి. "సపిత్రా చ పరిత్యక్తః" అన్నట్లు తలిదండ్రులుకూడ విడిచిపెట్టిన జయంతుడైన కాకాసురునిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించి చంప దలంచిన స్వామియే కొనకు వానిని రక్షించిరి. ద్రౌపది ధర్మప్రధానులైన భర్తలయిదుగురు సమీపమందున్నను వారిని విడిచి దూరస్థుడైన శ్రీకృష్ణునికొఱకు మొఱ్ఱబెట్టగా నయ్యో యిట్టి యాపత్సమయమందు నేను ద్రౌపది కుపకరింప జాలకపోయితినని "గోవిందేతి యదాక్రంద త్కృష్ణా మాం దూరవాసినమ్। ఋణం ప్రవృద్ధమివ మే హృదయా న్నాపసర్పతి" అని స్వామి అనుతపించిరి. అర్జునుడు "నాఅభిమతమును నేను సంపాదించుకొన జాలనని దుఃఖింపగా—" నీమట్టుకు నీవు చేసుకొనుపని యొకటి యుండినపుడుగదా దాని నెరవేర్చుట కశక్తుడనని నీవుశోకించుట— నీభారములన్నిటిని నాతలపైనుంచి నీపనులన్నిటిని జేయుటకు నేనే సమర్థుడనని యుండుము నీవిరోధి వర్గమును నిరసించి నీకార్యములను నేనే నిర్వహించెదనని పలికెను. ఈరీతిగా నాళ్వార్లు "సర్వేశ్వరుడే నిరుపాధికబంధువు. వానినే ఆశ్రయించుడు" అని తాము నిష్కర్షించిన యర్థము పరుల కుపదేశించుచున్నారు. ఇందులో "మత్తోన్నిల్లైయురుంగ చ్చొన్నోమ్" అనునది (ఉయిర్వాట్టు.)

### 1. కొండ పెండీర్.

శ్లో. కాంతాపుత్రసుహృజ్జనా ప్తవితతి భృత్యా స్తథా బాంధవాః
స్నిహ్యాం త్యాధ్యజనే తతః పరిజహా త్యేనం పున దుర్గతమ్,
సంప్రాప్తే ప్రళయే నిధాయ భువనా న్యాత్మోదరే పాతి య
స్తస్యాంఘ్రిశరణంభజధ్వ మిహా వోనాన్య ద్భవే ద్రక్షకమ్.

ఉ. కాంతలు పుత్రు లాప్తులును ♦ గల్మిగలట్టిదినాల బ్రీతియు
స్స్వాంతముతో మెలంగుదురు ♦ సంపదవోయినవేళ వారలా
చెంతకు జేర రెవ్వరును ♦ సింధుసుతాపరిరబ్ధగాత్రు మీ
స్వాంతమున స్భజింపుడు కృ ♦ పానిధి రక్షక మెవ్వ డన్యుడో.

## 2. తు న్నై యుం శా ర్వ్య మ్.

శ్లో. బంధుజ్ఞాతిసుహృ త్తమేతరజనా స్స్నేహోదయసంరక్షణ
ప్రోద్యుక్తా ఇవ సన్నిపత్య ధనినం చూషంతి సృక్కా ఇవ,
ఏకేషుప్రహతావనీరుహచయం కాలాంబుదాభం హరిం
ప్రాప్య జీవత రక్షకం నతుపరైరన్యైత్రి సిద్ధ్యే త్ఫలమ్.

ఉ. మిమ్ముల బాంధవాళి మితి♦మీరిన స్నేహముతోడ జూచితా
రిమ్ముల జేరి మీధనము ♦ లెల్ల భుజింతురి జలూకమాడ్కి సే
మ మ్మిది గాదు నేననెడు ♦ మాట వినుండిక సాలసత్తకం
బమ్మున గొట్టినట్టి జల ♦ జాప్తకులాంబుధిచందురి పాదయు
గ్మమ్ము బరిత్యజించి మరి ♦ కల్గదు వేరుశరణ్య మిమ్మహిన్.

## 3. షా రు ళ్కీ యుం డా య్.

శ్లో. పశ్యంతో ధనినం కరస్థితధనం భూయో ధనిష్ఠో భవా
న్స్వ ర్భదారిణి తవే త్యళీకవచనై స్సంవర్ధయంతో భృశం,
దార్గత్యోపహతం తమేవ నపునర్ద్రష్టుం సహంతే జనా
స్తస్మా త్కృష్ణపదాబ్జ మాశ్రియత భో నాన్యద్ధి వో రక్షకమ్.

ఉ. మీరు ధనాఢ్యులై బ్రతుక ♦ మేదినిలో భవదీయబంధువుల్
పారములేని గౌరవము ♦ బంధుసపర్యల సల్పుచుందుర
వ్వారలె మీరు దుర్గతికి ♦ బాల్పడ జూచి యొకండు జీవనా
ధారము లేక స్రుక్కితివి ♦ తాపము నొందితివంచు జాలి నో
రారగ బల్కరింప డఖిలా ♦ సురకోటి వధింప భూమిపై
గోరి జనించినట్టి మన ♦ గోపవధూదయితుండు తప్ప నీ
ధారుణి లేరు రక్షకులు ♦ తప్పక నమ్ముడు నాదుమాటలన్.

## 4. అ రు ణ మా వ ర్.

శ్లో. కుర్యా దాపది సాహ్య మిత్యధిసుహృ న్నిక్షిప్య తేచే ద్ధనం
గృధ్నుస్సోపి హరత్య ముష్య న దదా త్యంతే స జహ్యోన్మృతః,

కిం స్యా ద్వర్ణితయా కృతఘ్నకథయా నిర్వ్యాజబంధోఽహరే
స్సత్కల్యాణగుణా న్విహాయ న భవే దన్య ద్విముక్తిప్రదమ్.

ఉ. ఆపదలందు మీరు మన ♦ యార్తిని దీర్తురటంచు బ్రీతితో
బాపులకాత్మబంధుసుత ♦ భార్యలకున్ ధనమిచ్చి కావ నా
యాపదలందు వాని కిసు ♦ మంతయు దోడ్పడ బోవరయ్యయో
పాపులసంగము న్విడిచి ♦ పాయక శ్రీమధురాపురంబులో
బ్రాపుగ బుట్టి కంసముఖ ♦ బాధకుల న్వరిమార్చినట్టి యా
గోపకులావతంసు మది ♦ గోరి భజింపుము భద్రమద్దియే.

5. శ ది ర మె న్ను త మై త్ర త్తా మే.

శ్లో. ఆత్మానం శ్లాఘమానా నయమతిచతురా స్సమ్మతా స్త్రీజనస్య
త్యేతద్ద్రక్పాతజాలచ్యుతహృదయమృగాదీర్ఘమాభిర్విహృత్య,
అంతే తన్న్యక్కృతాస్స్యుఃఖలదితితనయోజ్జాసనాయావతీర్ణం
కృష్ణం సంశ్రిత్య ముక్తిం భజత తదితరో నాస్తిహేతుస్సుఖస్య.

చ. ధనమున యౌవనంబున ను ♦ దగ్రత గర్వితులై సుఖేచ్ఛలన్
వనితల దృష్టివాగురల ♦ బద్ధులు వార్థక మొంద వారిచే
శునకముమాడ్కి జూడబడి ♦ శోకితు లౌదురుగాన వారితో
బని యిక మాని పంకరుహ ♦ పత్రవిలోచను నాశ్రయింపుడీ.

6. ఇ త్లై క ం డీ రి న్బ మ్.

శ్లో. నాస్త్యే వాత్ర సుఖం బతాఽఖిలజగన్నాధాంఘ్రిచింతా బహి
ర్మ్ఖాతా కత్య భజన్మృతిం నృపశవః ప్రాంచోజనిత్వాముధా,
గాయంతో మధురాపురీనిలయినః కృష్ణస్య లీలాశ్శుభా
స్తత్కల్యాణగుణా న్గృణీత యది వో మోక్షేఽభిలాషో భవేత్.

శా. ఆనందంబు రవంతమైన గలదే ♦ యాత్మ న్విచారింప బ్రా
చీను ల్బ్రాశ్యపి నెందరో మునుపు సం ♦ క్షీణత్వము న్బొందరే
నానేభ్యప్రవికీర్ణమైన మధుర ♦ న్నారాయణుండయ్యదా

దీనత్రాణము సేయ బుట్టిన పరున్ ♦ దేహాంబుతో నుండగా
ధ్యానాచార్యాదులదృష్టు జేసి ♦ ధరలో ధన్యత్వముం గాంచుడీ.

7. మ త్త్రో న్ని ల్లె.

శ్లో. అన్యన్నాస్త్య యనాయ సాధన మిదం యత్సంగ్రహేణాభవం
సర్వాత్మప్రియస్య చింతన మలం మా యస్యతం మానవాః,
హంతేదం విదితం న వో మధుపురీజాతస్య దివ్యాన్గుణా
న్నిత్యం జీవత కీర్తయంత ఇహ తత్స్యాదేవ ముక్తిప్రదమ్.

ఉ. లేదిల నన్యసాధన మ ♦ లీకముగాదు వినుండు చెప్పెదన్
శ్రీదయితాంఘ్రి సంస్మృతియె♦సిద్ధము ముక్తి భయంబుమానుడీ
వేదశిరోవచోగదిత ♦ వీధ్రియశస్కుని కీర్తి బాడుచున్
మోదముతోడ గాలమును♦బుచ్చుటయే మనపూరుషార్థమా.

8. వా ల్ట ర్ ద ల్కా ం డే ర్.

శ్లో. ఉజ్జీవిత్వ మథోత్కజస్మరణతో యుక్తం జనా శ్రీపతేః
పాదాంభోరుహచింతనేన దివసాన్ క్షేప్తుం సమర్థస్య తామ్,
సంసారార్ణవతారణాయ మధురాజాతం యదూనాం పతిం
కృష్ణం చింతయతా నిశం న హి భవేన్ముక్తే రుపాయోఽపరః.

చ. పరిహృతసర్వసంగులగు ♦ భక్తులబోధ్రిచుతలంపుతోడను
త్తరమధురాపురిస్ మనుజ ♦ ధామమునందు జనించి వైరిసం
హారణపటిష్ఠుడైనహరి ♦ నన్యము వీడి నుతింపుచుంటయే
పరమపుమర్థమంచు మది ♦ భావనసేయుడు మీర లెల్లరున్.

9. యా డు మి ల్లె.

శ్లో. త్యక్త్వా కృష్ణపదాంబుజం కతిపయే తాంత్రికేతి మత్వేతరం
కర్ణచ్ఛిద్రపృథూకృతా నరఇవ ఛ్ఛిన్నశ్రివాః పాక్స్థితేః
భ్రిష్టా స్స్యుర్మధురాపురీనిలయినం పుష్పస్రగంచద్భుజం
శ్రీకృష్ణం త్వపహాయ నాస్తి శరణం ప్రత్యేత లోకాద్భుధమ్.

ఉ. అంతకు మించినట్టి పురు ♦ షార్థము లేదని నిశ్చయించి తా
మెంతయు గర్ణరంధ్రము ప ♦ దింతలు బెంచ దలంచికీడునన్
వంత గలంగువారివలె ♦ బ్రాక్స్థితి గోల్పడి నష్టులౌదు రే
చింతయు మాని కృష్ణవిభు ♦ జేరి భజించుట రక్షకంబగున్.

## 10. కణ్ణనల్లాల్.

శ్లో. సర్వేషాం హరిరేవ రక్షక ఇతో నాన్యోస్తి పాతే త్యసా
వస్మత్త్వా వయితుంస్వయంమధుపురీమాయా న్మహీభారనుత్,
భ్రాంత్వా యద్భవదీయ మిత్యభిమతం స్వం చేత్తదస్మై ద్రుతం
ప్రత్యర్ప్యాఙ్ఘ్రిముపైత తన్నభవతాం సర్వం తదీయంస్మృతమ్.

ఉ. కృష్ణుడె రక్షకుండనుచు ♦ గీర్తితుడయ్యె నటన్నమాటరో
చిష్ణుత మజ్జగంబులను ♦ సిద్ధముసేయ ధరిత్రిలో వలం
భూష్ణుత దాజనించి ధర ♦ బూనిన భారము మాన్పినట్టి యా
విష్ణువుకంటె రక్షకులు ♦ వేరుగ గల్గుదురే తలంపగన్.

## 11. ఆదుమిల్లై.

శ్లో. కృష్ణాన్నాస్తి పర శ్శరణ్య ఇతి యో నిశ్చిత్య కృష్ణం లస
న్మాల్యాలంకృతబాహుదండయుగళం తుష్టావ కార్యాత్మజః,
తేనోద్గీతసహస్రకే శుభవచోగుంఫే ఽనవద్యే ధృత
స్యాప్తినాందశకం త్విదం కలయతామ్ ప్రాచీనదాసావయమ్.

ఉ. ఆతనికంటె భక్తులకు ♦ నన్యు డికెవ్వడు రక్షకుండటం
చాతత నిశ్చయంబు గల ♦ యట్టి శఠారి రచించినట్టి వి
ఖ్యాతసహస్రగాథలను ♦ గన్పడు నీపదిపద్యముల్స దా
కూతముతో బఠింపగల ♦ కోవిదు లెల్లరు మత్ప్రభూత్తముల్.

శ్రీమతే శఠకోపాయ నమః.

---

శ్రీమతే రామానుజాయనమః.

## నవమ శతకము - రెండవ దశకము.

[పంౘైనాళాశే.]

అవతారిక :— ఆళ్వార్లు క్రిందటి తిరువాయిమొళిలో సర్వేశ్వరుఁడొక్కఁడే నిరుపాధికబంధువనియు దక్కినవారందరు సోపాధికబంధువులనియు సాదించియున్నారు. వాడు నిరుపాధిక బంధువైనచో బంధుకృత్యము చేయకుండ నుండఁడుగదా? ఇట్లు పరమబంధువైన యీశ్వరుఁడు నిద్రించుచున్న తిరుప్పుళింగుడికి బోయినచో సకలమనోరథములు సిద్ధించునని యాశపడి యచ్చటికి బోవగా వీరినిజూచి సర్వేశ్వరుఁడేమని పలుకరించుటగాని కన్నులతో జల్లగా జూచుటగాని యొకమాటచెప్పుటగాని కానగాలేదు. అందుచే మిక్కిలి యవసాదమునొందిరి. శరీరము శ్రమనొందున ట్లేకరూపముగా నిద్రించుచున్నాడనియు నిందువలన నేమియపాయము కలుగునోయనియు భయము నొందిరి. క్రిందనున్న "ఆరావముదే" అను తిరువాయిమొళిలో నాయార్తిని పోగొట్టలేదని దుఃఖితులైరి. ఇచ్చట తనయార్తిని నాయార్తినిగూడ నిరసింపలేదని దుఃఖము నొందుచున్నారు. అందుచే "కొడియార్మాడక్కోళూరగత్తుం పుళింగుడియుం మడియా దిన్నే" (జండాలతో నిండిన మేడలుగల తిరుక్కోళూరులోను, తిరుప్పుళింగుడియందు చలింపక యీవిధముగా 8-3-5) అను విషయమే తలయెత్తి బహుళోత్కంఠతో నాయార్తి యంతయు దీరునట్లు నీకన్నులతో నన్ను జల్లగా గటాక్షింపవలెను. నాశిరస్సుపైని నీపాదముల నుంచవలెను దేవగవార్లు పిరాట్టిమార్లతో వేంచేసియున్న యునికిని నాకు గనపరుపవలెను. సంజయుఁడు పొందిన పురుషార్థము నాకు గొఱత కాకూడదు. "నచాభిమన్యుర్నయమౌ తం దేశ మభిజగ్మతుః। యత్ర కృష్ణౌ చ కృష్ణా చ సత్యభామా చ భామినీ। ఉభౌ మధ్వాసవక్షీబౌ వరచందనరూషితౌ। స్రగ్విణౌ వరవస్త్రౌ తౌ వరాభరణ భూషితౌ। నానాస్తరణసంకీర్ణం యత్రాసాతే నరర్షభౌ। సత్యాంక ముపధానం తు కృత్వా శేతే జనార్దనః। అర్జునాంకగతౌ పాదౌ కేశవస్యోపలక్షయే। అని మహాభారతము ఉద్యోగపర్వములో జెప్పబడినట్లు "సంజయుఁడు దర్శనమునకు వచ్చియున్నా" డని తెలియజేయగా "మనయెడల నితఁడు మిక్కిలి మంచివాఁడు మనమున్నస్థితిని మనశత్రువుల కితఁడు తెలియజేయువాఁడు లోనికి బ్రవేశపెట్టుఁడు." అని శ్రీకృష్ణుఁడు సాదించెను. తల్లిదండ్రు లొకచో నుండగా కుమారుఁడుబోయి చూచుటకాటంకముండదు గదా. అట్టి పుత్రుఁడైన యభిమన్యుఁడుకూడ వెళ్లుటకు శక్యముగాని స్థితిలో సంజయుని బిలిచి దర్శనమొసగినట్లు దేవరవార్లు

పిరాట్టిమార్లతో వేంచేసియున్నస్థితిని నాకు గనపర్చవలెను. నేను చూచుచుండగా నాముందర సంచరింపవలెను. అనుకూలదర్శనముచే గలిగిన స్మితమును నేనుచూడవలెను. ఒకవార్తను సాదింపవలెను. అని తమ మనోరథము లన్నింటిని తెలియజేసి యివియన్నియు నిప్పుడే ఫలింపవలెనని త్వరపడిరి. కిందతిరువాయిమొళ్ళిలో బ్రాప్తి ననుభవించియున్నారు. ఇందులో బ్రాప్తిఫలము కోఅకాశపడిరి. దీనిలో "కిడంద నాళ్ కిడంద్రాయ్" అనునది (ఉయిర్పాట్టు.)

## 1. పంద్రై నాళా లే.

శ్లో. సద్వీచీతామ్రపర్ణీతటభువి సరసీపూర్ణ చించాపురీశ
ప్రాక్త్వత్కారుణ్యదృష్టో భవదధివసతేర్మార్జితా త్వద్గతాత్మా,
పారంపర్యేణ దాస్యం సముపగతవతా మంతిమ స్సానుగ స్తే
పాదం ప్రాప్తోస్మి విష్ణో సకృదపి లప మాం దృక్సుధాభి నిరీక్షించన్.

సీ. తామ్రపర్ణీనదీ ♦ తటమున రాజిల్లు
చించాపురీస్థిత ♦ శ్రీనివాస
తొలినుండి నీకృప ♦ తోయజాతాలయా
నుగ్రహంబున బొంద ♦ నోమునోచి
నీవుండుకోవిల ♦ నిర్మలంబుగ జేసి
బహుపురుషాంతర ♦ ప్రభృతి మిత్ర
బంధుభార్యాపుత్ర ♦ పరివారయుతముగా
శాస్త్రోక్తవిధి నీకు ♦ శౌస్యులమయి

తే. గీ. దాసులై యున్నమాయెడ ♦ దయను జూపి
పలుకు మొకమాటు నీముఖ ♦ పంకజంబు
దెరచి కందోయిపిప్పియు ♦ దీనదయను
మము గటాక్షించు మొకపరి ♦ మధురభంగి.

## 2. కుడిక్కిడందాక్కంశెయ్దు.

శ్లో. క్షైదార్యోపవనోజ్జ్వలే కదళికాంచద్వప్రసంవేష్టితే
శ్రీచించానగరే హరా ప్రసితయా వంశస్య మర్యాదయా

బద్ధ స్సాతోఽయం స్వవంశ మఖిలం కృత్వా భవత్పాదయోః
కైంకర్యైకరతి స్తవాంఘ్రియుగళే త్యక్తేతరం న్యస్తధీః.

శ్లో॥ త్వద్దాస్యైకపరాయణాన్వయజనిం సంప్రాప్తవాన్ శ్రీపతే
యత్పూర్వం వసుధామమేఽంఘ్రిజలజం సర్వాత్మసంతారకం,
తన్మే మూర్ధ్ని నిధాయమండనతయా మాంత్వత్కటాక్షామృత
స్రోతో బిందునిషేచనా ద్భవమరుక్లాంతం సముజ్జీవయ.

సీ॥ ఉచ్చసాలావృతం ♦ బుపవనావృతమునై
రాజిల్లు చించాపు ♦ రంబునందు
బవ్వళించినసామి ♦ భవదీయశేషత్వ
వృత్తిచే గులమును ♦ వెలుగజేసి
సంసారనాశక ♦ సకలకైంకర్యైక
నిష్ఠునిగా జేసి ♦ నీరజాక్ష
నీపాదదాస్యంబు ♦ నిత్యంబు సలుపంగ
జని బుట్టగాజేసి ♦ సదయుఁడవయి

తే. గీ. నన్ను బ్రోచిన మాధవా ♦ మహితచరిత
జగముఁగొల్చిన నీపాద ♦ సరసిజంబు
నొక్కపరి మాశిరంబుల ♦ కెక్కుడైన
మండనంబుగ నుంచుమా ♦ మహికివచ్చి.

3. కిడందనాళ్కిడందాయ్.

శ్లో॥ శ్రీచించానగరీశయాలమిహతే కాయోపమర్దం కియ
చ్ఛేషే ప్రాక్తనదాస్యమార్గనిరతా నేకాంతసేవాజుషః,
అస్మాం స్తామరసానుకారినయనాలోకైః పరం హర్షయ
న్నాద్యాబ్జానతలోక మేధి శయనా దుద్ధాయ దేవ్యాసహ.

శా॥ చించాపుర్యధినాథ కోరదగు నీ ♦ శ్రీమత్తనూవల్లికిన్
మెంచ నొప్పు జనింపదే కటకటా ♦ యెన్నాళ్లునీనిద్ర నై
పెంచన్యాశ్రితదాసులై నిను సదా ♦ కీర్తించుమామీఁద నీ

కొంచంబైన కృపారసంబు జిలుకన్ • గోవింద నేత్రాబ్జశో
భాంచద్దృష్టి వెలుంగ శ్రీదయితతో • హర్షంబుదీపింపగా
బంచాస్యోపమమధ్యలెమ్మ జగముల్ • పాదంబు సేవింపగన్.

4. పు ళిం గు డి క్కి డం దు.

శ్లో. సుప్త శ్చించానగర్యాం వరగుణనగరే సన్నిషణ్ణో వికుంఠే
తిష్ఠ న్నస్మాన సాంతర్వసతి మవిజహ త్త్వం మమ ప్రాణలోలః,
నృత్యంతః కీర్తయంత స్తవగుణవితతిం మజ్జయంతోఽద్భుతాబ్ధౌ
లోకం నందామ దేవ త్వదమలవదనం దర్శయా స్మాకమీశ.

చ. వరగుణమంగయందు ప్రభు • వైఖరినుండి వికుంఠధామమం
దిరమున నిల్చి యామ్లపురి • దెండి మదీయమనోనికేతనాం
తరవసతిం ద్యజింపక స • దా నను నేలినవాడ నీ గుణో
త్కరము జగంబు బాడ జల • దంబుపయి న్వడంబుమాడ్కి వి
స్ఫురదధరంబు వెల్గ భువి • శోభనరూపము జూపరాగదే.

5. ప వ ళం బో ల్క ని వా య్.

శ్లో. శంఖప్రోతఘనప్రవాళవిలసచ్ఛ్రీతామ్రపర్ణీవృతే
శ్రీచించానగరేశయ ద్వ్యపపరిత్రాణత్వరాధావక,
త్వద్బింబోష్ఠ మమందమందహసితాంకూరై ర్విభో మండయన్
ఫుల్లాబ్జారుణకాంతిదృగ్విలసితై రాయాహి మత్సన్నిధిమ్.

మ. సరసీజాయతనేత్ర యూమ్లపురివా • స్తవ్యా మహాగ్రాహభీ
కరవక్త్రాంతరలగ్నదంతిపకిర • త్ప్రాయత్తచిత్తంబుతో
గరుడారూఢుడవై సరోవరతటి • న్గన్పట్టి సట్లత్తరిన్
దరహాసాంకురభూషితాధరుడవై • త్వద్దివ్యగాత్రప్రభా
తరళాంగంబులతోడ గన్పడుము నే • ధన్యత్వము న్బొందగన్.

6. కా య్ శి న ప్ప ర వై.

శ్లో. స్వర్ణత్మాధరసన్నివిష్టసజలాంభోవాహవత్పక్షిరా
ట్పృష్ఠస్థ్యాధవపు ర్ధృతాంబుజధనుశ్చక్రాదిదివ్యాయుధ

కృత్వా ప్రేతపురాతిథీ దితిసుతౌ మాలిం సుమాలిం రణే
శ్రీచించానగరీంశ్రిత ప్రజహి నో దుఃఖం భవోత్థం హరే.

మ. కనకోర్వీధరమస్తకోపరిలస • త్కాలాంబువాహాంబనన్
దనుజానీకవధత్వరాప్రవిచల • త్తార్క్ష్యాశ్వపృష్ఠంబునన్
ఘనరూపంబు ధరించి హేతితతితో • గాన్పించి యుద్ధావనిన్
దనుజాధీశసుమాలిమాలిముఖదై • త్యవ్రాతము న్గూల్చి దే
వనికాయంబుల బ్రోచినట్టి వ • రదా పద్మాక్ష చించానికే
తన మాదుఃఖము బోనడంచి మములన్ • ధాత్రీస్థలిస్ జూడుమా.

7. ఎమ్మిడర్కడిందు.

శ్లో. ఫుల్లాంభోరుహషండరాజితసరస్సంశోభి చించాపురీ
వాసిన్ దుఃఖనివారకా మరపతే మత్వాలకాం భోజదృక్
త్వద్దాసా స్కృతిసంభ్రమాని హ యదా సంవీక్ష్య మోదామ హే
పశ్య త్వాం జనతా యథా సకృ దుపైహ్యస్మాకమక్ష్ణోః పురః.

శా. మాదుఃఖంబుల బోనడంచి దయతో • మమ్మేలుకాడా సుప
ర్వాదిస్తుత్యపదాబ్జ పద్మసరసీ • భ్రాజిష్ణుచించాపురా
మోదస్వాంత మదీయసంభ్రమములన్ • భూమిస్థలిం జూడ నీ
మేదిన్యాశ్రితు లెల్ల నిన్ను గనర • మ్మా దేవనామోద్దకున్.

8. ఎంగళ్కణ్ముగప్పే.

శ్లో. తారేశశ్రితహర్మ్యవీథివిలసచ్చించాపురే సుస్థిత
శ్రీవైకుంఠనికేతనా హాతరవిజ్యోతిస్స్ఫురద్విగ్రహా
అస్మాకం మిమతాం యథేహ జనతా త్వత్పాదసేవాపరా
ప్రీత్యా నౌతి తథాఽత్రతిష్ఠ సకృద ప్యాత్మాన మావిష్కురు.

శా. శ్రీధామంబయి యుచ్చసౌధతతమౌ • చించాపురిన్నిత్యమున్
బోధేద్యావనిదేవపూజితపదా • భూమిస్థభక్తౌఘముల్
గాథల్పాడుచు వారిశక్తికొలదిన్ • గాఢస్తుతు ల్సల్పి తే
జోధామంబు భవత్స్వరూపము గనన్ • క్షోణిన్ప్రవేశింపుమా.

అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మంగళమ్ " అన్నట్లు మంగళాశాసన మొనర్చి తనయిచ్ఛఁజెను. ఇట్లాతని పలుకులు విస్మారకములు. అతఁడేదైన నొక మాట చెప్పినయెడల దానిప్రకారము ప్రతివాఁడును చేయక యుండ లేదు. కాఁగా నతడు నాగాయణుఁడై యుండు ఉనికిని యీయాళ్వార్లనుసంధించిరి. ఆనారాయణశబ్దార్థమును విచారింపగా నొకనికిని తనలాభనష్టములకు దాను యత్నింపవలసిన యవసరము లేదు. ఈరీతిగానుండు సర్వేశ్వరుడు తమయెడ జూపిన విశేషకటాక్షమును నారాయణశబ్దార్థమున కెల్లయయిన వానిశీలగుణము ననుసంధించి " ఇప్పుడే ఇట్టి శీలవంతుని దర్శనము నాకు కావలెను" అని ఆక్షేపించిరి. వాఁడున్నచోటికి వీరు స్వయముగా నడచిపోవ జాలనట్లు వాని శీలగుణమందు సక్తులై యవసాదము నొందిరి. ఒకవేళ వీరు తనయొద్దకు వచ్చిననొకదానిని చేయుట గొప్ప యనియుండువాడు. వీరొకటిఁ జేసి అనుభవించుటకు సమర్థులు కాకుండనున్నారు. ఈరీతిగానున్న సర్వేశ్వరుని శీలగుణప్రాచుర్యమును చెప్పి యీతిరువాయిమొళి ముగియుచున్నది.

" కణ్ణాళ్ శివందు" అను తిరువాయిమొళిలో ప్రణవార్థ మనుసంధించిరి. దానిలో మొదటిరెండర్థపాశురములచే అకారార్థము అనుసంధింపబడినది. మీదనున్న అగపాశుగములచే చతుర్థ్యర్థము, మధ్యమాక్షరార్థము, తృతీయాక్షరార్థము సాదింపబడినది. చతుర్థ్యర్థము మధ్యమాక్షరార్థము నన్యోన్యసాపేక్షములై యుండుటచే విడదీసి చెప్పక విప్పి చెప్పఁబడినది. మీదనున్న నాలుగు పాశురములచే తృతీయాక్షరవాచ్యుని వైలక్షణ్యము ప్రతిపాదింపఁబడినది. మీద నున్న రెండుపాశురములచే ప్రణవార్థము ననుసంధింపని బాహ్యులు కుదృష్టులు నిరసింపబడిరి. "కరుమాణిక్కమలై," "నెడుమాల్కడిమై" అనుతిరువాయిమొళులచే నమశ్శబ్దార్థము సాదింపబడినది. నమశ్శబ్దార్థము శాబ్దమనియు నార్థమనియు రెండువిధములుగా నున్నది. వానిలో శాబ్దమైనఅర్థము "కరుమాణిక్కమలై" అనుదానిలో జెప్పబడినది. ఆర్థమైన యర్థమును " నెడుమాల్కడిమై" ప్రతిపాదించుచున్నది. " నా నెనక్కురియే నల్లేన్" (నేను నాకుపయోగించువాఁడను కాను) అనుటయే నమశ్శబ్దమునకు శాబ్దమైన యర్థము. పరుని కుపయోగించుట తనకు దా నుపయోగింపకపోవుట కన్యకయొక్క స్వరూపము. మీదను నారాయణశబ్దార్థమును సాదించిరి. స్వామిత్వము, వాత్సల్యము, ఉపాయత్వము, ఉపేయత్వము, వ్యాపకత్వము మొదలగునవి నారాయణశబ్దార్థములు. మీదనున్న " పండైనాళాలే" అను తిరువాయిమొళిచే చతుర్థ్యర్థమును సాదించిరి. కైంకర్యప్రార్థనయే చతుర్థ్యర్థము. ప్రణవార్థము, నమశ్శబ్దార్థము, వ్యాపకత్వము,

అవ్యాపకత్వము యితరవ్యాపకమంత్రములయందుఁగూడ నున్నవి. అందులో శామా దరించిన విషయము అష్టాక్షరీమంత్రమను నంశమును " ఓరాయిరమ్ " అనుతిరువా యిమొళ్లిచే సాధించుచున్నారు. ఈప్రక్రియను నడువిల్ తిరువీదిప్పిళ్లై సాధించిరి. " ఓరాయిరం " అనునది (ఉయిర్పాట్టు.)

1. ఓరాయిరమాయ్.

శ్లో. యస్త్వేకనామ బహుధా భువనాని పాతి
యో వా బిభర్తి శుభనామసహస్ర మీశః,
యః ప్రావృషేణ్యజలవాభతను స్సఏవ
నారాయణో உస్మదధివ స్సకలేష్టదాయీ.

తే. గీ. ఒక్కపే రొక్క వేయిగ ♦ నుక్కుమిగిలి
మహిని బ్రోచు సహస్రనా ♦ మములవాఁడు
కాలమేఘనిభాంగుఁడు ♦ కమలనేత్రు
డైననారాయణుండె మా ♦ కధిపుఁడరయ.

2. అవనేయ కల్ ఞాలమ్.

శ్లో. సఏవ సస్రుజే ధరాం ప్రళయతో విదధ్రే బహి
స్సఏవ వినిగీర్య తాం పున రధోజ్ఝగార క్రమాత్,
సఏవ విమమే భువం శివవిరించివృత్రారయ
స్సఏవ సచరాచరం జగదవిద్మనిస్సంశయమ్.

మ. అతడే విశ్వధరిత్రి జేసి నిజదం ష్ట్రాగ్రంబున న్మోసినా
డతడే దానిని కుక్షి బెట్టి మరలన్ ♦ హావ్యాంబుతో దీసినా
డతడే దానిని గొల్చినా డతడెపో ♦ యబ్జాసనుం డద్రిజా
పతిసుత్రాము డతండె సర్వమును దా ♦ పద్మాక్షుడే యెంచగన్.

3. అఱిందనవేదవరుమ్.

శ్లో. దుర్గాత్రివ్యూహబోధకపురాణవచ శ్శ్రుతా స్య
ప్యావేదయంతి మనసా యమచింత్యశక్తిమ్,
తం జ్ఞానినో భవరుజాగద మిత్య వేత్య
నారాయణం పరమకారణ మాశ్రయంతి.

తే. గీ. వేదములు వేదవేత్తలు ♦ వేయిగతుల
దెలిసికొనఁబోయి తెలియక ♦ తెల్లఁబోవు
నద్భుతాచింత్యమహిముని ♦ నంబుజాక్షు
దెలిసికొనజాలితిని వాని ♦ దివ్యకరుణ.

4. మ రుం దే న ం గ ళ్.

శ్లో. భావత్కానుభవాబ్ధివర్ధకమహాజారో ప్రసీదే త్యలం
జల్పంతో దివిజా స్స్రవంతి సతతం యస్మిన్ని బద్ధాశయాః,
తం నీలాబ్దనిభం మదీశ మమలం జాగ్రం యదోరన్వయే
కృష్ణం పద్మనిభేక్షణం మమ మనో మాజీహాపః పార్థయే.

తే. గీ. త్వదనుభూతిమహానంద ♦ వర్ధకమని
నిత్యసూరులు పలవించు ♦ నీరజాక్షు
ముదిరనిభగాత్రుఁ గృష్ణుని ♦ ముక్తిదాయి
వదలవల దెప్డు డెందమా ♦ వదలవలదు.

5. మ న మే యు న్నై.

శ్లో. తారుణ్యజుష్టతులసీస్రగలంకృతం తం
నిర్ధూతసామ్య మఖిలేశ్వర మాశ్రియ త్వమ్,
మన్మాన సేద మనునీయ ముహు బ్రువే త్వాం
మా సంత్య జాంఘ్రిభజనం మధుకైటభారేః.

తే. గీ. తులసిమాలికఁ దాల్చిన ♦ జలజనేత్రు
నిస్సమాధికు సర్వేశు ♦ నిఖిలగురుని
విడువకుండుము డెందమా ♦ వేడుకొందు
మరవకుము నేను సెప్పిన ♦ మాట నెపుడు.

6. అ ద్వై వ దు మ ణి యా ర్.

శ్లో. యః క్షీరోదతనూభవాభుజలతాశ్లేషప్రియంభావుకో
యః పూర్వామర పూగమారణరణవ్యాపారబద్ధోద్యమః,
యో మంథానవసుంధరాధర పరిక్షోభావిలాంభోనిధి
స్తం పద్మాయతనేత్రమేవ సతతం దాధ్యాతి మే మానసమ్.

తే. గీ. ఇందిరాశ్లిష్టపృథువక్షు ♦ నింద్రవహితు
దానవాసుమరుత్పాన ♦ దందశూకు
మథితకలశాంబురాశి నా ♦ మన మజస్ర
మనుభవించుచునుండు నీ ♦ యవనియందు.

7. అగంశేర్ నరసింగమదాగి.

శ్లో. హర్యక్షరూప మవలంబ్య హిరణ్యవక్షో
ద్వేధా విదారితవతో నిశితైర్నఖాగ్రైః,
వైకుంఠధిష్ణ్య మవలోకయితుం మనో మే
బద్ధాదరం సతతముత్సుకతా ముపైతి.

తే. గీ. నిశితకరజౌఘపవిక్ర్త ♦ నిశిచరేశ
పీనవక్షోముహీధ్రుడు ♦ పీ్రతబుభుడు
గోరి నివసించుచుండు వై ♦ కుంఠ మెపుడు
జూడ నాశించు హృదయంబు ♦ చూడ్కు లలర.

8. ఇన్ని ప్పోగవిరువి న్నై.

శ్లో. ఉన్మూల్యా స్మద శేషపుణ్యవృజినా న్యాత్మాభిమానాస్పదే
ష్వేతత్ప్రాకృతదేహచారకచయే ష్వస్మాన నస్యన్ద్రుతం,
యో రక్ష త్యఖిలామరార్చితపద స్తస్యా ధివాసం గిరిం
శేషాఖ్యం ప్రణమంతి యే భువి నరా స్తే భాగ్యవంతస్సురాః.

తే. గీ. కర్మమూలకప్రకృతిసం ♦ గంబు విడిచి
పరమపదమున కేగి త ♦ త్పదమునందు
సేవ్యుడై యుండు శ్రీపతి ♦ శేషశైల
మందు జూచుటె మాభాగ్య ♦ మవనియందు.

9. తొణ్డుమామలర్.

శ్లో. సౌగంధ్యప్రథమానపుష్పనికరై స్తీర్థాంబునా ధూపస
ద్దీపై స్త్వాం వయ మర్చయామ ఇతి యచ్ఛీలస్య తత్తేధికమ్,
నస్యా ద్దేవ తథాపి తే హ్యపయశ శ్శ్రీశో దురారాధ ఇ
త్యేవం త్వచ్చరణాప్తిసాధన మహం నావైమి నాగేశయ.

తే. గీ. పుష్పధూపజలాదుల ♦ బూని వాని
బూజలొనరించి తీఱాత ♦ బొందెదమను
పలుకుమాత్రమె నీప్రీతి ♦ గలుగజేయు
స్థిరయశస్కుడ మాధవ ♦ శేషశయన
మెఱుగ నీయంఘ్రి నొందుట ♦ యెట్టులగునొ.

10. తా శ తా మ రై యా ను మ్.

శ్లో. త్వన్నాభి మావసతి పంకరుహాసనో యం
త్వత్కాయభాగ మధితిష్ఠతి శూలపాణిః,
త్వత్కింకరా స్సకలదేవగణా స్తవేదం
శీలం కథం స్తుతివచో విషయం మురారే.

తే. గీ. నళినజాతుండు నీనాభి ♦ జలజగతుఁడు
శర్వుఁడేవేళ భవదంగ ♦ సంస్థితుండు
దాస్యమును సల్పువారెల్ల ♦ దానవారు
లహహ నీదగుసౌశీల్య ♦ మద్భుతంబు.

11. శీ ల మె ల్లై యి లా న్.

శ్లో. సౌశీల్యసాగరపదాబ్జసమర్పితం యు
ద్గాథాసహస్ర మశఠో చ్ఛఠజి న్మునీంద్రః,
తస్మి న్నిదం దశక మంబుజనాభశీల
సంవేదకం కలయతాం ఫలతీ హ ముక్తిః.

తే. గీ. నిరవధికసత్త్వభావుఁడౌ ♦ నీరజాక్షు
నంఘ్రియుగమున శఠరిపుం ♦ డధికభక్తి
నర్పితముసేసి యతులప్ర ♦ హర్ష మొందు
వేయిగాథల నీపది ♦ విడుపులేక
చదువువారికి మోక్షంబు ♦ సంభవిల్లు.

శ్రీ మ తే శ ఠ కో పా య న మః.

శ్రీమతేరామానుజాయనమః.

## నవమ శతకము - సాల్గవ దశకము.

[మైయ్యార్ కరుంకణ్ణి.]

అవతారిక :— ఈశ్వరస్వాతంత్ర్యమున కీశ్వరుడే మూలము. వాని శీలాదిగుణములకు పిరాట్టి మూలము. శీలగుణములో ప్రవేశింపగా నీశ్వరస్వాతంత్ర్యము చెడునేమో యని శంకపొడమును గాని అట్లుకాదు. బాగుగా నిరూపింపగా నాస్వాతంత్ర్యముతో దుల్యముగా లక్ష్మీసంబంధము నిత్యమైయుండుటవలన స్వాతంత్ర్యమునకు భంగములేదు. ఏలయనగా శ్రీభాష్యకారమునులు గీతాభాష్యావతారికలో నీశ్వరరూపమును నిరూపించు సందర్భమున "శ్రియఃపతిః" "శ్రీవల్లభః" అని ముందుగా సాదించియున్నారు. క్రిందతిరువాయిమొళిలో నీశ్వరుని సౌశీల్యగుణమును దానికి మూలమైన శ్రియఃపతిత్వము ననుసంధించియున్నారు. శీఘ్రముగా బొందదగిన గుణాధిక్యముగలవాడై యుండుటచేతను, లభింపజేయు పిరాట్టి దగ్గరనే యుంకుటచేతను, ఇపుడే యీశ్వరుని బొందవలయునని యాళ్వార్లకభిలాషజనించెను అసమయమందే వీరి కీశ్వర ప్రాప్తి కలుగకపోవుటచే విషయానురూపమగు తృష్ణ గలవారైరి. పొందదగిన గుణాధికుడై యుండుటచేతను లభింపజేయువారు సమీపమందే యుండుటచేతను వెంటనే పురుషార్థము సిద్ధింపవలసి యుండగా సిద్ధింపకపోవుటవలన నీయాళ్వార్లు సహించి యుండజాలకపోయిరి. ముడియానేయందుండు వాసనచే ప్రత్యేకముగా దమకరణములు తామకూడ విడాయిగలవారైరి. ఈభావవృత్తి "శెంజొల్కవి, వీత్తిరుందేళ్ళులకు, ఎన్నైనుక్క మెన్నై, ముడియానే" మొదలగు తిరువాయిమొళ్ళులన్నిటిలోనున్నది. తొల్లి గజేంద్రాళ్వానును రక్షించుటకు మెల్లగా బోయినా డనునట్లు తమయుత్కంఠనుబట్టి విలంబము చేయక మున్ను శీఘ్రముగా స్తంభమం దావిర్భవించినట్లు శీఘ్రముగా వచ్చి కనబడవలెనని యభిలషించిరి. ఇట్లున్న తమదశను, తమకరణములకు గలిగినవిడాయిని తెలునుకొని వచ్చి ముఖము కనపర్చినందు కాళ్వార్లు సంతసిల్లి "నేను కృతకృత్యుడ నైతిని, కైంకర్యము చేయలభించితిని, శ్రీవైష్ణవులకందరికి నుపకారకుడ నైతిని, ఇది సొట్టిపురుషార్థలాభము" అని తమకుగలిగిన లాభము ననుసంధించి హృష్టులై దానిని చెప్పి ముగించుచున్నారు. దీనిలో "మైయ్యార్ కరుంకణ్ణి" అనుపాశుర (ముయిర్పాట్టు.)

### 1. మై య్యా ర్క రు ం క ణ్ణి.

శ్లో. నీలాంజనాక్తసుదృశా కమలస్థయా
దేవ్యా పరిష్కృత మురస్స్థల ముద్వహంతం,

జ్వాలాతిభీషణసుదర్శనశంఖపాణిం
త్వాం ద్రష్టు మక్షియుగళం మమ బద్ధతృష్ణమ్.

ఉ. అంజనలిప్తనేత్రయుగ ♦ నంబుజసౌధవిహారనిర్వృతన్
గంజవిలోచన స్రమను ♦ గౌరవమొప్ప నురస్థ్సలంబునన్
రంజిలజేయు దేవ పరి ♦ రక్షితసామజనాథ క్రవ్యభు
క్భంజన మద్విలోచనము ♦ భవ్యుని నిన్ను గనంగ గోరెడున్.

2. కణ్ణేయు నైష్.

శ్లో. నేత్రీభూతభవద్విలోకనసముత్కంఠాకులం మే మన
స్సంఖ్యాతీతమనోరథైకనిలయం విక్రోశతి త్వత్కృతే,
నారీణాం సురమానినామపి సుదుర్దర్శం భవంతం ధ్రువం
నాదృష్ట్వా విరమేదు మిత్యనుకలం త్వా మాహ్వయామిప్రభో.

ఉ. నిన్ను గనంగ నామనము ♦ నిచ్చలుగోరుచు మొఱ్ఱవెట్టు నా
పన్నశరణ్య పాపచయ ♦ పంకవిశోషణచండభాస్కరా
నున్నబలారి సూనురథ ♦ నూత్నసరోరుహపత్రలోచనా
మిన్నుల నుండుదేవతలు ♦ మేటిసనందనముఖ్యులెన్న నీ
వున్నతెఱంగెఱుంగ రచి ♦ తోద్యములైనను భగ్నయత్నులే.

3. అఖైక్కిన్న వడినాయేన్.

శ్లో. జంఝానిలోపహత గోగణరక్షణోత్క
మోఘీభవే త్తవ దయేతి హృది ప్రదూయే
నేశే నివేదయితు మాత్మశుచో యథా శ్వా
న స్వాశయం ప్రథయితుం ప్రభవే దపుచ్ఛః.

ఉ. వాలవిహీనకుక్కురము ♦ వాలముద్రిప్పి నిజేంగితంబులన్
బాలకు దెల్పలేనిగతి ♦ బామరగణ్యుడనైన నేను నీ
పాలికి జేర్పుమంచు బలు ♦ పాటులతో మొఱవెట్టుచుంటి గో
పాలుడవై నగంబు నొక ♦ బాహువుచే వడినెత్తి గోపగో
పాళిని గాచి తీకృపకు ♦ బాహ్యునిగా నను జేయుటొప్పునే.

4. ఉరువదిదువెన్ను.

శ్లో. గీర్వాణదానవసుదుర్గ్రహసింహరూపిన్
త్వద్దాస్య మేవ మమ సాంప్రత మిత్యవేత్య,
నిష్కించనః కిము లభేయభవత్సకాశా
దిత్యాకులోస్మి భగవ న్నవ జూత్రిహారిన్.

చ. సురలకు దానవాళికిని ♦ జూడగ శక్యముగాని భీతికృ
న్నరహరివై నిశాటపతి ♦ నాశమొనర్చిన దేవదేవ నీ
చరణసరోజసేవతరమె ♦ సర్వఫలంబుల నిచ్చునంచు నే
స్థిరముగ నమ్మియుంటినిక ♦ జేకురు టెప్పుడొ నాదు భాగ్యముల్.

5. అటియాయువమ్మానై.

శ్లో. సూరివ్రజేశితు రమేయమహామహిమ్నో
నాగేశతల్పస్య సవితుః కమలాసనస్య,
నీలాంబుదాభవపుషః కుహనాహరే స్తే
పాదం దిదృక్షతి మనో మమ సాభిలాషమ్.

చ. నరహరిరూపుడై విబుధ ♦ నాయకుడై మహిమాస్పదుండునై
సరసిజసంభవాదులకు ♦ స్రష్టయునై భుజగేంద్రశాయియై
పరమమునిప్రగేయపద ♦ పంకజుడై నిజభక్తలోలుడై
బరగెడువాని జూచుటకు ♦ బహ్వభిలాషము నామనంబునన్.

6. కరుత్తేయునైన్.

శ్లో. త్వాం ద్రష్టుం సతతం స్పృహాపరవశో మన్మానసే న్యక్షిపం
సూరిస్తుత్యపదాంబుజాత కమలాప్రాణేశ విష్ణో హరే,
అత్యర్థానలసైజరుక్తతిదురాలోకే పరే వ్యోమని
స్థాత స్త్వ మనుసందధాతి హృదయం త్వద్దర్శనాయాకులమ్.

తే. గీ. నిన్ను జూడంగ నాశించి ♦ నీరజాక్ష
స్థిరముగా నామనంబున ♦ జేర్చుకొంటి

నిత్యసూరులయొకిమీాడ ♦ నిత్యదీప్ర
పరమపదవాస నామనో ♦ భావ మెపుడు
నిన్నె ధ్యానించుచుండును ♦ నిశ్చలముగ.

7. ఉ గ ం దే యు నై ౦.

శ్లో. సింహీభూయ శిలోచ్చయాతికఠినాం దైత్యేంద్రవక్షస్థలీం
నిర్భిద్య క్రకచోపమైః కరరుహై ర్లోకస్యరక్షాంవ్యధాః,
నిత్యం త్వత్పదకంజచింతనరతే శ్చిత్తే మమా తిస్థిరం
హృష్టో వాస ముపేయివన్ కమలభూభర్గాదిసంసేవిత.

తే. గీ. సంతతము నిన్ను స్మరియించు ♦ స్వాంతమందు
స్థిరనివాసునిగా నేను ♦ జేసికొంటి
నఖరదంభోళిధారాగ్ర ♦ సుఖవిదీర్ణ
హైమకశిపూగ్రవక్ష హ ♦ ర్యక్షరూప.

8. ఉ రు వా గి యు అ ఱు శ మ యు ం గ ళ్.

శ్లో. అంతర్వసంత మఖిలస్య చరాచరస్య
బాహ్యైః కుదృష్టిభి రచాల్య మనంతకీర్తిం,
బ్రహ్మాదిదేవనికరస్య నిదాన మాద్య
మద్రాక్షమ్మ కృష్ణ మభవామ చిరాత్కృతార్థాః.

తే. గీ. పరమతాకంప్యదుర్జ్ఞేయు ♦ పరమతత్త్వ
మఖిలవస్తుచయంబున ♦ కంతరాత్మ
నరసిరుహజాతభర్గాది ♦ సకలదేవ
కారణుని గృష్ణు గాంచితి ♦ గన్నులార.

9. క ం డు గొ ం డె న్క ణ్ణి నై.

శ్లో. కృష్ణం నిపీయ నయనాంజలిభి ర్నికామం
నిర్ధూయ పాప మశివం భృశమస్మి తుష్టః,
శ్రీశాంఘ్రి భక్తవితతే రమృతాయమానా
స్సూక్తిస్రజో గ్రథితవా నహమీాశదాసః.

తే. గీ. కన్నులారంగ గనుఁగొని • గర్వమొంది
పాపసందోహమడచి స • వాసనముగ
నిత్యసూరీంద్రదాస్యస • న్నిష్ఠనేను
భక్తకంఠస్రజంబులై • పరిణమించు
సూక్తిమాలల గ్రుచ్చితి • సూరులలర.

10 అ శీ యా ని వ నె న్ను.

శ్లో. దాసో యమిత్యవికలం మయి బద్ధభావా
త్స్వాన్తానుకంప మనవద్యయశఃప్రకాశం,
తార్క్ష్యధ్వజం స్వచరణప్రమితాబ్జజాండం
కృష్ణం ప్రపద్య భవవార్ధిమహం తరీతా.

తే. గీ. వీఁడు నాభక్తుఁడని యెంచి • విమలకృపను
జూపి నన్నేలినట్టిని • స్తులయశస్కు
బన్నగాశనకేతను • బద్మనేత్రు
క్రాంతలోకాంఘ్రి గనుగొని • ఘనుఁడనైతి.

11 అ రా మ ద యా నై.

శ్లో. చ్యోతన్మదద్విపనిషూదన మబ్జనాభం
తుష్టావ యేన శఠజిత్కురుకాపురీశః,
తస్మిన్నిదం దశక మర్థయుతం సహస్రే
సూరివ్రజస్య హి విలాపయతే మనాంసి.

తే. గీ. కువలయాపీడగజమును • గూల్చినట్టి
కృష్ణు నుతియించి శఠవైరి • కీర్తి వెలయ
గూర్చినసహస్రమున సూక్తి • గుంభితముల
నీపదింటిని జదువఁగ • నేపుమీర
సూరిహృదయాళి గరగించు • చోద్యముగను.

శ్రీ మ తే శ ఠ కో పా య న మః.

శ్రీమతేరామానుజాయనమః.

## నవమ శతకము – అయిదవ దశకము.

[ఇన్నుయిర్ చ్చేవల్.]

అవతారిక :— "తొండరక్కముదుణ్ణ చ్చొన్నామాలైగళ్ శొన్నేన్" (దాసుల కమృతపానము చేయించునట్లు సూక్తిమాలారూపమైన తిరువాయిమొళిని చెప్పితిని 9—4—9) అని గర్వించిన యీయాళ్వార్లు తమయొక్క ప్రాణరక్షణకొరకు తిర్యగ్జంతువులు కాళ్లమీద బడువారైనారు. "దేవర్గళ్కెల్లాం కరువాగియ కణ్ణనై కండుగొండేనే (9—4—8 దేవతల కందరికి కారణభూతుడైన కృష్ణుని సేవించితిని) అన్నట్లు వైశద్యము పుట్టగా బాహ్యసంశ్లేషమం దభిలాష పుట్టెను. సర్వేశ్వరుడు వీరికి మరింత దర్శనతృష్ణను గలిగించి ముఖము కనపర్చవలెనని తలంచి చటుక్కున వీరియపేక్షితమును నెరవేర్చలేదు. తాము తలంచినపుడే తమయపేక్షితము సిద్ధింపలేదని తల్లడబాటునొంది లౌకికపదార్థానుసంధానముచే హృదయము నన్యపరముగా జేసికొని ధరించి యుందామనియు వానితో సదృశమైన పదార్థముల జూచియైనను ధరించి యుందామనియు నెంచి కొన్ని లౌకిక పదార్థములను జూచిరి. అవి వీరి కాశ్వాసహేతువులు గాకపోవుటయే కాక మీదుమిక్కిలి స్మారకములై బాధకములు కాసాగెను. ఏపదార్థము జూచినను వాడు లేకుండ దాని సద్భావముండదు గావున నవి వానినే కనపర్చుచుండును. వానికి స్మారకములైన లౌకికపదార్థములు తమ్ము బాధించు ప్రకారము నన్యాపదేశముగా జెప్పుచున్నారు. స్వామితోగలిసి వియోగమునొందిన యొకపిరాట్టి తనయుత్కంఠావినోదార్థమై వానిబోలిన వస్తువులను జూచి ప్రాణములను నిలువ బెట్టుకొందమని తలంచి యుత్కంఠాపేరితురాలై యుద్యానవనమందు బ్రవేశింపగా నచట నుండు శుకపికమయూరాదులు వాని నామరూపములకు స్మారకమై బాధింపగా "ఇవినన్ను బాధించుట కేమిహేతువు. వీనికి నాకు శత్రుత్వము లేదుగదా. ఇవి నన్నేల బాధించుచున్నవి. ఇందుకు మూల మేమియని యాలోచించి వాడే నన్ను జంపుటకిచటికి వానిని బంపియున్నాడని నిశ్చయించి నన్ను వధించుటయే మీముఖ్యోద్దేశమయిన యెడల నిందుకింత ప్రయత్నమేలయని యాపక్షులతో బలికి వాని గుణజ్ఞానముచే ధరించి యుండుటకు నిశ్చయించిరి. ఇందులో "నణ్ణినాన్వళర్త్త" అనునదిగాని "కూట్టుండునీంగియ" అనునదిగాని (ఈయిర్పాట్టు.)

### 1. ఇన్నుయిర్ చేవలుమ్.

శ్లో. హేకోకిలా స్సహచరై స్సహ సన్నిపత్య
మన్మానసం క్షిణుత దుశ్శ్రవకూజనైః కిం,

కృష్ణం న మత్ప్రియతమం హ్యాయథా త్రేయాతు
మాయస్యతే కియదసూ నపహృత్య దాతుమ్.

మ. ప్రియులంగూడి చరించుకోకిలవధూ ♦ బృందంబులారా రమా
ప్రియుని న్బాసి వియోగవహ్నిశిఖల ♦ స్వీప్లుష్టనైనన్ను ని
ర్దయులై కూయుచు బాధపెట్టదరికన్ ♦ దాక్షిణ్యమున్బానినా
నయనానందకరుండు కాంతుడు వెస ♦ న్నాయొద్దకుం జేరగా
రయమొప్ప న్బిలువుండు నన్ననద నే♦ర్చన్ యత్నమింతేలొకో.

2. ఇ త్త నై వేం డు వ దు.

శ్లో. క్రౌంచాః కాంతసమాగమేన సుఖితాః కాలం కియంతం రుధ
స్వాంతారుంతుదకూజనై రలమలం సంక్లిశ్య మాం బాధితుం,
విశ్వాస్యో నహి కస్యచిత్ప్రిణయివాన్ రక్షేతి చాహుర్బుధా
మత్ప్రాణాశ్చ తదీయహస్తలగితాః కావా గతి న్యాన్మమ.

ఉ. ఇంత ప్రియత్నమేల నను ♦ నేచగ క్రౌంచవధూటులార మీ
రెంతయు నాథులం గలిసి యుం♦పుగ గూయుచునున్నవారు శ్రీ
కాంతుడు మాయి వానిపయి ♦ గల్గదు నమ్మక మెట్టివారికిన్
వంత యికేల జీవితము ♦ వాని కరంబున జిక్కె నిత్తరిన్.

3. అ వ నై క్క య దే మె న దా రు యి ర్.

శ్లో. క్రౌంచ్య స్తస్య కరస్థితా మదసవః కాంతోపభోగోత్సుకాః
కూజంతిః కలనిస్వనం తత ఇతః కిం భ్రామ్యథా పీడ్య మామ్,
పాపిన్యాః పరిలుప్తభాగ్యవితతేః ప్రాణాః కిమస్యాం తనౌ
శుశ్రూష్యా యుష్మ దనక్షరధ్వని మహం నస్యామ ధీరా కథం

ఉ. క్రౌంచి మదీయజీవితము ♦ కంజదళాక్షుని చేత జిక్కెనే
కొంచక నీవు నీప్రియుని♦గూడి సుఖంబుగ నుంటి వయ్యయో
కొంచము పుణ్యలేశమును ♦ గూర్చని నామన మిచ్చటుండెనే
పంచమనిస్వనోపమ భ ♦ వత్కల భాషితము ల్చెవిం బడన్
వంచన జేసిపోయె నవ ♦ వారిదసన్నిభగాత్రు చెంతకున్.

4. కూ క్కు ర ల్ కే ట్టు మ్.

శ్లో. మాయీ యాదవపుంగవ శ్శ్రితరవో నా యాతి మత్సన్నిధిం
బర్హిణ్యోభవతి ప్రియైస్సహాయుతా చూ కూజత ప్రోద్ధతం,
మత్కం వాఙ్మనసం న మేస్తి నికటే తత్రైవ సంప్రస్థితం
ప్రాణా వపుష్మ చ ముద్ధ్యతే స్థితిమితాః పీడాం భజంతేతరామ్.

తే. గీ. మీపలుకు లాలకించియు ♦ మేదినిపయి
శౌరి వెలువడఁడేల ము ♦ యూరులార
సహచరులఁగూడి కూజన ♦ ల్సలుపవలదు
నాదు కరణత్రయంబు శ్రీ ♦ నాథుఁ జేరె.

5. అ ం ద ర ం ని న్న ఝ ప్ల.

శ్లో. ముధాటాట్యాం కుర్వన్ శుకగణ గృహైః కర్ణపరుషై
ర్హృదో మే సంతాపం జనయసి హి తే నోచితమిదమ్,
పరిదశ్య స్త్వాం మాయా స్వవశకృతలోకావళిరసౌ
రమేశో మాం హంతుం హ్యజగదమువాయుం పటుతరమ్.

తే. గీ. వమ్ముసేతల జేయుచు ♦ కమ్మలార
తియ్యపలుకుల నన్ను బా ♦ ధింపవలదు
యింద్రజాలంబు గనబర్చి ♦ యీజగంబు
గొన్న శౌరియె నాప్రాణ ♦ గొడ్డమయ్యె.

6. స న్గ ణ్ణి నా న్వ శ ర్త.

శ్లో. కుర్యా దాపది సాహ్య మేషఇతి సంప్రీత్యా మయా వర్ధిత
శ్శ్రీమత్కీర విముక్తకంఠ మసకృన్మాకూజ మాం పీడయన్,
రక్తాస్యో దినవాధవంశతిలకో రక్తాంతనేత్రాంబుజో
రక్తోష్ఠః కమలాసఖః ప్రవిజహౌ సంశ్లిష్య మాం నిర్దయః.

ఉ. ఆపదలోన నడ్డుపడు ♦ దంచు శుకంబ నిను న్ప్రియంబుగా
నోపికతోడ బెంచితి న ♦ యుగ్మశరాశుగవహ్నికీలసం

తాపితగాత్రినైన నను ♦ దద్దయు గూయుచు నేచనహాతమే
రూపమున న్నినుంగెలుచు ♦ రూపముచే నతిమోహనుండు న
న్నేపున గూడి బాసె నిక ♦ నేమనవచ్చును వాని గీరమా.

7. కూ ట్టుం డు నీ ం గి యు.

శ్లో. దత్త్వా శ్లేషరసం మమ ప్రథమతః పశ్చా దహో సీ ద్ద్విషా
యు శ్శోణాబ్జవిలోచనో ఽధరపుట ప్రోద్ధూతబింబీఫలః,
యు స్సంమృష్టబలారినీలరుచిర స్తస్య చ్ఛవే ర్ధారకా
మా మే ఘాః స్వరుచం ప్రదర్శయత మేత త్స్వాధి మే మూరక మ్.

మ. నిజసంశ్లేషరసం బొసంగి పిదప ♦ న్నిర్జోహయుక్తి చన్న నీ
రజనేత్రుండు పురందరోపలరుచి ♦ భ్రాజిష్ణుదేహుండు నో
ష్ఠజితిహేప్రితతుండి కేరిఫలుఁ డా ♦ శ్చర్యైక తానుండునై
వ్రజము న్గాచిన కృష్ణు బోలిన ఛన ♦ ద్రాజత్తనూకాంతి నా
కు జనింప న్వెత చూపబోకు జలదా♦కోపింతు నే నీయెడన్.

8. ఉ యి ర్కు దు కా ల న్.

శ్లో. తస్మై మారకవద్భవేదితి ముహు ర్వో యాచమానా మపి
ప్రోచ్చా ర్యాచ్యుతనామ మాంనిహథ హేమ ర్మేధసః కోకిలాః,
భిన్నాం క్షీరవిమిశ్రితాం దధియుతం సత్కృత్య వర్తంచ వః
ప్రాశయ్యా లపితా న్యశిక్షయ ద హో సాధూపకారః కృతః

ఉ. కోకిలలార నామనము ♦ ఘోరముగా విదళించుచున్నను
శ్లోకుని నామము ల్పలికి ♦ శోకము బెంచెను మిమ్ము వేడెదన్
నాకవి మృత్యురూపములు ♦ నా చెవిలోఁ బడఁ బల్కఁబోకుడీ
యాకొనియున్న వేళ బ్రియ♦మారగ మీకు బయస్సునన్నమున్
జేకొని పెట్టినందుకిక ♦ జేసితిరిట్టి మహోపకారమున్.

9. ప ణ్బు డై న ం డొ డు.

శ్లో. గాయంతో మధురం శిలీముఖచయా మా గుంజతే తఃపరం
కుంతే నేర్మను వేధవత్తుదతి మేహ్యాన్మర్మ యుష్మద్ధ్రుతిః,

అంభఃపూర్ణసరఃప్రఫుల్లసరసీజాక్షో యదూసాంపతి
ర్మత్ప్రాణా నపహృత్య సిద్ధయతయా సంత్యజ్య దూరంగతః,

తే. గీ. గాన మొనరించుమధుపసం ♦ ఘంబులార
పాడవలదిఁక మీపాట ♦ శ్రవణములోన
గ్రుచ్చు బల్లెమువలె నాకు ♦ ఘోరబాధ
నిచ్చుచున్నది పంకరు ♦ హేక్షణుండు
గూడి నను బాసి చనియెను ♦ గ్రూరుఁడగుచు.

10. ఎ ఱ న ణ్ణి నా ము మ్.

శ్లో. హంసాః పద్మసరోవిహార రసికా వైకుంఠపాదాంబుజ
ప్రాప్త్యై యత్నపరావయం చ హరిణా నిస్సంశయం సంగతాః,
సంక్షీభూయ విచార్య కింకురుధ మే కాయోపి శీర్ణః పత
త్యానందం సముపైతు సర్వజనతా బుద్ధిర్భవే త్సర్వతః.

తే. గీ. సారసములార ననుజంప ♦ మీరుగూడి
చేయుజతనంబు విఫలంబు ♦ చెప్పెదనిఁక
వానిపాదాబ్జముల మున్నె ♦ లీనమైతి
దనువు పతనోన్ముఖంబయ్యె ♦ దనకుదానె.

11. ఇ న్ప ం త లై ప్పె య్ ను.

శ్లో. ప్రాప్యానందసమృద్ధి మబ్జనయనా ల్లబ్ధ్వా తదీయాం కృపాం
తత్కల్యాణగుణానుకీర్తనపరః కార్యాత్మజో భక్తితః
యజ్జగ్రంథ సహస్ర మచ్యుతపరం తస్మిన్ దశైః తద్వచో
గుమ్ఫాశ్శ్రోతృజనస్య మానస మరం సంలాపయంతిస్ఫుటమ్.

మ. తనకళ్యాణగుణావళు ల్సతతముం ♦ దాబాడుమం చాజ్ఞని
చ్చిన శ్రీకృష్ణుని సంస్తుతించి శఠజి ♦ త్సిద్ధుండు సౌశబ్ద్యగుం
భనతోగూర్చిన వేయి నీపది సదా ♦ భక్త్యాత్ము లై పాడువా
రనయంబు న్గరగంగ జేయుమరు లో ♦ కాళీమనం బెప్పుడున్.

మ తే శ ఠ కో పా య న మః.

శ్రీమతే రామానుజాయ నమః.

## నవమ శతకము - ఆరవ దశకము.

[ఉరుగుమాల్ నెంజన్.]

అవతారిక :— ఆళ్వార్లు క్రిందను "ఎణ్ణవణ్ణి నాముమ్ సమ్మాననాదనో దొన్నినోమ్" (9-5-10 మేము ఉజ్జీవించునట్లు దగ్గరించి మనపూర్వపదవాసుడైన శ్రియఃపతితో గలిసికొంటిమి) అని తమజీవనమం దాశపోయి చెప్పినమాటఇది. ఈ సమయమందు సర్వేశ్వరుఁడు వచ్చి ముఖము గనపర్చి వీరిని పొందుట గాని లేక వీరిని విడుచుకొనుట గాని చెయ్యవలసిన దశయయియున్నది. ఈయవస్థయందు మారుతి నెల్లి శ్రీస్వామివారి వృత్తాంతమునంతయు జెప్పఁగా విని "సమా ద్వాదశ తత్రాహం రాఘవస్యనివేశనే। భుంజానా మానుషాన్భోగాన్ సర్వకామసమృద్ధినీ" అని పలికిన పిరాట్టికి పన్నెండుసంవత్సరములు తాను స్వామియు గలిసి యుండి యనుభవించిన భోగసౌఖ్య మీసమయమందు స్మృతివిషయమైనట్లు "ఇరుత్తుంవియందు" లో గలిగిన సంశ్లేషము వీరికి స్మృతివిషయమైనది. దీనికి మూలమేమనగా— వీరు ప్రారంభించిన ప్రబంధరచనారూపకైంకర్యము ముగించుటకైన వీరిజీవనాదృష్టమని గాని వీరిసూక్తిరచనావిశేషమును విని సంతసించు సర్వేశ్వరుని యదృష్టమని గాని లేక శ్రీసూక్తులను విని భగవద్విషయమునందు రుచిగలిగించుకొను చేతనుల భాగ్యమని గాని చెప్పవచ్చును. "ఇరుత్తుంవియందు" అనుతిరువాయిమొళిలో "మూన్ఱులగుందన్నెరియా వయిత్తిలొఱ్ఱుండు శిఱియేనుడైచ్చిందై యుళ్ళే నిన్నొళిందాన్" (8-7-8 మూడులోకముల కొక యుపద్రవము రాకుండ తన యుదరమం దుంచుకొని క్షుద్రుడనైన నాహృదయమందు నిల్చియుండెను.) అన్నట్లు పైనంతట క్రమముతప్పి పనిచేయ లేదు. వీరియొద్దనే క్రమము తప్పి పనిచేసెను. అనగా ఈయాళ్వార్లను శేషిగా దలంచి తన్ను (ఈశ్వరుని) శేషభూతునిగా జేసికొనుట. సంశ్లేషదశయందు విశ్లేషవ్యసనము స్మృతివిషయమైనచో "తయో ర్యథా ప్రార్థితమింద్రియార్థా నాసేదుషో స్సద్మసు చిత్రవత్సు। ప్రాప్తాని దుఃఖాన్యపి దండకేషు సంచింత్యమానాని సుఖీబభూవుః" అన్నట్లు సంశ్లేషమందున్న సౌఖ్యాతిశయముచే మరువఁబడినట్లుండును. విశ్లేషదశయందు సంశ్లేషావస్థయందున్న సౌఖ్యము జ్ఞాపకమునకు వచ్చినయెడల "అస్మిన్మయా సార్ధ ముదారశీలా శిలాతలే ప్రాగ్వ ముపోపవిష్టా। కాంతస్మితా లక్ష్మణ జాతహాసా త్వామాహ సీతా బహువాక్యజాతమ్" అన్నట్లు తాను పిరాట్టియు జలక్రీడ జేసిన స్థలమును తద్వియోగసమయమునందుస్మరిం

చినస్వామికి వ్యసన మతిశయించుట కుపయోగమయ్యెను. వీరికి నారీతిగానున్న పరిమూర్త్తి యొకస్మృతిమాత్రమై యుండక తదానీంతనబుద్ధి పుట్టెను. ఆరీతిగా పరత్వముగలవాఁడు తాను పరుడైయున్నను శేషభూతుడై కనపర్చినగుణమును శరీరసౌందర్యమును చెప్పి ఇప్పటియనుభవమే యిది యన్నట్లొక బుద్ధిపుట్టి వాని శీలగుణానుసంధానముచే శిథిలులగుచున్నారు.

ఇందులో “ ఆరుయిర్పట్టదెనదుయిర్పట్టదు ” అనునది (ఉయిర్పాట్టు.)

1. ఉ రు గు మా ల్ నె ం జ మ్.

శ్లో. రథ్యాంచన్నవఫుల్లహల్లకమహాసౌరభ్యసంవాసిత
శ్రీపుర్యాం స్థితిమీయుషో మురరిపో ర్మాయావినో వంచితుః,
అత్యాశ్చర్యనిధిన్ జగద్ధితకరాన్ లీలావతారాన్ శుభా
నామ్నాతు ర్మమ మానసం ద్రవతికిం కుర్యా మహం చాపలీ.

చ. తెరువుల నల్లగల్వవిరి ♦ తియ్యనితావుల జిమ్ము శ్రీపురిన్
మరిగి వసించు శ్రీధరుని ♦ మాయపుచేష్టలు మాటిమాటికిన్
స్మరణపథంబు జేర మది ♦ సన్నత నొందగజొచ్చె బ్రేమయు
న్బరుగుచునుండె నేమియిక ♦ వెఱ్ఱిని జేయునో నాకు నిత్తరిన్.

2. ని నై దొ రుం శొ ల్లుం దొ రుం.

శ్లో. వాపీమండితనిష్కుటాళివిలసచ్ఛ్రీపుర్యధీశ ప్రభో
పాపధ్వాంతరవీ న్భవచ్ఛుభగుణా న్సంకీర్త్య సంస్మృత్యచ
ఆనందోర్మిషు మజ్జతో మమ మన స్తబ్ధం లినాత్యన్వహం
కైంకర్యం తవపాదయోః కథమహం కుర్యాం నజానే హరే.

చ. విమలజలాశయాంబుఝరి ♦ వేష్టితపుష్పవనాభిరామమై
రమకిరవైన శ్రీపురిని ♦ రాజిలుసామి మదీయపాపపుం
జముల హరించు నీశుభయ ♦ శంబును బాడెడువేళ నాదుచి
త్తము గరగంగ సాగె పరి ♦ తాపమునొందె మదాత్మనీదుపా
దములను బొందగోరి నవ ♦ తారమసాక్షు హరీ రమాపతీ.

3. నీశైయూల్ నెంజమ్.

శ్లో. వంచిత్వా మయి సంప్రవిశ్య నిజసౌశీల్యాతిరేకాన్మనః
కుర్వన్నార్ద్రమసౌచమామనుభవన్ జాతోఽంతరాత్మాచమె
వ్యాకోచవ్రనవాభిరామసుమనోవాటీలసచ్ఛ్రీపురీ
ధామ్నో నీలఘనద్యుతేర్వ్యదుపతేర్నాథాయమాయామహో.

తే. గీ. సుమవనీరమ్యశ్రీపురీ • సుస్థితుఁడయి
నీలమేఘాభగాత్రుఁడౌ • నీరజాక్షు
మాయ నెఱుగంగజాలను • మాయఁజేసి
చొచ్చె నామన మాతఁడు • చోద్యముగను.

4. అఱిగిలేన్ దన్నుళ్.

శ్లో. సంకల్పభావితసమస్తచతుర్ముఖాండ
స్తేషామభూత్పరమశేషితయాఽంతరాత్మా,
ఆక్రీడశోభితరమాపురనాయకస్య
వ్యామోహ ఏష మయి కస్య వచః పదం స్యాత్.

తే. గీ. నిఖిలజగములు తనలోన • నిండియుండ
నిఖిలమందును దా నుండు • నేర్పుకాఁడు
పరిమళోద్గారిసుమవనీ • ప్రకరపిహిత
శ్రీపురీవరవాసియౌ • శ్రీధరుండు
నన్ననుభవించె నీ కృప • నాకు మెఱుఁగ.

5. తిరువరుల్ శెయ్‌బవన్.

శ్లో. జాతానుకంప ఇవ మే హృదయం ప్రవిశ్య
భేజే మమాత్మని తనావతిభోగ్యబుద్ధిం
శోభాస్పదోపవనశోభిరమాపురీశః
కృష్ణస్య నీలవపుషః కుహనా బతైతాః.

ఉ. సత్యముగా ననుగ్రహము • చయ్యన నాయెడ జూపినట్లు తా
నిత్యచయార్చితాంఘ్రియుగ•నీరజుఁ డయ్యెనుజొచ్చినామదిన్

నిత్యమదాత్మునిన్ తనువు • నేర్పున నొక్కపరిన్భుజించె నా
దిత్యశతప్రకాశమున • దివ్యనుతంబగు శ్రీపురంబులో
దైత్యవిమర్దనుం డిటుల • దా రచియించిన మాయ లెట్టివో.

6. ఎ న్క ణ్ణ న్క ళ్వ మ్.

శ్లో. కృష్ణస్య కైతవమిదం ప్రతిభాతి సత్య
మాత్మాపి మే తదుపభుక్తివశా దసారః,
దైన్యం ప్రపద్య సతతం యదుపుంగ వేతి
చాక్రోశ్య నౌతి కమలాపురవాసదీక్షమ్.

ఉ. ఈశుడు సేయుమాయపను • లెల్ల యధార్థముగాఁదోచునా
కేశముఖామరాదివిత • తీద్ధకిరీటమణిప్రవేకరు
క్కాశితపాదపద్ముఁడగు • కంజదళాక్షుని శ్రీపురీవరా
ధీశుని సర్వకాలముల • నేమరకుండ నుతింతు నామదిన్.

7. కా ట్క రై యే త్తు మ ద ను ళ్.

శ్లో. దాస్యం మమ ప్రవితర న్నివ సంప్రవిశ్య
కృష్ణో జహార శఠధీ హృదయం మదీయమ్,
ఈట్టే రమాపుర మదస్థిత కేశ వేతి
క్రందద్రవ త్యభినివేశరుజా పరీతం.

తే. గీ. మత్కృతాఖిలదాస్యంబు • మరుగువాని
పగిదినాలోన జొచ్చిన • పరుఁడుతాను
నన్ను నుభవించి యంతట • నయముమీర
ననుభవింపని గతి నొప్ప నబ్జనేత్రు
శుభగుణంబుల ధ్యానించి • చొక్కుచుందు.

8. కో ళు ం డా న న్ని.

శ్లో. నాపేక్ష్య కంచిదుపకార మరిష్టనేమి
రాగత్య మామనుబభూవ భృశం ప్రమోదాత్,

నీలాంబుదాభవపుషః కమలాపురీశో
దాసో ఒభవం ఖలు కథంచి దదీనవేషః.

తే. గీ. అనుదినంబును నన్నుదా ♦ ననుభవించె
శ్రీపురంబున నివసించు ♦ శ్రీధరుండు
సజలజలదాభగాత్రుండు ♦ సర్వవేది
వానిదాసుడనైతిని ♦ వన్నెమీర
నావగిది గష్టమెఱిగిన ♦ నరులు లేరు.

9. ఆరుయిర్పట్టదు.

శ్లో. బింబాధరోష్ఠ మరవిందవిశాలనేత్రం
ప్రావృట్పయోదరుచి మస్త్రవిభూషణాఢ్యం,
లక్ష్మీపురైకనిలయం హరి మాప్తు మాత్మా
సంక్లిశ్యతే మమ యథా నతథాన్యదీయః.

తే. గీ. అబ్జనేత్రుండు ♦ బింబఫలాధరోష్ఠు
డంబుదశ్యామగాత్రుడ ♦ స్త్రయుతోరు
బాహుడై శ్రీపురంబున ♦ వరలువాని
విషయమున నేనుజెందిన ♦ వివిధశ్రమల
నెవ్వరొందిరి తలప నీ ♦ పృథివియందు.

10. వారికొండునైన్.

శ్లో. దృష్టశ్చే త్త్వ మహం త్వహంప్రథమికాజుష్టస్త్వదారాధనం
కర్త్వం స్త్వానుబుభూషు రస్మి నృహరే లక్ష్మీపురాధీశ్వర,
మత్తోపి ప్రథమం త్వమేవ బహుళం మయ్యాదరం దర్శయ
న్మాం కార్త్స్న్యా దనుభూతవానసి హరే నీలాంబుదశ్యామల.

తే. గీ. వాని జూచినయప్పుడే ♦ బహువిధముల
సర్వకైంకర్యవిధులను ♦ సలుపునాశ
గలుగ నాకంటెముందర ♦ గడురయంబు
మీరదావచ్చి కృపను నా ♦ మీదజూపి
యనుభవించును శ్రీపురా ♦ ధ్యక్షుండు డివుడు.

11. క డి య నా య్ క ం జ నే.

శ్లో. కంసారిం స్తువతా శఠారిమునినా యత్పద్యసాహస్రకం
జగ్రంథే నిగమాంతవాక్పరిషద స్సంశీతినిశ్శ్రేయకం
తస్మి న్నేతదనూనపద్యదశకం సార్థం పఠంతో జనా
స్తర్త్వాజన్మనదీం తథా మృగజలప్రాయం భవం ద్యంతిచ.

తే. గీ. కుపితుండై కంసుగూల్చిన ♦ గోపవిభుని
సన్నుతించి శఠారాతి ♦ సాధుఫణితి
గూర్చియిచ్చిన వేయిలో గూడినట్టి
యీపదింటిని జదువగా ♦ నేర్చుభవము.

శ్రీ మ తే శ ఠ కో ప యన మః.

శ్రీమతేరామానుజాయనమః.

నవమ శతకము – ఏడవ దశకము.

[ఎంగానల్.]

అవతారిక:— ఆళ్వార్లు దిగువ నప్రీతికళర్ణగుణానుసంధానముచే మిక్కిలి సంతసించిరి. భాగ్యహానిచే నప్రీత్యంశమే తలయెత్తగా నాసర్వేశ్వరుని లభించిన యెడ బ్రతుకుట లేనిచో మృతినొందుట యనదగిన తమదశ నన్యాపదేశముచే సాధించుచున్నారు. సర్వేశ్వరునితో సంశ్లేషించి వియోగమును జెందిన యొకపిరాట్టి వానివిగ్రహసౌందర్యమందు సక్తచిత్తయయి యవసాదమునొందియుత్కంఠితురాలై ప్రమదవనమునకు బోయి యచ్చటనున్న పక్షుల నుద్దేశించి "పిన్నానార్వణం శోది తిరుమూఝిక్కళమ్"(తిరుమూఝిక్కళము తరువాత వారుసేవించు జ్యోతిస్సు) అన్నట్లు దూతగా పోయినవారికి కష్టపడి వార్తలు చెప్పనవసరము లేకుండ తిరుమూఝిక్కళమునకు వచ్చి విచ్చేసియున్నాడు తనకు మంచివారైనవారిని విడువజాలనివాడగుటచేతను కృపావంతుండగుటచేతను నాదశను తెలియజేసినయడల దప్పక నాయొద్దకువచ్చును. మిమ్ములను విశ్లేషించిన వారు ధరించియున్నారని సర్వేశ్వరునికి దెలియంజేయుండని సవినయముగా ప్రార్థించుచుండెడి యొకపిరాట్టిమాటలచే దమదశను సాధించుచున్నారు. అంజిరైయమడనారైలో "సర్వేశ్వ

రుడు నాపట్లనున్న యపరాధముచే నాయొద్దకు వచ్చుట మానినాడు. వానియపరాధసహాత్వగుణమును వానికి దెలియజేయవలెను." అనితలంచి యపరాధసహాత్వమునాధారముగా జేసికొని దూతలను బంపిరి. వైకల్పూంగత్రివాయిలో మంచి వస్తువును జూచినయెడల దానియందు సక్తమనస్కుడగువాడగుటచే తిరువణ్వాండూరుయొక్క సమృద్ధిని జూచి యచ్చట సక్తుడై నిలిచెను. సునయార్తిని తెలియ జేసినచో నచ్చట నిలుచువాడుకాడు. అను నంశము నాధారముగా జేసికొని దూతలను బంపిరి. పొన్నులగాళిలో తిరుక్కోళూరుకు పోవుటకు దాను నివసించి యున్న పట్టణమునకు సమీపమందున్న పూదోటవరకు వెళ్లి బలహీనిచే పురివెళ్లజాలక ఆగిపోయిన యొకపిరాట్టి వాడురాకపోవుటచే "వానియైశ్వర్యవిస్మృతిచేవచ్చుట మానివేసినాడు. ఆశ్రితులలో నేకరసుడగుటచే వచ్చును" అని ఏకరస్యము నాధారముగా జేసికొని దూతలనంపిరి. దీనియందు దనకు మంచివారై యున్నవారిని విడువఁజాలక పోవుటచే రాలేదు. అట్టి దివ్యమంగళవిగ్రహసౌందర్యము అట్టికళ్యాణగుణములు గలవాడు కాగా వానితో వియోగమును పొందినవానికి జీవించియుండ శక్యమా? అనితలంచి వాని విగ్రహసౌందర్యమును వానిగుణములను ఆధారముగా జేసికొని దూతలను బంపుచున్నారు. ఇందులో "నుమనోడుంపిరియాదే" అనునది (ఉయిర్పాట్టు.)

## 1. ఎంకానలగమ్.

శ్లో. పారావారస్య తీరే వనభువి విచరన్సారసా రక్తపాద
త్వాంయాచే దూత్యమేత్య వ్రజవిమలసరోనామకం శ్రీశవాసమ్,
తత్రత్యం మౌళిరాజత్సురభిళతులసీమాల్యమాలోక్య నాథం
బ్రూహ్యస్మత్తాపమస్మై క్రమమశిరసికురుత్వోత్పదంయుష్మదీయైః.

చ. జలనిధితీరకాననము ♦ చక్కని బారెదునుప్పుకాల్వలో
బలుదెసలన్ మెరల్వెదుక ♦ బర్విడు సారసపక్షులార శై
వలినిపురంబున న్కుసుమ ♦ వారకనత్తులసీసవ్రిజాంచితో
జ్జ్వలమణిమౌళియౌ హరికి ♦ బంపుదు దూతలగా మిముం జనుం
డలసతమాని నావెతల ♦ నాతనితోడ వచించి వచ్చినన్
దలపయి దాల్చెద న్నీనుడు ♦ తప్పక నే భవదీయపాదముల్.

## 2. నుమరోడుం.

శ్లో. బంధుగ్రామయుతాః ప్రియైశ్చ కలితా హేతుక్కభా మద్వచ
శ్శ్రోతవ్యం విమలహ్రదాఖ్యనగరే సంతిష్ఠతో పేక్షితా
నింద్యాచాస్మి మదీయబంధువితతే రత్రిస్థితా కింకరో
మ్యాత్మీయైస్సహ తత్పురీం శ్రితమమూం నార్హామి కింవీక్షితుమ్.

ఉ. బాంధవకోటితోడ బ్రియ ♦ భర్తలతోడ జరించుచుండు పే
మాంధ విహంగసంఘము ప్ర ♦ హర్షముతోడ దరంగిణీపురిన్
సింధుపతిప్రియాత్మజను ♦ జేరివసించు మదాత్మవల్లభున్
బంధువులెల్లగూడి యప ♦ వాదము మోపి పరిత్యజింప నా
బంధురగాత్రి పంచశర ♦ బాణపరంపర కొప్పగించి నీ
యంధత జూపుకొంటివిది ♦ యర్హమె యంచు వచించి రండికన్.

## 3. తక్కల మేకేళీర్గళ్.

శ్లో. క్రౌంచాశ్శ్రిత సరోవిహారనిరతా దాత్యూహసంఘా హి మే
వాస్తవ్యం విమలహ్రదాఖ్యనగరే బింబాధరం శ్రీసఖమ్,
రక్తాబ్జోపమపాణిపాదనయనం నీలాంబువాహచ్ఛవిం
త్వాం కిం నార్హతి సా సతీతి సమయం సంవీక్ష్యతంపృచ్ఛతమ్.

ఉ. కొంగలగుంపులార జత ♦ గూడి చరించుజలాండజౌఘమా
భంగవతీపురీపతిని ♦ బద్మవిలోచన పాణిపాదు న
య్యంగజుతండ్రి శ్రీహరి న♦యంబున జూచి భవత్కటాక్షు మి
య్యంగనమీాద లేదె యని♦యచ్చుపడంగ వచించి రండికన్.

## 4. తిరుమేనియడిగళుక్కు.

శ్లో. విద్యుద్భూషితవారిదా స్సురుచిరే శుభ్రహ్రదాఖ్యేపురే
బద్ధావాస మదభ్రరూపవిభవా క్లృప్తత్రిలోకం హరిం,
దూతా మత్ప్రహితా ఉపేత్య భవత స్సంశ్లేష మస్యైదిశే
త్యాఖ్యాతాంబరతో భవత్తనురుచింహృత్వా క్షిపే త్కం స వః.

చ. జలదములార నాయెడల • సత్కృపగల్గి మదీయ దూతలై
విలసితనిమ్నగాపురికి • వేడుకతోఁజని శౌరిగాంచి యా
జలజదళాయతేక్షణను • జాలముసేయక చూడరావలెన్.
జలదనిభాంగ యంచునొక • సారి వచింపగ మీతనుద్యుతిన్
దోలగఁగఁ జేసికోపమున • దోయదమార్గమునుండి త్రోయునే.

5. తెళివిశంబుకడిదోడి.

శ్లో. తారావర్త్మని చంచలాంశువలయోన్మేషస్ఫురద్వారిదా
గత్వా శుభ్రసరఃపురీవరకృతావాసం శతార్కప్రభమ్,
నాథం దివ్యపదస్య సూరిమహితం మన్మానసాభ్యంతరం
సద్మీకృత్య వసంత మబ్జనయనం బ్రూతాశు వార్తాం మమ.

శా. శంపాజాలవిరాజితంబులగుచున్ • సంఘంబుగా మింటిపై
నింపారం జరియించువారిదములా • యాత్మాతలంబందు నై
లింపావాససమాపగాపురి మహా • లిప్తాంగుడై యుండునా
కింపాకప్రతిమున్ హరి న్గని మదు • క్తిం జెప్పగా వేడెదన్.

6. తూదురైత్తల్.

శ్లో. ఝుంకారప్రతినాదితాఖిలహరిద్భృంగౌఘసంసేవితో
ద్యానాంచద్విమలహ్రదాఖ్యనగరే ప్రీత్యా వసంతం హరిమ్,
పద్మాలంకృతవక్షసం మధుకరా దృష్ట్వా వియోగార్తిత
స్తస్యాః కంకణవాససీ విగళత స్స్వామి న్నితి ఖ్యాత తమ్.

మ. మధురధ్వానముసేయుషట్పదతతీ • మా దూతలై పోయి యా
మధుపానాగతభృంగజుష్టసుమనో • మాన్యావనీజాతస
న్నిధిసంసేవితనిమ్నగాపురివస • న్నీలాంబుదశ్యామునిన్
బుధసంసేవ్యు రమేశు జూచి దయతో • బోధింపుడీ మాటలన్.

7. శుడర్వళైయుమ్.

శ్లో. మాం సంశ్లిష్య విముచ్య వస్త్రవలయాన్యాచ్ఛిద్య శుభ్రప్రదం
సద్మీకృత్య వసంత మబ్జనయనం కల్యాణకీర్త్యాస్పదం,

దాత్యూహాః ప్రహితా మయా ప్రణిధివద్గత్వా ప్రవాళాధరం
మత్సందేశవచః సకృత్కథయత త్యక్త్వా చ శాలీనతామ్.

చ. జలచరగాయుధోత్కరము ♦ సంగతుడై ననుబాసి భూషణా
వళులను నస్త్రసంతతిని ♦ వంచనచేగొని నిమ్నగాపురీ
నిలయమున న్వసించు నవ ♦ నీరజనేత్రుని జూచి యాశర
జ్జలజముఖిన్ స్మరార్త నవ ♦ సన్నగ జేసితి వంచు బల్కుడీ.

8. ఎ న్న క్కొ న్ను ప ణి యా ర్గ ళ్.

శ్లో. ఆహారాయ వనాంతరాటనరతా యుక్తాః ప్రియైః కుక్కుభా
ఉచ్చాట్టాలకవప్రవేష్టనలసచ్ఛుద్ధహ్రదాఖ్యే పురే,
క్ష్ణావాస మురోవిరాజితరమం ఫుల్లాతసీసచ్ఛవిం
దృష్ట్వా మద్విరహవ్యథాంసువిషమాం చక్షుధ్వమ స్త్రప్రాయాః.

మ. వెసమేయంగ వనాళికేగు విహగీ ♦ బృందంబులారా కన
ద్వసుధాభృత్సదృశాట్టమండితమునై ♦ ప్రాకారసంశోభియై
వసుధ న్రాజిలు నిమ్నగాపురమునన్ ♦ బద్మాక్షు వీక్షించి యా
బిసజాతాక్షిని బ్రోవుమంచనడు మీ ♦ వీర్యంబు తెల్లంబగున్.

9. పూ ం దు ఱ్ఱా య్.

శ్లో. కాసారస్థలమానసారస భవాన్ శుద్ధహ్రదాఖ్యేపురే
ప్రీత్యోప్యాత్తనికేతనం కరగతజ్యోతిర్మయారిం హరిమ్,
గత్వా సా మదనాస్త్రవిహ్వలతను బాష్పాయితాక్షీ కృశా
వైవర్ణ్యంసముపైతి తేవిరహతః కింన్వాయ్యమిత్యుచ్యతామ్.

మ. జలవేణీతరదల్పసారసమ స ♦ చ్ఛక్రాదిదివ్యాయుధున్
తులసీమాల్యపరీతమౌళి నఘభృ ♦ ద్దూరున్ నదీపట్టణో
జ్జ్వలవాసున్గని యామృగాక్షి తనువై ♦ వర్ణ్యంబు పెంపెక్క న
శ్రులు నిండ న్గనులందు నంచు బలుకన్ ♦ శూరత్వమున్బ్రానుడీ.

10. త గ వ న్నె న్ను రై యా ర్గ ళ్.

శ్లో. గంభీరాబ్జసర స్తరచ్ఛితగరున్మత్యాః ప్రియోత్కంఠితా
సా త్వయ్యేవ నిబద్ధమానసతయా క్షామాం తనుం బిభ్రతీ

కాంచీముక్తకటిః ప్రజాగరవశా చ్చూన్యాక్షియుగ్మేతి తం
గత్వా శుద్ధసరఃపురీశ మసకృ ద్భ్రాన్తి ధ్రియేయావతా.

చ. సితగరుదోఘమా తనువు ♦ చిక్కె వివర్ణతహెచ్చె భూషణ
ప్రతతులు జారె గాత్రమున ♦ ప్రాణమరుత్తులు కంఠసీమకున్
దురితగతి జేరె మీరికను ♦ దోయజనేత్రుని నిమ్నగాపురీ
స్థితు కడకేగి నీకృపకు ♦ జేడియ బాహ్యమె యంచుబల్కుడీ.

11 ఒళ్లువిన్ని తిరుమూళిక్కళత్తురైయుమ్.

శ్లో. నిత్యం శుద్ధసరఃపురే నివసతః కృష్ణా ద్వియోగవ్యథాం
ప్రాప్తా కాచిదుదీర్ణశోకభరత శ్చక్రన్ద ముక్తస్వనమ్,
తత్సర్వం శఠజిజ్జగాద దశకే స్వోక్తం సహస్రం గతే
తత్పద్యాని దశా నుసందధదిహ చ్ఛిత్వా మయా నంజసా.

చ. అనయము నిమ్నగాపురస ♦ మాశ్రితునం దనురక్తచిత్తయై
తనువు మనోజబాధలకు ♦ దార్చిన యాశుకవాణి మొఱ్ఱలన్
ఘనముగ జెప్పినట్టి శఠ ♦ కాలుడుకూర్చిన వేయిలోని యీ
జననుతిపద్యము ల్పదియు ♦ జుపును శౌరివియోగజార్తులన్.

శ్రీమతే శఠకోపాయ నమః.

---

శ్రీమతేరామానుజాయనమః.

నవమ శతకము – ఎనిమిదవ దశకము.

[అఱుక్కుంవి నైయూయన్.]

అవతారిక :— తిరువడి పిరాట్టియొద్దకుబోయి యామె యోగక్షేమములను గొని మరలివచ్చిన తరువాత పెరుమాళ్లదగ్గిరికి బోకమునుపామె కుదయించిన మనోరథమువలె క్రింద తిరునాయిమొళిలో బంపబడినదూత లీశ్వరునిసన్నిధికి బోయి యాతని దీసుకొనిరాకమునుపు మధ్యకాలములో నీయాళ్వార్లకు బుట్టిన మనోరథము చెప్పఁబడుచున్నది. ఈరీతిగా తమయార్తి దూతలద్వారా వానికి దెలియజే

యించినను వానిరాక కనబడక పోవుటచే నవసాదమునొంది దూతప్రేషణముచేతను, వానిగుణానుసంధానముచేతను, మనఃప్రసాదముచేతను "వాడువచ్చి మనలగటాక్షించి స్వనివాసస్థానమైన తిరునావాయికి నన్నుదీసికొనిపోవుట నిశ్చయమని తలంచి క్రమముగా బోవుటకు సహింపక "అచ్చట బ్రవేశింపగలనా- ఎప్పుడు ప్రవేశించెదనో- కన్నులార వానిని సేవించి కైంకర్యమొనర్చ లభించెదనా- అని యనేకవిధములుగా మనోరథించిరి. ఉపాయోపేయములు రెండు నీశ్వరుఁడేయనియధ్యవసాయముగలవారికి ప్రాప్యరుచి కొరత గాకుండనుండుటచే విలంబమునకు హేతువు లేదుగాన ప్రాప్యసిద్ధివఱకు మనోరథము ప్రవర్తించుచుండును. యీమనోరథమీయాళ్వార్ల కెన్నడును వదలనిది. భోగ్యమైనది. స్వరూపముతో జేరినది. పెరియముదలియార్ (ఆళవందార్) ప్రాప్యసిద్ధియందున్న త్వరచే నెల్లప్పుడీ తిరువాయిమొళ్ళినే యనుసంధించువారట. అందుచే నీతిరువాయిమొళ్ళికి పెరియముదలియార్ తిరువాయిమొళ్ళియని పేరు. ఇందులో "కోవాగియమావలియై" అనునది (ఉయిర్పాట్టు.)

1. అరుక్కుంవినైయాయన.

శ్లో. యే విన్యస్య హృదంతగే మురరిపుం ధ్యాయంత్యనన్యాశ్రయా
స్తేషాం పాప్మ సమూలఘాత మఖిలం ఘ్నంతీం బుధై రాశ్రితాం,
ఉన్మీలత్సుమనఃపరీమళఝరీసంవాసితాక్రీడసం
సేవ్యాం కేనచ సాధనేన జడధీః ప్రాప్స్యామి నౌకాపురీమ్.

చ. అనవరతంబు వాని హృద ♦ యంబున సంస్మరియించువాని పా
పనివహ మెల్ల బోనడచు ♦ పట్టణమై వివిధప్రసూనవా
సనలుగలట్టి పుష్పవన ♦ సంఘముగల్గిన నౌపురంబు నా
కనులను జూచుభాగ్యమిఁక ♦ గల్గుట యెన్నడు సంభవించునో.

2. కొడియేరిడై.

శ్లో. వల్లీవలగ్నవిలసద్వనజాలయేశో
నీళావిలోచనచకోరశశాంక మూర్తిః,
యామధ్యువాస సుమనోవనశోభితాం తాం
నౌకాపురీ మహ ముపైమి కదాను దాసః.

మ. తనుమధ్యాన్కమలావధూమణి నురో ♦ ధామంబునన్ దాల్చువా
డనఘాత్మవ్రజసేవ్యమానచరణుం ♦ డబ్జాయతాక్షుండు పా

వననామముండు వసించునౌపురిని నే ♦ పాపిన్మదీయాత్ములన్
గనుభాగ్యంబు నొసంగువాసరము లి ♦ క్కాలంబునన్గలునే.

### 3. అ వై గొ ళ్ అ ణు గ ప్పె రు నా ళ్.

శ్లో. ప్రాప్స్యామ్యహం కిల కదేతి తదేకచిత్తః
పర్యశ్రునేత్రయుగళః పరిదేవయే తమ్,
నిర్ధూతహేయకమలాసఖవాసభూమిం
నౌకాపురీ ముపలభేయ కదా తిభక్త్యా.

తే. గీ. చిత్త మైకాగ్ర్యతను బొంద ♦ జేసి సతత
మశ్రుజలపూర్ణనయనుండ ♦ నైతినేను
నళినవయనుండు వసియించు ♦ నౌపురాన
భాగవతగోష్ఠి జేరంగ ♦ బడయుటెపుడొ.

### 4. నా ళే ల రి యే న్.

శ్లో. నీలాభికాంబుధరచుంబిసుమటప్రమండ
నౌకాపురీనిలయ దేవవరార్చితాంఘ్రి,
అశ్రాంతదాస్యకరణోద్యత ఏషదాస
స్సిద్ధ్యేత్కదా నిజమనోరధ ఇత్యుదశ్రుః.

తే. గీ. రమ్యనానాసుమోద్యాన ♦ రాజమాన
నౌపురీవరవాసుదే ♦ వా పరేశ
నీళపతి నీదుదాస్యైక ♦ నిష్ఠ దగిలి
యున్న నామాయువికనెంత ♦ యుండొ నాకు
జెప్పవేడెద గరుణించి ♦ శ్రీరమేశ.

### 5. మ ణా ళ ర్మ ల ర్మం గై క్కు.

శ్లో. ధాత్రీరమాప్రియసఖో దివిజేశ్వరాణాం
లోకస్థజంతునివహస్య చ సన్నియంతా,
ఆదృత్య యామధివసత్యధిభూమి రమ్యాం
నౌకాపురీం మమ దృశౌ పిబతః కదాను.

తే. గీ. వల్లభుడు కమలవాసినీ ♦ వసుమతులకు
దేవమర్త్యాళిదేవత ♦ దీప్తియుతుడు
కాపురముసేయు నౌపురి ♦ గన్నులార
గనెడుభాగ్యంబదెప్పుడు ♦ గలుగునాకు.

6. కం డే క ళి క్కి న్న దు.

శ్లో. సౌరభ్యలీనమధుపావృతపుష్పవాటీం
నౌకాపురీ సుధివస న్వ్రజగోపనాథ,
దాసీకృతోస్మి తవ ముక్తసమ స్తహేయమ్
దృష్ట్వా కదా మమ దృశావభినందత స్త్వామ్.

తే. గీ. భృంగపూర్ణసుమాకీర్ణ ♦ తుంగభూజ
నివహవేష్టితనౌపురీ ♦ నిత్యవాసి
గోపగోవత్సరక్షక ♦ గోపనాథ
నిర్వికారమైనమనముతో ♦ నీకునున్నె
దాసుడైతిని నినుజూడ ♦ నాసగొంటి.

7. కో వా గి యు మా వ లి య్యె.

శ్లో. వైరోచనా త్త్రిభువనం సముపాత్తవాం స్త్వం
దేవాసురాహవభువి ప్రజఘుంథ శత్రూన్,
నౌకాపురీస్థిత రమేశ తపస్వినం మా
మత్వా మదీయఇతి సించ కృపామృతౌఘైః.

తే. గీ. క్షితిపుడై యున్నబలిని వం ♦ చించి భూమి
గొన్నవామన వినిహత ♦ క్రూరదనుజ
నౌపురీనిత్యసంస్థిత ♦ నళిననేత్ర
వీడునాదాసుడని బ్రోవ ♦ వేడుకొందు.

8. అ రు ళా దో ళు వా య్.

శ్లో. దీనంమామనుగృహాణ కామంత్వ మధవా సద్వస్తుకల్పంహిమాం
వస్తూకృత్య తవాంఘ్రిపద్మయుగళే విన్యస్య సంరక్షమాం,

నౌకాపూర్నీలయా స్మదీశ దయయా జ్ఞానం ప్రదేహి ప్రభో
యేన త్వాం హృదిసన్నివేశ్య సతతం ధ్యాయా మ్యవిద్యాతిగః.

ఉ. నౌపురినున్న పద్మనయ ♦ నా వనునీవు కృపార్ద్రచిత్తతన్
నీపదయుగ్మమందిడిన ♦ నిష్ఠుర మొప్ప బరిత్యజించినన్
గోపము లేదు నాకు నిను ♦ గోరిమనంబున నుంచి చింతనం
బేపున జేయునట్లు దయ ♦ నెప్పుడు జూపుము దేవతాగ్రణీ.

9 దేవర్షి నివర్తిన్యమ్.

శ్లో. ఆద్య స్త్రిషు త్రిదశమానిభి రప్యగమ్యో
లోకత్రయీసృజనరక్షణలంపటశ్చ,
యా మావస త్యతిముదా భగవా న్సదా తాం
నౌకాపురీం సముపయేయు రహీనభాగ్యాః.

తే. గీ. దేవమునిసంఘదుర్జ్ఞేయు ♦ దివ్యమహిముఁ
డరయమూర్తిత్రయంబున ♦ కగ్రగణ్యుఁ
డఖిలజగముల కధిపతి ♦ యైనవాఁడు
ప్రీతి నివసించునౌపురి ♦ బ్రీతులగుచు
గనెడుభాగ్యం బికెవ్వరు ♦ గలుగువారొ.

10. అంతోవనుగప్పెరునాళ్.

శ్లో. వ్యాకోచపుష్పకుహాళీభరనమ్రభూజ
నౌకాపురీశ్రిత పురందరనీలకాంతే,
త్వత్ప్రాప్త్యనేహస మహం ప్రసమీక్షమాణః
క్రందామి సాధి రనిశం భగవ న్రమేశ.

తే. గీ. కుసుమభూరుహసంవ్యాప్త ♦ గోత్రమైన
నౌపురంబున నుండెడు ♦ నళిననేత్ర
నిన్ను బొందెడు సమయం ♦ బదెన్నడౌనొ
యనుచు మొఱవెట్టుచుంటి నే ♦ నబ్జనాభ.

## 11. వ ణ్ణ ం మ ణి మా డ మ్.

శ్లో. ఉత్తుంగరత్నమయసౌధవిరాజితాం శ్రీ
నౌకాపురీం శ్రిత మధోక్షజ మర్చయిత్వా,
కార్యాత్మజోఽ తనుత పద్యసహస్ర మస్మి
న్నేతద్దశప్రపఠతాం కరగా స్సుభోగాః.

తే. గీ. సౌధరమణీయనౌపురీ ♦ సారసాక్షు
వినుతిసేయు శఠారాతి ♦ వేయిలోన
నీపదింటిని జదువువా ♦ రిహసుఖంబు
నొంది తరువాత ముక్తిని ♦ బొందువారు.

శ్రీ మ తే శ ఠ కో పా య న మః.

శ్రీమతేరామానుజాయనమః.

## నవము శతకము - తొమ్మిదవ దశకము.

[మల్లిగైకమఖ్.]

అవతారిక :— అయోధ్యయం దున్నయెడల నత్తమామలు దగ్గరగా నుండుటవలన తన స్వేచ్ఛవచ్చినట్లు స్వామితో విహరించుట కడ్డమని తలంచి యరణ్యమునకుఁ బోయినచో నేకాంతముగా స్వామి ననుభవింపవచ్చునని మనోరథించి యడవికిబోయిన అమ్మవారు " కాంతారమధ్యే విజనే విసృష్టా బాలేవ కన్యా విలలాప సీతా " అన్నట్లు మొఱబెట్టినట్లు తిరునావాయిలో బ్రవేశించి సర్వేశ్వరుని సర్వవిధముల ననుభవించుటకు మనోరథించిన యీయాళ్వార్లకు బాధకవర్గమును జూచి భయఁపడి మొఱబెట్టవలసివచ్చినది. ఒకనాడు పెత్తియను భాగవతోత్తము లొకరు (నంబిళ్లగారి సబ్రహ్మచారి. నంజీయర్ శిష్యులు) నంబితిరువరంగనారాయణదాసు డనువారొకరు నారెుద్ద తిరువాయిమొళ్లిగానమును విని అచ్చటికి వెళ్లిరి. నేడుపిళ్లగారు పాడిన వినోదమేమియని యడుగగా " అరుక్కుంవినైయాయన, నాళై మల్లిగైకమఖ్ తెన్నలుమ్, మాలైప్పూశలుమ్, అని పాడించిరి. ఈయాళ్వార్లు క్రిందతిరువాయిమొళ్లిలో ప్రాప్యవస్తువును లభించుటకు మనోరథించిరి. కోరిన వెంటనే తమమనోరధము లభింపకపోవుటచే తిరువాయిప్పాడియందున్న గోపికలం

దరు శ్రీకృష్ణుని విశ్లేషించి యొకనాటిరాత్రి పొందిన వ్యసనమునంతయును వీరొక్క-రేపొందిరి. అని ఆళవందారు సాదించువారట. దీని నెంబెరుమానార్లు విని " వీరు మునుపే యుత్కంఠచే బాధనొందుచున్న వారగుటచే నంతమట్టు కవకాశ మిచ్చుటకు కావలసిన యాశ్రయము చాలదు. కావున వానిని విశ్లేషించి యొకసంధ్యాకాలమందు పడ్డ బాధను పడుచున్నారని చెప్పవలెనని సాదించిరట. దీనియందు జేయునదేమనగా " జ్ఞానము పుట్టినతరువాత గూడ విరోధియగు సంసారమునుండి మర్లజాలక ప్రాప్యభూమియందున్న మనోరథముచే బాధకవర్గము బాధించునట్లు పదును చేయబడుచున్నది. " పొయినిన్న ఇానములో భగవద్విషయక జ్ఞానము పుట్టగా విరోధియగు సంసారసంబంధమును ఛేదించివెయ్యవలయునని యీశ్వరుని వీరు ప్రార్థించినను వీరి నీవిభూతిలోనుంచి, వీరిచే గొన్నిప్రబంధములను జేయించవలెనని తలంచి సర్వేశ్వరుడు వీరిప్రార్థనను మన్నింపలేదు. అవిరోధియందున్న యరుచి యింతవరకు ననువర్తింపగా స్థిరముగా నున్నరీతిని చెప్పుచున్నారు. దీనిలో బ్రతిపాదింపఁబడిన యర్థమే యుపనిషద్వాక్యమందు బ్రతిపాదింపఁబడుచున్నది. అనగా— " ఛాందో–6–14–తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యే అథ సంపత్స్యే. " అనువాక్యములో బ్రతిపాదింపఁబడుచున్నది. " ముడియానే" యందు తమకరణములకు గలిగిన శైథిల్యమును జెప్పియున్నారు. ఆకరణములకు వానికాశ్రయమైన అవయవికి గలిగిన యవసాదము నిందులో జెప్పుచున్నారు. జ్ఞానేంద్రియములకు కర్మేంద్రియములకు నేకరీతిగా గలిగిన యవసాదము నిందులో జెప్పుచున్నారు. తిరువాయిప్పాడియందున్న గోపికలకు కృష్ణవిరహముచే నొకసంధ్య రామావతారమందు గలిగిన పదునాలుగుసంవత్సరముల వియోగముతో సమానమైనది. ఆ యవతారమందు గుణాధికవిషయమును విశ్లేషించి యుండుటచే పదునాలుగేండ్లు గడిచినవి. ఈకృష్ణావతారమందు సౌలభ్యములో మున్నులగుటచేత నొకపగలు బహుకల్పసమానమైనది. గుణములుగుణములై నిబర్హించవు. ఆశ్రయమందుంటుటచే బాధించును. ఇచ్చట (కృష్ణావతారమందు) భర్తృ యనేయయి యున్నను పెంకెతనముండుటచే సహింప శక్యముకాదు. లోకులెల్లరు భోగ్యములని యెంచుకొను శబ్దాదివిషయములు తమకుఁబాణములుగా బాధకములు కాగా ప్రాప్యవస్తువును లభింపలేక పురుషశార్దూలుఁడైన భీష్ముఁ డర్జునబాణములచే ఖండితగాత్రుఁడై బాధనొందిన ట్లీయాళ్వార్లు బాధనొందుచున్నారు. తిరువాయిప్పాడియందున్న గోపికలు కృష్ణుడు పశువులను మేపుటకు పైకి జనగా నతడు మరలివచ్చువరకు వారు పొందు విరహవ్యథ నీతిరువాయిమొళ్లి చెప్పుచున్నది. గొల్లవాండ్రకు పశువుల మేపించుట బ్రాహ్మణులకు సంధ్యావందనము వంటిది. జాత్యుచితమైన ధర్మమగుటచే విడువ

శక్యముగానిది. ఈరీతిగా గృష్ణుని పశువులవెనుక బంపి యాతఁడు మరలివచ్చు సంధ్యాసమయముకొరకు నిరీక్షించి యుందురు. కాగా గృష్ణుఁడు పశువులను మేపుటకు బోయినయడల గోపికలు పగటిప్రొద్దు నంతయు నతికష్టముగా గడిపి మామూలుగా వాఁడువచ్చు సంధ్యాసమయమురాగా మొదటిమందలో వాఁడు కానరాకపోవుటచే మిక్కిలి విరహవ్యథ గలవారగుదురు. ఈగోపికలు తాను రాకపోవుటవలన బడు పాట్లను జూచి సంతోషించుటకు వెనుకమందలో నుండిపోవును. వాఁడు రావలసిన సంధ్యాకాలము వచ్చినది. ఆలమందలుకూడ వచ్చినవి. కృష్ణుఁడురాకపోవుటచే నాసమయమందుమల్లికాకుసుమపరిశము, మలయానిలము, చంద్రిక, సముద్రఘోషము, క్రౌంచపక్షి, వేణునాదము మొదలగునవి యాగోపికలను బాధింప సాగినవి. కష్ణుని మురళీనాదము వానిగుణములను స్మరింపఁజేసి బాధకే హేతువైనది. మునుపు వేరు వేరుగా పరుషభాషణములను బలికి అమ్మవారిని బాధించిన ఏకాక్షి, ఏకకర్ణి మొదలగువారొక్క పెట్టున నామెపైబడినట్లు బాధకవర్గ మంతయుగలిసి యొక్క సారి వీరిపై బడగా ముట్టబెట్టుచున్నారు. ఇందులో " ఊదుమత్తింకుఘ్ఘ్రేక్కయుయ్యేన్ " అనునది (ఉయిర్పాట్టు.)

## 1. మల్లిగైకమఱ్ఱెతెన్నల్.

శ్లో. మల్లీసౌగంధ్యజుష్టా మలయగిరిభవా వాతపోతా మురారే
గీఃతి స్నా వైణవీచ ప్రముషితతపనా యామినీ సాంధ్య మేఘాః
ఏతే కృంతంతి మర్మాణ్యహహవికసితాంభోజపత్రాయతాక్షః,
సంశ్లిష్య త్యక్తవాన్మా ముగతిరహమితః కుత్ర వర్త్స్యే నజానే.

సీ. సంఫుల్లమల్లికా ♦ సౌగంధ్యవాసిత
మలయమారుత మొక్క ♦ నలను బలిసి
రాళ్లను గరగించు ♦ రమ్యమౌ కృష్ణుని
మురళీస్వనం బొక్క ♦ తెరువునందు
అస్తభూధరమస్త ♦ కాగ్రసంవిష్టార్క
రశ్మితో గూడిన ♦ రాత్రియొకట
సాంధ్యరాగప్రభా ♦ సంతానభాసిత
వారివాహము లొక్క ♦ వైపు మెఱయు.

తే. గీ. క్షతసమర్పితశస్త్రంబు ♦ గతిని నాకు
జీవితారుంతుదములయ్యె ♦ జెప్ప నేల

శౌరి నన్గూడి యెడబాసి ♦ చనియెనిప్డు
డేమిరోయనరించుదాన నిం ♦ కెందు జొత్తు.

2. పుగలిడమతిగిలమ్.

శ్లో. కింకుర్వే ఉత్రి భజామి కంచ శరణం కృష్ణస్య వేణూద్భవా
గీతి శ్శ్యాకవ్రరకంఠలగ్ననినదఘ్ఘంటాశుప్రితి ర్దారుణా,
రాత్రి శ్చందనకర్దమం పికరుతి ర్వాం దాక్షిణాత్యో మరు
న్మల్లీపుష్పచయశ్చ మర్మసు తుదం త్యేకాకినీచా స్వ్యహం.

శ్లో. యః స్పృష్ట్వా భువనత్రియం ప్రథమతః కల్పోపరామే నిజే
కుక్షౌ న్యస్య తతఃపరం తదఖిలం నిష్ఠీవ్యతి ద్రాగ్బహిః,
మిత్వా విక్రమత స్తదేవ బహుధా శారక్ష్యతే దైత్యహా
మాయీనైతి మదంతికం స మురజి త్ప్రాణా న్కథంధారయే.

సీ. వృషభకంధాలంబి ♦ పృథులఘంటాస్వనం
బహాములు మలయునా ♦ తాళి గాత్రి
మురహారుండూదెడు ♦ మురళినినాదంబు
సంధ్య మాఖ్యాసువాళి ♦ చందనంబు
కోకిలపంచమ ♦ కూజనంబులు నన్ను
బాధించుచున్నవి ♦ బ్రిమ్మకసీక
పద్మజాండము నెల్ల ♦ బ్రభవింప జేసియు
బ్రళయాన గుక్షిలో ♦ భద్రపరచి

తే. గీ సృష్టి వెలి బుచ్చి క్రమ్మర ♦ నిష్టమొప్ప
గాలిచి రక్షించు దేవుండు ♦ క్రూరదనుజ
సమితిసంహర్త చక్రి నా ♦ సవిధమునకు
రాడు నాప్రాణ మికనెట్లు ♦ రక్షితమగు.

3. ఇనియిఋందెన్నుయిర్కాకూమార్.

శ్లో. వక్షోజౌ పరిముంచతః కఠినతాం మధ్యంచ చంకంప్యతే
దత్వా దుఃఖదమాత్మభోగమజహాద్యోమాంముధావంచయన్,

సశ్శ్రీమాన్ యదుపుంగవో మయి రతః పంచాస్యసత్ప్రోనమా
మా యాత్యస్య మహోజ్వాలాకృతి రసౌమన్మానసం వృశ్చతి.

సీ. పంచకుండగు పంచ ♦ బాణునిజనకుండు
పంచబాణుని కేళి ♦ పలు తెఱగుల
దేల్చి హాతాత్తుగా ♦ దీవ్రవేదన ముంచి
యెడబాసి చనియె నో ♦ యింతులార
నడుము కంపంబందె ♦ నళినోపమాక్షులు
వారివాహములయ్యె ♦ వనజనేత్రి
అనయంబు వాని నే ♦ తాంబుజయుగ్మంబు
హార్యక్షమధ్యంబు ♦ నధరబింబ

తే. గీ. మళికులస్పర్థిమూర్ధజా ♦ కులశిరంబు
భుజచతుష్టయ మెప్పుడు ♦ పువ్వుబోడి
నిల్చి నాముందుగొంకక ♦ నిష్ఠురముగ
జీల్చుచున్నవి హృదయంబు ♦ జెప్పనేల.

4. పా వి యే న్మ న త్తే.

శ్లో. ఉష్ణా శ్శీతలదాక్షిణాత్యమరుత శ్శీతాంశుతా విశ్రుత
శ్చంద్రోప్యుష్ణకరాయతే సుమమయీ శయ్యాదహత్యేవమామ్,
స్త్రీతాఖ్యం సుమ మాత్తసార మతనోత్కాట్యాసనేందిందిరో
నాహాం సోఢుమలం విపద్గణమముం నో మే సహాయం మనః.

ఉ. చల్లనిగాలి పువ్వుమయ ♦ శయ్యయు శీతమయూఖరశ్మిజా
లోల్లసితప్రసూనవని ♦ కోజ్జ్వలసౌధము కోకిలాదులున్
ఉల్లము నేచసాగె నెటు ♦ లోర్చెద నింక ననంగకేళిలో
నుల్లసమాడి పీడె, నను ♦ నుగ్రసురారివిమర్దనుండు నా
తుల్లకమైనమానసము ♦ గూడ పరాఙ్ముఖమయ్యె నిత్తరిన్.

5. యా ము డై నె ం జ ము న్.

శ్లో. మాం త్యక్త్వా చలితం మనో మమ తత స్త్విష్టద్గువేలాపత
త్ప్రియా నశ్మహ్యా దస్య వేణునినద శ్చైతన్య ముత్కట్యతి,

మత్తః ప్రాగపి మత్సఖీ మమరుజాం జ్ఞాత్వాపి నిద్రాతి సా
దుష్ప్రాపా స్య కృపా కిమత్రమదనూం స్త్రాతుంభ వేత్సాధనమ్.

తే. గీ. గగనమెల్లను సాంధ్యరా • గంబు గప్పె
గఠినహృదయుండు కృష్ణుండు • గానరాఁడు
వేణునిస్వన మెంతయు • బ్రాణహారి
నాయవస్థను వీక్షించి • నాసకియలు
చింతనొందుచు నున్నారు • శ్రీధరుండు
వచ్చువేళకు బ్రాణము • ల్వదలు నేమొ.

6. అ వ ను ష్టై య రు ష్ప రుం బో దు.

శ్లో. దుష్ప్రాపా స్య కృపా సబంధువచనా న్యాశ్వాస హేతు న మే
యావన్నాందయతే స జీవితమిదం ధర్తుం నతావత్ క్షమా,
శీరుద్రాబ్జభవాశ్రితం వపు రదో మాం బాధతే కింకరో
మ్యాత్మా ప్రాణవిధిః కథం మమ రుజః కస్మై బ్రువే మాతరః.

ఉ. ఇప్పటికైన వాఁడు దయ • నించుకయైనను జూపఁబోఁడు తా
దప్పిన వేరులేదు మరి • ధారకమెద్దియు నాకు మేనిలో
నొప్పఁగ బ్రహ్మరుద్రుల మ • హోదధికన్యను దాల్చినట్టి యు
య్యప్ప నుశీలతాగుణ మ • హాన్నిశ మాత్మ గలంచె నెచ్చెలీ.

7. ఆ రు క్కా న్ శ్లో ల్లు గే న్.

శ్లో. నీలాంభోదతనుద్యుతి స్సభగవాన్ జహ్రే మనో మామకం
తత్తత్రైవ నిషక్తమబ్జ సురభి ర్వాతార్భకో దాక్షిణః,
ఆదాయా గరుధూపచందనలసత్సౌరభ్య మావాత్యహాం
కస్మాయా త్తిమిమాంబ్రవీమికిముమాంత్రాతుంభ వేత్సాధనమ్.

ఉ. వారిదవర్ణదేహుఁడగు • వారిజనేత్రుని కృత్రిమంబుచే
హారితమైన నామనము • నాతనియొద్దకు బోయినిల్చె వి
స్తారసుగంధచందనము • శ్రావ్యవిపంచికలస్వనంబు నిం

డారగ బూయు మల్లియల ♦ హారిసువాసన గూడినట్టి యా
మారుతపోతము ల్గవిసి ♦ మర్మవిదారణ జేయు సాగెడున్.

8. పు దు మ ణ ము గం దు గో ం డు.

శ్లో. ఆషాఢాదిసముద్భవాశ్చ పవనా స్సంగృహ్య కాందం రజో
మయ్యేవ ప్రకిరంతి రాగగరిమాసాంధ్యః క్రమాత్ శ్రీయతే,
ఆగా స్వాప్తిసుఖం వితీర్యతదను త్యాగే మతిం చక్రిషః
కృష్ణ స్యాయ మరుంతుదః ప్రతికలం వంశీనినాదో మమ.

సీ. సురభిదక్షిణదిశా ♦ మరుదంకురంబులు
పెరుగుచునాపైని ♦ వీవజొచ్చె
సాంధ్యరాగప్రభా ♦ సంతానరంజిత
వారిదంబయ్యె న ♦ భస్థలంబు
కృష్ణుఁడొనర్చిన ♦ కృతిప్రేమవ్యాపార
మతనికంటెను క్రూర ♦ మైతనర్చె
స్యందమానమరంద ♦ సంశోభిమల్లికా
మాల్యచందనపంచ ♦ మస్వరములు

తే. గీ. వల్లవీజనసందోహ ♦ వంచనార్థ
గీతమురళీరవామృత ♦ స్ఫీతినాదు
హృదయు మగలించుచున్నది ♦ సుదతులార
బ్రతుకనియ్యవు నేనెట్లు ♦ బ్రతుకుదాన.

9. ఊ దు మ త్తిం క ట ర్కే.

శ్లో. దివ్యాలంకృతిభూషితో నిజదృశా విస్మృత్య చైకంపరం
సాకూతం మురళీరవేణ నిగద న్గోపీ ర్వినిఘ్నన్ రుషా,
మధ్యే కాన్యపి నర్మగర్భవచనా న్యాసూచయ న్మాధవో
యాం గీతిం కలయత్యుదారమధురాం సా మే మనోధూర్వతి.

ఉ. వేణువునూదుచు న్నదుమ ♦ వేడుకహాస్యపుమాటలాడి వి
న్నాణముదోప నేత్రముల ♦ నాకు నిజాత్మ నెఱుంగజేయుచున్

వేణువునూదీ గోపికలు ♦ వేమరు బొందెదు దుఃఖమెంతయున్
దానె ముఖాబ్జసంజ్ఞలను ♦ దద్దయు దెల్పుచు బాడుపాటలన్
బ్రాణము నిల్పజాలనిక ♦ వాఁడును రాఁడు సరోజలోచనా.

### 10. మూర్ఛయుం వందదు.

శ్లో. ఆసన్నం రజనీముఖం యదుపతి ర్నాఽయా త్యటంతోఽభిత
స్సంధిన్యో గళబద్ధకింకిణీరవా వేణుస్వనో దుశ్శ్రవః,
నీలాబ్జాని వగాహ్య కుందకుసుమా న్యాఘ్రాయ భృంగాస్స్వనం
త్యబ్ధి ర్భ్రమర వేణ నిస్తనతి మాం కోవా ద్య సంరక్షతి.

తే. గీ. సాంధ్యరాగంబు నిండెను ♦ జదలనిండ
పశుగణంబులు ఘంటికా ♦ స్వనము లెసగ
గోష్ఠమున జేరి యున్నియు ♦ గుంపుగూడె
బ్రియుఁడు రాడయ్యె నికనేమి ♦ వెరవు చెపుమ.

### 11. అవస్థ విట్లగన్ను.

శ్లో. తద్విశ్లేషనిపీడితవ్రజవధూశోకోక్తిభంగీ బ్రువం
స్తద్విశ్లేషశుచార్ధిత శ్శరరిపుః శౌర్యాత్మజః కేశవే,
యజ్జగ్రంధ సహస్ర మత్రిదశకం చైతత్పఠంతో హరా
భక్తాః ప్రాప్య తదంఘ్రిపంకజయుగం మోక్షశ్రియం లుంఠతే.

మ. విరహార్తి న్సహియింపజాలని వ్రజో ♦ ర్వీగోపికాసంఘముల్
ఖరరశ్మ్యస్తమయావసానమున దుః ♦ ఖప్రాప్తి గూపెట్టుచో
కరసావేశము గారిజుండు భువిలో ♦ గంగోక్తివర్ణించు నీ
సరసంబౌ దశకం బొసంగు హరిమో ♦ క్షస్థాన మేపారగన్.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతేరామానుజాయనమః.

## నవమ శతకము – పదియవ దశకము.

[మాలైనణ్ణి.]

అవతారిక :— ఈయాళ్వార్లు అరుక్కుంవినైయిలో సర్వేశ్వరుని లభింపవలెనని మనోరథము గలిగియుండిరి. తాము మనోరథించినట్లు సిద్ధింపకపోవుటచే "మల్లిగైకమళ్లులో" తమరుపొందిన క్లేశమును జెప్పిరి. అది రాత్రివ్యసనమై బాధపడ్డరీతి. ఇట్లు మనోరథించి లభింపకపోవుటచే బాధపడుచుండు వీరియొక్క యవసాదము ననుసంధించి ఈశ్వరుడు, "ఇట్లపేక్షించు వారును, అయపేక్షితము సిద్ధింపకపోవుటచే గ్లేశము నొందువారును మీరా ? మిమ్ములను బొందవలయునని మనోరథించినవాడను నేను కానా ? మీరు నాకు దొరకనపుడు క్లేశము నొందినవాడను నేను కానా ? మీకొక కొఱత యున్నదా ? శ్రీవైకుంఠమును విడిచి నేను తిరుక్కణ్ణపురమందు విచ్చేసియున్నది మీకొఱకు గాదా ? మీశరీరావసానకాలమందు మీకోరికను తీర్చెదము" అని ఈశ్వరుడు సమాధానము చెప్పగా సమాహితచిత్తులై సంతసిల్లిరి. ఇట్లుసంతసిల్లి సర్వసమాశ్రయణీయుడై తిరుక్కణ్ణపురమందువిచ్చేసియున్న యాసర్వేశ్వరు నాశ్రయింపుడు. ఆశ్రయించి వానిపాదములయందు భక్తి సల్పుడు. అందుకుదగిన యధ్యవసాయము మీకు లేనియడల నుక్తిమాత్రమైన చాలును. ఆమాత్రముచేతనే మిమ్ములనాతడు వదలడు. కావున మీరందరాతని నాశ్రయింపుడని పరోపదేశమందు బ్రవర్తించుచున్నారు. మూర్ఛగతులై పడియున్నప్పుడు తప్ప తెలివిగానున్న సమయమందు పరుల నుపదేశింపక యుండజాలరు.

"శరీరావసానమందు మీయపేక్షితమును నెరవేర్చెదము." అని యీశ్వరుడు చెప్పుటయు అది విని వీరుసంతసిల్లుటయు సందర్భింపదు. ఏలయనగా మోక్షము ప్రారబ్ధకర్మావసానమందు సిద్ధించునని వేదాంతశాస్త్రసంప్రదాయము. యీయాళ్వారీతిరువాయిమొళ్లియందు భక్తినిజేయుడు అందుకు సామర్థ్యము లేనివారు ప్రపత్తినిజేయుడని చెప్పుచున్నారు. వేదాంతము లుపాసకుడైన అధికారిని పట్టి చెప్పుచున్నవి. ఇచ్చట ప్రపన్నునిగురించి చెప్పుచున్నది. "తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యే" అను వాక్యముగదా యీయర్థమును చెప్పుచున్నది. ఈవాక్యము శరీరావసానమునుబట్టి చెప్పుచున్నదా లేక కర్మావసానమును బట్టి చెప్పుచున్నదా అని పమశించి కర్మావసానమునుబట్టి చెప్పుచున్నదని సిద్ధాంతీకరింపలేదా దానితో విరోధించదా అంటే ; న్యాయానుగృహీతమైన వాక్యమే అర్థప్రత్యాయక మగుచున్నది. ఉపాసకునికీ దా నవలంబించినయుపాయము

పక్వమై ఫలింపవలసియుండుటచే గర్మావసానమువరకు న్యాయము నడచును. ఈ ప్రపన్నుఁడు మొదటినుండియు "నాసర్వభారములకు నీవే సమర్థుఁడవు" అని సర్వేశ్వరునిపట్లను భరన్యాసము చేసినవాఁడు. వీఁడుచేయవలసిన దొకటియుండి యది పక్వముకాగా లభింపవలెనను నొక విలంబహేతువు లేదు. వీఁడు భరన్యాసము చేసిన ఈశ్వరుని కీశక్తియుండుటచే విలంబము కాలేదు. కాగా నిట్లు న్యాయములు కనపరుపగా శరీరావసానమందు పురుషార్థసిద్ధికి ప్రతిబంధకము లేదు. గరుడపురాణస్థశ్రీరంగమహాత్మ్యమందు శ్వేతతీర్థప్రశంసలో మాధవి యను నొక స్త్రీ విషయమై యిట్లుచెప్పఁబడినది. "అథ యోషిద్వరా కాచి న్మాధవీతి చ విశ్రుతా। విదుషీ సర్వధర్మాణాం సర్వకామ వివర్జితా। తప శ్చచార బహుళం తస్మిన్ తీర్థవరే శుభే। అనాహారా జితక్రోధా సదాచైవాంభసి స్థితా।" అని యారంభించి మూడధ్యాయములచే మాధవీవైభవమును సవిస్తరముగా బ్రతిపాదించి తృతీయాధ్యాయాంతరమందు "అథాత్ర మాధవీ సాపి తపస్తప్త్వా సుదుశ్చరమ్। భగవన్తం ప్రపన్నా సా భగవంతమవాపసా" అని యీమాధవి భగవత్ప్రపత్తి చేసిన వెంటనే భగవత్ప్రాప్తినిపొందెనని చెప్పఁబడియున్నది. నరకయాతనల నొందుచున్నవారు భగవన్నామశ్రవణసమనంతరమందు ముక్తులయిరని చెప్పఁబడినది. "జన్మ కర్మ చ మేదివ్య మేవంయోవేత్తి తత్త్వతః। త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోర్జున" అని యవతారరహస్యజ్ఞానముగలవాఁడు శరీరావసానమందు ముక్తిని లభించునని భగవద్గీతలలో వర్ణింపఁబడినది. అందువలన భగవత్ప్రపత్తి చేసినవెంటనే భగవత్ప్రాప్తి కలుగవలదా? ఈవిరోధిని నిరసించి నీపాదముల నాకొసంగుమనిగదా యీప్రపన్నుఁడపేక్షించునది. వీనికనభిమతమైన శరీరముతో నుండుట కర్మశేషముచేతనా, లేక ఈశ్వరుఁ డుంచగానున్నాఁడా అని విమర్శింపగా నీశ్వరుఁడే యుంచినాఁడని చెప్పినచో వానిని గొన్నిదోషములు ప్రసంగించును. ఇంతియకాక మీవిరోధులను ఖండించి మిమ్ములను మోక్షస్థానమునకు గొనిపోయెదనని వాఁడుచెప్పినమాటతో కూడ విరోధించును. కావున కర్మవశ్యులతో దుల్యముగా నీప్రపన్నుఁడు సుఖదుఃఖముల ననుభవించుచుండుటచే గర్మముచేతనే వీనిదేహము నిలువఁబడియున్నదని చెప్పవలెను. ఇతనుకర్మయే ప్రధానమైనచో బ్రారబ్ధకర్మావసానమువరకు వెళ్లుటకు బ్రతిబంధకమేమి యనగా నధికారవిశేషముచే దాని యపేక్ష లేదు.

ఈచేతనుఁడు ప్రపత్తిచేసినవెంటనే ముక్తిని పొందినయెడల విషహ్రదమునకువలె నీప్రపత్తికిబ్రతిచేతనుఁడుభయపడిభగవద్దాస్యమందు బ్రవేశింపఁడు. ఈశ్వరుఁడు భీష్ముని యీలోకమందు గొన్నాళ్లుంచి యాతనిచే జ్ఞానమును బ్రకాశింపజేయించి

నట్లీ చేతనునిగూడ నిచట గొన్నాళ్లుంచి కొందరి కుపదేశముచేయుంచియు మఱికొందరి వృత్తమును దిద్దించియు వీనిచే మంచిపనులను చేయించుట కుపయోగించువానినిగా జేయును. ఇది నేను వీనికిచ్చిన చరమశరీరమేని యుపేక్షింపఁజాలడు. ఇందుకు "సర్వాంచ యోగ స్సర్వదే బ్రహ్మ స్తైవః। రమతే తస్మిన్నుత జీర్ణే శయానే। నైనం జహా త్యహాన్సుపూర్వ్యేషు (యు–వే–అరుణం ప్ర–3 అను 14 బుక్ 4) ఈచేతనుఁడు ప్రపత్తిచేయు సమయమందు "విరోధినాశపూర్వకముగా నిప్పుడే నీపాదములను పొందవలెన" ని త్వరపడుటకు వీని కవకాశము లేదు. దీనిని విడువుమనగా శీఘ్రముగా నిష్టపడును. ఇక నొక శరీరమును పరిగ్రహించుటగాని గర్భమందు నివసించుటగాని మానివేయవలెను. అందుచేత తత్క్రతున్యాయముగా వీనికి పురుషార్థములభించును. వీనితలంపును బట్టి వీడిందులో చాపలము చేసినయెడల నీశ్వరుడు నాలుగుదినము లిచ్చటనుంచును.

ఇచ్చటనుండు దినములలో నాధివ్యాధిపీడ లేకుండ నితరులకంటె వీనినిసుఖతరముగా జీవించువానినిగా నెందుకు జేయఁడు. లోకులతో సమానముగా గలిగినలాభమునకు సంతోషించువానిగాను నష్టమునకు దుఃఖము పొందువానిగాను చేయుటయేమి ? అంటే ఈచేతనుఁడు విరోధులను పోగొట్టి నీప్రాప్తి నాకు గలుగజేయవలెను అని యపేక్షించును. ఈసంసారము క్షుద్రమైనదని తెలిసియున్నను విడువలేకుండనుండును. వీని నీశ్వరుఁడిందులో సుఖజీవిగా నొనర్చినయెడల నిదియే సుఖముగానున్నదని కొంతకాల మిందులోనుండుటకు గోరుచుండును. ఈశ్వరుఁడు వీనియిచ్ఛానుసారము జేసినచో యింకమరియొక శరీరమందు గూడ నభిలాషపుట్టవచ్చును. అందుచే వీనిహితమునే చూచునీశ్వరుఁడు వీడున్నట్లే యుండనిమ్మని యుపేక్షించును. అందువలన నిదివరకు బరిచితమైన యీశరీరము తనంతటతాను నశించియింకొక యితరశరీరమందు రుచి పుట్టకమునుపే ఈశ్వరునికి వీనిపని నేర్చుట కవకాశముగానుండును. ఇదివరకు పరిచితమైన శరీరము తనంతటతానే పోవును. పైనవచ్చుశరీరమెట్టిదో తెలియకపోవుటచే దానియందు వీనికి రుచియుండదు. ఈశరీరము క్షుద్రమైనదని యీచేతనునికి దెలియును. వీడు మొదట దీనిని తీసివేయవలయునని ప్రార్థించి యుండుటచే నీశ్వరుఁడు వానికొక యపురుషార్థముచేయువాఁడుగానుండుటకు గూడ నవసరము లేదు. చరమదశయందిచేతనుఁడు కాష్ఠపాషాణసన్నిభుఁడై యుండును. కావున వీఁడు మొదట జెప్పిన మాటను పరిగ్రహించి యీశ్వరుఁడు వీని కార్యమును నెరవేర్చును.

అచిత్కల్పుఁడై యుండువానిపై నేకార్యభారమునుంచను. నేనే యన్నిపనులను జేసికొందును. అని యీశ్వరుఁడు తొల్లిచెప్పియున్నాడు. "స్థితే మనసి

నుస్వస్థే శరీరేసతి యోనరః। ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపంచ మామజం। తత స్తం మ్రియమాణంతు కాష్ఠపాషాణసన్నిభమ్। అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్ ” అను నీశ్లోకద్వయ ముదయవరులను సర్వస్వామై యుం డెనని వాడుక. (స్థితేమనసి) = నిలిచినరీతిగా నిలువనిమనస్సు నొకచోట స్థిరపర్చి స్వేచ్ఛాసంచారము చేయుచు దిరుగు పశువువలె నొకచోట నొకక్షణమైనను నిలువని మనస్సుగలవాడొకదానియందు బ్రవర్తింపనేరడు. పురుషార్థ మును లభించునపుడు స్థిరమైన మనస్సుతోగదా ప్రవర్తింపవలెను. లోకు లూర్వశిసాలోక్యమునకు సాధనానుష్ఠాన మొనర్చువార్త యుండగా నామె స్వయముగా వచ్చి స్వాభిప్రాయమును దెలియజేయగా నీవు నాకు తల్లివిగానా యని నమస్కరించి దూరముగా బోయిన పరమవిరక్తుడైన అర్జునుడే “ తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ”(వాయువును మూటగట్టుటవలె మనస్సును నిగ్రహించుట మిక్కిలి దుష్కరమని పలికెను. సుస్వస్థేశరీరే = (పరిణామిద్రవ్యమైన శరీర మొకస్థితిలోనిలువగా- ధాతుసామ్యేస్థితే = దానికుపయోగముగా వాతపైత్యశ్లేష్మములు మూడును సామ్యావస్థలో నుండగా నెవడు నన్నుస్మరించునో, ఈశరీరమచిత్తు. దేహాదులకంటె విలక్షణమైన యాత్మయొకటి కలదు. అది యీశ్వరునికి శేషభూతమైనది. తత్ప్రాప్తియే యీయాత్మకు మోక్షము. అని స్మరించువాడు(విశ్వరూపంచ మామ్)గర్భసంబంధముచే నొకని కాలిలో ముల్లునాటినయెడల నావ్యసనము తనదిగా భావించునట్లు స్వసృష్టములకు గలిగినబాధ తనదిగా దలంచునట్లు సకలచరాచరమును శరీరముగాగల నన్ను (అజమ్)స్వసృష్టమైన వస్తువులవలె జన్మనిబంధమైన కాలుష్యము లేకుండ నున్ననన్ను (తత స్తంమ్రియమాణంతు( దృణముగా దిరుగుచున్నసమయమందితలంపు పీడకుండును. అచిత్కల్పుడై పడియున్నపు డీతలంపుండదని గణింపకనే నేవానినెల్లపుడు స్మృతిలో నుంచుకొందును. (మద్భక్తమ్)రక్షించెదనని ప్రతిజ్ఞతో బరిగ్రహించి విడిచిపెట్టువానినా వాడు పట్టినవాడు. చిరకాలము కానుకలు పుచ్చుకొని కార్యకాలమురాగా కానుక నియ్యని దినములను లెక్కపెట్టి విడిచిపెట్టువానినా పీడు పట్టుకొన్నది. (నయామిపరమాంగతిం) కళ్ళన్గొల్లిపిగాట్టిని మునుఁగువేసి తీసికొనిపోయినట్లు తానేచేయిపట్టుకొని తీసికొనిపోవును. ఆతివాహికులద్వారా గాని పెరియతిరువడిద్వారాగాని తీసుకొనివెళ్లుటగాక ఆతివాహికులలో ప్రధానుడైనతానే స్వయముగా తనస్థానమునకు గొనిపోవును. ఈతిరువాయిమొళిలో “శరణమాగుంతనతాళ్ డైందార్కెల్లామ్ ” అనునది (ఉయిర్పాట్టు.)

## 1. మాలై సణ్ణే

శ్లో. అంభోరాశిమహోర్మిధౌతవిపులప్రాకార సంవేష్టిత
శ్రీమత్కృష్ణపురీనివాసనిరతస్యా జ్ఞాగుణాంఘ్రి ద్వయమ్,

ప్రత్యాసాద్య దివానిశం నిరుపమాం భక్తిం వహంతో దళ
త్పంకేజాదిసుమైస్సమర్చ్యవిధివత్క్లేశాం స్తరేయు ర్దురితమ్.

ఉ. శీతలవార్ధివీచితతి ♦ సేవితమై వరణావృతంబునై
గీతయశస్కమై వెలయు ♦ కృష్ణపురంబున నున్నవాలభూ
జాతపలాశశాయిపద ♦ సారసయుగ్మ మహర్నిశంబు కం
జాతసుమాళి పూజలను ♦ సల్పి తరించుఁడు మీర లందరున్.

2. క ళ్ల వి ఘ్రుం మ ల రి ట్టు.

శ్లో. భక్త్యా గళన్మధుసుమై ర్వరివస్యనంత
త్వాదే విధాయ భవ ముత్తరితుం యతధ్వమ్,
సంవేష్టితాం రజతసాలగభీరఖేయా
చక్రేణ తాం ఝడితి కృష్ణపురీ ముపాధ్వమ్.

శా. ప్రాకారావృతమై గభీరపరిఘా ♦ పాథోధిసంవీతమై
నాకౌకస్స్తుతమైన కృష్ణపురము ♦ న్నానాప్రసూనాళితో
వీక న్పూజలసల్పి సంసృతిభవో ♦ ద్వేగంబు శాంతింపగా
నేకాలంబు భజింపుడీ నరులు మీ ♦ కిద్దాన మోక్షంబగున్.

3. తో ణ్డా ర్ న స్థ మ్.

శ్లో. సారామకృష్ణనగరీశ్రిత మబ్జనాథం
బ్రహ్మాండపాలనకళాచతురం రమేశమ్,
సద్యోవికస్వరసుమైః ప్రవిధాయ పూజాం
పాపా న్యపోహితు మలం శ్రయతా దిదేవమ్.

మ. భ్రమరౌఘధ్వనిఘుష్టపుష్పవనికా ♦ ప్రాగ్భారసంశోభియై
కమలాధామము నైన కృష్ణపురి భ ♦ క్తవ్రాతసంసేవ్యుఁడై
యమరాళీనుతిపాత్రుఁడై వెలుఁగు బ్ర ♦ హ్మాండాధినేతన్ హరిన్
సుమము ల్బెట్టి సపర్య సల్ప దురిత ♦ స్తోమంబు శాంతించెడున్.

4. మా నే య్ నో క్కు.

శ్లో. నీళాసఖం నిఖిలజీవనికాయనాథ
మభ్యర్చ్య పుష్పనిచయై రనిశం స్తువీత,

ఉత్తుంగవప్రపరివేష్టితకృష్ణపుర్యా
మాసక్త ఏవ మురజిచ్ఛరణం భవేద్వః.

మ. హరిణాక్షీమణియైన నీళ కతిప్రా • ద్యప్రియుండైన శ్రీ
హరికి న్వాదనిప్రావులుంచి సతతం • బారాధన ల్సల్పుడీ
మరుదధ్వప్రవిచుంబిసాలవిలస • న్మాణిక్యహర్మ్యావళిబం
ధుర శ్రీకృష్ణపురి న్వెలుంగుహరి మీ•తోడై సదా బ్రోచెడున్.

5. శరణాగుస్.

శ్లో. త్రాతా నిజాంఘ్రికమలాశ్రయనిర్భరాణాం
దాతాఽపవర్గవిభవస్య తదంతకాలే,
దుర్గేద్యవప్రయుతకృష్ణపురీ ముపేత
స్త్రాతుం భువం స్వరతి షూద్వహతేఽనురాగమ్,

చ. తనపదపంకజద్వయము • దప్పక కోరిభజించువారిఁ జే
కొని సతతంబు బ్రోచు మృతి•కూడినవేళను మోక్షమిచ్చెడున్
ఘనవరణా వృతంబగుచు • గ్రాలెడుకృష్ణపురి న్వసించువాఁ
డనయము భక్తపాళియెడ • నత్యధికప్రియుఁడై చరించెడున్.

6. అన్నాగుస్.

శ్లో. వాత్సల్య ముద్వహతి భక్తజనేషు చాత్రా
తీక్ష్ణాగ్రపాణిరుహకృత్తసురారివక్షాః,
ప్రాకారసాష్టవవిరాజితకృష్ణపుర్యాం
బద్ధాదరో నిజపదప్రవణేషు సత్యః.

తే. గీ. హేమకశిపుని జీరిన • కామజనకుఁ
డాశ్రితులకెల్ల బ్రీతుఁడై • యలరుచుండు
స్వర్ణవరణావృతంబౌచు • వన్నెకెక్కు
కృష్ణపురవాసి శ్రితులను • కృపనుజూచు.

7. నుయ్యాగుమ్.

శ్లో. యే నన్యా స్సముపాసతే తమనిశం తైరేవలభ్యో భవే
ద్యేత్వన్యప్రవణా భజంతి నహితే ద్రష్టుం లభంతే హరిం,

మతోస్యల్లోడనజాతబుద్బుదరవాశాంతాంబుశాలేయసం
రాజత్కృష్ణపురీపతి స్సులభఏవా త్మ న్యనుధ్యాయతాం.

తే. గీ. కృతిములకెల్ల దానగు • గృతిముండు
సత్యభక్తుల కెప్పుడు • సత్యుఁడగును
కృష్ణపురమున వసియించు • కేశవుండు
సులభుఁడై యుండు నిజపూజ • కులకు సగము.

8. అ ణి య నా గు మ్.

శ్లో. స్వాంఘ్రిశ్రితాఖిలజనస్య వంశవదోసా
జన్మాటవీం ద్యతి నిహాం త్యఖిలలోపతాపాన్
స్వర్ణప్రదీప్రవరణావృతకృష్ణపుర్యాం
వాస్తవ్యతా ముపయాతి శ్చరణం శ్రయధ్వమ్.

తే. గీ. సులభుఁ డాత్మాంఘ్రిసంశ్రిత • సూరిజనుల
కాధిజనిమృత్యువునడంచు • నధికకృపను
స్వర్ణవరణావృతింబయి • వన్నెకెక్క
కృష్ణపురముననున్న శ్రీ • కృష్ణపాద
కమలమును గొల్చి ధన్యత • గనుఁడు మీరు.

9. పా ద నా ఘు ం ప ణి య.

శ్లో. పూర్వోత్తగాఘవితతి ర్విలయాం ప్రయాతి
నిత్యం తదంఘ్రియుగళే సముపాస్యమానే,
సద్వైదికప్రచురకృష్ణపురీశ్రితం తం
సర్వాది మాశ్రితవతాం నహి శోకమోహతా.

తే. గీ. అతనిపాదంబుననుదిన • మాశ్రయింప
గూలు పాపాద్రులిఁక నాకు • గొరతలేదు
కృతమతులు వాసమొనరించు • కృష్ణపురిని
సర్వకారణు నుతియింప • సమయు వెతలు.

## 10. ఇ ల్లై య ల్ల ల్.

శ్లో. లక్ష్మీసఖాద్భుతమహాబ్జ్వలవాసభూమేః
పాషాణవప్రపరివేష్టితకృష్ణపుర్యాః.
నామ్ని స్మృతే సవిధమేతి న మే ఒపి శోకః
కింహీయతే మమ ముకుందకటాక్షలేశాత్.

తే. గీ. లక్ష్మినివసించువక్షస్స ♦ లంబువాఁడు
పరగ వసియించు శ్రీకృష్ణ ♦ పురవరంబు
సంస్మరింపఁగ దుఃఖము ♦ ల్సవిధమునకు
జేరవిక నాకు గొరఁతేమి ♦ చెప్పవలెను.

## 11. పా దు కా రా వి న్నై.

శ్లో. పాపాని వారయితు మిచ్ఛతచే త్సగీతే
కార్యాత్మజగ్రథితపద్యసహస్రకే ఒస్మిన్,
గీత్వా నరాదశక మేత దభీష్టవంత
శ్శ్రీశం ప్రపద్య భవభీతి మపాకురుధ్వమ్.

తే. గీ. పాపములపాపుకొొన మీాకు ♦ భావమేని
కురుకనేలెదు శఠకోప ♦ గురునివేయి
పద్యములలోన నీపది ♦ పద్యములను
భక్తిజదువుచు శ్రీపతి ♦ పదము గనుఁడు.

శ్రీ మ తే శ ఠ కో పా య న మః.

నవమశతకము సమాప్తము.

---

శ్రీశఠకోపాయనమః.

శ్రీమతేరామానుజాయనమః.

# ఆంధ్రగీర్వాణ శఠకోపసహస్రము.

## —• ద శ మ శ త క ము. •—

### మొదటి దశకము.

[తాళతామరై.]

అవతారిక :— ఈయాళ్వార్లు దిగువను "నాళేలఱియేన్ ఱొనక్కుళ్లన" (నాకున్న దినముల నెఱుంగను. అనగా నాకిక నాయుష్యమెంతయున్నదో నేనెఱుంగను) అని పాడించియున్నారు. "ఈశ్వరుఁడయితే "మరణమానాల్" వీరు పరమపదించినయెడల వీరికిపరమపదము సాధించెదనని నిశ్చయించుకొని యున్నాడు. ఈశ్వరుఁడు "చేసెదను" అని తలనూపినచో నాకార్యము తప్పక సిద్ధించును. అందుచే నాళ్వార్లు స్వయముగా పోవుట కుద్యోగించిరి. పోవునపుడు చిరకాలము భోగాయతనమై యున్న యీశరీరమును విడువశక్యముగాని సంబంధముగల బంధువులను విడిచిపోవుటకు నిశ్చయించిరి. పోవలసిన ప్రదేశము మునుపు తామెన్నఁడె ఱఁగినది కాదు. ప్రతిబంధకము లనేకములు. అవిద్యాకర్మవాసనా రుచులను వాని కవధియే లేదు. వీనినన్నిఁటి నడఁచి మార్గమందు తోడుగా దీసికొని పోవుటకీశ్వరుఁడపేక్షితుఁడు. అదియేమి? తనకే తాను సహాయుఁడు కాఁకూడదా? ఇంతవరకు రాగా సంసరించుటకు కార్యమును చూచినవా డితడే. ఈశరీరముతో నున్న రోజులలో హితచింత చేసినవాఁడైనను యితనిపూర్వవృత్తము చూచినయెడల నితఁడుతనకు దానే సహాయుఁడు కానేరడు. మార్గమందు తీసికొని పోవునపు డితనికి గలుగువిరోధుల నెఱుంగుటకు సర్వజ్ఞుఁడైయుండవలెను. తెలిసికొన్నయెడ నావిరోధివర్గమును నివారించుటకు సర్వశక్తియై యుండవలెను. "యస్సర్వజ్ఞస్సర్వవిత్" ఇత్యాది ప్రమాణములచే నీశ్వరుఁడేసర్వజ్ఞుఁడు సర్వశక్తియనిచెప్పఁబడుచున్నాడు. శక్తియున్నను ప్రాప్తుఁడుకానిచో ప్రయోజనము లేదు. "మాతాపితాభ్రాతా" ఇత్యాదులచే నీశ్వరుఁడే సర్వవిధబంధువని చెప్పఁబడుచున్నాడు. "ఎమ్మాను మెమ్మనై యుమ్-" అని ప్రమాణము. మొదట రాగాంధులై పిల్లలగని తరువాత యౌవనవిరోధి యని విడిచి వేయుదురు. వీడు పరిచితమైన ముఖముగుటచే "అమ్మా" అను

నపుడు స్త్రీస్వరముతో "ఏమి" అనును. "నాయనా" అనునపుడు "ఏమి" అని పురుషకంఠముతో పలుకును. ఇట్లతఁడు మూఖమును కనపర్చి తీసికొని పోవుటకు సమర్థుఁడై యుండును. శరీరము శిథిలమై ప్రాప్యభూమికి బోయి ప్రవేశించు వరకు వెళ్లగా మధ్యనున్న విరోధులను పోగొట్టి తీసికొనివెళ్లుటకు దగిన యుపాయ మెఱిగినవాఁడీశ్వరుఁడు కావలెను. విరోధులను నివారించి తీసికొనిపోవుటకు సమర్థమైన శక్తిగలవాఁడు కావలెను. తానుతన్నురక్షించుకొనజాలనపుడు వీడుమనకు రక్షకుఁడని వానిచేతిలో దన్నుంచుకొనున ట్లాప్తుడు కావలెను. అతఁడు సర్వజ్ఞుఁడు సర్వశక్తియని శ్రుతిప్రమాణసిద్ధుఁడు—ఈయాళ్వార్లే "తంజమాగియ తందై తాయొడు తానుమాయ్—(3 పది. 6 తి. మొ. 9 పా.)అనుపాశురములో తంజమ్ (రక్షకము) అని సాధించియున్నారు.

ఇతఁడు దయావంతుఁడనునంశము నీయాళ్వార్లు "మయర్వర మతినల మరుళినన్" అనుతమవాక్యముచేతనే వెల్లడించిరి. శేషియగుటచే నితఁడే ప్రాప్తుఁడై యుండును. కాఁగా మన విరోధులను బోనడచి ప్రాప్యభూమివరకు మనల దీసికొని పోవువాఁడు కాలమేఘస్వామియని యధ్యవసించి, సాపాయప్రదేశములయందు తమవద్దనున్న ధనమును బలవంతులైన అంతరంగుల చేతిలో భద్రపర్చి నిరపాయప్రదేశమును చేరఁగా తిరుగవారిచేతిలోనుండి యాధనమును దీసికొను పథికులవలె శరీరవిశ్లేషసమయమందు కాలమేఘస్వామిసన్నిధిలో తమఆత్మను నిక్షేపముచేసి ప్రాప్యభూమియందు ప్రవేశించినతరువాత తిరుగ తీసికొనెదమని తలంచి మార్గసహాయముగా నవలంబించిరి. ఈస్వభావము లోకప్రతీతియైనను లేకపోయినను ఈశ్వరుఁడు ముందునడవఁగా వెనుక నీయాళ్వారు పోవుచు వానిశరీరసౌందర్యము ననుభవించుచు వెళ్లుటయే ప్రయోజన మగునట్లు పోవు ప్రకారముగానుండెను. "వళ్లలే యుందమక్కున్నుం నమస్సర్గళ్ కళ్లర్గళ్" అన్నట్లు శత్రువులు సంకోచించునట్లు గర్వముగల రొుకని నాశ్రయింపవలెను. "పరిహార మధుసూదనప్రపన్నాన్" అనియామునుడుకూడ తన దూతలో చెప్పియుండెను.

ఇందులో కూత్తన్కోవలన్ అనునదిగాని తుయక్కొడుమ్ అనునదిగాని ప్రధానగాథ.

## 1. తాళతామరై.

శ్లో. కేదారపంకజసరఃపరిమండితశ్రీ

మోహూర్ప్వురైకవసతిం దనుజాంతకం తమ్,

బింబోష్ఠ మబ్జదళనేత్ర మరాళకేశం
త్యక్త్వా నవాంబుదనిభం శరణం కిమన్యత్.

చ. కమలతటాకపంకరుహ ♦ గంధవహాళిభృంగసేవ్యమానమై
విమలమహీసురప్రకర ♦ విశ్రుతమైన మొహూర్పురంబునన్
సమదసురారిభంజనుఁడు ♦ సారసనేత్రుఁడు తప్ప వేరుగా
యమభయవారకుం డెవడు యజ్ఞభుగోఘము నందుజూచినన్.

2. ఇ లం గ ది మ త్తొ న్నృ.

శ్లో. నాన్యాగతి ర్భగవతి న స్సతతం తులస్యా
రాజత్స్రజో విమలనామసహస్రిణో ఽస్య,
విఖ్యాతవైదికనికాయనివాసశుంభ
న్మోహూర్పురాధివసతే శ్శరణం విహాయ.

మ. తులసీమాల్యవిభూషితుండు శ్రితదు ♦ ర్దోషాళినాశైకని
ర్మలనాముండు సురారిభంజనుఁడు వి ♦ ప్రవ్రాతముల్ జేరి ని
శ్చలులై యుండు మొహూర్పురంబునసదా ♦ సక్తిం భజించిభూ
స్థలి లేడెవ్వఁడు రక్షకుండుమనకున్ ♦ సర్వామరశ్రేణిలోన్.

3. అ న్ని యా మొ రు పు గ లి డ మ్.

శ్లో. త్వత్పాదాబ్జయుగం వినాస్తి శరణం నాన్య ద్రమేశేతి తే
దేవాః కంజభవామరేంద్రశశభృత్ఫాలలలాటాదయః
మూర్ధ్నా యం ప్రణమంతి సర్వజగతీరక్షామణిం తస్య త
న్మోహూరాఖ్యపురీ మనన్యమనసో దుఃఖచ్ఛిదం ప్రాప్నుమః.

మ. నిను వర్జించిన రక్షకుండెవడగు ♦ న్నీరేజపత్రేక్షణా
యనిబ్రహ్మాదిసురాళి మొక్కులిడి తా ♦ మత్యంతభక్త్యాత్ము లై
వ్వని జింతింతు రజస్ర మట్టివిలస ♦ త్పంకేజనేత్రుండు ప్రీ
తిని నిత్యంబు వసించుమోహురుమన ♦ స్తీవార్తి ఖండించెడున్.

4. ఇ డ ర్కె డ.

శ్లో. నిష్కాస్యాఖిలదుఃఖ మేహిభగవ న్నఃపాలయే త్యుజ్జ్వల
జ్యోతీరూప ముపాసతే సురగణా యం మానినో భక్తితః,

తం మోహూర్పురి విస్తృతాయత ఫణీట్పర్యంకనిద్రారతం
స్తోత్రైః ప్రీణయితుం భవోపరతయే భక్తా స్సమాయాంత భోః.

శా. మాదుఃఖంబు నశించునట్లరుగు దె ♦ మ్మా త్రయంచు దేవర్షిణము
న్యాదుల్ప్రార్థనసేయ మోహూరుపురం ♦ బందున్ ప్రభాశాలియై
మోదంబొప్ప వసించు నాగశయనున్ ♦ భూకాంతరాత్మున్ హరిన్
వేదైకప్రతిపాద్యు గొల్వ దురితో ♦ ద్వేగంబు శాంతించెడున్.

5. తొండీర్యమ్మన్.

శ్లో. త్రేధాయః కారణత్వంభజతిహి జగతాంయస్తువిక్రాంతలోకో
విష్వక్లేక్షేవభాస్వత్తనురుచికలితః పీతకౌశేయవాసాః,
యస్యైక్యచ్ఛాయగోహత్కలనుచయలసద్వ్రజసంవర్ష్మితాయాం
మోహూర్ప్యాంనగారంనుతిశశిముఖరాస్సంప్రణీయున్నృత్తమ్.

శా. జ్యోతిఃపుంజమయోరు దేహుఁడు శుచి ♦ శ్లోకుండు క్రాంతాంబుజో
ద్భూతాండుండు వసించు నిక్కువని కా ♦ పూర్ణంబు మోహూర్పురిన్
జాతప్రీతి భజించి పాడుదము సం ♦ సారోత్థతాపంబు జీ
మూతాసారవినష్టదావముగతిన్ ♦ మూలంబుతో బోయెడున్.

6. కూత్తన్ కోవలన్.

శ్లో. గోపాలో ఘటలాసకః కుపథగక్రవ్యాది భేట్పాకల
స్వాంఘ్రిద్వంద్వపరాయణామరముని వ్రాతస్య నశ్చోత్తహో,
శాలేయాచ్ఛసరఃపరీతసవిధే మోహూర్పురే యస్థిత
స్తస్యాప్తస్య పదాంబుజాన్న శరణం విందేమ కింవాపరమ్.

మ. మదమత్తాసురభూధరౌఘపవి యం ♦ స్మత్స్వేవ్య పాదుండు శా
మదుఁ డంభోజభవాది దేవతలకు ♦ న్మాన్యుండు యోగీంద్రయో
గదశాగమ్యుఁడు శాలిసస్యవిలస ♦ త్క్ష్మాభాగ మోహూర్పురిన్
సదయుండై నివసించు మాధవుఁడె మా ♦ సర్వార్థులన్బాపెడున్.

## 7. మ త్తి ల మ ర ణ్.

శ్లో. సృష్ట్వాగ్రే స్థిరజంగమాత్మక మిదం విశ్వం తతో వేధసం
నాభీపద్మకుటీరధిష్ణ్య మసృజ ద్య స్సర్గకర్మోద్యతః,
య స్తస్మై ప్రజిఘాయ వేదనివహం తస్య స్ఫురద్భాసభూ
ర్మోహార్ణ్యామకపూః ప్రతిక్షణమఘోచ్ఛిత్త్యై పరీయాన్మహః.

చ. తొలి బ్రకృతి న్మహాజలము • తోచగ జేసియు నాభినున్న యా
జలజమునందు పంకరుహ•జాతు సృజించి సుపర్వలోకమున్
గలుగంగ జేసినట్టి హరి • కంసరిపుండు ముదంబుతోడ దా
నిలయము జేసికొన్న పురి•నిష్ట భజింపుడు పాయు బాపముల్.

## 8. తు య ర్కా డు మ్.

శ్లో. అత్యభ్రాదభ్రలీలావనతతిసరసీమండితప్రాంతభూమా
మోహాబ్ధ్యర్వా ముపాత్తావసథముదయం దైత్యతృణ్యాహ
తాశమ్, భక్తౌఘానంతతాపప్రశమనకుశలప్రావృషేణ్యాంబువాహం
క్షిప్రం శ్రీకాశలేయం వ్రజత భజత వో దుఃఖ మేయాత్ప్రశాంతిమ్.

చ. కొలకుల బూవుదోటలను • గూడిన మోహపురున న్వసించు న
య్యలఘు సహస్రనాము • నసురాసుమరుద్గ్రసనాహినాధునిన్
జలజదళాక్షు దాశరధి • సామజరక్షకు నాశ్రయింప ని
శ్చలమతి రండు భక్తు లఘు•సంఘమునాశనమొందు జయ్యనన్.

## 9. మ ణి త్త డ త్తు.

శ్లో. యోగిధ్యేయపదాబ్జ మబ్జనయనం బింబాధరాలంకృతం
వృత్తాయామసుహేతిభూషితచతుర్బాహుం రమాలింగితం,
దైత్యానీకవిదారణైకచతురం దివ్యం మహాదృశ్యతే
యస్యాం తాంభవవాగణౌషధిమిహ ప్రాప్తాస్స్మ మోహాపురీమ్.

తే. గీ. రక్తనేత్రాంఘ్రియుగ్మంబు • రక్తముఖుఁడు
విద్రుమాధరసంశోభి • విమలయశుఁడు
రమ్యబాహుచతుష్టయ • రాజితుండు
నిరతము వసించు మోహనూరు • పురము గనక
రక్షకము దాని జేరంగ • రండుమీరు.

## 10. నామమైందనల్లరణ్.

శ్లో. సాధిష్టం శరణం భవేదయమితి ప్రాగ్దానవౌఘాత్పురం
భీతోజ్ఞాసితధర్షితైస్సురగణైస్సంప్రార్థ్య యా శ్శ్రీశ్రియే,
సోఽసౌ యత్ర రమాపతి ధృతవరారోహాకృతి స్తానపా
త్తస్యాన్నామ జపంతు మామకజనా మోహనూరుపుర్యాస్సదా.

చ. మనకగు రక్షకుండని యు • మర్త్యులు పోయి ప్రపత్తిఁ జేయఁగా
దనుజుల గీటడంచి నిబు • ధవ్రజ మత్తరి బ్రోచినట్టి యా
వనజదళాక్షుఁ డెప్పుడును • వాసము సేయు మొహనూర్పురంబు నా
మనివహ మాత్మ నిత్యమును • మానక సంస్మరియింపమేలగున్.

## 11. ఏత్తుమిన్నమగ్గాళ్.

శ్లో. మత్వా దేవం స్తుతీతే త్యసకృదుపదిశన్ శ్రీశఠారి స్సహస్రం
యత్పద్యానాం ప్రణీయ ప్రకటయతినిజాం వాసుదేవానుభూతిం,
తత్రైత్ర శ్లోకపంచద్వికమమలపదం తేన మోహనూర్పురీశే
దత్తం యే త్వామనంతిప్రవజతిహి విలయందుఃఖపూగశ్చతేషామ్.

ఉ. బంధువులార మీరతుల • భక్తి నుతింపుడటంచు భక్తస
ద్బంధువు శ్రీశఠారి హరి • పైని రచించిన వేయిగాధలన్
బంధుర పాపము ల్దొలుచు • పాటలు మోహనగుబద్ధము ల్సదా
బంధుల గూడి బాడ మన • పాపములన్ని నశించు మేదినిన్.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతేరామానుజాయనమః.

## దశమ శతకము - రెండవ దశకము.

[కెడుమిడ రాయవెల్లామ్.]

అవతారిక :— "ఒరువల్లుత్త మెనక్కుయిరా య్వాళుల్" (10 పది. 10 తిరుమొళ్ళి) అను తిరుమొళ్ళిలో ననేకదివ్యదేశముల నొక్కపర్యాయము సాధించుట కభిప్రాయమేమని నంజీయరు భట్టరువారి నడుగగా బుట్టింటినుండి యత్తవారింటికి కాపురమునకుఁబోవు నాడుపిల్లలు మేనత్తవారింటికి బోయివచ్చెదనని ప్రతి బంధుగృహమునకుఁబోయి చెప్పివచ్చినట్లే యాళ్వార్లును ప్రాప్యభూమి సన్నిహితము కాగా ప్రతిదివ్యదేశమందు ప్రవేశించుచున్నారు." అని సాధించివారట.

ఆకీతిగా నీయాళ్వార్లును (నమ్మాళ్వార్లు) తిరుప్పులింగుడి, తిరుక్కాట్కరై, తిరుమూళిక్కళమ్, తిరునావాయ్, తిరుకణ్ణపురమ్, తిరుమోగూరు, తిరువనందపురము మొదలగు దివ్యదేశములందు ప్రవేశించుచున్నారు. ప్రాప్యభూమికి వెళ్లుటకుద్యోగించి మధ్యనున్న ప్రతిబంధకములను బోగొట్టి మార్గమందు దీసికొని పోవుటకు కాలమేఘస్వామిని తోడుగా బట్టుకొనిరని కిందఁ జెప్పఁబడినది. "తాళ్దైందోర్ తంగళుక్కు త్తానే వత్తిత్తుణైయామ్ కాళమేగత్తై గతియాక్కి మీళుదలాం (తిరు. నూత్తం 9.)

మనకిచ్చటనే తిరువనందపురము ప్రాప్యమైయుండగా నంతవరకు మనము పోవలెనా? యని తిరువనందపురము ప్రాప్యమని నిశ్చయించి యాదివ్యదేశము— "పేరుమి న్నూళమిన్ని పెరియ నీర్పళై శూళ్దందునాళమే కమళుం శోలై వయలణియనందపురమ్" అను పాశురమునఁ గీర్తింపఁబడిన గామణీయకము గలదైయై సర్వేశ్వరునికిఁ గూడ సాదరవిషయమై నివసింపదగిన నిరతిశయభోగ్యత్వము కలదియగుటచేతను జగన్నివాసుఁడగువాఁడు వచ్చి వర్తించుటచే సంసారదురితగంధమంటని ప్రదేశమగుటచేతను శరీరవిగమానంతరము ప్రాకృతదివ్యదేశమునకుఁ బోయి చేయవలసిన కైంకర్యము రుచిపుట్టినప్పుడే యిచ్చటనే చేయదగిన స్థలమై యుండుటచేతను "అమరరాయ్ త్తిరిగిన్ఱార్గళుక్కు ఆదిశేర నంత్తపురత్తు అమరర్కోన్ అర్చిక్కిన్ఱాన్" (6-2-10) అన్నట్లు నిత్యసూరులుకూడ విచ్చేసి సర్వేశ్వరునికి సకలవిధకైంకర్యముల నొనర్చు ప్రదేశమగుటచేతను "కళిప్పుం కవర్వుం మత్తు (10-3-2) నిత్యాభివాంఛితపరస్పరనీచభావై ర్మద్దైవతైరపి జనై స్సహ సంగసీయ," "వియన్మూవులగుం పెరినుం పోయ్ తానే తానే యానాలుం" అన్నట్లు భాగవతులతో గూడ వచ్చుననియు, వీరియభిప్రాయము.

ఇంతియకాక ఈ తిరువనందపురము దివ్యదేశములన్నిటికంటె నధికతరమైన భగవద్విషయరుచిని బుట్టించునదియై రుచిపుట్టిన పిదప "యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్" అన్నట్లు సౌలభ్యమున కెల్లరైయుండుట చేత నుపాయభావము పూర్ణమై ప్రాప్యభూమికి గొనిపోవునపు డాతివాహికగణమందు బ్రధానుండైనతానే "తదోకోఽగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో విద్యాసామర్థ్యాత్తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ హార్దానుగృహీతః శతాధికయా" అన్నట్లు మార్గమందున్న ప్రతిబంధకములను బోనడచి తీసికొనిపోవుటను మొదటివాఁడు కావడమున నుపయోగించునదియై సంసారబంధము పోయి యూపైకి వెళ్లి చేయవలసిన కైంకర్యమును విరోధియున్నను కాదాచిత్కముగా జేయుట కవకాశమిచ్చునదియై యుండును. కావున రుచిని బుట్టించుట కుపయోగమైనదియై, రుచి పుట్టగానే ఉపాయము కావడమున కుపయోగమై జ్ఞానభక్తివర్ధకమై విరోధియున్నను దాస్యము చేయుట కుపయోగించునదియు నగుటచే తిరువనందపురమే పరమప్రాప్యమని నిశ్చయించి మాతో సంబంధముగల యనుకూలులందరు నచటికి గుంపుగూడి పొండని యుపదేశింపుచున్నారు. "తీవినై యుళ్ళత్తిన్ శార్వల్లవాగి ఏఱుం బేఱు ఉత్తాల్ నావినుళ్ళు ముళ్ళత్తుళ్ళు మమైంద తొళ్ళిపినుళ్ళు నపిన్ను యూవరుం వందు వణంగుం పొళ్ళిల్ తిరువారన్విలై యదనై మేవి వలంశెయ్యదు కైతొళ్ళ కూడుం గొలెన్ను మెన్శిందనైయే" అని యాళ్వార్లనుసంధించియున్నారే? కాని అన్ని దివ్యదేశములకు సన్నియోగ్యతలున్న నొక్కొకదివ్యదేశము విషయమై యొక్కొక రీతిగా ననుసంధానవిశేషముండును. దానికి దగినట్లు సమర్థింపవలెను.

ఇందులో "కడుపనైకళైయలాగుమ్" అనునది (ఉయిర్పాట్టు.)

## 1. కెడుమిడరాయవెలాం.

శ్లో. క్లేశో నాశముపైతి కేశవ ఇతి ప్రోచ్చార్యమాణే పదే
హింస్రా యామ్యభటోత్కరోఽపి సవిధం నాయాతు మీష్టే చనః,
వక్త్రోద్వాంతవిషాగ్నిదగ్ధదనుజవ్యాళేంద్రశయ్యాజుషః
కేదారాంచితభూమ్యనంతనగరీం గత్వా విశంతు ద్రుతమ్.

ఉ. కేశవయన్ననామమును ♦ గీర్తనజేసిన దుఃఖమంతయున్
నాశము నొందు యామ్యభట ♦ నాయకులుం దరిజేరలేరు నా
గేశశయానుఁడాదరము నె ♦ ప్పుడు జూపుననంతపూర్వరం
బాశు ప్రవిష్టులై మది స ♦ మాదరణంబున నాశ్రయింపుడీ.

2. ఇ న్ను పో యి పు రి ది రా గి ఁ.

శ్లో. ఉద్యానశ్రితమాలతీపరిమళప్రాగ్భారసంవాసిత
ప్రోత్తుంగోజ్జ్వలసౌధవీథినిబిడానంతాభిధానే పురే,
వాస్తవ్యస్య యదేకనామకథనం తుల్యం సహస్రేణ త
త్సద్య స్తన్నగరం యది ప్రవిశత శ్రీయా దఘం వః క్షణాత్.

ఉ. ఇప్పుడు బోయి యాపురిని ♦ హెచ్చగు బ్రీతిని జూచివచ్చినన్
గొప్పవి దుఃఖపుంజములు ♦ గూలు నవశ్యము ధాత్రిలోపలన్
విప్పగు సౌధరాజముల ♦ వెంబడి గన్పడు పూవుదోటలన్
యొప్పుననంతపూర్వరము♦నొక్కరహిన్వసియించు మాయిపేర్
చెప్పిన నొక్కదానిఫల ♦ సిద్ధి సహస్రనునామతుల్యమా.

3. ఊ రుం పు ళ్ళొ డి యు మ్.

శ్లో. కల్పాపాయనిగీర్ణవాస్తుజగతి స్సర్పారివాహస్య య
త్ప్రేష్ఠం ధిష్ణ్య మనంతనామకపురం క్షిప్రం ప్రవిష్టాయది,
దుఃఖం నశ్యతి పాపమ స్తమయతే ప్రత్యేత సత్యం బ్రువే
తద్దేవస్య సహస్రనామనిచయే ప్యేకం సముద్ఘుష్యతామ్.

మ. వినతానందనకేతనుండు భువనో ♦ ద్యోగైకపాకీణుడు
దనుజవ్రాతవినాశకుండు హరి ని♦ త్యప్రీతితో నుండు స
ద్వనికాజుష్ట మనంతపూర్వరము మీ♦పాపంబులం దోలి దుః
ఖనికాయంబు నశింపజేయుఁడిది నే♦కాన్క్షంబుగా జెప్పితిన్.

4. పే శు మి స్కా శ మి న్ని.

శ్లో. అంభోగాశిపరీతనిష్కుటలసత్పుష్పౌఘసంవాసితే
శాలిస్తంబకరిత్వశోభితమహాకేదారసంవేష్టితే,
శ్రీత్యా నంతపురే స్థితం మధురిపుం యే పూజయేయు స్సుమై
ర్ధన్యాస్తే కృతపుణ్యపుంజసుపరీపాకోజ్జ్వలాః కీర్తితాః.

చ. జలధిజలావృతంబగుచు ♦ జాలసుగంధముగల్గు పూవుదో
పులనలరా రనంతపురి ♦ బొల్పుగనుండు రమేశుపాదమున్

జలజసుమాదికంబు లిడి • సంతసమందుచు బూజనంబులన్
సలిపి నుతించు భక్తతతి • సల్పెడుపుణ్యము జెప్పశక్యమే.

5. పుణ్డ్రీయంశేయ్యదు.

శ్లో. భక్తిప్రహ్వో విశుద్ధస్స్నపనజలసుమవ్రాతహస్తః పరేశం
సంపూజ్యావర్తయద్వ్యంశుభగుణవసతే స్తస్యనామావళింతామ్,
శుశ్రూషేయ జ్జన్మాంబురాశిర్ద్రుఢ మహామధునా సంగిరే పుష్పవాటీ
సాంద్రానంతాఖ్యపుర్యాశ్రితవిభుపద గాదేవభూయంప్రయాంతి.

చ. మనమున భక్తిగల్గి సుమ • మాలికల న్పరిశుద్ధవారియున్
గొని పచరించి యర్చనల • గోయుని పాడిన వానినామముల్
జనినిధనాది దైవలిని • జానుగనింతును నొక్కి చెప్పెదన్
ఘనమగు పూవుదోటగమి • గ్రాలెడు శ్రీమదనంతపూర్వరం
బున నివసించు జక్రిధరు • బొల్పగు పాదము నాశ్రయించువా
రనుపమనిత్యసూరిజను • లౌచు దివంబున నుందు రెప్పుడున్.

6. అసురరాయ్త్రిరిగిన్నార్గళ్ళు.

శ్లో. క్రాంచారే జనకస్య పాతకనుదో గోవిందనామ్నో హరే
ర్దేవానాం ప్రధమస్య పుష్పవనికా శ్రీమత్యనంతే పురే,
ప్రీత్యా తస్యుప ఆచరత్య పచితిం సేనాధినాథేప రే
దేవాస్తత్ర సహాయకా శ్శ్రీణుతతాంగచ్ఛామమ్మత్రాఃపురీమ్.

చ. హరునకు బంకజాతభవ • హత్యజనించిన ఘోరపాపముల్
గరుణదలిర్ప మాన్పిన ఖ • గప్రజనాథరథుండు బ్రహ్మశం
కరముఖదేవతార్చితుఁడు • కాంతు వసించిన తా వనంతపూ
ర్వరమున సైన్యనాథుఁడు స • పర్యనొనర్చును వాని కెప్డు కిం
కరులు విరించిముఖ్యులట•కల్గునె మాకిటువంటి భాగ్యముల్.

7. తుడైత్తగోవిందనారే.

శ్లో. లోకా న్నామురజంగమ స్థిరతరాన్ సృష్ట్వా పునస్సంహరన్
యః క్రీడత్య హిరాజభోగశయనారూఢః పరేభ్యః పరః,

తస్యా వాస మనంతనామకపురం మత్వోత్సుకోద్వర్తన
ప్రేక్ష్యాంభఃప్లుతవప్రమంతమయతే సంమృజ్య తేచేదఘమ్.

చ. భువనముల న్సురాసురుల • భూతచయంబు సృజించి క్రమ్మరన్
లవనము సేయువాఁ డురము • లక్ష్మికొసంగినవాఁడు ప్రీతితో
బవనభుగీశతల్పమున • బండు ననంతపురంబు వాకిలిన్
శివమగు నూడ్చినన్ భవము • శీఘ్రముగానశియించు జూడుడీ.

8. క డు వి నై క శై య లా గు మ్.

శ్లో. నశ్యేత్సర్వ మఘం నుమేషుజనకో యద్వాసలేయం ముదా
జగ్రాహేతి వదం త్యనంతనగరం నిర్నిదప్రశోభాస్పదం,
భక్త్యోత్ఫుల్లఫణాసహస్రభుజగేట్పర్యంకమస్మా నేమవః
పాదాంభోజ ముపైతు మేత సుదృఢం హేమామకీనా బ్రువే.

ఉ. పాపములెల్ల బాయువడి • బంచకలంబుని గన్నతండ్రి నా
పాపగువాఁ డనంతపుర • వాసియటంచు వచింతు రుర్విలో
నేపున నాగశయ్య బవ • ళించిన వానిపదాబ్జయుగ్మమున్
ఓపిక జూడ బోదమిక • నొక్కపరిం జనుడెండు చెప్పితిన్.

9. నా ము మ క్క రి య చ్చొ న్న.

శ్లో. ప్రత్యాసన్నా మదుక్తా దివసగణమితిః క్షేమదంవో వనాళి
స్సంశ్లిష్టానంతనామప్రవరపుర మిదం మామకా స్తత్రగత్వా,
ఆదాయో ద్గంధిపుష్పాణ్యగరుపరిమళోద్దామధూపం సదీపం
దత్వా శ్రీవామనాంఘ్రిర్వ్రజనతతిరియాన్నాశమభ్యర్చ్య తేచేత్,

ఉ. నేనును మీకు జెప్పిన • యనేహము డగ్గరె చూడుఁడీ యికన్
జానుదలిర్చు పుష్పవన • సాంద్ర మనంతపురంబు భద్రసం
తానము మీకు జేయు సత • తంబు సదీపసుమాళి నించుచున్
బూనిక బూజ సల్పినను • బోవునుమీవృజినంబులెల్లయున్.

10. మా య ం ద రు మ్.

శ్లో. ఏనో నశ్యతిమాధ వేతిగదితే శ్రావ్యస్వరాలంకృత
ప్రాకారాట్టపరీతపుష్పవనికోద్భాసి న్యనంత రేపురే,

నిద్రాళోః ఫణీపుంగవే పదయుగం శ్రీఖండదీపాంబుజై
రభ్యర్చ్య స్తుతిభి గ్గృణంతి భువి యే తేస్యు ర్యశోభాజనమ్.

ఉ. మాధవయన్న మాత్రమున ♦ మాననిపాపములెల్ల మానుమీ
యాధి నశించు హేమమయ♦మైన యనంతపురంబునందు మా
నాధుని పాదపంకజము ♦ నమ్మి ప్రసూనము లేర్చి తెచ్చియా
రాధనసల్పువా రధిక ♦ రాజితకీర్తివహింతు రుర్విలోన్.

11. అందమిల్పుగ ర్.

శ్లో. భక్త్యా నంతపురస్థితం శుభగుణావాసం జగత్కారణం
రమ్యోద్యానపరంపరేద్ధకురుకావాసీ శఠారి స్తువన్,
యజ్జగ్రంథ సహస్ర మత్ర దశకం చైతద్గృణంతో జనాః
ప్రేత్యా ముత్ర సురాంగనాభుజలతా సంశ్లేషభాజో దృతమ్.

మ. కురుకానాథుఁ డనంతపట్టణపతిన్ ♦ ఘుష్టోరుకీర్తిస్ వచ
స్స్ఫురణం బొప్పనుతించి కూర్చిన లస♦త్సూక్తిప్రబంధంబులో
సరసంబీ దశకంబు బాడినవారుల్ ♦ చక్రాంకు ధామంబునన్
సురనారీజనభూషి తాంగులగుచున్ ♦ శోభింతు రెల్లప్పుడున్.

శ్రీమతే శఠకోపాయ నమః.

---

శ్రీమతేరామానుజాయనమః.

దశమ శతకము – మూడవ దశకము.

[వేయమరు]

అవతారిక :— ఈయాళ్వార్లు తిరువనంతపురమును ప్రవేశించి తమ రనుకొన్నట్లు స్వామికి కైంకర్యము చేయలభింపకపోవుటచే మిక్కిలి శంకింపవలసివచ్చెను. శ్రీవైష్ణవులు తాముకూడి కైంకర్యము చేయవలెనని యాలోచించిరి. తమ రాలోచించినట్లు దివ్యదేశమునకుఁ బోయి ప్రవేశించి కైంకర్యము చేయలభింప లేకపోయిరి. అప్పుడే వెళ్లి యాదేశమందు ప్రవేశింప జాలకపోవుటచేతను, అనుకొన్నట్లు కైంకర్యమొనర్చుటకు లభింపకపోవుటచేతను, చిరకాలము విశ్లేషించిన వాసనచేతను, అనాదిగా వచ్చుచున్న యచిత్సంసర్గము ననుసంధించి భయమునొందుటచేతను,

శిశుపాలునికి తన్నిచ్చి భరతునియందు వైముఖ్యముఁబూనిన ఈశ్వరునియొక్క స్వాతంత్ర్యము ననుసంధించి భయఁపడుటచేతను, సర్వేశ్వరుఁడు తానేవచ్చి వీరిని గటాక్షించుటకుఁ దగినభక్తి తమకు లేదని అనుకొనుటచేతను, వాఁడు నన్ను మరికొంత కాలము ప్రకృతిలో నుంచినయెడల నేమిచేయఁగలనని భయముచే నవసన్నులై తమకు బుట్టిన దశావిశేషము నొకపిరాట్టిమాటలచే సాధించుచున్నారు. భయనివృత్తి కుపయోగించు నిదియేయిపుడు భయహేతువయ్యెను. ఇప్పుడే ఆదేశమునకుఁబోయి ప్రవేశింప జాలకపోతిమని విచారింపనవసరము లేదు. వాని ననుసంధింపగా "కాలాఴుం నెంజఴియుమ్" అన్నట్లు భక్తిపారవశ్యముచే నిపుడడుగుదీసి యడుగు పెట్టలేరు. దాస్యవృత్తిని లభింపలేకపోతిమనియు భయఁపడనక్కరలేదు. "పుగఴునల్లొరువన్" అను తిరువాయిమొఴిలో జెప్పినప్రకారముగా నున్నస్థలమందేయుండి యేదోయొకదానిని జెప్పగా దానిని తన కైంకర్యముగా గ్రహించు స్వభావముగలవాఁడైన యీశ్వరుఁడు వీరు తలంచినవానిని చేసినవానిని తనకైంకర్యముగా గ్రహించును. శత్రుఁడైన హిరణ్యకశిపునికంటె భక్తుఁడైన ప్రహ్లాదుఁడంతరంగుఁడని స్వామి తలంచియుండగా దేవాసురయుద్ధములో రాక్షసపక్షము నవలంబించి యెదిరించెను.

భ్రాంతునికి బుట్టిన తెలివివలె నచిత్సంసృష్టునికి బుట్టినజ్ఞానమును నమ్మఁగూడదని యీయాళ్వార్లు ప్రకృతిసంబంధమును దలంచి "తేఱలెన్నై" అని భయఁపడిరి. "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అని శాగోధిని నిరసించి తీసికొనిపోవుట కుపయోగమై యుండుటచే నీశ్వరస్వాతంత్ర్యమును దలంచి భయఁపడ నవసరము లేదు. ప్రపత్తి నుపాయముగా నవలంబించినవారగుటచే తమకు భక్తి లేదనుకొనకూడదు "నోపజనం స్మరన్నిదం శరీరమ్" అన్నట్లు దీనిని స్మరింపనట్లు సాక్షాత్కారము లేకపోవుటచే గలిగిన పాట్లివి. ప్రత్యక్షముకూడ నకించిత్కరమై తనతో గలిసియున్నను విశ్లేషించినాఁడని భ్రమజెందునట్లు విశ్లేషముచే గలిగినవాసన అతిశయించినది. యోగ్యతయుండగా పడునట్టిపాట్లివి. "మయర్వఱమదినలమరుళినన్" అన్నట్లు భగవత్ప్రసాదలబ్ధమై, పరభక్తిరూపమై, రుచికార్యమై యుండెడు వీరి జ్ఞానమిట్లున్నది. మనుష్యులు వెళ్లలేని యొకప్రదేశమందు వీరినుంచి ఈశ్వరుఁడు పరిహసింప వలసియున్నది. కొన్ని దినములు కలిసియుండి చిరకాలము విశ్లేషించినయొక పిరాట్టియొక్క అవస్థగలవారై ఆవాసనచే గృష్ణుఁడు తనతో గలిసియున్నను పూర్వమితఁడు విడిచిపోయిన ప్రాతఃకాలము మరలవచ్చుటచే దక్కాలమందు వీచువాయువుల వీచుచుండుటచేతను, కోకిలలు కూయుచు నుండుటచేతను, మయూరము లాడుచుండుటచేతను, ఆవులు పెయ్యలు అరణ్యమందంతట వ్యాపించియుండుటచేతను, కృష్ణుఁడిపుడు గోవులవెంబడి పోకమానఁడు. పశువులను మరికొందరు కాచు

చున్నను వానినివిడిచి యతఁడు మనతో నుండడు అని తలంచి కూఁడనున్న నతఁడు వెళ్లిపోయినాఁడని యతని విశ్లేషమును నిశ్చయించి "ఇన్నుయిర్ చ్చేవల్, మల్లిగైకమఙ్గ్" మొదలగు తిరువాయిమొళులలో నతని యసన్నిధియందు పడవలసిన క్లేశములన్నియు వానిసముఖమం దనుభవించి సర్వశక్తియైన యతనికిఁగూఁడ పరిహరింప శక్యముగాని యాపద నీయాళ్వార్లు పొందిరి. పోయినయెడల తిరుగవచ్చువాఁడు కాఁడు. వెళ్లిపోవుటకు తలంచినచో వెళ్లుటమానఁడు. ఇట్లు బాధపడి నీవు పశువుల మేపుటకుఁ బోవలదు. నీపోక నాకిష్టములేదు. అందుచే నీవు పోవలదని నిషేధించుచున్నాను. నీహస్తము నాశిరస్సుపై నుంచవలెను. అరణ్యమందు నీవు పశువులను మేపుచుండగా నసురులవలనను రాక్షసులవలనను నీకేమి ప్రమాదము సంభవించునోయని భయఁపడుచున్నాను. "మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణః" అను వచనమునుబట్టి వాఁడు సకలవిధబంధువులైనట్లు యీచేతనునికి తత్సంబంధజ్ఞానము పుట్టినచో చేతనునికి వానిపై సర్వవిధస్నేహము లుండును. "యదా యదాహి కౌసల్యా దాసీవచ్చ సఖీవచ। భార్యావ ద్భగినీవచ్చ మాతృవచ్చోపతిష్ఠతే॥" అన్నట్లే. కావున పశువుల మేపుటకు నీవడవికి వెళ్లినయెడల నేనుండజాలనని పలువిధంబుల దుఃఖపడిరి. సర్వేశ్వరుఁడు వీరిదుఃఖములన్నింటిని బాగుగా నాలోచించి "నేను పశువులతో వెళ్లను" అని యీపిరాట్టిని నమ్మించి సమాహితచిత్తం జేయగా ప్రాణములను ధరించి సుఖంబుననుండెనని యీతిరువాయిమొళిలో జెప్పఁబడెను.

దీనిచేతాదర్యముయొక్కపరమావధి చూపింపబడినది. "ఎమ్మావీట్టులో" "తనక్కేయాగ వెనై క్కొళ్లుమీదే" అని యొకటి నిష్కర్షింపఁబడినది. అది యిందులో పాడుజేయబడినది. నన్ను పరిగ్రహింపవలెనని యచట చెప్పఁబడినది. నాతో కలుసుకొన్నసుపకే పరస్త్రీలతో గలుసుకొన్నసుపకే అని యిచట జెప్పఁబడినది. దానియందు "నాకు" అను నంశము పురుషార్థము కావడమునకుగాను చెప్పఁబడినది. ఇది అచిద్వ్యావృత్తి కుపయోగించునది. ఈచేతనుఁడు "నాకు" అనునప్పుడు పురుషార్థము కానేరదు. ఈశ్వరుఁడు నాదరముతో బ్రవర్తింపజేయఁడు.

ఇందులో "ఉగక్కునల్లవరొడుమ్" అనునది (ఉయిర్పాట్టు.)

## 1. వే య్ మ రు.

శ్లో. మ్లానిం యాతి మృణాళకోమలమిదం బాహుద్వయం మామకం
మత్పీడా మనవేక్ష్య దుశ్చరివరుత్తై ర్ధునన్వంతి మాం కోకిలాః,

గా॥ పాతుం త్వయి నిర్గతే స్వసదనా దేకోయుగస్యాత్రుటిః
స్వామి న్నిర్ఘృణ రక్తదృగ్విలసితైః కిం మాం క్షిణోష్యత్రపః.

సీ. నీవు నన్వీడనాడి ♦ బోవంగ మద్బాహు
లతికావసాదంబు ♦ వితతమయ్యె
నొడలు కృశించుట ♦ నొంటరితనమును
సరకుసేయక మది ♦ పరభృతములు
కలిసి నీశుభనామ ♦ గణముబల్కుచునన్ను
గారింపజొచ్చె న ♦ కారణముగ
బర్హిణంబులు తమ ♦ బర్హంబులను విప్పి
యెక్కుచో నాడుచు ♦ బిక్కటిల్లె.

తే. గీ. నీవు పశువులవెంబడి ♦ బోవ నొక్క
త్రుటియుగంబయ్యె నేమియు ♦ దోచదకట
కంటిచూపుల నన్నేచ ♦ గడగితీవు
నన్నుబాసిన నేనిట్టు ♦ లెన్నొవెతల
పాలబడితిని కృపలేదె ♦ పద్మనయన.

2. త గ వి లై త గ వి లై యే.

శ్లో. కృష్ణ త్వం భృశనిర్దయ స్తవతు సంశ్లేషే య ఉద్వేలతా
మానందాబ్ధిరితో వియత్పృథుతరస్సం మోహాయే చ్ఛేతనామ్,
సోఽసౌ స్వప్నఇవాధునా క్షయతి మే చేత స్సముత్కంఠితం
మాగా శ్చారయితుంపశూన్ పునరపిస్యాద్విప్రయోగ స్త్వయా.

మ. కృపలేదించుకయైన నీకు కఠినా ♦ కృష్ణా త్వదీయోపభో
గపరానందము గూడ నీవిరహము ♦ న్గాఢంబుగా దల్పగా
జపలంబై గనుపట్టు స్వప్నముగతిన్ ♦ జకార్రింక నీవేప్రమయున్
గృపణ న్నన్ను గలంపసాగె పశుపా ♦ కృష్టుండవై పోకుమా.

3. వి వ ని న్ప శు ని రై.

శ్లో. గా॥ పాతుం యదిగచ్ఛసిత్వ మధునా మర్తవ్య మత్రైవ మే
తీక్ష్ణోచ్ఛ్వాసవివర్ణితాధర మణి ర్వర్తిష్ణు రేకాకినీ,

దృష్టుం నోపలభే తవాంజనరుచిం ఘుసా్రిపి నావస్యతి
పాియోమే నిధనం తవైవ విరహా త్వాద్వల్లవీజన్మనః.

ఉ. ఆశదొలంగి నన్విడిచి ♦ యావుల మేపగ బోయిన న్వతం
గేశరథుండ నిన్నుగన ♦ కిప్డుని మేపములోన నాదుప్రా
ణాశ నశించు గోపికల ♦ మైనమును స్గృపలేక పాసికీ
నాశునిభంగి ప్రాణివధ ♦ నాధ యొనర్పగ నీకు న్యాయమే.

4. తొ ఘ్ర త్రై యా మ్.

శ్లో. దాసీనాం విరహావ్యధావిధురితాం నా వేక్షసే దుర్దశాం
గోవిందా ద్రియసే విహాయ కృపణా గాఃవసంరక్షితుమ్,
వాణీం త్వత్వదనేందుమండలగళత్పీయూషధారోపమాం
స్మారం స్మార మతీవ తాపమయతే మన్మానసం కేశవ.

ఉ. నీయెడ మామనంబులను ♦ నెయ్యము నీభువనైక మోహన
చ్ఛాయయు రూప మాకృతియు ♦ శాశ్వతకీర్తియు ద్రోసిపుచ్చిలే
బాియపుగోపులం గలిసి ♦ పాడుచు నాడుచు నాలవెంబడిన్
బోయిన వేళ మాకడను ♦ బొల్పగు మాటలనాడియుంటి వా
మాయలమాటలెల్ల మము ♦ మర్మముల న్బగులంగ గొట్టెడిన్.

5. ప ణి మొ త్రి ని నై ద్రో రు మ్.

శ్లో. శుత్వా శ్వాసకరాణి తేసులపితా న్యాత్మా నిరస్త్రి జ్వల
త్యహ్నా హోషుపి ధేనుపాలనరతే త్వయ్యస్తభావా వయమ్,
అధోఽస్మిలితమల్లికాసుమపరిరంభప్రియంభావుకా
వాతామర్మసు ఘట్టయంతి వియతి వ్యాప్నోతి గాఢం తమః.

సీ. పశువుల మేపంగ ♦ బారెకుసమయాన
భవదుక్తసాంత్వోక్తి ♦ భావమునను
స్మరియించినపుడెల్ల ♦ మన్మనం బంగార
చుంబితమైనట్లు ♦ చురుకుచుండు

సంశ్లిష్టమల్లికా ♦ సౌగంధ్యబంధుర
మలయవాతంబయ్యె ♦ మారకంబు
కౌస్తుభమణివార్ధి ♦ కన్యాపరిష్కృత
భవదురస్స్థలమందు ♦ బరమకృపను.

తే. గీ. జేర్చి మధురాధరామృత ♦ శీధుపాన
మత్తచిత్తను గావించి ♦ మచ్ఛిరమున
మృత్యుభయహారిభవదీయ ♦ మృదుకరంబు
నుంచినాయార్తి దుర్చగ ♦ నెంచవయ్య.

6. అడిచ్చియోంతలైమిశై.

శ్లో. అస్మన్మూర్ధ్ని నిధేహి తావకపదాబ్జాతం సరోజాక్ష తే
పాదాంభోజసమాశ్రితా యువతయో బర్హావతంసోజ్జ్వల తాః,
ఉచ్ఛూనారుణ మస్మదక్షియుగళం వాధఃప్రణాశాయ తే
గాఃపాతుం త్వయి నిర్గతే చహృదయం లేలీయతే స్నిగ్ధవత్.

శా. అన్యోన్యాశిగభీర కృష్ణ భవదీ ♦ యాంఘ్రైనహస్తంబు సం
పూర్ణార్తన్వహియించుమచ్ఛిరమున న్బాలస్సుందగానుంచుమీ
కర్ణాన్సాద్యభవద్వచోఽమృతమనః ♦ కాలుష్యసంవిగ్నలౌ
పూర్ణేందు ప్రతిమాననల్పలువురీ ♦ భూమి న్భవద్వశ్యలై
తీర్చ సంగశిరార్తిలైరి వెసమత్తి ♦ వార్తి వారింపుమా.

7. వేమొము దుయిరళ్ల్.

శ్లో. సానాశీరమణిప్రభాంచితతనో గోపాలనప్రస్థితే
త్వయ్యద్ధా సుమసుందరాంఘ్రిచలనై ర్ధూయే పరంచేతసి,
కాయోమే క్రిసిమాన మేతి వలయైస్సార్కంచ కాంచీగళ
త్యసాంభఃకణదూషితేచ నయనే బాహుద్వయం మ్లాయతి.

ఉ. గోగణపాలనప్రసిత ♦ గోపకుమారవతంస గూఢపా
దోద్భగళయాన గోనిచయ ♦ పోషణకై పశుపాళితోడ నీ
వేగ గరస్థకంకణము ♦ లెల్లను జారెను జారెనీవి సా

భోగమదక్షియుగ్మమున • భోరున నశ్రుజలంబు వెల్వడెన్
సాగెను మత్కుచద్వయిని • సాంద్రవివర్ణత గప్ప గోపికా
పూగమనోఽబ్జభృంగ వన • భూములలో నడిదాకి దైత్యులు
ద్వేగము జేతురేమొ యని • భీతిజనించు మది న్మణిప్రభా.

8. అశురర్గళ్ తశైప్పియ్యల్.

శ్లో. దైతేయాయది తత్రగోచరగతం త్వాం ప్రార్థయేరం స్తదా
కస్త్రాయేదితి వేపతే మమమనో మాగాః పశూం శ్చారయన్,
త్వత్సంశ్లేషరుచిః ప్రలోభయతి మాం హాతుం న తేయుద్యతే
స్త్రీభిః క్రీడసిచే ద్రమస్వ పురత స్సందర్శయం స్త్వన్ముఖమ్.

మ. దనుజులువచ్చి యుద్ధమున • దాకిన నేమగునోయటంచు నా
మనము భయంబునొందునిక • మానుము గోవుల వెంటబోవుటల్
వనజమువంటి నేత్రములు • వాతెరహస్తయుగంబువస్త్రమున్
కనులకు జూపి యిష్టముగు • కంజదళాక్షులగూడి యుండుమా.

9. ఉగక్కనల్లవరోడుమ్.

శ్లో. ప్రీతా స్స్వ్యమభృశంహరే యది భవాం స్త్వత్ప్రేయసీరంజనా
దాత్తప్రీతి రతోగవామనుగతౌ బుద్ధిం వృథామాకృథాః,
కంసేనప్రతిచోదితాః పలభుజః కూటాహవోద్యోగినో
ఘోరా స్త్వామభిధర్షయేయు రథమేవా చంకురుష్వాదరాత్.

చ. సరసుడ నామ్మ్రగూడనగు • సాంద్రసుఖాతిశయంబుకంటెనీ
తరుణులగూడి నీవిచట • దద్దసుఖించుట జూచుచుండుటల్
కరము ప్రియంబు మాకికను • గావగ నాలను బోకుమయ్యనీ
కరులసురుల్ గదాయనుచు • నాత్మజనించుభయంబుమాధవా.

10. అవత్తంగళ్వైయుమ్.

శ్లో. సంగ్రామ స్తవ రాక్షసైస్సహ భవే త్కంసప్రణున్నైఖలై
రేకాకీవిచరస్యహో ముసలినం త్యక్త్వా వచోమేశృణు,
బిభ్యాత్మానిగణా పిశంకిత హృదో ఖిద్యత్యలం మేమనో
గోవత్సావన మేవ తేప్రియతరం మన్యే దివః పాలనాత్.

శా. కంసప్రేరితఘోరరాక్షసతతుల్ ♦ కాంతారపాసీంద్రిలన్
హింసన్బెట్టగ సంచరించెదరు నీ ♦ వేకాకివై బోదు వు
త్తంసీభూతమయూరపింఛ బలభ ♦ ద్రస్వామి లేకుండ నో
హంసధ్యేయపదారవింద వినుమా ♦ యస్మద్ధితోక్తు ల్చెవిన్.

## 11. శెం గ ని వా య్.

శ్లో. శ్రీకృష్ణాంఘ్రినివిష్టధీ ర్దశశతీం యాం కారిజోనిర్మమే
తత్రైతద్దశకం ప్రియాహృతహృదా ప్రేయోవియోగార్తయా,
వల్లవ్యా ప్రియయా పశూననుసర న్మాగచ్ఛ కృష్ణేతితం
రుంధంత్యాభిహితంసదానిగదతాం ప్రాప్యం మురారేః పదమ్.

ఉ. ఆవులవెంట బోవవల ♦ దంచు ననంగనరాత్రి గోపికల్
భావమెలర్ప గృష్ణునికి ♦ బల్కినపల్కులు శ్రీశఠారి భ
క్త్యావిలుఁడై రచించినస ♦ హస్రములోనివి గానసీపదిన్
యేవిధినైన బాడ సక ♦ లేప్సితము ల్సమకూరువారికిన్.

శ్రీ మ తే శ ఠ కో పా య న మః.

---

శ్రీమతేరామానుజాయనమః.

## దశమ శతకము - నాలుగవ దశకము.

[ శార్వతవనెరిక్కు. ]

అవతారిక :— ఈశ్వరుఁడు తమ్ము విశ్లేషించుటకు లేశము తలంపు లేని వాఁడైయున్నను అత్యార్తిశంకచే వియోగులు పొందు వ్యసనమంతయును పొంది యవసాదమునొందగా “మిమ్ముల నొకదినమైనను విశ్లేషించను” అని వాఁడాశ్వాసింపఁగా నందువలన ధరించి క్రిందతిరువాయిమొఴిలో మిక్కిలి సంతసిల్లిరి.

మొదటి తిరువాయిమొఴిలో ననగా ఉయర్వరలో తత్త్వవిషయమై చెప్పవలసినదంతయు జెప్పఁబడినది. ఇక నర్థతత్త్వము తానే ప్రాప్యమైయుండును. ఆప్రాప్యవిషయమును ప్రాప్తిఫలమగు కైంకర్యమును “కొడు మిదరాయవెల్లామ్” అను తిరువాయిమొఴిలో “పడమడై యరవిల్పళ్లిపయిన్నవన్। కడైత్త

రైశీయ్క్కవెత్తాల్ ", అను రెండుపాశురములచే ననుసంధించిరి. కెడుమిడరులో నాప్రాప్యమప్పుడే హస్తగతము కాకపోవుటచేతను చిరకాలము విశ్లేషించినవా సనచేతను వీరవసాదమునొందగా నీయవసాదము నీశ్వరుఁడు చూచి నివారింపగా నాశ్వస్తులైరి. కాఁగా ఉయర్వరలో తత్త్వవిషయమై చెప్పవలసినదంతయు జెప్పి యావస్తువే ప్రాప్యమైయుండుటచే నాప్రాప్యమును లభించుట కుపాయమైన భక్తి యోగమును " వీఁడు మిన్మత్తము "చే జెప్పి యాభక్తిమంతులకు సర్వేశ్వరుఁడు సులభుఁడైయుండునని వాని సౌలభ్యమును " పత్తుడైయడియవర్ " చే జెప్పిరి. కాఁగా వీఁడు మిన్మత్తమందు, పత్తుడైయడియవర్‌లోను చెప్పఁబడినభక్తి స్వసాధ్యముతో బొందియున్న ప్రకారమును జెప్పి యాతిరువాయిమొళ్ళిలో భక్తివర్ధకములుగా జెప్పఁబడిన గుణములను పరామర్శించి తమరు తమయొక్క పురుషార్థమున కుపాయముగా మొదటి తిరువాయిమొళ్ళియందు జెప్పిన ప్రపత్తితో సమాప్తి నొందించిరి.

ఈయాళ్వార్లకు భక్తిప్రపత్తులు రెండుకలిగియున్నను తమపురుషార్థమున కుపయోగించునదగా వీరు తలంచునది ప్రపత్తియే. మొదటి తిరువాయిమొళ్ళియందు ప్రపత్తిసూచకమైన శబ్దమున్నదా అనగా " కటాక్షించినాఁడు " అని సాదించిరి. కటాక్షించినాఁడన్నంతమాత్రముచే ప్రపత్తిని చెప్పినా అంటే, " అదువు మవన దిన్నరుళే " అనిసాదించియుండుటచే ప్రపత్తికి మూలము భగవత్కృప యగుటచే ప్రపత్తియని సిద్ధించును. వీరికి ప్రపత్తియే పురుషార్థమున కుపాయమనుటయేమి ? భక్తి కాకూఁడదా అంటే వీరిభక్తి వేదాంతవిహితభక్తి కాదు. అట్లయినచో నపశూద్రాధికరణన్యాయవిరోధము ప్రసంగించును. అయిననేమి ? అది యీయాళ్వార్ల యొక్క ప్రభావమున కుచితముకాదా అంటే అది వీరి ఉక్తులతో విరోధించును. అరుళినన్ (కటాక్షించినాఁడు) అనునవియేకదా వీరిఉక్తులు. " ఉభయపరికర్మిత స్వాంతస్యైకాన్తికాత్యంతికభక్తియోగైకలభ్యః " అని కర్మజ్ఞానములచే సంస్కరింపఁబడిన అంతఃకరణముగలవానికి కేవలసర్వేశ్వరునియందే యావదాత్మభావిగా నుండునది భక్తి. వీరికా కర్మజ్ఞానములస్థానమందు భగవత్కటాక్షము కలిగినది. దానితరువాత పరభక్తి యుద్భవించినది.

శ్రీమద్భాష్యకారులును వీరిమార్గమునే అనుసరించి వీరిపురుషార్థమునే పురుషార్థముగా దలంచి ప్రపత్తిజేసి తరువాత భక్తిని ప్రార్థించిరి. సర్వేశ్వరుఁ డుపాయమైనను వీరికి రుచియున్ననే ప్రాప్యము సిద్ధించును. లేనిచో బురుషార్థము కానేరదు. ప్రాప్యమిదియని నిష్కర్షించి యవ్యభిచరితమైన యట్టి ప్రాప్యరుచి గలవానికే సర్వేశ్వరుఁడు ప్రాపకుఁడగును. అందువలన నీయాళ్వార్ల

భక్తి ప్రపత్తులు వికల్పింపవలసియున్నవి. వీరికి భక్తిప్రధానము లేక ప్రపత్తిప్రధానమాయని వికల్పము.

కాఁగా వీఁడుమిన్ముత్తమందు, పత్తుడైయడియవర్ లోను పరుల కుపదేశించినభక్తి తమపురుషార్థలాభమున కుపయోగించిన ప్రకారమును చెప్పి ఇదిసాధ్యవ్యాప్తమని చెప్పి ముగించిరి. ప్రాప్తియుంటేగదా యిది సాధ్యముతో జేరియుండుటయన్నచో నపుడు సాక్షాత్కారరూపమైన యనుసంధానమున్నయెడలచాలును. గుణ మనుభావ్యమైనచో నాగుణవిశిష్టముగా నిచటనే యుండి యుపాసించును. కాఁగా నుపాసనవేళయందు నాగుణ మున్నప్రకారము ననుసంధింప బ్రతిబంధకము లేదు. దిగువను "కణ్ణానైనాన్కండేనే, కండుకొండుయందొళిందేన్ కండుకొండె న్కణ్ణిణైయాగ క్కళిత్తు" మొదలగు ననేకపాశురములయం దీప్రాప్యానుసంధానమేగదా వీరు తరుచుగా జేయుచున్నదిఅంటే— ఆయాయితిరువాయిమొళులయందు వానినిపట్టి పుట్టిన కొన్నిరసవిశేషములను చెప్పియున్నారు. ఉపక్రమించినయర్థము నుపసంహారము చేయవలయునను నొక నియమమున్నదిగావున దానినిచట జెప్పిరి.

ఒకసమయమందు పిళ్లాన్ "నీవు పశువులను మేపుటకు బోవవలదని చెప్పగా నయితేవెళ్లను. మానివేసినాను" అనెను. అందువలన నితనికంటె సులభుఁడుమరి లేఁడు. ఇతఁడు భక్తిలభ్యుఁడన్నయంశము నిశ్చయము" అనిసాధించిరట.

ఇంక మొదటి తిరువాయిమొళియందు ప్రాప్యమును సాధించియున్నారు. ఆప్రాప్యమునకు ప్రాపకముగా భక్తిప్రపత్తులు రెండు నుపాయముగా విధింపఁబడినవి. ఆరెండింటిలో భక్తి బ్రాహ్మణక్షత్రియవైశ్యులకే. ప్రపత్తియందు నాలుగుజాతులవారికి నధికారము కలదు. సర్వాధికారమై తమకిష్టమైన యుపాయముగా తాము స్వీకరించిన ప్రపత్తిని "వీఁడుమున్నత్త"ములో బ్రతిపాదించిరి. త్రైవర్ణికాధికారమైన భక్తిని "పత్తుడైయడియవర్లో" సాధించినారు. కాఁగా రెండుతిరువాయిమొళులలోను సాధించిన భక్తిప్రపత్తులు స్వసాధ్యముతో జేరయున్నప్రకారమును శార్వ్వతవనెటి, కణ్ణన్కళలిణై అను నీరెండు తివాయిమొళులచే సాధించిరి. వానిలో "శార్వ్వతవనెటి అను దానిచే ప్రపత్తి స్వసాధ్యముతో పొందియున్నప్రకారమును సాధించిరి. శార్వ్వతవనెటిక్కు తామోదరన్ తాళ్" అనుపాశురమందున్న తపశ్శబ్దము ప్రపత్తివాచకము. "తస్మాన్న్యాసమేషాం తపసామతిరిక్తమాహుః" అను శ్రుతివాక్యముచే ప్రపత్తి తపస్సులలో నుత్కృష్టమైన తపస్సని చెప్పఁబడినది. సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణంవ్రజ। అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః" అను శ్లోకముయొక్క అర్థమును "పండే పరమన్ పణి

త్తపణివగైరే కండేంనమలమలర్పాదమ్ కాండలుమే విండేయొట్రిందవినైయాయి నవెల్లామ్" అను పాశురముచేతను,"ఇరుమైవినై కడిం దింగెన్నై యాళ్గిన్నాన్" అను పాశురముచేతను ప్రతిపాదించిరి. "వీడు మిన్ముత్తమ్" అను తిరువాయి మొళ్రి ప్రపత్తివిషయమని ఆళవందార్ సాధించిరని తిరుమలైయాండాన్ సాధించి రట. శ్రీభాష్యకారులు నారీతిగానే యిది ప్రపత్తిపరమని సాధించి శ్రీభాష్య మును రచించినతరువాత రహస్యోపాయమును వెల్లడిచేయకూడదని యెంచి యీ తిరువాయిమొళ్రి భక్తిపరమని సమర్థించిరి.

కాఁగా మొదటితిరువాయ్మొళ్రియం దనగా ఉయర్వరలో ప్రతిపాదింపఁ బడిన పారిప్యస్వరూపమును పారిప్తిఫలమైన కైంకర్యమును "కెడుమిడర్లోనున్న "పడముడై యర విల్పళ్లిప్పయిన్నవన్," "శడైత్తలై శీయక్క-పెత్తాల్" అను నీరెండుపాశురములచేతను ప్రతిపాదించిరి. ఆకైంకర్యమందున్న దోషభాగమును పరిహరించి ఉందన్తిరువుళ్ల మిడర్ కెడుందోరుమ్ నాంగళ్వియక్క- విన్బురుదుమ్" అను పాశురముచే ద్వయమంత్రోత్తరఖండమందున్న నమశ్శబ్దార్థమును వివరించి "కెడుమిడర్ వేయ్నరుత్తోళిగై" అను రెండుతిరువాయ్మొళ్రులచే ఉయర్వర యొక్క-అర్థమును నిగమించి "శార్వే తవనెటి, కణ్ణన్క-ళ్రలిగై" అను రెండు తిరువాయిమొళ్రులచే "వీఁడు మిన్ముత్తిమ్, పత్తుడై యడియవర్" అను రెండుద శకములయందు యథాక్రమముగా ప్రతిపాదింపఁబడిన ప్రపత్తి, భక్తి స్వసాధ్య ముతోఁ జేఁనవని సాధించిరని ఆళవందార్ నిర్వహించినట్లు తిరుమలైయాండాన్ సాధించిరి. ఇందులో "కండేన్క-మలమలర్పాదమ్" అనునది (ఉయిర్పాట్టు.)

## 1. శా ర్వే త వ నె టి క్కు-.

శ్లో. నీలాంబువాహనిభకాయరుచేః పరస్య
కంజాతపత్రనయనస్య రథాంగపాణేః,
భూమ్యగ్నివాయువియదాదిశరీరకస్య
పాదద్వయీ భవతి ముక్తిపథస్య నేత్రీ.

ఉ. సాంబుపయోదసౌభగుఁడు • సారసనేత్రుఁడు భూమిమారుతా
గ్న్యంబునభస్థలాదితనుఁ • డదిసుతాదయితేస్తుతుండు భా
వంబున గొల్చువారలకు • వాంఛితము ల్నమకూర్చువాఁడునౌ
యంబుజనాభుపాదమె జనా • లికి భక్తిపథంబు జూపెడిన్.

2. పెరుమైయనే.

శ్లో. మహీయాన్సూరీణాం భవమరుపరిక్లిష్టమనసాం
దవీయా న్యోద్రష్టుం గదితుమపి వాచా మవిషయః
సరోజాతావాసీభవదమలవక్షా మురరిపు
ర్వ్యధూయాఘ ద్విత్వం సమవతి సదా మాంచ కృపయా.

చ. దొరకనివాఁ డభక్తులగు ♦ దుష్టులకు న్విభుధాధికుండు నిం
దిర వసియించునట్టి నిజ ♦ దేహముగల్గినవాఁడు సూరిసం
పరిచరితాంఘ్రి శోణనవ ♦ పంకజనేత్రుఁడు నైనశ్రీరమా
వరుఁడె యఘంబడంచి నను ♦ బాయక ప్రోచెడువాఁడునిత్యమున్.

3. అళ్గిన్నాన్.

శ్లో. చక్రీ రక్షతి మా మపార కృపయా కింమేఽధునా హీయతే
సంసారాబ్ధి మతీతరం నచపున స్తత్క్లేశ ఆవర్తతే,
త్రిస్వద్బాలమృగీదృశః ప్రియతమో నీళావధూటీమణేః
పాదాబ్జద్వితయీం వహామి శిరసా సంసేవ్య శేషామివ.

ఉ. ఏలిక నాకు చక్రధరుఁ ♦ డిప్డు భవోత్థసమస్తదుఃఖముల్
గూలెను రాదు దుఃఖమిక ♦ గూడదు నాకు గోరంతలేశమున్
నీలప్రియు న్రమావిభుని ♦ నీరజనేత్రుని గన్నులార నే
జాలితీ జూడ వాని పద ♦ సారస ముల్తలపై ధరించితిన్.

4. తన్నైమేల్పునైందేన్.

శ్లో. మూర్ధ్నా యస్య వహామి పాదజలజం న్యగ్రోధపత్రేశయః
స్సోసౌ సర్వసుపర్వమౌళిమణిభి ర్నీరాజితాంఘ్రి ద్వయః,
శేషక్ష్మాధరమస్తకాగ్రవసతిః పశ్చా త్ప్రవిశ్యా దరా
న్మత్స్వాంతం స్థిరసద్మ చక్రఇతి భో నిశ్చిత్య ధన్యోస్మ్యహమ్.

ఉ. నాతలమీఁద వానిచర ♦ ణద్వయి చాల్చితి నిత్యసూరిసం
ఘాతనిషేవ్యమాణపద ♦ కంజయుగుండయి శేషశైలశృం
గాతతభూమినుండి హృద ♦ యంబున సుస్థిరుఁడయ్యెనంచు నే
గ నిశ్చయించితి గృ ♦ తార్థుఁడనైతిని సాటివారిలోన్.

5. నిచ్చిత్తిరుందేన్.

శ్లో. జహ్యాన్నైన్నవ రమాపతి ర్మమమనో వా స్తవ్యతా మిత్యహం
నిశ్చిత్య స్థితవా న్కరాగ్రవిలసచ్ఛఙ్ఖో భృశం వంచకః,
అస్మాకం స్పృహణీయఏవ ఫణిరాడ్భోగేశయానః పరై
రప్రాప్యో ఋజుశీలవానివ భవేదన్యేషు మాయావ్యపి.

చ అతఁడు మదాత్మవాసము నఁ హానిఁ శమను న్విడఁడంచు నిశ్చయిం
చితి నరిశంఖహస్తుఁడగు ♦ శ్రీపతి వంచకుఁడౌను తా ననా
శ్రితులకు దుర్లభుండయిన ♦ చిక్కనవాని గతిన్నటించువాఁ
డతని పదాంబుజాప్తి మనఁ కాశపడం దగునంచు నెంచెదన్.

6. నాగత్తణైయానై.

శ్లో. స్వానువ్రతత్రిదశభూరుహ మబ్జనాభం
నాగేంద్రభోగశయనం సురసేవ్యమానం,
చంద్రార్ధమౌళిసమధిష్ఠితవామభాగం
శ్రీశం శ్రితోస్మి దితభక్తభవోగ్రపాశమ్.

చ. చిలువనుబండువాఁడపుడు ♦ చిత్తముల న్స్మరియించువారి ని
చ్చలు కృపసేయువాఁడు జలఁజాతదళాక్షుఁడు చంద్రమౌళియం
దలఘుకృప న్వహించి తన ♦ యంగమున న్నివసింపజేయువాఁ
డెలమినిజాంఘ్రినాశ్రొసగ నెంతటిధన్యుఁడనో తలంపుడీ.

7. పణినెంజేనాథమ్.

శ్లో. పౌగండరాశ్మరుచిరం జితకాయకాంతిం
చక్రాంచితాగ్రకర మంబుజపత్రనేత్రం,
సర్వాధికం మురరిపుం హృదయ శ్రియస్వ
రక్షేదసౌ భవదవార్దితవారిద స్త్వామ్.

మ. హరినీలాభశరీరుఁ డాసురచమూ ♦ హవ్యాతిభీమానలో
ద్గిరదుగ్రాకరుండు దేవతనుస ♦ త్కీర్తిచ్ఛటా ప్రస్ఫుర

ద్ధరిదంతుండు మదీయజన్మదురితం ♦ బంతంబునొందించి నే
మరకెల్లప్పుడు వానిఁగొల్వుము మనం ♦ బా నీవు నేమొక్కెదన్.

8. ఆ త్రి యా నా త్రి.

శ్లో. హస్తాబ్జాంచితచక్రహేతి మమర వ్రాతాధిక ప్రాభవం
స్రష్టారం స్థిరజంగమాత్మకజగత్సర్గస్య చాంతే స్థితమ్,
గోవత్సావనలోలుపం నిజభుజప్రోత్క్షిప్తగోవర్ధనం
ధ్యాయే ద్దేవ మనారతం స్థిరధియా దూరీభవద్విస్మృతి.

ఉ. సూరిమనోవచఃపథము ♦ సుంతయు గన్గొనలేని మోహకా
పారమహత్త్వమందిరుఁడు ♦ బాహుసముద్ధృతభూధరుండు శం
ఖారిపరిష్కృతాత్మకరుఁ ♦ డైన పరేశుని పాదపద్మముం
జేరిభజింపుమా మనమ ♦ చేకురు ముక్తిపదంబు నీకిఁకన్.

9. కం డే న్క మ ల మ ల ర్వా ద మ్.

శ్లో. పురాణపురుషః పురా యదుపదిష్టవా న్ముక్తిదం
వచ స్తదనుసారతః ప్రకటభక్తిమాన్ శ్రీపతౌ,
తదాశ్రయపర స్సదా సముపలభ్య తస్యామలం
పదాంబుజ మహం క్షణా త్పరివిముక్తపాపోస్మ్యహమ్.

ఉ. తన్ను భజించున ట్లఖల ♦ దాస్యరుచిం జనియింపజేసి యా
పన్నశరణ్యుఁడైనహరి ♦ భక్తజనాళికి దెల్పినట్టి యా
తిన్ననిమార్గమందు జన ♦ దెల్వియొసంగి యనుగ్రహించెదా
న స్నఖిలేశుపాదముల ♦ నమ్మితి బాపములెల్లబాయగన్.

10. వ గై యా ల్మ న మొ న్ని.

శ్లో. యస్మై కాగ్రధియః పదాంబుజ మమీ విధ్యుక్తరీత్యాసురా
ధూపోద్గారసుగంధిపుష్పసలిలై ర్దీపైశ్చ బద్ధాదరాః,
అర్చంతో ఽనుకలం ప్రదక్షిణనమస్కారాదికం కుర్వతే
సస్వామీ నిజభక్తరక్షణవిధా వేకోభవేల్లక్ష్మకః.

మ. మన మేకాగ్రముజేసి నిత్యమమరుల్ ♦ మానుల్సధూపాదుదీ
పనివేద్యంబుల నిచ్చిపూజలనొన ♦ ర్ప న్వారిసర్వార్థముల్
ఘనకారుణ్యముతో నొసంగు కమలా♦కాంతుండుదారుండు శ్రీ
వనజాతాక్షుఁడుభక్తసంఘమునకున్♦ బ్రాప్యుండు సుండీభువిన్.

11. పత్తెన్ను పత్తి.

శ్లో. చాణూరభూధరపవిః పరమ స్స ఏవ
ప్రాప్యత్వ ఇత్యుపదిశన్ శఠజి ద్వ్యధా ద్యత్,
సాహ్యస్సమత్ర దశకం పఠతాం జనానాం
ప్రాప్యంభవే త్కమలనాథపదారవిందమ్.

చ. వరదుఁడు మల్లయుద్ధపటు♦ బాహుయుగుండు పరాత్పరుండునా
కరయుగ బ్రాప్యుడంచు మది ♦ నబ్బినభక్తి శఠారి శబ్దవై
ఖరిని రచించినట్టి వెయి ♦ గాథల నీపదిపద్యముల్సదా
దరమున బాడువారలకు ♦ దైత్యరిపుండగు బ్రాప్యమెప్పడున్.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతే రామానుజాయనమః.

దశమ శతకము – ఐదవ దశకము.

[కణ్ణన్ కళలిణై.]

అవతారిక :— ఆళ్వార్లు దిగువతిరువాయిమొళ్ళిలో భక్తి స్వసాధ్యముతో జేరిన పరికారమును సాధించియున్నారు. ఆక్రమమును సహింపలేక ఈశ్వరుఁడు తమ్ము స్వపదమునకు దీసికొనిపోవుటకు త్వరపడుచున్న రీతినిజూచి " వాఁడు తీసికొనిపోగా మనకిఁక వెళ్లకతీరదు. కావున నీచేతనులకు భక్తిమంతులయొక్క చర్య నుపదేశించెదమని యాలోచించిరి. యీయాళ్వార్లను ఎంతెరుమానారువలె కృపావంతులు. కాబట్టి యీసంసారిచేతనులకు భక్తిగలవారిచర్య నుపదేశించి వారికొరత దీర్పవలెనని యెంచి పరోపదేశప్రవృత్తులై ఈశ్వరుఁడు తమ్ములను పరమపదమునకు గొనిపోవ త్వరపడుచున్నాఁడనియు, వినువారికి శీఘ్రముగా బ్రతిపత్తి కలగవలెననియు సంగ్రహముగా నుపదేశించుచున్నారు. భక్తికాలంబనమైనది సర్వేశ్వ

యని తిరునామమనియు నీభక్తియందుదిగువా రనుసంధింపవలసిన మంత్రమిదియనియు దానియర్థానుసంధానమే మోక్షసాధనమనియు, ఆమార్గమునవలంబించి వాని యందుభక్తిగలిగియుండుఁడనియు, కరణత్రయముచేతను వానినేఆశ్రయింపుఁడనియు, ఇట్లాశ్రయించువారికి వాఁడుసులభుఁడనియు, శ్రియఃపతియగుటచే సుఖారాధ్యుఁడ నియు, యీచేతనుఁడు సర్వేశ్వరు నాశ్రయించునట్లు చేసి వీనిదైన్యము నీశ్వరునికి బోధించి వీనిని రక్షించుటకు తగిన పురుషకారము జేయుపిరాట్టి దగ్గరనేయున్నద నియు, ఆశ్రయించునపుడు చేతనునకధికారసంపత్తి యవసరములేదనియు, రుచిగ లవారందరు నధికారులేయనియు, పుష్పాద్యుపకరణములను గ్రహించి వానినాశ్ర యించుఁడనియు, ఇందులో దిగినవారివిరోధులన్నియు నశించుననియు జెప్పి కొన్ని రోజులు మేమింక నిచటనుండకుండ మాపోక సమీపించినది గనుక మీరందరు నా యుపదేశమును స్వీకరింపుఁడని చెప్పిముగించిరి. ఇందులో "కణ్ణన్కళలిగై" అను పాశురము (ఉయిర్పాట్టు.)

1. కణ్ణన్కళలిగై.

శ్లో. భోభో శ్శ్రీకృష్ణపాదాబ్జసమాశ్రయణమానసాః,
నారాయణాఖ్యా సంకీర్త్యా నూనం వచ్మినిబోధత.

ఆ. వె. పరముఁడైనకృష్ణు ♦ పదపంకజంబుల
బడయు మనముగల్గు ♦ భక్తులార
పలుకుచుండుఁ డింక ♦ పలుమారునారాయ
ణాఖ్య పావనిచయు ♦ మంతమొంద.

2. నారణనెమ్మాన్.

శ్లో. కంసవేదండపారీంద్రో మదీశో భూమివల్లభః,
బీజం సర్వజగత్స్రష్టే నారాయణ ఇతిస్మృతః.

తే. గీ. సకలజగదేకకర్త ♦ నాసామి పరుఁడు
భూమిదేవీప్రియుండును ♦ పురుషవర్యుఁ
డిభమదాపహారుండయి ♦ యింపుమీరు
వాఁడెనారాయణుండని ♦ వన్నెకెక్కె.

3. తానేయులగెల్లామ్.

శ్లో. స్వయం సర్వజగద్రూపీ స్వయం సృజతి లుంపతి,
స్వయం నిగీర్యోద్గిరతి స్వయం రక్షతి కేశవః.

తే. గీ. తాన భువనాళి సృజియించి ♦ తానెమి౯ంగి
మరలనుమిసెడువాఁడు త ♦ న్మాతయునయి
భువనతనుఁజూచు నందర ♦ బోషిచువాఁడు
వాఁడెనారాయణుండని ♦ వన్నె కెక్కె.

4. ఆఖ్యానాశ్రీసీర్.

శ్లో. శయానస్య భుజంగేంద్రతల్పే వారిణ్యదన్వతః,
పాదౌ విక్రీర్య పుష్పౌఘై రుపాధ్వం భోజనాన్సదా.

తే. గీ. జలధిజలవిస్తృతాభోగ ♦ సర్పశయ్య
బవ్వళించినవాఁడగు ♦ బరమపురుషు
పాదముల బూల నర్పించి ♦ మోదమెసగ
బూజగావించి పడయుఁడు ♦ ముక్తిపదము.

5. నాడీర్నాడ్రుమ్.

శ్లో. అమ్లానపుష్పాణ్యాదాయ పూజయధ్వం హరింసదా,
నిత్యంగాయత తన్నామ ముక్తి ర్లభ్యేత తావతా.

తే. గీ. పడసి యమ్లానకుసుమము ♦ ల్ప్రతిదినంబు
బరుని నారాయణుని బూజ ♦ బరగఁజేసి
వానిసంకీర్తనంబును ♦ భక్తితోడ
జేయ జేకురు ముక్తి మీ ♦ క్షేమమువిలె.

6. మేఘూ న్వాంగవ న్.

శ్లో. అతసీపుష్పసంకాశో కూటమాల్యస్తపం ధయః,
రమాశ్లేషలసద్వక్షా శేషభూధరసంస్థితః.

తే. గీ. అతసికుసుమాభగాత్రుండు ♦ వితతకీర్తి
పూతనాగూఢవిషపయో ♦ భోజనుండు
దండకాకాదిమస్తక ♦ స్థానమందు
నిత్యవాసంబు జేయుచు ♦ నెగడువాఁడు.

7. మాదవనెన్ను.

శ్లో. నారాయణో రమాకాంత ఇతి వక్తుం క్షమా యది
నశ్యే త్పూర్వార్వాఘవితతి నోత్తరాఘంచ సంస్పృశేత్.

తే. గీ. వెలయ నారాయణుండె శ్రీ • విభుఁడటంచు
నిత్యమావృత్తిజేయుము • నీమనమున
దుఃఖపుంజంబులెల్లను • దూరమగును
పాపములు సేరవిఁక నాదు • పలుకువినుము.

8. శారావేదంగళ్.

శ్లో. ప్రావృషేణ్యపయోవాహవినీలవపుషో హరేః,
నామాని యేతు గాయంతి తేస్యుర్దేవా గతైనసః.

తే. గీ. పాపములు జేరవిఁక మీాస • మీాపమునకు
సజలజలదాభగాత్రుఁడౌ • సారసాక్షు
నామములు నిత్యమెవ్వరి • నాలుకపయి
నాట్యమాడునో వారెపో • నాకులిలను.

9. అమరర్క్కరియానై.

శ్లో. అప్రాప్యస్య విరించాద్యైః ప్రాప్యస్య నిజసంశ్రితైః,
పాదం సంసేవమానా యే తే స్యుస్సంత్యక్త కిల్బిషాః.

తే. గీ. కమలసంభవముఖదేవ • గణమునకును
బొందశక్యముగాని ము • కుందు నెప్పుడు
భజనజేసెడువారల • పాపసమితి
దహనవిప్లుష్టతూలవి • ధంబు నొందు.

10. విణ్ణైఎల్లిరుళెన్నుమ్.

శ్లో. సద్యఃప్రబుద్ధపుష్పాద్యై ర్దేవం పూజయతాన్వహమ్,
వృజినాజ్ఞానసంమోహాః కాందిశీకత్వ మాప్నుయుః.

తే. గీ. పాపసంఘ మవిద్యాస • వాసనముగ
ననలసంప్లుష్టతూలౌఘ • మన నశించు

మాధవాంఘ్రిని మంచిసు • మంబులిడుచు
బూజగావించి ధ్యానింపుఁ • డోజమీఱ.

11. నెడియానరుళ్.

శ్లో. శఠగోపమునీంద్రేణ నిర్మితే ఉక్తి స్సహస్రకే,
దాపయే ద్దశకం హ్యేత స్నరాణాం శ్రీహరేః కృపామ్.

తే. గీ. పరగ సర్వేశ్వరుని కృప • పాత్రుఁడైన
శఠరిపుండు రచించిన • సారమైన
వేయిగాథల నీపది • విడువకెపుడు
బాడువారలు తత్కృపా • పాత్రులెంచ.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతేరామానుజాయనమః.

దశమశతకము — ఆరవ దశకము.

[అరుళ్పెరువార్.]

అవతారిక :— “పొయ్‌నిన్ఱ ఞానమ్” (తిరువిరుత్తము మొదటిపాశురము) మొదలుకొని యింతవరకు నాళ్వార్లు సర్వేశ్వరు ననుసరించినరీతి చెప్పఁబడినది. ఈ తిరువాయిమొళి మొదలుకొని ఈశ్వరుఁడే ఆళ్వార్ల ననుసరించినరీతి చెప్పఁబడు చున్నది.

ఇట్లాళ్వార్లు చేతనులకు భక్తిస్వరూపము నుపదేశించిన తరువాత పూర్వమే తమయెడల నీశ్వరుని కత్యంతానురాగ మతిప్రవృద్ధమయిన ప్రకారమును జూచియున్నారు. ఇప్పుడు తిరువాట్టారులో పరస్థానము వేంచేసియుండి వీరిని స్వధామమునకు గొనిపోవుట కధికత్వరగలవాఁడై యుండెను. వీరి కీశ్వరునియందున్న ప్రీతి కంటె నీశ్వరునికి వీరియందున్న ప్రీతి “పదేపేయం క్షణమపి వినా తామసితేక్షణామ్” అన్నట్లధికతరమై యుండెను. ఆళ్వార్లు నేను కలిసియుండి యనుభవించవలెను. అట్లు వారిని నే ననుభవించునపుడా యనుభవమునకు విచ్ఛేదము లేకుండ నేకాంతమైయున్న యొకదేశవిశేషమందు వారినుంచి యనుభవించవలెనని యాలోచించి ఈశ్వరుఁడట్లు చేయునపుడు వారికి దాను పరతంత్రుఁడైయుండి వీరు నియమించినప్రకారము తాను నడచుకొనవలయునని యూహించెను. గాని యాళ్వార్ల యనుమతి లేకుండ నేమియు జేయజాలక పోయెను. ఆళ్వార్లీశ్వరపరతంత్రులు

గావునతాము వానిని నియమించలేకపోయిరి. ఇట్లు తమయం దత్యంతాభినివేశముగల యీశ్వరుని పరత్వము నట్టిపరత్వముగలవాఁడు తమపట్లను పరతంత్రుఁడై తమకు శేషభూతుఁడై యున్నప్రకారము నను సంధించి యిట్టిస్థితి ముచ్చటించుటకై సంసారచేతనులను జూడఁగా వారన్యపరులై శబ్దాదివిషయ ప్రావణ్యముగలవారై యుండిరి. పోనీ ఈశ్వరునితో ముచ్చటింపవలెనని చూడగా వాఁడును తమయం దున్న అభినివేశాతిశయముచే నేమియు దోచకయున్నవాఁడగుటచే సంలాపగోష్ఠికి దగినవారిని నెవ్వరిని గానరైరి. ఇక దాము తమమనస్సే యుండిరి. ఇఁక వామనస్సును గురించి– ఓ నామనమా– సర్వేశ్వరుని పరత్వమును, అట్టిపరత్వముగలవాఁడు మన యెడల శేషభూతుఁడై యున్న ప్రకారమును మనము వానివలన బొందిన పురుషార్థలాభమును జూచితివాయని తమమనస్సుతో జెప్పుకొని సంసిల్లిరి. ఇంతకుము నుపే యాళ్వార్లు సర్వేశ్వరుఁడు సర్వనియంతయనియు స్వతంత్రుఁడనియు దలంచి యుండిరి. ఇప్పఁడు ఆశ్రితపారతంత్ర్యమే వానికి స్వరూపమని తలంచిరి. మునుపు వీరు తమచేతనే తమపారతంత్ర్యమును ఉదగొట్టుకొన్నారు. ఇపుడీశ్వరునిచే పోగొట్టుకొన్నారు. ఆసంగతి "ఇరుప్పొంవియుంప" లో జెప్పలేదా? అంటే– దానికి దీనికి గొంతభేదమున్నది. "అడియాన్ద మ్మ్రడియనేన్" అని హేతువుతో ననుసంధించిరి. ఇందులో "అరుళ్పెరువార్" అను మొదటిపాశురమే (ఉయిర్పాట్టు.)

## 1. అరుళ్పెరువార్.

శ్లో. శ్రీమద్భాగవతాంఘ్రిసేవనపరే దాసే మయి శ్రీపతిః
ప్రోద్యుంక్తే కరుణాంవిధాతు మయమ ప్యన్వేతిచా స్మద్విధిమ్,
అజ్ఞానావృతసంసృతా విహా నమే జన్మోత్కరో రోచతే
శ్రీవాటీపురనేతు రంఘ్రికమలం సేవస్వ మన్మానస.

మ. వనజాతాక్షికృపారసోక్షితజన ♦ వ్రాతాంఘ్రిభక్తుండనౌ
ననుబ్రోవ న్ననుకట్టియుండె గమలా ♦ నాథుండవిద్యాతమో
ఘనసంసారభవంబు గోరనికనే ♦ కామంబు నజ్ఞానమున్
మనమా వీడుము వాటికాపురవస ♦ న్మానాథు సేవింపుమా.

## 2. వాట్టాత్తాన్.

శ్లో. శ్రీవాటీనగరీశితు శ్శుభకథా స్సంస్మృత్యజన్మాటవీం
చ్ఛేత్తుం గీతిశతై స్తుతిర్విరచయన్ పాపం సమూలంకషన్,

త్యక్త్వా దుఃస్త్యజ దుర్మనోరథదవజ్వాలాపరీతైస్సమం
సంగం మానస సంశ్రితోస్మి చరణం శ్రీశస్య జానాసికిమ్.

ఉ. భవదుఃఖంబు నశింప మద్విభుని శ్రీ ♦ వాటీపురాధీశుపా
దవనేజంబుల గొల్చి సన్నుతులచే ♦ దర్పించి పాపావళీ
దవదాహం బొనరించి లోకజనబం ♦ ధంబూడ్చి వైకుంఠుమా
ధవునిన్ జేరితి నోమనంబ వినుమ ♦ ద్వాక్యంబులీ విత్తరిన్

3. నణ్ణినంనారాయణై.

శ్లో. సంకీర్త్యా న్వహ మబ్జనాభ మధత త్వాదాబ్జమాసేదివాన్
శ్రీవాటీనగరేశితా నరహరి ర్మామేత్య ముక్తించ మే,
దాతుం సంత్వరతే ఫలంతి విపులం కార్యాణినో మానస
శ్రీశాపారకృపార్ఘురీబహుముఖై ర్మాం ప్లావయత్యంజసా.

ఉ. నామముల న్స్మరించి నళి♦నప్రతిమాక్షుని బొంది యుంటిమో
నామనమా ధరాస్థలిని ♦ నాకినిషేవితవాటికాపురీ
స్థేముడు వచ్చి సత్కృపను ♦ దివ్యపదంబును నాకొసంగి సు
శ్లేషవిధాయి యూటకును ♦ సిద్ధముగానిట నుండె జూడుమీ.

4. ఎన్నెంజత్తుళ్.

శ్లో. శ్రీవాటీనగరేస్థితో దితిజరాడ్వక్షఃకవాటచ్ఛిదా
కుట్టాకోగ్రనఖాయుధ శ్శ్రితిశిరోవాగీడ్యసద్వైభవః,
కౌంతేయావనసంభ్రమా ద్రిణభువి ప్రోత్ క్షిప్తచక్రో హ్యాది
స్థిత్వాఽగుంఫయదాదరాచ్ఛ్రితిమయీ మంతర్ద్రావిడీంసంహితామ్.

చ. కొడుకునుబట్టి చంపు పటు ♦ క్రూరనిశాట హిరణ్యువక్షమున్
బుడిబుడి గోళ్లజీరినవి ♦ భుండు వసుంధర వాటికాపురిన్
యిడముగ గొన్న వాఁడుమును♦ వెల్ల మహీశుల గూల్చుబుద్ధిదో
ర్ప్రడిబవరంబునన్ శ్రితుల బ్రోం ♦ దవులం గృపజూచినట్టియా
గడసరి నామనంబునను ♦ గట్టిగ నిల్చి ప్రబంధమొందు నీ
పుడమిరచింపఁజేసి నను ♦ బ్రోచె గృపామతి నెట్టిపుణ్యమో.

### 5. వా నే అ వ త్రి తం ద.

శ్లో. యో వైకుంఠ ముపైతు మాశ్రితజనస్యా ర్చిష్పథం సృష్టవాం
స్తద్వాటీనగరేశితు ♦ స్త్వనుసరన్వాచం విముక్తేః పదం,
ఆహూయాస్మాక్రమితుంతిరస్కురుభవంమత్వాంతపాదంనిజం
తాత్పర్యారోహణలోలుపశ్శిరశి మేన్యాస్థత్కృపాందర్శయన్.

ఉ. ముక్తినిబొంద మాధవుఁడు ♦ మున్ను దయామతినిచ్చినట్టి యా
సూక్తినిబట్టి నేనడచి ♦ శోభనధామము బొందనుంటి మ
త్సక్తమనంబ శ్రీతులసి ♦ దామపరిష్కృతమౌళి సర్వవే
దోక్తిపథాతిగుండు నగు ♦ నుత్తము పాదము నెత్తిఁజేర్చితిన్.

### 6. త లై మే ల్ తా ళి నై.

శ్లో. కంజాక్షో నకదాచిదుజ్ఝతి మమస్వాంతేనివాసం ప్రభు
స్తత్పాదం మమమస్తకేచ నిహితం ధన్యోస్మ్యహం తావతా,
శ్రీవాటీనగరే ధరోపమగృహే నాగేంద్రశయ్యాజుషః
కంసప్రేరితదంతిదంతముసలోద్ధర్తుః పదాబ్జాశ్రితః.

ఉ. నాతలమీఁదనుండె నళి ♦ నాక్షుని పాదము మన్మనంబునన్
బ్రీతిమెయి న్వసించె బృధి ♦ వీధరబృందసమానసౌధవీ
థ్యాతతవాటికాపురము ♦ నందు వసించెడువాఁడు శత్రువి
ఖ్యాతపరాక్రముండు నగు ♦ నాహరిపాదము లాశ్రయించితిన్.

### 7. కు రై క ఴ ల్గ ళ్.

శ్లో. ప్రాప్తః కృష్ణపదాంతికం మమహృది శ్రీశో నివాసంవ్యధా
దుల్లోలాబ్ధిపరీతదక్షిణహరిన్నారీముఖాలంకృతే,
శ్రీవాటీనగరే మహీధరవరప్రోత్తుంగసౌధాంచితే
నిద్రాళో స్తులసీ సముద్గిరతి మద్దేహేఽధికం సౌరభమ్.

మ. కటకాలంకృతతత్పదాంబుజము నే ♦ కాంక్షింపఁ బ్రాపించితిన్
స్ఫుటవార్ధిస్వనఘుష్టవాటికపురీ ♦ భూషాభవ ద్భక్తలం,
పటశ్రీనాథుని పాదపంకజములన్ ♦ భక్తి న్సమర్పించువి

స్ఫుటసౌరభ్యముగల్గు శ్రీతులసిస్ర ♦ క్పుష్పౌఘమెల్ల న్మఱి
త్కటగంధంబుల నీను నాతనువునన్ ♦ గంజాక్షు మాయావిధిన్.

8. మె య్ ని న్నా క మ ళ్.

శ్లో. దేహంచత్తులసీపరీమళలసన్మాణిక్యమాళిర్యథా
సంకల్పం రిపుకృంతనోద్యమచలచ్ఛక్రాయుధాలంకృతః,
ఔదన్వత్సలిలాంజనాద్రిశితవార్వాహాభకాయఃపరో
మత్వాన్వం తే లగతిస్మ తస్యతు మయా కోవోపకారః కృతః.

చ. తనువున బర్వ శ్రీతులసి ♦ దామసుగంధము గల్గువాఁడు చ
క్రనిహతదానవోత్కరుఁడు ♦ కాలపయోధరసన్నిభుండు దా
ననయము వాటికాపురము ♦ నందు జెలంగెడువాఁడు నామనం
బున వసియించియుండుటకు ♦ బుణ్యము నేట్టిది చేసియుంటినో.

9. తి గ ళ్ గి న్న.

శ్లో. వక్షః పీఠసుఖాసికా సుఖితయా లక్ష్మ్యా సమం కేశవ
శ్శ్రీవాటీనగరే స్థితో భవతి తద్వాహః ఖగానాంపతిః,
గర్వాంధాహవబద్ధదోహలసురద్విష్టాబ్జినీ దంతిరా
ణ్మత్వాన్వం తే స్థిరతాముపేత్య నివస న్నాస్తైతి బద్ధాదరః.

చ. వనజనివాసిని న్వపుల ♦ వక్షమునన్ ధరియించి సౌధసం
ఘనిచితవాటికాపురిని ♦ గోపురముందు పతంగనాథకే
తనుఁడు మహాయశంబుగల ♦ దైవము రాక్షసమర్దనుండు నా
మనమున బాయకుండి కడు ♦ మన్ననతో వసియించు నెప్పుడున్.

10. పి రి యా దా శ్నై య్యో న్ను.

శ్లో. ఛిత్వా మద్భవశృంఖలా నిజపదాంభోజాతదాస్యం దద
త్కింతుర్వాణతయా గ్రహీన్మరరిపు ర్వాటీపురీనాయకః,
సైంహీం ప్రావ్యతనుం హిరణ్యకశిపో శ్ఛిత్త్వా భుజంగేశయో
దిష్ట్యాదశరయదాశ్రియేణమహ తాంలభ్యంచమార్గంవిభుః.

ఉ. దాసుఁడవీవు నాకగుము ♦ దాస్యమొనర్చుమటంచు నుజ్జని
త్రాసజరాదుల న్నెడపి ♦ దానవనాథు హిరణ్యుమూర్ఖునిన్
భాసురవజ్రతుల్యనఖ ♦ పంక్తిని జీరినదంభసింహుఁ డా
యాసముదీర శేషభుజ ♦ గాసనశాయిగ వాటికాపురిన్
వాసిగనుండె నాకఖల ♦ వాంఛితము ల్వమకూర్చి యిచ్చుచున్.

11. కాట్టిత్తన్ కనైకழల్గళ్.

శ్లో. త్రాతారం భవవారిరాశిపతనా త్ప్రాపయ్య పాదద్వయం
శ్రీవాటీనగరాధిపం శఠరిపు స్తుష్టావ యేనాదరాత్,
తస్మిన్ స్వద్యసహస్రకే మధుముచ స్సూక్తి ర్దశైతాః పరం
శృణ్వంత శ్శ్రితియుగ్మమాత్ర ఘటకం నిందంతి దేవావిధిమ్.

మ. ధ్వనదత్యర్ఘసువర్ణనూపురలస ♦ త్పాదాబ్జయుగ్మంబు జూ
పి నికామోగ్రభవంబు మాన్పిదయతో ♦ బెన్వాటికం జేరి భ
క్తనికాయంబును బ్రోచుశ్రీధరునిపై ♦ భక్తిన్ శఠారాతి కూ
ర్చినవేయింటిని గూడు నీవదిని సం ♦ సిద్ధుల్మహా సూరులున్
వినికర్ణద్వయమాత్రదాయియనుచు ♦ న్నిందింత్రు వేధన్సదా.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతేరామానుజాయనమః.

దశమ శతకము – ఏడవ దశకము.

[ శెంజొల్కవిగాళ్. ]

అవతారిక :— ఆళ్వార్లు “ విడివగైయే ” అని నైతిరువాయిమొళిలో జెప్పినట్లు పర్వేశ్వరుఁడు తమకు బరతంత్రుఁడైయున్న ప్రకారము ననుసంధించినారు ఆప్రసంగములోనే “ విరైకుழுవు నఱుందుళబం మెయ్‌నిన్ను కమழுమే ” అనియు “ తలైమేల తాళిణైగళ్ ” అనియు పర్వేశ్వరుఁడు తమశరీరమందు బ్రవేశించి కలిసియున్నరీతిని జెప్పినారు. వచ్చి తమతోఁగలిసి తమకు బరతంత్రుఁడై తమశరీరమును విడువజాలక మిక్కిలి యభినివేశముగలవాఁడై యుండుటను జూచి “ నేను మొట్టమొదట “ ఇన్నిన్న నీర్మై యినియామురామై ” అని ప్రార్థించియున్నను నన్నీ విభూతిలోనింక వాఁడుంచుటకు నాచేత నేదో యొకకార్యము జేయించుట

కనగా నీప్రబంధము రచింపఁజేయుటకని యూహించెదను. అంతమాత్రమే కాక యిప్పుడీ నాశరీరమం దధికాదరముగలవాఁడై విడువజాలక కేవలము దేహాచపలుఁడై యున్నాఁడు. నాచేత కవిత్వము చెప్పించుకొనుట యొకవ్యాజము. ఇది యానుషంగికఫలము. నాశరీరమం దాదరము గనపఱుచుటయే ప్రధానము. వీఁడు నా శరీరము నాదరించుట నాపట్ల వీనికున్న యభినివేశమే ముఖ్యహేతువు. ఇట్టి మంచి సమయమందే నాపనిని వీనిచే జేయించుకొందునని తలంచి "దేవరవారిట్లు దాసుని శరీరమందింత యాదరము గనపఱచుట కభిప్రాయమేమి యని సర్వేశ్వరు నడిగిరి. వాఁడును మీశరీరమం దాదరముగలవాఁడనై యిన్నిపాట్లు పడుచున్నాను. ఇంతకంటె మఱేమియు కాదనెను. అందుపై నాళ్వార్లు దేవరవారీ యాదరమును విడువవలెనని విన్నవింపఁగా నిది వాని యభినివేశమును మఱింత పెంచుటకొఱకే హేతువయ్యెను. ఎట్లనగా- లోకములో గొందరు తమదౌర్లభ్యము నెదుటివారికి గనపఱచినకొలది వారు వీరిపై హెచ్చుగా నాదరము గలవారగుదురు. ఇదియు నట్లనే-

సర్వేశ్వరుఁడిట్లు తమశరీరమందుఁజూపుచున్న యాదరమును జూచి యాళ్వార్లు "నన్నీశరీరముతోనే యీశ్వరుఁడు తనపదమునకు గొనిపోవ నిశ్చయించినట్లు కానవచ్చుచున్నది. ఇక నీసంసారము మనకు నిత్యానువృత్తమై యుండును. ఎట్లైన నీదేహమును విడుచుకొనవలెను" అని తలంచి "నాకిది యభిమతము. నాశరీరమం దాదరమును దేవరవారు విడుచుకొనవలయునని విన్నవింపగా మీరు మీయుద్దేశమును విడువలేనట్లు నేనును నాయుద్దేశమును విడువలేనని ఈశ్వరుఁడు పలికెను. అందుపై నాళ్వార్లు శరీరముయొక్క దోషముల నీశ్వరుఁ డెన్నఁడెఱుఁగఁడు గావున దీనియందింత ఆదరమును జూపుచున్నాఁడు. దీనిదోషములను గనపఱచినచో విముఖుఁడగునని తలంచి "స్వామీ! యీనాశరీరము షడ్భావవికారములతో గూడినదియై హేయమై యుండునది. ఆత్మవలె నాదరవిషయము కాదు. కావున దీనియం దిట్టి యాదరమును జూపుట దేవరవారికి దగదని విన్నవించిరి. అభిమత కామినీశరీరగతమాలిన్యము కాముకుని కిష్టమైన ట్లాళ్వార్లు నిషేధించినకొలది యీశ్వరునికి వారి శరీరమం దాదరము హెచ్చెను. సర్వప్రయత్నములచేతను దీనిని విడిపించుకొనవలెనని భగవత్సన్నిధిలో శరణాగతి జేసిరి. ఈశ్వరుఁడు వీరు చెప్పినట్లు చేయువాఁడు గావున నంతటితో నుపేక్షించెను. కాఁగా నీప్రకారముగా నారంభించిన పారతంత్ర్యమును నిగమించి సర్వనియంతయు సర్వాధికుఁడునైన సర్వేశ్వరుఁడు తనకు వీరిశరీరమం దాదరమున్నను వీరు నిషేధింపఁగా విరమించెను. అందు కాళ్వార్లు "ఆహా- ఏమి- యీశ్వరుని సౌశీల్యము" అని కొనియాడిరి. ఈవిషయమందింత

మరెవ్వరు దిగకూడదు. దిగి నేపడినపాట్లు చాలునని ప్రీతిప్రకర్షచే పతులతో జెప్పినిగమించిరి. దీనిలో “మంగవొట్టున్మామూర్తై” అను పాశురము (ఊయి ల్పాట్టు.)

1. శెంజొల్క్కవిగాళ్.

శ్లో. రక్షంతః కవయః పరంకవయత స్వాత్మాన మాత్మేశ్వరం
మాయావీ వనభూధరాగ్రవసతి ర్భూత్వాచ మాయాకవిః,
మద్దేహేన మదాత్మ నైక్యముపయన్ భుక్త్వో భయం సాదరం
పూర్ణో మత్యభిమానితాం దధదిదం శీలం కథం వర్ణ్యతే.

చ. లలితవచోవిలాసగుణ ♦ లాలితసత్కవులార ప్రాణముల్
మెలకువతోడ గాచికొని ♦ మేలగుదాస్యమొనర్చు జూడుడీ
వెలయగ వానభూధరని ♦ విష్ణుడు వంచకతన్వహించి మా
యలకవియై మదీయహృద♦యంబున జొచ్చిరమావధూటికిన్
దెలుపక సత్ప్రబంధమును ♦ దెల్లముగా రచియింప జేసి న
న్గవిసియు నేనెదానగుచు ♦ గష్టముల న్బడబాపె సత్కృపన్.

2. తానేయాగినిఱైందు.

శ్లో. ఆత్మానంనుమకాలేన్యతోఽనుభవితాపూర్ణః ప్రధానశ్చర
స్థాస్నుప్రాణివిశిష్టసర్వజగతో నేతా సభూత్వా హ్యహం,
ఆత్మానం స్వయమాత్మనైవ నుతిభి స్సత్వా మధుక్షీరవ
న్మహ్యంచ స్వదమానతా ముపగతో వానాద్రినాథోఽభవత్.

శా. నాయాత్మానుభవంబు నింపొనర దా ♦ న్గావించి నానావిధ
చ్ఛాయన్ లోకములెల్లనిండి జగతీ ♦ సందోహమ్ముంజేసి తా
నాయాయిస్థిరజంగమాదులకుదా ♦ నంతస్థితుండై సదా
ధ్యేయుండై వనభూధరాగ్రవసతిన్ ♦ దీపించు భక్తార్థియై.

3. ఎనైముత్తుముయిరుందు.

శ్లో. భుక్త్వాఽత్మాన మథానువిశ్య మలినే మద్విగ్రహే ప్రీతిమా
నాత్మాత్మీయనియంతృతా మధిగతో మాయూ పరేశో హరిః,

యస్యాభ్రంకషకూట మావసతి తం వానాచలం దాక్షిణం
నత్వాన్యత్ర సరామికిం మురరిపో హాసత్కృపోదారతా.

శా. నాలోనన్ తనువందుజొచ్చి యధికా ♦ నందంబుమీఱంగ నా
కేలోపంబును లేకసర్వవిధదా ♦ స్యేష్టాప్తినొందించి యే
లీలంద్రుప్తుఁడుగాక శ్రీధరుఁడు ని ♦ ల్లేపస్థితి న్వానభూ
శైలాగ్రంబున నుండె సుస్థిరనివా ♦ సంబొప్ప నే గొల్వగన్.

4. ఎన్గొల మ్మాన్ తిరువరుళ్.

శ్లో. సర్వప్రాణిజగన్నియామకతయా రాజన్నపి ప్రీతిత
స్సాధీయానితి దేహముజ్ఝితినమే పత్యా త్రిలోకత్రయః,
ద్వైతేయాంతకరోఘటాత్మజదిశాయోషిన్ముఖే చిత్రకం
వానత్త్మాధర మస్మదీయ మజహాత్కావా కృపా శ్రీపతేః.

మ. జలజాతాసనశంకరాదికత్రిభు ♦ క్సంసేవ్యపాదాబ్జుఁడౌ
బలివిధ్వంసి నను న్స్వదాసు నధమున్ ♦ స్వాయత్తునిం జేయగా
దలపున్గల్గివనాద్రిమస్తకమునన్ ♦ దానుండె నద్దేశమే
యిలమత్ప్రాప్యము వేరుగాగలఁడెనా ♦ కెన్నంగ దానన్యమున్.

5. సన్నావశురర్.

శ్లో. ద్విష్టాశేషపలాదనాశ మఖిలశ్రీశాంఘ్రిభక్త్యుచ్ఛ్రయం
సర్వోపాసకమానిపుంగవమహానందైకసంధాయకమ్,
భూత్వా హం విరచయ్య గానవిలసద్గాథాసహస్రం స్తువ
న్వ్యైన స్వం వనభూధరేంద్రవసతి హాసాపేక్షేణ తద్గాయతి.

ఉ. పొందనిదానవుల్ల్వాలియ ♦ బొందినదేవులు వృద్ధినొంద స
ద్బృందము సంతసిల్లగ గ ♦ వితృమున న్బలికించి సత్కృపన్
పిందొనరింప వీనులకు ♦ విశ్వజనాళికి దాని బాడు గో
విందుఁడు వానభూధరని ♦ విష్టతి నొంది ప్రహృష్టచిత్తుఁడై.

6. తిరుమాలిరుంజోలై.

శ్లో. యం దృష్టుం [illegible]శంకరా వశకనా భక్తింవహంతౌ పరా
మీడాతే పదపంకజం నిజమనోఽభీష్టార్థసంసిద్ధయే,

రో లోకత్రయ మాత్మకుక్షికుహరే నిక్షిప్య రక్షేన్మహా
కల్పాంతే సవనాద్రిగో మదవన వ్యాముగ్ధచేతాః పరం.

తే. గీ. బహ్మరుద్రులు నుతియింప ♦ బహువిధముల
వారికోర్కెల దీర్చియు ♦ ప్రళయమందు
కుక్షినిక్షిప్తలోకుఁడై ♦ రక్షసేయు
బక్షిరథుఁడుండె వానాద్రి ♦ బరమ కృపను.

7. అ రు కై యీ మె న్న మా నే.

శ్లో. దయస్వ స్మాన్స్వామిన్నితి పురహరాబ్జాసనశచీ
పతిప్రేష్ఠా దేవా మునివరగణా శ్చాపియమినః.
స్తువంతో యం భక్త్యా హ్యరి నిదధతే వన్యమనసో
వనక్ష్మాభృ త్తస్యావనధగిరి రస్మద్వృజినహా.

మ. కృప మమ్మేలుమటంచు బ్రహ్మయునభుఁ ♦ కేశుండు సుత్రాముఁడున్
విపినంబందు దపస్వినర్చుమునులు ♦ న్వేర్వేరుగా భక్తితో
విపులస్తోత్రము జేతురేవిభుని నా ♦ వేల్పుండు వానాద్రినా
కుపరప్రాప్యముసర్వకాలమును నా ♦ కోర్కెల్ఫలించుంజుమీ.

8. తి రు మా లి రుం శో లై మ లై యే.

శ్లో. వానక్ష్మాధరమస్తకే ఫణిమహీభృచ్ఛృంగభూమౌ విభు
ర్వైకుంఠే కలశాంబుధౌ వితనుతే యాం ప్రీతి మత్యుత్కటామ్.
తాం ప్రీతిం విదధ న్మదీయతనువాక్కర్మాత్మహృన్మస్తకే
ష్వద్ధా మాం నజహాత్యసౌ క్షణమపి త్రైలోక్యనాథో హరిః.

చ. వనకుధరంబు నాకలశ ♦ వార్ధియు నాదుశిరంబు మారుతా
శనకుధరంబు నాయొడలు ♦ శాశ్వతధామ మదాత్మ నామనం
బును క్రియ వాక్కు నెప్పుడును ♦ బూనికతో విడువంగబోదులో
క నిచయవంది తాంఘ్రిసవ ♦ కంజయుగుండు మహాద్భుతంబగున్.

9. ఊ త్త్రి ము ద ల్వ నో రు వ నే.

శ్లో. కల్పే కల్పే త్రిలోకీం సృజతి వయునతః ప్రాతి యోలుంపతేచ
ప్రాకామ్యం యస్యభూతిష్వవితథ మమరానీక పైగ్యస్సమీడ్యః

యో వార్ధిశ్శ్యామలాంగో వనగిరినిలయుంతస్యపద్మావిభో స్త్వం
మాత్యాక్షీస్స్వాంతకాయువ్యయుమనుభవితుం బాధ మంగీకురుష్వ.

మ. ప్రతికల్పాది సృజించి సర్వజగము ♦ ల్పాలించి తున్మాడి శ్రీ
పతి వారాశిసమానవర్ణుఁడు స్ఫుర ♦ త్పంకేజనేత్రుండు దై
వతనాథుండు వసించియుండెడు లస♦ద్వానాద్రి నోస్వాంతమా
సతమున్బాయుకకోల్పుచుండుమది యే♦ సర్వార్థదంబౌసుమీ.

10. మంగళాష్టుప్రార్థనమై.

శ్లో. వానప్రస్థాధరనిత్యవాసరసిక స్వామిం స్త్వదంఘ్రిశ్రితం
దాసంత్వద్విహితాద్విమోచయ దృఢాన్మాయామయాద్బంధనాత్,
యుస్యా గ్రంథిపరంపరా మహదహంకారౌ మనఃపంచక
ద్విత్వఖ్యాత మథోభయేంద్రియగణం భూతౌఘమాచక్షతే.

తే. గీ. నన్నురక్షింపవానాద్రి ♦ నున్నవాడ
మహదహంకార ప్రకృతిత ♦ న్మాత్రవిషయ
లాలసేంద్రియగణబంధ ♦ లర్ను నన్ను
వేగవిడిపించి కావవే ♦ విమలచరిత
నాశనముజేసి రక్షింపు ♦ నన్ను వేగ.

11. మానాంగారమనంగెడ

శ్లో. మానాహంకారదుష్టేంద్రియవితతిమనోవశ్యతాం మేనిహత్య
ప్రోద్యత్కారుణ్యనిఘ్నో మమ మనసివిశన్మత్పరశ్చాభిమంతా,
శ్రీశోభూదిన్ద్వద్గంప్రముదితహృదయ స్తంశతారిస్స్వవన్య
త్సాహసంనిర్మమే తద్గతదశకమిదం వానభూభృత్పరంస్యాత్.

ఉ. ఇంద్రియపంచకప్రభుత ♦ నేపడగించి మనోమహత్తులన్
సాంద్రముగాగ మర్చించి నను ♦ సాకెడుసారసపత్రనేత్రునిన్
యింద్రమణిప్రభాంచితుని ♦ హెచ్చుగుభక్తిని శ్రీశతారిమా
నీంద్రుఁడు కూర్చినట్టివెయి ♦ నీపదిమంగళపద్యము ల్వనా
ద్రీంద్ర సుసంగతంబులని ♦ శ్రీశఠవైరి యొసంగె సత్కృపన్.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతే రామానుజాయనమః.

## దశమ శతకము - ఎనిమిదవ దశకము.

[తిరుమాలిరుంశోలై.]

అవతారిక :— ఆళ్వార్లు అరుళ్చెరువారులో సర్వేశ్వరుఁడు తమయెడల జూపిన పారతంత్ర్యమును చెప్పియున్నారు. శెంజొల్కవిలో నాపారతంత్ర్యమును కొనవరకు నడిపించినప్రకారమును చెప్పిరి. మీరు చెప్పినట్లు చేసెదమనితల యూపిరి. సర్వేశ్వరుఁడు వీరిని శరీరముతో పరమపదమునకు గొనిపోవుటకునిశ్చయి మీనడుమ చెప్పఁబడినది. " శెత్తుంపరవై త్తానేను త్తివాన్ " అన్నట్లు గరుడవాహనారూఢుఁడై వచ్చి వీరిని విషయీకరించెను. ఆగరుడునితో వచ్చి వీరిని తీసికొనిపోవుట కాలోచించెను. కొందరి నాతివాహికుల ద్వారా రప్పించును. మరికొందరిని గరుడుని పంపించి తెప్పించును. గరుడునిమీద నెక్కి వచ్చి తానే స్వయముగా దీసికొని వెళ్లదగినవారు వీరు " అహం స్మరామి మద్భక్తం నయామి పరమాంగతిమ్ " అనిసాధించియుండెను గదా. కళ్వన్గొల్లిపిరాట్టిని మనుష్యులను బెట్టి తీసికొని వెళ్లి తేగదా వీరిని మనుష్యుల ద్వారా తీసికొనిపోవుట. " నానిలఁవాయ్ కొండు నన్నీఅర మెన్ను కొతుకొండవే నలంశెల్వన్ కువైత్తుమిళ్లపాపై కండపాన్నే " అన్నట్లు సంసారమనెడు మరుభూమిని దాటిపోతిమి, " నచపునరావర్తతే" అని చెప్పఁబడు దేశమందు ప్రవేశించితిమి" అని తానే చెప్పియున్నాడు.

కాఁగా సర్వేశ్వరుఁడిట్లు తమ్ముల దీసికొనిపోవుటకు త్వరపడుచున్న ప్రకారము ననుసంధించిరి. ఇతఁడిట్లు నన్ను దీసికొనిపోవుటకు గారణమేమని యాలోచింపగా తమయందేమియు గనపడలేదు. మొదట సర్వేశ్వరుఁడు వీరికి దనయందద్వేషమును పుట్టించి దానిమూలముగా వీరియందు విశేషకటాక్షమును జేసి, దానివలన దనయందు వీరికిచ్ఛను గలుగజేసి " తానే యుపాయము " అను బుద్ధిని బుట్టించి, అసహ్యాపచారబహుళులై యున్న వీరి సకలాపచారములను క్షమించి, శబ్దాదివిషయములందు ప్రావణ్యముగల వీరిని, "పలనీకాట్టి పడుప్పాయో" అని పలుకునట్లు చేసి, తన్నువిడిచి నిముషముండలేని యవస్థను గలిగించి, తానేవచ్చి స్వయముగా వీరిని దోడుకొని పోవుటకు త్వరపడుచున్న రీతిని జూచి, " ఇప్పుఁడు నాయందింత యాదరమును జూపుచున్న సర్వేశ్వరుఁడు పూర్వమందు చిరకాలము నన్నువిడిచి యెట్లుండెను. నేఁడిట్టియాదరము జూపుటకు హేతువేమియని విచారింపగానే హేతువు వీరికి గనపడలేదు. ఈపురుషార్థమును తమమూలముగా వచ్చినది కాకపోవుటచే తమయెడల నొకయోగ్యతను వీరు కానలేదు. మునుపటికంటె నిపుడు తమ

కొక గొప్పతనము కలిగినదని తలంచువారు కారు. చిరకాలమునుండి వీరిని లభించవలెనని కోరుచున్న యీశ్వరుఁడు వీరికిపుఁడు క్రొత్తగా నొకటేమియు చేయదలంచి యుండలేదు. సర్వజ్ఞుఁడైనవానిచే దీనికొక సమాధానమును జెప్పుమని అడిగెదమని సంకల్పించుకొని ఆళ్వార్లు స్వామితో నిట్లనిరి. "స్వామీ! దేవరవారు నేడింతలవరముతో జ్ఞానదేహము నింతకమునుపనాదికాలమునుండి యెందుకుపేక్షించిరి. అందుకీశ్వరుఁడు "మీకున్న అద్వేషముబట్టి యిట్లుచేయుచున్నానని అనజాలకపోయెను. ఆయద్వేషముసైతము తనవలననే కలిగినదని తానెఱుఁగును. ఇంతియ కాక అది పురుషార్థమును సాధించుటకు దగినయుపాయముకూడ గాదు అయ్యో వీరిని సమయమందు రక్షింపఁజాలక వెనుకబడితినే యని లజ్జించుటతప్ప రక్షకునికి రక్ష్యవర్గమును చిరకాలము విడిచియున్నందుకు వేరేమియొక యుపపత్తి చెప్పవలసినది లేదు. అందుచే దీనికిదగిన ప్రత్యుత్తరము చెప్పఁజాలక తలవంచుకొని కాలిబొటనవ్రేలిచే నేలను వ్రాయుచునూరకయుండెను.

మొదట జగత్సృష్ట్యాదులనొనర్చి తనయందిచ్ఛ పుట్టించుటకు మార్గమును గల్పించెను. ఆమార్గముచే దనయం దిచ్ఛబుట్టించెను. తనయం దుపాయభావము నారోపించుకొని "షాయ్నిన్నఞానమ్" మొదలుకొని యింతవరకు వీరికి దనయం దాభిముఖ్యమును గలిగించెను పరభక్తి మొదలుకొని పరమభక్తివరకునైన దశావిశేషముల బుట్టించెను. దీనినంతయును పూర్వమే యెందుకు జేయలేదని యడుగగా జెప్పవలసిన ప్రత్యుత్తరమేమియు దోచకపోవుటవలన నిరుత్తరుఁడై యుండెను. దీని నంతయును విచారించి యీయాళ్వార్లు— సర్వేశ్వరుఁడు తమవిషయమై చేసినవిశేషకటాక్షమును దానికిమూలమైన వానికృపాదిగుణముల ననుసంధించి "ఓహో యేమి వాని నిర్హేతుకకటాక్షము. అనియాశ్చర్యవిద్ధులై సంతసిల్లుచున్నారు. ఇందులో "ఇన్నైస్ప్రాకళాక్కి" అనుపాశురము (కాయిన్బాట్టు.)

## 1. తిరుమాలిరుంశోలై మలై యెన్నే.

శ్లో. వసుధరఇతీరితే మయాసౌ హరిరవిశన్మమ మానసే రమేశః,
కుసుమణివిలసత్కవేరజాయాస్తటభువి నామపురీహ రేనివాసః.

తే. గీ. వానభూధరమంచునే ♦ బలికినపుడె
వనజనేత్రుండు నిండె నా ♦ మనమునందు
తన్నివాసము కావేరి ♦ దక్షిణదిశ
వెలయు నామపురంబని ♦ విబుధులండ్రు.

2. పేరేయు రైగిన్న.

శ్లో. ఆగత్య సంప్రతిహి నామపురీనివాసీ
ముంచామి నైతదితి మే హృదయం ప్రవిష్టః,
కల్పావసానగిళితాఖిలసప్తలోకీ
దుష్పూరతుందకుహరం దృఢ మాశ్రితోఽస్మి.

తే. గీ. నామపురవాసి హరి నామ ♦ నంబునందు
వదలనని చెప్పి వసియించె ♦ వాఢ్యు లేదు
పర్వతము లేదు జగముల ♦ పంక్తి పరవి
మెసవి నిండనియుదరంబు ♦ వసజెలంగు
వనజనాభుని బట్టితి ♦ వదలకుండ.

3. పిడిత్తేన్ పిగవి కెయుత్తేన్.

శ్లో. ప్రోత్తుంగధ్వజమాలినీం పృథుగృహప్రాసాదవప్రాంచితాం
నామాఖ్యాం నగరీ మధిష్ఠితవతః పాదం సుఖే నాస్తవాన్,
తత్పాదాశ్రయణా దియంభవఘురీ శుష్కా నివృత్తాగుజ
స్సంసారస్య నిదాన మాపవిలయం మాయైవ చాభాతి మే.

ఉ. మేడలు మిద్దెటిండ్లు మణి ♦ మేదురగోపురసంచయంబుల
న్గూడిననామపూర్వరము ♦ గూర్మి వసించువరేశు పాదముల్
వాడనిపూలఁబెట్టి వరి ♦ వస్యలజేసి వశంబు జేసితిన్
వీడెభవంబుమాయయును ♦ వెన్నుని సత్కృపనొంది ధన్యుడన్.

4. ఎళిదాయినవార్.

శ్లో. హృష్టో భవామి హృది పాదసరోజయుగ్మం
విష్ణో స్సులభ్యమితి బాష్పజలావిలాక్షః,
శౌకస్వనప్రికటపుష్పవనోపగూఢ
శ్రీనామపత్తనవిభు ర్వితరే త్స్వపాదమ్.

తే. గీ. సులభమయ్యెను దత్ప్రాప్తి ♦ చోద్యమిదియె
యనుచు మనమున నానంద ♦ మందుచుంటి

శుకపికధ్వానముఖరిత ♦ సుమవనాళి
నామపురవాసి యొసగును ♦ నాకుముక్తి.

5. వానేతరువాన్.

శ్లో. పుష్పాసవార్ద్రవననామపురాధివాసీ
దాతుం స్వకీయ పద మాశ్రితవా న్ప్రమేశః,
మజ్జాస్థిమాంస బహుళం వపు రాస్థితో మే
కూర్యాణి సుష్కృతశతా న్యలునాద్దయాళుః.

తే. గీ. మధురసాపూర్ణసుమ ♦ వనీమాన్యనామ
పురనివాసి యొసంగగ ♦ బరమపదము
ప్రీతిన జేసి మదీయాత్మ ♦ బరగజొచ్చి
పాపములనెల్ల బాపెను ♦ వరదుఁడగుచు.

6. తిరుప్పేర్నగరాన్.

శ్లో. వసుధరనివాసీ నామపూర్ణిత్యసంస్థో
మమసవిధమిదానీ మేత్య మచ్చిత్తపీఠే,
న్యవసదథ తదీయానంతశుంభద్గుణౌఘా
మృతసరసి నిమగ్న స్సావలేపోస్మి జాతః.

తే. గీ. నామపురవాసి వానాద్రి ♦ నాథుఁడైన
సామి మన్మానసంబు సం ♦ స్థాయముగను
గానెను దత్ప్రీతిపాత్రత ♦ గూడెనాకు
దుద్గుణానుభవం బెప్పు ♦ దనరఁజేతు

7. ఉందుకళిత్తైర్కు.

శ్లో. సంసేవ్య తోషమయతో మమ నేత్రయుగ్మా
న్నైతి నామపురవాససుఖీ ముకుందః,
కింలుప్యతే ఽనుభవతో హరిమేవనిత్య
మంత్యంన మోవచన మప్రతిమం ప్రయుంజే.

తే. గీ. భృంగఝుంకారముఖరిత ♦ తుంగపుష్ప
వనవిరాజితనామపు ♦ ర్వనవిహారి
మరిగి సేవింప నాకన్ను ♦ మరువఁడెపుడు
కోరతలికనేమి తద్గోప ♦ కులజుకృపను.

8. క ణ్ణు ళ్ నిన్న గ లా న్.

శ్లో. నిత్యం మదక్షివిషయో మమ ముక్తిదానే
సన్నహ్యతి ప్రథితనామపురాధివాసీ,
వాచామగోచరమహావిభవో ఽతిభోగో
నిర్హేతుకం మమమనః ప్రవివేశ రాగాత్.

తే. గీ. కంటినెడబాసి కదలఁడు ♦ కనులనయనుఁ
డవ్యయపదంబు నాకియ్య ♦ నభిలషించు
రమ్యహర్మ్యఘనామపు ♦ రస్థితుండు
ప్రీతితోఁజేరె నామనః ♦ పీఠినిపుడు.

9. ఇ న్నై న్ఱు హా రు ళా క్కు.

శ్లో. అసత్కల్పం శ్రీశ స్వపదిగమయా న్వాస్తుపదవీం
మదన్తశ్చాత్మానం నిదధ ఇభరాజావనపరః,
పురా కింమాం క్షేప్తుం బహిరిహ నిమిత్తం దదృశివా
నితి ప్రష్టుం నామాహ్వయనగరనాథం వ్యవసితః.

తే. గీ. క్షితిని నన్నొకవస్తువు ♦ జేసి యతఁడు
జొచ్చెనాయందు సంప్రీతి సూరులలర
పర్వతోపమసౌధవి ♦ భాసిరైన
నామపురమున వసియించు ♦ కామజనకు
విన్నవింపగ నొకటినే ♦ వేఁడుకొందు.

10. ఉ త్తే ను గ ం దు.

శ్లో. కింకృత్య తేఽంఘ్రికమలం భగవన్ప్రపన్న
స్తుష్టోస్మి వాంఛిత మితః పరమేత దేవ,

సద్యస్సురోధ్యుషితనామపురీట్పదాబ్జ
భృంగాయమాణమనసో ఽభిభవే న్న దుఃఖమ్,

తే. గీ. పాపముల బాపునీపాద ♦ పద్మములకు
దాస్యవృత్తిని బచరించి ధన్యు(డైతి
వైదికోత్తమ వైష్ణవా ♦ వాసమైన
నామపురమునవసియించు ♦ నళిననాభు
దాసులకు దుఃఖమెంతయు ♦ బాసిపోవు.

## 11. ని ల్లా వ ల్ల ల్.

శ్లో. సస్యాఢ్యనామనగరీం ప్రతి కారిసూను
ర్యాం ప్రాణయ ద్దశశతీం ఫణితిప్రగల్భామ్,
తస్యా మిదం దశక ముచ్చరతాం నశోకః
ప్రాప్యం భవే త్పరమఖం కమలా ప్తదీప్రమ్.

తే. గీ. అమలభక్తుల కాటప ♦ ట్టైనకురుక
వెలసినశఠారి కూర్చిన ♦ వేయిలోన
నీపదింటిని జదువంగ ♦ నింపుమీఱ
భక్తులకు దుఃఖముండదు ♦ పరమపదమె.

శ్రీ మ తే శ ఠ కో పా య న మః.

---

శ్రీమతేరామానుజాయనమః.

## దశమ శతకము – తొమ్మిదవ దశకము.

[కూర్మకుంబు.]

అవతారిక :— పరమయోగులకు బుట్టదగిన పరభక్తి వీరికి జనించినది. ఆ ప్రకారముల నీతిరువాయిమొళివర కనుభవించిరి. ఇక నీవిభూతిలోనుండి యను భవింపదగిన దెద్దియు లేకపోవుటచే బరమపదమునకు బోవలెనని మనోరథించిన వీరిని దీసికొనిపోవలెనని వీరికంటె నధికతరత్వరగల యీశ్వరుడు వీరికి బరమపదప్రా ప్తియందు హెచ్చుతృష్ణ గలిగించుటకు దనయొక్క స్వరూపరూపగుణవిభూతుల గంటితో జూచినట్లు విశదముగా బ్రకాశింపజేసి యనుగ్రహించెను. అనగా

వేదాంతములయందు ప్రసిద్ధమైన అర్చిరాదిమార్గమును, శరీరవియోగసమయ మందు సంభవించు క్లేశమంతయు శాంతించునట్లు తానువచ్చి ముఖము గనపర్చుట యును, అర్చిరాదిమార్గమందు బోవుముక్తపురుషులకగు సత్కారములు, ఆమార్గముగుండా పోయి ప్రవేశింపదగిన పరమపదమును నిత్యసూరులువచ్చియీ ముక్తపురుషుని యాదరించుప్రకారమును, పిరాట్టిమార్లు, శ్రీవైకుంఠనాథుడు ముక్తుని కెదురుగావచ్చి యాదరించువిధము, నిత్యసూరులు సేవింపగా నీశ్వరుడు పిరాట్టిమార్లతో వేంచేసియున్నరీతిని పరమప్రాప్యులైన నిత్యసూరుల మధ్యను తామానందనిర్భరులై యున్నప్రకారమును గనపర్చగా జూచి సంతుష్టులై దాని నన్యాపదేశముగా జెప్పి యనుభవించుచున్నారు. ఇచట నన్యాపదేశమనగా— నీ యాళ్వార్లకు సర్వేశ్వరుడు కటాక్షించిన పురుషార్థమును శ్రీవైష్ణవులందరు పొందునట్లుచెప్పినది. ఈవిభూతిలోనున్న మనకుగూడ నాళ్వార్లు లభించిన పురుషార్థ ముతప్పదని నమ్మియుండుటకొఱకు. ఇందులో "వందవరెదిర్ కొళ్ల—" అను పాశురము (ఉయిర్పాట్టు.)

## 1. శూళ్విశుంబు.

శ్లో. ఆనందావహతుంగమంగళగుణగ్రామస్య మత్స్వామినో
దృష్ట్వా భక్తజనా న్వైకుంఠనిలయం చార్చిష్పథేనాగతాన్,
హర్షాదంబరభూమణా జలధరా స్తూర్యస్వనం చక్రిరే
ఉద్వేల స్సరితాంపతిః ప్రముదితో హాల్లీసకా నాతనో
త్సప్తద్వీపగతా స్సముహార్ణపరా స్సన్నేహిరే సోపదాః.

చ. శుభగుణకీర్తిమందిరుని ♦ సూరిజనస్తవనీయు శ్రీధరున్
యిభపతిరక్షకు న్సతము ♦ నింపుగగొల్చెడువారి జూచి యా
నభమునమండు మేఘములు♦నమ్రితజేసెను తూర్యరావముల్
రభసమెలర్ప వార్ధులు త ♦ రంగకరంబుల నెత్తియాడగన్.

## 2. నారణన్ తమురై.

శ్లో. దృష్ట్వా శ్రీపతిపాదభక్తినిరతా న్ముక్తే రియాసూ న్పదం
జీమూతా స్సజలా హిరణ్యకలశీశోభా ముదూహుః పరామ్,
అర్ణోరాశితతి ర్జఘోష జనతా బద్ధాంజలి స్సాదరం
కేతూకృత్య మహామహీధరచయం భక్త్యా నిషేవేచ తాన్.

మ. హరిభక్తాఘోషము జూచి సంతసముతో ♦ నంభోదసంఘాతముల్
భరితాంబూజ్జ్వలహేమకుంభములతో ♦ భవ్యానిరాజిల్లగా
స్థిరతందాల్చి పయోధులెల్ల నొనరిం♦చెం దూర్యఘోషంబులన్
ధరలో దోరణపంక్తిగట్టిరి నరుల్ ♦ దండంబుల న్బట్టుచున్.

3. తో ర ణ ద న రు ల గ ర్.

శ్లో. కరిమత్రియమితావనేః పదసరోజ మాసేదుషా
ముపర్యదితినందనాః కుసుమవృష్టి మాన్యన్ముదా
వికుంఠ ముపసీదతా మయమయం సుపంథా ఇతో
ముఖం ప్రసరతేతి తాన్మనయ ఊచు రభ్యుద్గతాః.

మ. ధరణిం గొల్చినవానిభక్తులకు నా ♦ ధ్వస్థానగుల్ దేవతల్
పరమామోదముతో సుగంధభరధూ♦పంబిచ్చి నానాసుమో
త్కరవర్షంబుల వారిపైగురిసి హా♦స్తంబెత్తిముక్కన్సురల్
సరణి న్వారెదురేగి రండిటిదె మీ♦సంప్రాప్యమార్గంబనన్.

4. ఎ దు రే గి రి సు ర వ ర్.

శ్లో. ప్రత్యుద్గమ్య రమేశభక్తినివహాన్ క్ష్మాప్తాపకార్యా స్సురా
స్తేభ్యో మూర్ధ్ని నివేశితాంజలిపుటా స్సందర్శనతప్రీతయః,
భేర్యః కల్పవిరామమేఘవివరప్రోద్గీర్ణభీమాశని
వ్రాతాపాతవిదీర్ణ మేరుశిఖరాస్ఫోటారవా దధ్వనుః.

చ. పరిమళవాహిమాల్యవిని ♦ బద్ధకిరీటుని భక్తకోటికిన్
కరము సపర్య సల్పుమతి ♦ గల్పనసేసిరి వాసభూము లం
బరచరు లన్యులిద్దిచను ♦ మార్గమటంచునువారితోడ జె
ప్పిరి జలధు ల్మృదంగరవ♦వృత్తి వహించుచుమ్రోసెనత్తరిన్.

5. మా త వ న్ త మ రె న్ను.

శ్లో. శ్రీవైకుంఠ ముపేయుషాం దివిషదో మధ్యేపథం సంస్థితా
యుష్మత్పాదరజఃకణేన వసతీ ర్నః స్సంపునీత క్రమాత్,
గృహ్ణీతా స్మదనుగ్రహాయ పదవీం న స్సత్వరం యామయమి
త్యాచుర్యజ్వగణో దదౌ క్రతుఫలం గీతం జగుః కిన్నరాః.

చ. తెరువుననున్న దేవతలు ♦ దేవునిభక్తులటంచు మన్ననన్
గరుణను మానివాసముల ♦ గమ్రభవత్పదయుగ్మముంచుడీ
చిరధృతమైన మాపదవి ♦ జేకొనుడంచును గారవింపగా
గరుడులు కిన్నరుల్గలిసి ♦ గానముపాడగ నాడి రచ్చరల్.

6. వేళ్వియుళ్మదుత్తలుమ్.

శ్లో. శంఖా నిదధ్ము రతివేల ముదగ్రధూపై
రానర్చు రుజ్జ్వలవిభూషణభూషితాంగ్యః,
దివ్యాస్స్త్రియః పదమిదం పరమాశితవ్యం
యుష్మాభిరి త్యభిదధు ర్విహితాశిష స్తాన్.

ఉ. వైదికులెల్ల భక్తిజని ♦ వారికి యాగఫలంబొసంగ ధూ
పాదిసపర్యల న్సలిపి ♦ హర్షభరంబున కాహళంబులన్
నాదముగల్గు శంఖముల ♦ నల్దెసలందును బర్వ నూదగా
నాదెస నప్సరోజనము ♦ నచ్చటికేగి యలంకరింపుడీ
యీాదనుజారిధామ మని ♦ యెంతయు సన్నుతిజేసి రత్తరిన్.

7. మడందైయర్వాళ్త్తలుమ్.

శ్లో. విష్ణోఃపదం జిగమిషూన్ హరిభక్తవర్యాన్
దత్తాశిషో ముముదిరే త్రిదశాబ్జనేత్రాః
అన్యేయు దైవతగణా వసుభిస్సహైతా
స్సంతుష్టువు స్తుతివచోభి రమందభక్త్యా.

చ. జలనిధిశాయియైన జల ♦ జాతదళాయతనేత్రశోభికిన్
కులగతిదాసులైన జన ♦ కోటికినచ్చరలెల్ల దీవనల్
సలిపిరి దేవబృందవసు ♦ సంఘమువారిన వెంబడించి ని
శ్చలమతి సన్నుతించిరి సుసంస్కృతవాక్కుల బద్ధహస్తులై.

8. కుడియడియారివర్.

శ్లో. ఏతే కులక్రమవశా త్సముపాత్తదాస్యా
విష్ణోరితీర్థ ముకుటాంచితసూరివర్గః,

వ్రిత్యుద్గతో ధ్వజపరివ్కృతవప్రశోభి
పాృసాదగోపురభువం సమయా చచాల.

ఉ. వీరుకులక్రిమాగతులు ♦ వెన్నునిదాసులటంచు భక్తితో
సూరిజనంబు భూషణసు ♦ శోభితులై యెదురేగివారికిన్
శౌరివికుంఠమందిరము ♦ జయ్యనఁజేర్చుటకై మణీధ్వపా్రి
కారవిశోభిగోపురప్రి ♦ ఘూణసమీపము జేరి రత్తరిన్.

9. వైకుంఠంపుగుదలుమ్.

శ్లో. ద్వారావస్థితనిత్యసూరినికరో దృష్ట్వా ముకుందాశ్రితాన్
యాయంతస్స్వప్రాణీయతాపద మలంకుర్యాత వేశ్మాని నః,
ఏతైః తత్పధగాఇతి ప్రియవచాం స్వ్యాచే ధరావర్తినాం
దిష్ట్యా మోక్షపదాప్తిరిత్యురుతరానందాస్సురా మానయః.

శా. వైకుంఠాంఘ్రిసరోజభక్తు లవుడా ♦ వైకుంఠముం జేరగా
వైకుంఠంబున నున్ననూరిజనముల్ ♦ వైకుంఠభక్తుల్సదా
మాకున్ ప్రాప్యులురండు మాగృహముకున్ ♦ మన్నింపమేమంచుబ
ల్కీకస్సల్కిరి మానులు న్విబుధులున్ ♦ పృథ్వీజనవ్రాత మీ
వైకుంఠంబున జేరుకొంత వినుతింప ♦ న్భాగ్యమోయంచనన్.

10. విదివగ్గైపుగుండనర్.

శ్లో. ఏతే స్వద్భాగ్యయోగా దిహసముపగతా ఇత్యనల్పప్రమోదా
స్తాన్పాద్యాఘ్యాదిదానాద్వివిధవదుపచచారామలసూ్రివర్గః,
వ్రిత్యుద్గమ్యేందుముఖ్యః కనకమయపయఃకుంభపిష్టాతకస్రి
గ్దీపస్నానీయహస్తాః పరిచరితుమమూస్సంగతా విష్ణుభక్తాన్.

మ. ఘనతా వీరిటకేగుదెంచుటిది భాగ్యంబంచు సూరుల్ వరా
సనమందుంచి తదీయపాదముల ప్రబ ♦ క్షాళించి రవ్వేళ స
ద్వనితాసంఘము పూర్ణకుంభసుమనో ♦ దామప్రదీపాదులన్
గొనియాభక్తులు వచ్చుతో్రివకెదురై ♦ కూర్మి న్సమర్పింపగన్.

## 11. వందవరెదిర్ కొళ్ళ.

శ్లో. ప్రత్యుద్గమ్య రమాపతిః కమలయా సంవేశ్య ముక్తా న్స్వహ
మాణిక్యస్థగితం స్వమంటపపదం సానందసూరివ్రజైః,
తా న్ప్రాపయ్య యథాశయత్యభిమతా న్స్వామాన్యతారి స్తథా
శ్లోకై ర్వ్యనిజగాద తే శ్రుతిసమే సాహస్రకే ముక్తిదాః.

చ. ఎదురుగనేగి వారికి ర ♦ మేశుఁడు సూరులతోడఁగూడి స
త్సదమున రత్నమంటపని ♦ షణ్ణులజేసి యథార్హగౌరవం
బడసునజేసి యుత్తసరు ♦ హ్లాదము నొందినరీతి కారిజుం
డదగడుభక్తి జెప్పిన యు ♦ హీనసహస్రములోన నీపదిన్
హృదయమున స్మరించునరు ♦ లీశుగుణానుభవైకతత్పరుల్.

శ్రీమతే శఠకోపాయ నమః.

శ్రీమతే రామానుజాయ నమః.

## దశమ శతకము – పదియవ దశకము.

[మునియేనాన్ముగనే.]

అవతారిక:—పరమపదమందు ప్రవేశించి "అన్దమి ల్పేరిన్బత్తడియరోడిరుందమై (నిరవధికానందముతో గూడియున్నయానికి) అన్నట్లు నిరతిశయానందయుక్తులై భక్తగోష్ఠిలో నుండునానికి కేవలమానసికమై బాహ్యసంశ్లేషమున కుపయోగింపకుండ నున్న యీస్థితికి పైగా "ఇల్లైకండీ రిన్బమ్" "పిరప్పాం పొల్లావరువిన్నై మాయవన్ శేత్తళ్ల్ పాయ్న్నిలమ్" అని పరుల కుపదేశించు తాముకూడ సంసారమందు ప్రకృతిబద్ధులై యున్నప్రకారమును జూచి మేరుపర్వతశిఖరమందు నిర్దుఃఖుఁడై సుఖోత్తరుఁడైయుండువాఁడొకడు దుఃఖబహుళమై, దుస్తరమై, అత్యగాధమైయుండు పాతాళములో బడిపోయి బాధలనొందుచు నవసన్నుడైనట్లీ యాళ్వారు నవసన్నులై తమకీశ్వరుఁడు మునుపు చెయిలొంగిన ప్రకారమును, తన్ను పొందుటకు దానే యుపాయమైన ప్రకారమును సాధనానుష్ఠానము సలుపువానికి నపేక్షితుఁడై సర్వరక్షకుఁడై యున్నస్థితిని అనుసంధించి, యాక్షణమందే తమ అపేక్షితమును లభింపకపోవుటచే "ఇట్లున్న సర్వేశ్వరుఁడు నన్ను విడిచిపెట్టుటకు హేతువేమి" అనిదుఃఖితులై తల్లిదండ్రులు దగ్గరనున్నను ఆకలిచేతను, దప్పికచేతను

పీడింపఁబడుచున్న శిశువు ఆర్త్యతిశయముచే తల్లిపేరు చెప్పి మొఱ్ఱబెట్టినట్లు "వళ వేత్తులగు" లని చెప్పఁబడిన స్థితిగలవారు తమస్వరూపము ననుసంధించుకొనుటకు శక్తులుగాక దూతలద్వారా రప్పించుటకాక యీశ్వరుని కెదురుగానిలువఁబడి పిరాట్టిపై నొట్టుబెట్టి లజ్జనువిడిచి చెప్పఁదగిన యుత్కంఠతో దయాహీనుల హృదయములయందుఁగూడ కనికరముపుట్టునట్లు వారును తమ్ము లరక్షింపనగునే పరమపదమందు నివసించుటకూడ దుర్లభమగునట్లు కాచిఁచుచ్చుకో దగులుకొన్న వారివలె పెద్దగొంతికతో మొఱ్ఱబెట్టి "తే వధ్యమానాః పతితాశ్చపీడా నానద్యమానా భయశల్యవిద్ధాః। శాఖామృగా రావణసాయకార్తా జగ్ముశ్శరణ్యం శరణంస్మ రామమ్" అన్నట్లు సైరింపలేక వానిపాదములయందు శరణాగతిచేయఁగా నీశ్వరుఁడు పరమదయాళువు గావున "అయ్యో - ఇట్లుబాధపడుచున్నవీరిని విడిచిపెట్టియుంటినే" అనివిచారించి హెచ్చుగా వ్యసనమునొంది గరుడవాహనారూఢుఁడై పిరాట్టితోఁ గూడ వీరపేక్షించినట్లు వచ్చి కనఁబడి వీరి ప్రకృతిసంబంధమును ఛేదించి "అడియార్గళ్ కుళ్ణాంగ ళుడనన్కూడువ దెన్నుగొలో" అని వీరాశపడినట్లు భక్తసంఘమందు వీరిని ప్రవేశపెట్టి "ఎన్నవాపలచ్చూట్టుందాయే" అనియు, "అవావత్తువీడుపెత్తు" అనియు వీరంతటవీరే చెప్పుకొనునట్లు వీరితృష్ణను దీర్చి తనతృష్ణను దీర్చుకొని వీరితో సంశ్లేషించెను.

ఈ ప్రబంధమునకు ప్రమేయము నీశ్వరుఁడు. ఈప్రబంధము నిర్దుష్టమైనఅంతాదిప్రబంధము. ఈశ్వరునివలనభక్తిరూపాపన్నజ్ఞానమునుపొందినయాళ్వార్లు రచయిత. సర్వేశ్వరుని అవతారమువలె వీరి యవతారముకూడ సాధువుల సుకృతఫలము.

## 1. మునియే నాన్ముకనే.

శ్లో. పశ్యత్కాలముచే చతుర్ముఖఖసద్బింబోష్ఠ నీగేజదృ
జ్ఞిర్వేధోజ్వలనీలరత్న కుహక ప్రాశోపమ శ్రీపతే,
మత్వాశేఘ్వాం సముపేత్యమాం తవగుణాస్వాదేనసంమోదయన్
కుత్ర భ్రామ్యసి నోదిశామిచలితుం మాం మాతిసంధేహి భో.

చ. అలభవనీరజాసనుల ♦ కంతరవస్థితినొంది లోకముల్
గలుగఁగఁ జేసియు స్మరల ♦ ఖండనసేయుచు నొప్పవంచకా
బలరిపునీలకాంతితను ♦ బంధుర కంజదళాక్ష నిన్ను ని
శ్చలముగ బట్టికొంటి నిఁక ♦ చాలు నను న్విడఁబోకుమచ్యుతా.

2. మా యం కె ర్యే ల్.

శ్లో. త్వద్వక్షస్స్థలమండనాయితరమాకాంతాసుభి ర్భావిత
స్త్వత్పాద్రైరపి శాపితోసి నృహరే మావంచకో భూర్మయి,
స్నేహో న్మే భవతాసహైక్యమదదా నిర్ధూతయ భేదం హరే
మాం త్వత్పాదయుగం నయా ప్రవసతి ర్లోకే నమే రోచతే.

ఉ. వంచన సేయబోకుమిక ♦ వారిదసన్నిభగాత్ర యొట్టు సు
మ్మాంచిత పీనవక్షమున ♦ హర్షమున న్వసియించు లక్ష్మితో
డెంచగ నన్నునీవు కృప ♦ నేలి మదంతరమందు జొచ్చితో
పంచశరాయుతాభ యిక ♦ బాయక చేర్మము నన్ను నీదరిన్.

3. కూ వి క్కో ల్లా య్.

శ్లో. నిర్వేధాసితరత్నసుందర భవత్పాదాశ్రితాబ్జాసన
త్ర్యక్షేంద్రాదినిదాననాభిసరసీజాతాదికందాయితే,
సూరివ్రాతపతే త్వదంఘ్రిసవిధం క్షిప్రం నయైనం జనం
సాహం వేద్మి పరం మమేహ శరణం త్వాం దీనబంధుంవినా.

చ. అనవరతంబు భక్తిమెయి ♦ యర్చనసల్పుచు నుండుపంకజా
సనమృడజంభవైరులకు ♦ జన్మపదంబగు పంకజంబు నా
భినిగలవాడ సూరిజన ♦ బృందనిషేవ్యపదారవింద నా
కనయము నీవుదక్క మరి ♦ యన్యముగానను బట్టుకొమ్మ జ
య్యన నను బిల్చుకొమ్ముకమ♦లాయతలోచన తావకాంఘ్రికిన్.

4. ఉం బ రం ద న్నా త్రే యో.

శ్లో. త్వం మూలప్రకృతి స్త్వమేవ పురుషో యస్త్వత్తదంతస్థిత
స్త్వం తేజోఽమ్బరశమ్బరాబ్ధిరశనా వాయ్వాదిభూతావళిః,
త్వం తద్భూతమయాండమధ్యపతితా వీరాబ్జసూతీ విభో
నిర్వక్ష్యామి భరంత వేతి నిగద న్సంత్యక్తవాన్మాంముధా.

చ. ప్రకృతికి నన్యతత్త్వనిక ♦ రంబున కాత్మలకు న్విరించిత్ర్యం
బకముఖదేవతావళికి ♦ మానవజాతికి నన్యవస్తురా

శికి బరికింప నీవె శ్రుతి ♦ శీర్షపదోక్తసమస్తకారణం
బకలుష నన్ను గాచుభర ♦ మంతయు నీదె యుపేక్ష నాయమే.

## 5. పోరవిట్టిట్టెన్నై.

శ్లో. అభీతేషు సకర్మలేషు విషయే ష్వాకర్షితస్తు మే వేహసే
త్యక్త్వామాంయదితర్హి కంసముపయన్కింసాధ్యుయాంమేవద,
కింవక్తవ్య మిదం మదీయమితివా కింస్యామహం శ్రీహరే
తప్తాయోఘనచూషితాంబుకణవ న్మాం కృత్స్నశో భుక్తవన్.

శా. సంతప్తాయసచూషితోదకకణ ♦ చ్ఛాయ న్మదీయాత్మ నీ
వంతస్తోషముతో గ్రసించినయత్న ♦ ప్తామర్త్యపీయూష వే
శంతపర్ఖ్య యనాదరంబున ననున్ ♦ శబ్దాదులం ద్రోసినన్
వంతం జెందుదు నేసహాయమున నా♦వాంఛార్థముల్ దీరెడున్.

## 6. ఎనక్కారావముదాయ్.

శ్లో. అంభోజాయతనేత్రి పుల్లదతసీపుష్పచ్ఛవే శ్రీమనః
పద్మాహ్లాదనపద్మమిత్ర విలసద్బింబోష్ఠ మద్ధారక,
సోహిత్యాజనకామృతద్రవరుక్భోగ్య ప్రభో మత్తనుం
చాత్మానం పరిభుక్తవానసి పరం సాధూపభుంక్ష్వా చ్యుత.

మ. అతసీపుష్పసవర్ణ పంకరుహాప ♦ తాక్షా సుశోణాధరా
సీతపంకేరుహవాసినీప్రియ ముదా ♦ శ్లేషైకమోదాస్పదా
నతకారుణ్యపయోధరా సుధవలె ♦ న్నాకెంతో భోగ్యుండ నీ
వతిమాత్రప్రవణుండవై కనుము ♦ పాయ న్బోకు నన్నీశ్వరా.

## 7. కోలమలర్ప్పావైక్కు.

శ్లో. నీరేజాయతనాతిహృద్య శశభృత్ఖండద్వయాంచన్ముఖ
ప్రోద్యన్నీలశిలోచ్ఛ్రయోపమకిటిభూతాంస్ఫుటాబ్జాతదృక్,
దంష్ట్రోన్నీతధరా స్మదీశ మధితాకూపారల బ్ధ్వా భవ
త్పాదాంభోజ మితఃపరం కిముజహామ్యాన్యేభసంరక్షక.

మ. కలశాంభోధిసుతాహృదంబురుహభృం • గా సర్వదేవప్రియా
జలజాతాహితఖండయుగ్మవిలస • జ్జంభారినీలాద్రినా
చెలువొప్పారెడు కోలరూపధరుడై • క్షిత్యంబుజాక్షి న్వని
శ్చలతన్ దంష్ట్రను నిల్పినట్టి సరసీ • జాతాక్ష తండ్రీ పయో
జలధిన్ దర్చ్చినదత్క చేరినిను నే • శక్తుండనే వీడగన్.

8. పె త్తి ని పో్ప క్క వ నో.

శ్లో. ఈశ స్సర్వాత్మనాంయో జగదిదమఖిలంజంగమాజంగమంయ
స్సృష్ట్వాతద్వ్యాప్నువానోయమయతిమమయఃప్రాక్స్వభక్తింది దేశ,
యః పుణ్యాపుణ్యకర్మానుగుణఫలతతిం జీవసంఘాయ దద్యా
త్తంత్వామాసాద్యభక్త్యావననిపుణమతింసాంప్రతంకింత్యజేయమ్.

చ. పురుషకృతంబులై గలుగు • పుణ్యముపాపము దత్ఫలంబులై
బరగెడు సౌఖ్యదుఃఖములు • వావిరినీవలనన్ జనించు నో
పరమ జగత్త్రయాటవిని • బన్ని తదంతరమందు జొచ్చి నీ
వరయగ దాగియుండెదవు • హా నినుబొందితి వీడనేర్తునే.

9. ము ద ల్త ని వి త్తే యో.

శ్లో. సంఖ్యాతీతాండకోశే త్రివిధమపిభవ న్కారణం విశ్వకాయో
బుద్ధ్యాద్యాత్మాంతతత్త్వప్రకరనియమనవ్యాపసవ్యాపృతస్త్వమ్,
పుంసాం భోగాపవర్గప్రవితరణరతం యత్ప్రధానం ప్రతీతం
తస్యాపీశం రమేశంశుభగుణనిలయం త్వాంకదాహంప్రపస్యే.

మ. త్రిజగత్పాలికి గారణత్రికమవై • దేవేద్యలీలుండవై
నిజసృష్టాఖిలకార్యకారణదశన్ • నిఃణిక్తరూపుండవై
యజగూఢంబుగ జొచ్చియుందువు ప్రకృ• త్యాదిప్రధానుండ వీ
వజరుద్రాదులెరుంగలేరు భవదీ • యంబైనమాయ న్సదా
సుజనైకస్తుత నిన్నుగూడిసుఖముల్ • జూడంగ నెన్నండొకో.

10. శూ ల్తం ద గ న్ను.

శ్లో. యావ్యాప్తిస్సర్వతత్త్వేష్వఖిలమనుగతా సర్వత స్సర్వధాయా
తస్యా మూలప్రకృత్యా భవసిచ భగవన్నంతరాత్మా త్వమేవ,

నిత్యప్రజ్ఞానదీపప్రవిమలవిలసజ్జీవసంఘాన్తరాత్మాన్
జ్ఞానానందస్వరూపత్వదధిగమతృషాపూరమస్వగ్రహీ ర్మామ్.

చ. దశదిశలందుదానయయి ♦ తద్దజనించు వికారపాళికిన్
వశమయియున్నయాప్రకృతి♦వస్తువు నీకు నియామ్యమెప్పుడున్
వశిజనచింత్య జీవతతి ♦ వశ్యమునీకు విశుద్ధరూపికిన్
యశమగుగాక నన్నుగృప ♦ నాశఫలింపగఁజేసి ప్రోచినన్.

11. అవాపరచూచ్ఛౄరి త్రైమై.

శ్లో. అంతర్యామిణమబ్జజేందుధరయో రాకృశ్య నాథం హరిం
తల్లాభాభినివేశశాంతి పరమం సామ్యం శఠారి ర్గతః,
తత్సంద్రృబ్ధవిముక్త శబ్దఘటితప్రారంభపద్యాత్మకే
సాహస్రే దశకం త్విదం పిపఠిషు ర్నాఽప్నోతి లోకేజనిమ్.

మ. తనకోర్కెల్ఫలియింపఁగూడి తనతో ♦ దాసంతసంబందున
వ్వనజాతాక్షుఁడు దివ్యధామ మొసగెన్ ♦ భద్రంబునేగంటినం
చు నిజానందము వెల్లడించిన నుత ♦ శ్లోకుం డనన్యాశ్రితుం
డనఘుండైన శఠారికూర్చిన మనో ♦ హారిప్రబంధంబునన్
ఘనమా నీవదిపద్యము ల్జదువ నీ ♦ క్ష్మామండలి న్నిత్యసూ
రినిభాహ్లత్వము నొందిపూజ్యులు సదా♦హ్యామ్యన్మనోవృత్తులై.

శ్రీమతే శఠకోపాయ నమః.

---

## —♦ చంపకమాలిక. ♦—

పరపదవాసియై తనదు ♦ భవ్యచరిత్రము బాడువారి కె
ల్లరకును దివ్యసౌఖ్యతతు ♦ లన్న మకూర్చెడు వాసుదేవు స
చ్చరితముల న్ముదంబొదవ ♦ సంస్తుతిజేయఁదలంచి తొల్లి శ్రీ
కురుకనివాసియైన శఠ ♦ కోపుని ద్రావిడసూక్తిసంతతిన్
వరలెడు దివ్యగాథలిల ♦ వర్ణ్యములౌనని యెంచి భక్తితో
సురమృదుభాష నాంధ్రమున ♦ సూరిజనాదరణీయరీతిగా
నరసి రచించితి న్బుధుల ♦ యాదృతి యెట్లురహించునో కొక్కయుం
చురియుదు శ్రీశఠారివిమ ♦ లోక్త్యమృతాసవపానమత్తులౌ
నరులకు నవ్యకావ్యమని ♦ నన్మది కింపు జనింపనేర్చునే
పురుడిలలేని యందముల ♦ ప్రోవయి తావయిశౌరిభక్తికిన్
దిరిసెనపూవునుంబలె మ్రి ♦ దిష్టగుణంబును దేనెవోనిమే
లిరుచియు గల్గి శౌరిశుభ ♦ లీలల నెన్నెడి శ్రీశఠారిభా
సురకవితావిలాసముల ♦ చొప్పుల నేర్పడనుగ్గడింప నా
తరమగునే? యథామతిని ♦ దప్పక దీనిరచించి యెల్లవా
రరయఁగ శాలివాహనశ ♦ కాబ్దము లభ్రశరేభచంద్రమ
స్సురుచిరసంఖ్యలన్ దనరు ♦ చో విభవ న్మధుశుక్లపక్షమం
దిరుదుగలెక్క యా తిథి ది ♦ నేశుని వాసరమందు నేను శ్రీ
వరుకరుణన్ ముకుందకుల ♦ వార్ధిసుధాకరుఁడౌవరాహస
ద్గురునను కంపచే హరికి ♦ గోరి సమర్పణగా నొసంగితిన్.

తే. గీ. అమలశ్రీవత్సకులకల ♦ శాబ్ధితుహిన
దీధితివరాహదేశికు ♦ దివ్యకరుణ
కలిమి పేరోడయై ప్రావు ♦ గల్గ శఠజి
దుక్తివారాశి విహరింప ♦ నోపితిటుల.

కం. ఇంబయి సామాగమసా
రంబగు శఠవైరిసూక్తి ♦ రాశి దెలుగుగా

సంబరమునరచియించెను
వెంబరవీ త్తీ తేడనక ♦ వే గనుఁడు బుధుల్.

పాలకొండ తాలూకా రుసింగి అగ్రహారవాస్తవ్యులు మాపి్రయమిత్రులు శ్రీమత్తిరుమల పల్లేర్లమూడి నారాయణాచార్యులగారు నాగ్రంధముపై నిచ్చిన యభిప్రాయము.

తే. గీ. ఆంధ్రగీర్వాణశతజిత్స ♦ హస్రకృతిని
లీలమెయి సంతరించె బ ♦ లేయనంగ
మేడెపల్ల్యన్వయాబ్ధిత ♦ మీాశశత్రి
రమణుఁడై నట్టి వేంకట ♦ రమణబుధుఁడు.

కం. మాధుర్యాన్వితశతజి
ద్గాథాకవితాంధ్రపద్య ♦ కమలగణలస
త్స్వధురసపాయి మధుల
ట్సాధర్మ్యమునొంది తనియు ♦ సవి నాకొదవెన్.

మ. సుమహద్ద్రావిడవార్థిఁ దచ్చి తనక ♦ చ్చో శ్రీశతారాతివా
గమృతంబబ్బినసంస్కృతాంధ్రమయభా♦షామాత్రమందుంచియెం
చి మహాత్సంస్మృతిరుగ్భయాతురులను♦జీవింపఁగా జేయు శ్రీ
రమణాచార్యఫణీట్సయానునియుదా ♦ రత్వంబు సామాన్యమే.

కం. సహృదయహృదయాహ్లాదక
బహుళాలాపముల మృదుల ♦ భావములను భా
మహితాలంకృతులను ధర
నహాహా యిక్కవిత రామ ♦ యన నింపొసగున్.

మ. వరవంశోద్భవమై విశుద్ధగుణసం ♦ భావ్యంబునై నిర్మలో
దరసువ్యక్తకళాప్రపంచమయి వృ ♦ త్తఖ్యాతమై విశ్వసుం
దరమై యొప్పు ననర్ఘమౌక్తికము విం ♦ తా భూపమౌళిస్ఫు
ద్వరరత్నంబులవియ్యమందుటలుఖ్యా ♦ తంబౌ నెయొండైనచోన్

శ్రీ మ తే రా మా ను జా య న మః.

దశమశతకము సమాప్తము.

ఆంధ్ర గీర్వాణ శతకోప సహస్రమందు

ఉత్తరార్ధము

